శ్రీరస్తు

# శ్రీకాశీఖండము

శ్రీనాథమహాకవి ప్రణీతము



చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

వారిచే ప్రకటితము

1953

 [Price Rs. 3—8—0

# ప్రకాశకవిజ్ఞప్తి



1914-వ సంవత్సరాంతమున శ్రీనాథమహాకవి కృతమైన కాశీఖండమును ముద్రింప దలచి అచ్చుప్రతితో సంప్రతించు కొనుచు ఓరియంటలులైబ్రరీలోనుండు వ్రాతప్రతులప్రకారము రెండు పర్యాయములు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారిచే పాఠములు సమకూర్పించితిమి. తరువాత ఆంధ్రసాహిత్యపరిషత్తులోని వ్రాతప్రతిపాఠములను సమకూర్చితిమి. అప్పటిలో మహాపండితులును కీర్తిశేషులగు శ్రీ ఉత్పల వేంకటనరసింహాచార్యులుగారు దీనిని పరిష్కరింపగా 1917 సం॥లో ప్రకటించితిమి. నేడీ కాశీఖండప్రతు లత్యావశ్యకముగ కానవచ్చుటచే దీనిని పునర్ముద్రణము గావించినారము. శ్రీనాథకవి తక్కిన గ్రంథములు త్వరలో పునర్ముద్రణము గావించుచున్నాము.

ఇట్లు

ప్రకాశకులు

# కాశీఖండము

కవిసార్వభౌముడు శ్రీనాథమహాకవి 'ప్రాయ మింతకు మిగులఁ గైవ్రాలకుండ' రచించిన ప్రౌఢకావ్యము కాశీఖండము. రాజమహేంద్రవరము నేలిన రెడ్డిరాజు వీరభద్రారెడ్డి కంకితముగా క్రీ.శ. 1440 సం॥ ప్రాంతమున రచితమైనది. ఇది స్కాందపురాణమునందలి యేబదిఖండములలోఁగల సంస్కృత కాశీఖండమునకు అనువాదము. మహాపురాణైకదేశ మగు సంస్కృత కాశీఖండము సులభగ్రాహ్యమై పురాణరీతితో నుండఁగా, తెనుఁగున శ్రీనాథుఁడు ప్రౌఢతరమగు కావ్యశైలిలో దీనిని రచించెను కావుననే "కాశీఖండమయః పిండమ్" అను నాభాణకము తెలుగు కాశీఖండమునుబట్టియే యేర్పడినది.

సంస్కృతమూలమున, ద్వాదశసహస్రగ్రంథపరిమితిగల విషయమును తెలుగున నేడాశ్వాసములును (1-142, 2-167, 3-243, 4-306, 5-339, 6-310, 7-265) 1777 గద్యపద్యములుగల కావ్యమైనది. మూలగ్రంథములోని పౌరాణికవిషయములను, జాతివార్తా చమత్కార విలసితముగను, శైవతత్త్వప్రతిపాదకములుగను శ్రీనాథకవి విపులీకరించి, ఆంధ్రకాముద్రసీగ్రంథమున నచ్చొత్తినవాఁడు.

కాశీఖండమున కాశీక్షేత్రమహిమయే చెప్పబడినను, అందందు సాముద్రిక, పాతంజలయోగశాస్త్ర, మంత్రశాస్త్ర విశేషములు పొందుపడినవి కావున నిది శ్రీనాథుని కవితా శైలికేగాక పాండితీప్రతిభకు నికషోపలము.

ఇందలిశైలి కావ్యశైలి గావున సంస్కృతాంధ్రసాహితీ పారగుఁ డగు శ్రీనాథుఁడు, పూర్వకవుల రచనారీతుల నెట్లు జీర్ణించుకొన్నదనియు తెలిసికొనుటకు నీగ్రంథ మెంతేని యుప యోగపడును. సంస్కృతమున, మయూరుని సూర్యశతక శ్లోకానువాదములు ప్రధానస్థాన మాక్రమించును. వాల్మీకిరా మాయణము, భవభూతియుత్తరరామచరిత్రము, విశాఖదత్తుని ముద్రారాక్షసము, భట్టగోపాలుని సాహిత్యచింతామణి (కావ్య ప్రకాశికవ్యాఖ్య) అవతారికారచనముల కనువాదము లిందు గలవు. తెలుగున వేములవాడ భీమన యుద్దండలీల - నన్నయ భట్టారకుని యుభయవాక్ప్రౌఢి, తిక్కయజ్వ రసాభ్యుచిత బంధము ప్రబంధపరమేశ్వరునిసూక్తి వైచిత్రియు నిందుగలవు. ఇవియన్నియు ప్రత్యేకముగ జూపిన గ్రంథవిస్తరమగును. సూక్ష్మముగను విశాలముగను బరిశీలించి శ్రీనాథమహాకవి రచనమున పదబంధములకు మూలములు మనము కనుగొనుట కవకాశములు గలవు.

కాశీఖండము శ్రీనాథుఁ డాంధ్రీకరించిన వెనుక వేఱెవ్వ రును పద్యకావ్యముగ దీని నాంధ్రీకరింప దలపెట్టలేదు. ఈవిష

యమే దీనిప్రత్యేకత తెలుపగలదు. కంచెర్ల శరభకవి (క్రీ. శ. 1500) యు మోచర్లఅన్నయు (క్రీ. శ. 1650) దీనిని ద్విపద కావ్యములుగ పరివర్తించిరి. కాని యవి లభ్యముగుటలేదు. దీనిని కర్ణాటాంధ్రభాషలలో వచనరూపముగ హాలాస్యమాహాత్మ్య కృతికర్త యగు నంజరాజు రచియించియున్నాడు. ఈవచనకాశీ ఖండము నముద్రితమైయున్నది. లాక్షణికులగు కాతంభట్టు, అప్పకవి కాశీఖండములోని లక్ష్యము లుదాహరించిరి. కూచి మంచి తిమ్మకవి తన సర్వలక్షణ సారసంగ్రహమున నిందలి పద్యములను డెబ్బదింటికిపైగా నుదాహరించియున్నాడు. ప్రామాణికాగ్రగణ్యుఁడగు పరవస్తు చిన్నయసూరి దీనియందలి పాఠభేదములను గుర్తించినాడు. భాషావిషయమున నీగ్రంథ మెంతప్రమాణమో పై యుదాహృతులే తెలుపగలవు.

శ్రీనాథుఁడు సంస్కృతకాశీఖండమునందలి వ్యాసుఁడు కాశిని బాయుట అను వృత్తాంతమును గ్రహించి, దక్షిణకాశి యనఁదగిన దాక్షారామక్షేత్రమాహాత్మ్యమును (భీమఖండము) రచించెను. అఖిలభారతవర్ష ప్రసిద్ధమగు కాశీక్షేత్రమహిమను తెలుపుగ్రంథమే స్కాందపురాణమున నున్నది. ఆగ్రంథవిషయ మును గ్రహించి, ఆంధ్రదేశమున నూతనముగ వెలసిన దాక్షా రామముయొక్క మాహాత్మ్యమును తెలుగులో రచించి, ఆవెనుక దానికి పురాణప్రామాణ్యమును మూలగ్రంథగౌరవమును నొసం గుటకు శ్రీనాథుఁడు తెలుగుగ్రంథమును యథామాతృకముగా

సంస్కృతీకరించెను. సంస్కృతభీమఖండము శ్రీనాథోపజ్ఞమే యనుటకు నీవ్యాసఘట్టమే ప్రమాణము. కాశిని వ్యాసుఁడు శాసినవృత్తాంతము రెండు గ్రంథములయందును, భిన్నభిన్నరీతులుగ నుండుట కిదియే కారణము. ఈగ్రంథములను రెంటిని మూలగ్రంథములతో పరిశీలించి చూచిన నీవిషయము తేటతెల్లము కాఁగలదు.

క్షేత్రమహిమలు వెలయించుటయందు శ్రీనాథునికిఁగల ప్రత్యేకతను శ్రీయుత మహామహోపాధ్యాయ కొక్కొండ వేంకటరత్నముపంతులవారు తమ బిల్వేశ్వరీయమున నవతారికలో నిట్లు ప్రశంసించియున్నారు —

శా. స్కాందం బందనుసంహితాన్వితమునౌ ఖండద్వయం బాంధ్రభా
షం దివ్యంబుగఁ జేసి క్షేత్రమహిమాచాతుర్యం దనర్ గౌరవం
బందె న్సన్నుగ బిల్వనాథసమనామాఢ్యుం డెవం డెంతు స
త్సందోహస్తుతు నమ్మహాకవిని విద్యానాథు శ్రీనాథునిన్.

శ్రీనాథుని రచనము లనఁగా, పదునాల్గు పదునైదవశతాబ్దిలోని యాంధ్రదేశ రాజకీయ, సాంఘిక, సారస్వత చరిత్రప్రతిబింబములు. ఆంధ్రమహాజనుల సాహితీమయ జీవితమున సరసత్వమును, జాతీయతను, సభ్యతను ముద్రించి యజరామరకీర్తి గడించిన శ్రీనాథమహాకవి గ్రంథములు సప్రమాణికపాఠములతో సంస్కృతమూలములతో, సవ్యాఖ్యానములతో సమగ్రముగ

ముద్రితము లగునేని యప్పు డామహాకవిలోకోత్తరస్వప్రతిభా విశేషము, సర్వతోముఖ పాండిత్యము, సాహిత్యవిద్యాపారీణత, జాతీయకవిశేఖరత్వము ప్రస్ఫుటములై, అతనికీర్తిమూర్తిని దేదీప్యమానముగ విరాజిల్లఁజేయ సమర్థములగును. ఆంధ్రమహాజను లట్టి మహాకార్యమునకు గడంగుదురుగాక!

నిడుదవోలు వేంకటరావు, ఎం., ఏ.

# విషయసూచిక

## పీఠిక



## ప్రథమాశ్వాసము



## ద్వితీయాశ్వాసము

| విషయము. | | పుట. |
|---|---|---|

## సప్తమాశ్వాసము





# శ్రీకాశీఖండము

## పీఠిక

### ఇష్టదేవతాప్రార్థనాదికము

శా. శ్రీకాశీనగరాధి రాజ్యపదవీసింహాసనాధ్యాసి లో
కైకగ్రామణి విశ్వనాథుఁడు విశాలాక్షీమనోభర్త సు
శ్లోకుం దొడ్డయయల్లభూవరతనూజు౯ వీరభద్రేశ్వర
క్ష్మాకాంతుంజగనొబ్బగండనిమహైశ్వర్యాన్వితుం జేయుత౯.

సీ. కంఠాగ్రకరిరాజు ఢుంఠివిఘ్నేశుండు
వడఁకుగుబ్బలికూఁతుకొడుకుకుఱ్ఱ
యాకాశమండలం బను నల్లకలువక్కు
నకరు వాద్యుండు లోలార్కమూర్తి
గోపాలరామలగుబ్బచన్నుల మెచ్చు
గీర్వాణవంద్యుండు కేశవుండు
కరటి ప్రీడాశూన్యకటి గోపురద్వార
పరిరక్షకుఁడు కాలభైరవుండు

తే. కాలకంఠునిశిరసుపూ గగనగంగ
కాశికాక్షేత్రమున కేడుగడయు నైన
యిందఱును నిత్తు రెల్లప్పు డీప్సితమ్ము
లల్లయప్రభు వీరభద్రాధిపునకు. 2

సీ. కబరికాభారంబు కైపెక్కు విరులతో
నవటు భాగంబుపై నత్తమిల్ల

నల్లని లేఁజెమటచే నసలుకొన్న లలాట
కుంకుమంబునఁ జిన్నికురులు మునుఁగఁ
బసిఁడికుండలఁ బోలుపాలిండ్లభరమున
సన్నపుఁగౌఁదీఁగె జలదరింపఁ
ధవళతాటంకరత్నప్రభారింఛోళి
గండస్థలంబులఁ గౌఁగిలింపఁ

తే. గాశికారామకల్పవృక్షములనీడఁ
గుతపవేళలయందు నాఁకొన్నవారి
కమృతదివ్యాన్న మిడువిశాలాక్షి గౌరి
శాశ్వతైశ్వర్యములు కృతిస్వామి కొసఁగు. 3

ఉ. పాయక నిర్నిరోధనిరపాయసమగ్రకృపాగుణైకపా
రాయణతావిలాసము తిరంబుగ నంబుజసూతి వీరనా
రాయణు దానవైభవధురంధరు సంగరసవ్యసాచి దీ
ర్ఘాయురుపేతుఁ జేయుత నృపాగ్రణినల్లయవీరభద్రునిన్. 4

తే. కంఠపీఠిక నోంకారఘంట మొరయఁ
జెలఁగుఁ గావుత మన్మనగక్షేత్రసీమఁ
గవికుటుంబంబుపాలిటిదివిజసురభి
జలజసంభవుబోటి భాషావధూటి. 5

వ. అని సముచితప్రకారంబునఁ బూజ్యపూజాతత్పరుండనై యొక్కనాఁ డాత్మగతంబున నిట్లని వితర్కించితి. 6

సీ. చిన్నారిపొన్నారిచిఱుతకూఁకటినాఁడు
రచియించితిని మరుత్రాట్చరిత్ర
నూనూఁగుమీసాలనూత్నయౌవనమున
శాలివాహనసప్తశతి నొడివితి

సంతరించితి నిందుజవ్వనంబునను శ్రీ
హర్షనైషధకావ్య మంధ్రభాషఁ
బ్రౌఢనిర్భరవయఃపరిపాకమునఁ గొని
యాడితి భీమనాయకునిమహిమఁ

తే. బ్రాయ మెంతయు మిగులఁ గైవ్రాలకుండఁ
గాశికాఖండ మనుమహాగ్రంథ మేను
దెనుఁగుఁ జేసెదఁ గర్ణాటదేశకటక
పద్మవనహేళి శ్రీనాథభట్టసుకవి. 7

ఉ. స్కాందపురాణసంహితకు ఖండము లేఁబది యందులోన నా
నందవనానుభావకథనంబున శ్రోతకు వక్తకుఁ శుభా
నందపరంపరావహము నైజగుణం బని గాశిఖండ మా
కందు వెలింగి నేను సమకట్టితిఁ గావ్యముగా నొనర్పఁగాన్.

వ. ఇమ్మహాప్రబంధప్రారంభంబుఁ గర్ణాకర్ణికావశంబున నాక
ర్ణించి కర్ణాంతవిశ్రాంతవిశాలనేత్రుండును, బంటవంశకమల
మిత్రుండును, నశ్రాంతవిశ్రాణనక్రీడాపరాయణుండును,
వీరనారాయణుండును, నిత్యసత్యుండును, బల్లవాది
త్యుండును, భూభువనభారభరణదీక్షాదక్షదక్షిణభుజా
భుజంగుండును, రాయవేశ్యాభుజంగుండును, గీర్తిగంగా
తరంగిణీప్రవాహపవిత్రితస్వర్గమర్త్యపాతాళుండును, జగ
దగోపాలుండును, విమలధర్మశీలుండును సంగడిరత్నపాలుం
డును నగువల్లయవీరభద్రభూపాలుం డొక్కనాఁడు. 9

సీ. త్రైలోక్యవిజయాభిధంబైన సౌధంబు
చంద్రశాలాప్రదేశంబునందు

సచివసైన్యాధీశసామంతనృపవర
సీమంతినీజనశ్రేణి గొలువ
శాస్త్రమీమాంసయు సాహిత్యగోష్ఠియు
విద్వత్కవీంద్రులు విస్తరింపఁ
గర్పూరకస్తూరికాసంకుమదగంధ
సారసౌరభము దిక్పూరితముగ
తే. నిజభుజావిక్రమంబున నఖిలదిశలు
గెలిచి తను రాజ్యపీఠ మెక్కించినట్టి
యన్న వేమేశ్వరునిజాంక మాశ్రయించి
నిండుకొలు వుండెఁ గన్నులపండు వగుచు. 10

వ. అప్పుడు నన్నుం బిలువం బంచి సముచితాసనంబునం
గూర్చుండ నియమించి యన్నయవసరంబున. 11

తే. రాయవేశ్యాభుజంగ సంగ్రామపార్థ
గాయిగోవాడ వేమనక్ష్మాధవుండు
గూర్మియనుజన్మహృదయంబుకోర్కి దెలిసి
యర్థి ననుఁ జూచి యి ట్లని యానతిచ్చె. 12

సీ. వచియింతు వేములవాడభీమనభంగి
నుద్దండలీల నొక్కొక్కమాటు
భాషింతు నన్నయభట్టుమార్గంబున
నుభయవాక్ప్రౌఢి నొక్కొక్కమాటు
వాకృత్తు తిక్కయజ్వప్రకారము రసా
భ్యుచితబంధముగ నొక్కొక్కమాటు
పరిఢవింతు ప్రబంధపరమేశ్వరునిఠేవ
సూక్తివైచిత్రి నొక్కొక్కమాటు

తే. నైషధాదిమహాప్రబంధములు పెక్కు
చెప్పినాఁడవు మాకు నాశ్రితుఁడ వనఘ!
యిపుడు చెప్పఁ దొడంగిన యీ ప్రబంధ
మంకితము సేయు వీరభద్రయ్యపేర. 13

శా. ఈక్షోణి న్నినుఁ బోలుసత్కవులు లే రీనేఁటికాలంబునం
దాక్షారామచళుక్యభీమవరగంధర్వాప్సరోభామినీ
వక్షోజద్వయగంధసారఘుసృణద్వైరాజ్యభారంబు న
ధ్యక్షించం గవిసార్వభౌమ! భవదీయప్రౌఢసాహిత్యముల్.

వ. అనియనంతరంబ కర్పూరవసంతరాయండు వీరభద్రేశ్వరుండు
కర్పూరతాంబూలసహితంబుగా జాంబూనదాంబరాభరణంబు
లిచ్చినం బరిగ్రహించి. 15

సీ. ఆంధ్రక్షమామండలాఖండలుం డైన
వేమభూపతికృపావీక్షణంబు
ఘోడెరాయాంకసద్గురురాజభీమేశ్వ
రస్వామిపదసమారాధనంబు
కమలాద్రినిలయమార్కండేయశివమౌళి
చంద్రాంశునవసుధాసారధార
వేదాద్రినరసింహవిపులవక్షస్థలీ
కల్హారమాలికాగంధలహరి

తే. గారణంబులు సుద్బోధకములు గాఁగ
సంభవించిన సాహిత్యసౌష్ఠవమున
వీరభద్రేశ్వరుఁ బ్రబంధవిభునిఁ జేసి
కాశికాఖండముఁ దెనుంగుఁగా నొనర్తు. 16

తే. కలిగెఁ బదియాఱువన్నె బంగారమునకుఁ
బద్మరాగంబుతోడిసంపర్కలబ్ధి
కాశికాఖండ మనుమహాగ్రంథమునకు
నాయకుఁడు వీరభద్రభూనాథుఁ డగుట. 17

వ. అని తన్మహాప్రబంధకల్పనాకుతూహలాయత్తచిత్తుండ నై.

సీ. బాదరాయణుపాదపద్మంబులకు మ్రొక్కి
ప్రాచేతసుని మనఃపదవి నిలిపి
భట్టబాణమయూరభవభూతిశివభద్ర
కాళిదాసుల మహాకవులఁ గొలిచి
రాజశేఖరుని భారవి మాఘుఁ గీర్తించి
ప్రవరసేనుని దండి భాసుఁ దలఁచి
హర్ష బిల్హణుని మల్హణుఁ జోరుఁ గొనియాడి
క్షేమేంద్రు వేడుకఁ జిత్తగించి

తే. శబ్దశాసను నన్నపాచార్యుఁ దలఁచి
సత్కవిశ్రేష్ఠుఁ దిక్కయజ్వను భజించి
సత్ప్రబంధమహేశ్వరు శంభుదాసు
నధికసద్భక్తి సంయుక్తి నాదరించి. 19

తే. మత్పితామహుఁ గవిపితామహుని దలఁతుఁ
గలితకావ్యకళాలాభుఁ గమలనాభుఁ
జంద్రచందనమందారసదృశకీర్తి
సరససాహిత్యసామ్రాజ్యచక్రవర్తి. 20

వ. అని యనంతరంబ కృతీశ్వరు వంశం బభివర్ణించెద. 21

## కృతిపతివంశవర్ణనము

సీ. కలశాబ్ధికన్యకాకరపల్లవద్వయీ
సంవాహనక్రియాసముచితంబు
నిఖిలవేదాంతవాఙ్నిధివధూధమ్మిల్ల
బహుళపుష్పామోదభాసితంబు
ప్రణతనానాసుపర్వకిరీటసంఘాత
రత్నాంశురాజినీరాజితంబు
సనకాదిసన్మునీశ్వరమనోమందిరా
భ్యంతరరత్నదీపాంకురంబు
తే. పతగకేతనుశ్రీపాదపంకజంబు
గారణంబుగ జన్మించె భూరిమహిమ
గంగసైదోడు రిపుకోటిగళముత్రాడు
నాలుగవజాతి సమధికోన్నతవిభూతి. 22

శా. ఆవర్ణంబున నుద్భవించి గుణరత్నార్ణోనిధానంబు శ్రీ
దూన్నూరం బెరుమాళ్లరెడ్డియభివృద్ధుల్గాంచె మృత్యుంజయ
గ్రీవాత్యోళకలంకపంకహరణక్రీడాకళాగర్విత
ద్యావాపృథ్వ్యవకాశపేశలయశోధారానభస్సింధువై. 23

తే. అతనియర్ధాంగలక్ష్మి శ్రీయన్నమాంబ
గాంచెఁ దనయుల నర్థార్థికల్పకముల
నల్లయాధీశ పెదకోట యాన్న ప్రోల
దొడ్డయేశుల పినకోటరెడ్డివిభుల. 24

సీ. అవనిభారధురీణతాధరీకృతమహా
క్రోడప్రధానుఁ డల్లాడనృపతి

ఘాటీసమాటీకనాటోపవిధ్వస్త
  కుటిలాహితుఁడు పెదకోటశౌరి
పంటాన్వయక్షీరపాథోధిసంపూర్ణ
  పూర్ణిమావిధుఁడు తా ప్రోలవిభుఁడు
ప్రోద్దామదోర్గప్రతాపోదయవ్యతికర
  చ్ఛాయాధిపుండు దొడ్డాయనృపతి

తే. హాటకాచలధైర్యుండు మేటిబిరుదు
  పాటి కులవాఁడు కరహాటలాటబోట
  గౌళకర్ణాటదేశరాట్కటకసుకవి
  కోటినుతకీర్తి శ్రీపిన్నకోటరెడ్డి. 25

తే. పంటకులరాజు దొడ్డభూపాలునకును
  బరమకల్యాణి యన్నమాంబకును సుతులు
  ప్రోలభూపతియును గోటభూపతియును
  భువననుతకీర్తి యల్లాడభూపతియును. 26

వ. అందు. 27

సీ. కుటిలారిరాట్కంఠకుహరాంతములఁ గాని
  క్రీడింపనీఁడు కౌక్షేయకాహి
హారిదంతసౌధశృంగాగ్రవీథులఁ గాని
  తిలకింపనీఁడు కీర్తిధ్వజంబు
నాశ్రితబంధుమిత్త్రారామములఁ గాని
  సాగనీఁడు కృపావసంతలక్ష్మి
హారిణభృన్మూర్ధన్యచరణాబ్జములఁ గాని
  మరుగనీఁడు నిజాత్మమధులిహంబుఁ

తే. ప్రళయసంరంభశుంభదారభటిపటిమ
భయదఫాలాక్షభావసంభవదభంగ
దహనమహనీయదివ్యప్రతాపవిసర
దతులజయహారి దొడ్డయయల్లశౌరి. 23

మ. జయధాటీవిజయంబులన్ విలయజంఝామారుతాడంబర
స్మయహారిప్రతిజృంభమాణఘననిస్సాణోగ్ర భేరీస్వనం
బయి యొడ్డాడి భయంకరోడ్డమరశౌర్యం బైన శ్రీరెడ్డిదొ
డ్డయయల్లాడనృపాలురాహుతను బిట్టల్లాడు దిక్చక్రముల్.

మ. లలితాహంకృతి దొడ్డభూవిభునియల్లాడక్షమానాథు నా
జుల మార్కొన్నవిరోధిరాజు లమరస్తుత్యప్రతాపప్రభా
కలితశ్రీయుతులై సుఖింతు రెలమిం గల్యాణశైలంబుపైఁ
గలధౌతామలహర్మ్యరేఖలమరుత్కాంతాకుచాగ్రంబులన్.

మ. అనవేమక్షితిపాలుపౌత్రియగు వేమాంబామహాదేవికిన్
ఘనుఁ డయ్యల్లడభూమిపాలునకు సంగ్రామస్థలీగాండివుల్
తనయుల్ వేమవిభుండు వీరవసుధాధ్యక్షుండు దొడ్డప్రభుం
డునునన్నయ్యయు బాహువిక్రమకళాటోపప్రతాపోద్ధతుల్.

వ. అం దగ్రజుండు. 32

మ. కొనియెం గంచుకముల్ సముద్భటనటద్ఘోటీభటప్రౌఢిఁ గై
కొనియె న్వేడుకఁ జీడికొండ యహితక్షోణీశు లల్లాడఁ జే
కొనియె న్నాకవరంబు వీక మదవద్ఘోరారిసంహారి యై
ఘనుఁ డల్లాడమహీశు వేమన నిరాఘాటైకధాటీగతిన్. 33

సీ. సప్తమాడియరాయచంద్రబింబాననా
చికురవల్లరులపైఁ జిన్నిపువ్వు
రఘాడెజంతుర్నాటిజననాథశుద్ధాంత

కుచకుంభములమీఁది కుంకుమంబు
బారహాదొంతిభూపాలలీలావతీ
గండస్థలంబులఁ గలికినవ్వు
కలువపల్లొడ్డాదికటకాధిపతివధూ
సీమంతవీథులఁ జేరుచుక్క

తే. యల్లడాధీశువేమక్ష్మాధినాథు
భూరినిష్ఠురధాటీవిహారచటుల
సైన్యనాసీరతుక్ఖారశఫపుటోత్థ
వింధ్యపార్శ్వవసుంధరావిపులధూళి. 34

సీ. పంగువాసురథాని పావడం బంపిన
భద్రేభములు వీటఁ బాళెముందు
నోడ్డెధాత్రీనాథుఁ డుపదఁ బుత్తెంచిన
బింబాధరోష్ఠి సంబెళ వహించుఁ
గర్ణాటభూపతి కానుక యనిపిన
ముక్తాతపత్త్రంబు మ్రోల మెఱయు
యవనాధిపతి యుపాయనముగా నొసఁగిన
పాగాహయంబులు వాగె వచ్చు

తే. దూర మంతంత బారుహాదొంతిమన్నె
సప్తమాడియ రాజన్యసమితి మ్రొక్కు
రాయవేశ్యాభుజంగసంగ్రామపార్థ
గాయిగోవాడవేమనక్ష్మాధవునకు. 35

క. చటులత నల్లయవేమన
పటుధాటీవిజయభేరిభాంకృతి మొరయుఁ

ఆటవామదనృహారిసమధిక
కటుకంఠగభీరకుహారకవాకహారవమై. 36

సీ. ధరియింప నేర్చిరి దర్భవెట్టిన వ్రేళ్ల
లీల మాణిక్యాంగుళీయకములు
కల్పింప నేర్చిరి గంగమట్టియ మీఁదఁ
గస్తూరికాపుండ్రకంబు నొసల
సవరింప నేర్చిరి జన్నిదంబుల మ్రోలఁ
దారహారములు ముత్యాలసరులు
చేర్పంగ నేర్చిరి శిఖలనెన్నడుములఁ
గమ్మనిక్రొత్తచెంగల్వవిరులు

తే. ధామముల వెండి పసిడియుఁ దడఁబడంగ
బ్రాహ్మణోత్తము లగ్రహారములయందు
వేమభూపాలునను జన్ము వీరభద్రు
ధాత్రి పాలింప గౌతమీతటములందు. 37

తే. ప్రకటశాఖోపశాఖలఁ బంటవంశ
ముద్ధరించిన వేమేంద్రుఁ డుదయవేళ
శివు విశాఖునిఁ బూజించు భక్తి
లలితబిల్వత్రిశాఖపలాశసమితి. 38

సీ. త్రింబకాచలకన్యకాంబుపూరంబున
నఘమర్షణస్నాన మాచరించి
నిద్దమైన మడుఁగుసీర్కావిదోవతి
కనకమేఖలతోడఁ గట్టి ఘటించి
మూలమంత్రాక్షరంబుల భూతి మంత్రించి
పుండ్రకం బొగి ఫాలమున ధరించి

క్రొత్తము త్తైములతో రుద్రాక్షమాలిక
లష్టోత్తరశతంబు లలుతఁ దాల్చి

తే. పుండరీకాజినమునఁ గూర్చుండి శంభు
నర్చనముఁ జేయునపుడు మహాప్రమథుఁడు
చాల నొప్పారు రెండవశంభునట్లు
వీరనారాయణుం డల్ల వేమవిభుఁడు. 39

శా. చంచల్లీలల హస్తకంకణమణిచ్ఛాయల్ ప్రకాశింపఁ బూ
జించు న్వేమమహీవిభుండు నవరాజీవంబులం గల్వలన్
బ్రాంచత్కాంచనపుష్పకేసరములం బ్రాసాదపంచాక్షరిన్
మంచుంగొండయనుంగుఁబెండ్లికొడుకున్మధ్యాహ్నకాలం [బునన్.

వ. తదనుసంభవుండు. 41

సీ. రాజశశాంకశేఖరుఁడు రాజకిరీటవతంస మష్టది
గ్రాజమనోభయంకరుఁడు రాజులదేవర రాజరాజు శ్రీ
రాజమహేంద్రభూభువనరాజ్యరమావమణీమనోహరుం
డాజిఁ గిరీటి కీర్తినిధి యల్లయవీరనరేంద్రుఁ డున్నతిన్.

మ. మనుతుల్యుం డగుకోటభూవిభుని వేమక్ష్మాతలాధీశునం
దనఁ బాణిగ్రహణంబుచేసెఁ బ్రియ మొందన్వీరభద్రేశ్వరుం
డనితల్లి న్వనితామతల్లి సువయాస్త్రాద్రీంద్రసీమావనీ
ఘనసామ్రాజ్యసమర్థ ప్రతిమసాక్షాదిందిరాదేవతన్. 43

తే. అట్టియనితల్లి పుణ్యగుణాభిరామ
దనకుఁ బట్టంపుదేవిగా ధన్యలీల
వసుధయెల్ల నేకాతపవారణముగ
నేలు నల్లయవీరభద్రేశ్వరుండు. 44

సీ. మకరకుండలదివ్యమాణిక్యదీప్తులు
చెక్కుటద్దములపై జీరువాఱ
డాకాలిగండపెండారంబుదాపున
బొమ్మలై వైరిభూభుజులు వ్రేలఁ
గమియంగ నలఁదినకస్తూరినెత్తావి
యష్టదిక్కులయందు నవఘుళింప
మొగము చూచినమాత్ర మూర్ధాభిషిక్తులు
మోడ్పుఁజేతులు మస్తముల ధరింప
తే. మెఱుఁగుఁదీఁగెలఁ బోలుభామినులు గొలువ
నిండుకొలు వుండెఁ గన్నులపండు వగుచు
రాయవేశ్యాభుజంగవీరప్రతాప
విభవుఁ డల్లాడభూపతి వీరవిభుఁడు. 45

స్రగ్ధర. జంభారాతిభశోభాచకచకనిభముల్ శాంభవీయాట్టహా
హా, రంభాపస్తంభరేఖారభటలటహముల్ రాజరాజాద్రితే
జ, స్సంభారభ్రాంతిదంబుల్ సకలభువనవీథీకరంభంబులై
యుర్వీశా, జృంభించుకా వీరభద్రక్షితిరమణయశశ్శ్రీవధూవి
[భ్రమంబుల్.
క. వేరీ ధరణిపు లల్లయ
వీరక్ష్మాపతికి సాటి వితరణగరిమకా
ధారాధరధారాధవ
ధారాధరవాహదానధారానిధికిక్. 47

సీ. గోదావరీపావనోదకంబుల హేమ
కలశీశతంబుల జలక మార్చుఁ
గర్పూరకస్తూరికాకుంకుమంబులఁ
గలపంబుఁ గూర్చి శ్రీగంధ మలఁదు

సప్తగోదావరస్వర్ణపుష్కరహేమ
సౌగంధికముల నర్చనము సేయు
గలధౌతపాత్రలఁ గాలాగురుచ్ఛేద
బహుళధూపంబులు బరిఢవించు
తే. వేనవేలు నివాళులు విస్తరించు
నమృతదివ్యాన్నముల నుపహార మిచ్చు
సంఘటించు నశేషోపచారములను
బ్రమథనాయకునకు వీరభద్రనృపతి. 48

చ. విలసితకీర్తిశాలి యగువీరమహేశ్వరు *గేహరంబు శ్రీ
నిలయమునం ద్రిసంధ్యమును నిర్మలసౌధసువర్ణజాలకం
బుల వెడలుం గిరీశగళమూలహలాహలకాంతిఁ బోలి గు
గ్గులుమహిసాక్షివాసనలఁగ్రొవ్వినమంగళధూపధూమముల్.

ఉ. ఈశ్వరుఁ డింటివేల్పు జగదేకగురుం డగుఘోరరాయభీ
మేశ్వరుఁ డాత్మవంశగురుఁ డ్రీగులు నిత్యవినోదకృత్యముల్
శాశ్వతధర్మకీర్తులు దలంపఁగ నమ్మినసొమ్ము లాదిగ
శ్వేశ్వరుఁ డౌట నైజ మెనయే నృపు లల్లయవీరశౌరికిన్. 50

సీ. తెంచు నెవ్వనిహేతి దృప్తారినరవర
గ్రైవేయపరిలసత్కంధరముల
ముంచు నెవ్వనికీర్తిము గ్ధేందుధరకంఠ
కాకోలవిషమషీకాళిమంబుఁ
బెంచు నెవ్వనిబుద్ధి పంచాస్త్రపరిపంథి
పాదపాథోధితాత్పర్యచర్య
మించు నెవ్వనిమూర్తి మీనచిహ్నజయంత
నల నలకూబరాదుల జయించి

తే. యతఁడు వొగడొందు రాయవేశ్యాభుజంగుఁ
డవధిమహీధరచరమగాఢాంధకార
ధట్టఘట్టనలటహప్రతాపతపనుఁ
డల్లనరనాథుదొడ్డభూవల్లభుండు. 51

శా. ఔరా! యల్లయరెడ్డిదొడ్డవసుధాధ్యక్షుండు ధాటీచమూ
భేరీభాంకృతిఘోరఘోషమున నిర్భేదించె నొడ్డాది శ్రీం
గారంకోటయు లోఁతుగడ్డ (ద్ద)యునునుద్ఘాటించెనత్యుద్ధతి
క్షీరాంభోధితటంబున న్నిలిపె దిక్సీమాజయ స్తంభముల్.

మ. హరి దాఁటించెఁ బురోపకంఠమున వాహ్యాళిప్రదేశంబునం
దరరే యల్లయరెడ్డినందనుఁడు దొడ్డయ్యక్షమాధీశ్వరుం
డిరువైనాలుగుమూళ్ల మేర యనుగో సెక్కింపఁగా నేలయ
ద్ధరణీనాథునికీర్తి దాఁటెఁ గడు నుద్దండించి బ్రహ్మాండముల్.

మ. సరి [illegible] రిజలరాశివేష్టితమహీచక్రంబున న్విక్రమా
పరగాండీవికిఁ జక్రవాళమహీభృత్పర్యంతవిశ్వంభరో
ద్ధరణప్రౌఢభుజాభుజంగమునకుం ధాత్రీశు లల్లాడభూ
వరునన్నయ్య కకుంఠవాఙ్మయకళావైకుంఠరాట్సయ్యకున్.

సీ. జిష్ణువైభవరేఖఁ జెలువొందుటయుఁగాక
పావకవిస్ఫూర్తిఁ బరఁగు టెట్లు
ధర్మరాజవిభూతి దర్పించుటయుఁ గాక
పుణ్యజనోపాఖ్యఁ బూను టెట్లు
మహిని [illegible]చేతస్సమహిమఁ దాల్చుటయకా
తగ జగత్ప్రాణాఖ్యఁ దాల్చు టెట్లు
ధనదత్వవిఖ్యాత ఘనత నొందుటఁ గాక
శంకరసుషమచే జరగు టెట్లు

తే. తెలిసి దిక్పాలకాంశావతీర్ణుఁ డగుట
భోగమున శుద్ధ సూనృతమున జయమున
నాజ్ఞ బలమున ధనమున నధికకరుణ
నల్లభూపాలనందనుఁ డన్నవిభుఁడు. 55

ఉ. వల్లకిచక్కకాహళమువంశముడక్కహుఁడుక్కఝర్ఝరుల్
ఝల్లరి యాదిగాఁ గలుగుశబ్దపరంపర తాళబద్ధమై
యుల్లసితప్రబంధముల కొప్పుగ నాదుదు రగ్రవేదిపైఁ
బల్లవపాణు లీశ్వరునిఁ బంటమహీశులు పూజసేయఁగన్. 56

శా. మార్కండేయ మహేశ్వరుండఖిలసామ్రాజ్యంబు పాలింపఁ
గా, నర్కేందుల్గలయంతకాలము తదీయాంఘ్రిద్వయీభక్తి
సం, పర్కోదంచితభాగ్యసంపదలనాత్మామండలీవల్లభుల్
కోర్కుల్నిండఁగ సేవకత్వమునకై కొండ్రాయురైశ్వర్యముల్.

సీ. ఉండు నేవీట మార్కండేయమునినాథ
సజ్జలింగ మనంగశాసనుండు
ప్రవహించు నేవీటిపశ్చిమ ప్రాకార
మొరసి గంగమ్మ సాగరముకొమ్మ
యావిర్భవించినాఁ డేవీటికోటలో
బలభేది మదనగోపాలమూర్తి
పాలించు నేవీటి ప్రాగుదక్కోణంబు
నుమకోటి శ్రీముల్లగూరిశక్తి

తే. ప్రబలతారాసురత్రాణభద్రజాతి
కరిఘటాసైన్యదుస్సాధకనకలోహ
గోపురద్వారకవాటప్రదీపిత మది
సాంద్రవిభవంబు రాజమహేంద్రపురము. 58

మ. కలపుంస్కోకిలకంఠకోమలకుహూకారస్ఫురత్పంచమ
స్ఖల[1]పద్యాశ్యములైనకాలముల మార్కండేయనాథేశ్వరుర్
లలితోరస్కుఁడు వీరభూపతి వసంతం బాడు నీవీటివీ
థులఁ గర్పూరహిమాంబుసంకుమదకస్తూరీపటీరంబులన్. 59

ఉ. * ప్రాకటవిక్రమస్ఫురణ రాజమహేంద్రము రాజధానిగా
నేకసితాతపత్త్రమున నేలెను వీరనృపాలుఁ డుత్తమ
శ్లోకుఁడు వేమశౌరియనుజుండు సమున్నతవైభవాఢ్యుఁడై
చీఁకటియుర్ గళింగయునుఁజిల్కసముద్రముసింహశైలమున్.

షష్ఠ్యంతములు

క. ఈదృశగుణగణనిధికిని
వేదార్థకవిత్వతత్త్వవిధివత్పతికిర్
త్మాదివిజకవిజనాళీ
ర్వాదప్రవితీర్యమాణవైభవనిధికిన్. 61

క. క్షురికాకరబేతాళున
కరిభయదభుజాపరాక్రమాభీలునకుర్
శరణాగతకురుకేరళ
కురుభూపాలునకు జగదగోపాలునకున్. 62

క. అంభోధివలయితావని
సంభరణప్రౌఢనిజభుజా[illegible]యుగళీ
సంభావితకిటికచ్ఛప
కుంభీనససార్వభౌమకులకుధరునకున్. 63

క. వేమాధిపానుజునకును
రామామదనునకు ఘోడెరాయగురు శ్రీ

---

1. దధ్యాస్య; పద్యాస్య; దుర్వాస్య. * ఈపద్యము కొన్నిప్రతులలోఁగన్పట్టదు.

భీమేశ్వరశిష్యునకు
న్యేనూంబోగర్భసలిలనిధిచంద్రునకున్. 64

క. త్రైలోక్యవిజయసాధవి
శాలమహోదారచంద్రశాలాసతత
వ్యాలోకితగౌతమజ గోదావరి
న్యాలహరీవిగ్రహాఖాండవాటోపునకున్. 65

క. అనితల్లివల్లభునకుఁ
గనకాద్రివినిద్రకల్పకద్రుమలీలా
వనభవనకిన్నరస్త్రీ
జనతాజేగీయమానచారిత్రునకున్. 66

క. నిర్ఘృణనిర్ఘాతస్ఫుట
నిర్ఘోషకఘోరధాటినిస్సాణమహా
దీర్ఘతరధణధణాంకృతి
ఘూర్ఘటననిర్దళితచతురదిక్కునకున్. 67

క. హాటకకుభృద్ధనురర
జూటీకోటీకుటీరసుమనస్తటినీ
వ్యాటీకోర్మిసంఘో
ద్ఘాటవచోవైఖరీజితద్రుహిణునకున్. 68

క. గజదళవిభాళబిరుదున
కజగవధరభక్తిభావితాత్మునకు సమి
ద్విజయునకు రాయవేశ్యా
భుజగునకును వీరభద్రభూపాలునకున్. 69

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన కాశీ
ఖండంబు. 70

# ప్రథమాశ్వాసము ✓

## కథాప్రారంభము

### పురాణప్రశంస

సీ. పద్మాదికంబులు పదియు నెనిమిదియు
నాదిపురాణంబు లాపురాణ
జాతంబు నాల్గులక్షలసంఖ్యగలయది
యుపపురాణంబు లం దుద్భవించె
బదునొకండవది యై బహుసంహితలతోడ
బహుఖండములతోడ బహువిచిత్ర
కథలతో నేకలక్షగ్రంథపరిమాణ
కలితమై శ్రీమహాస్కాంద మొప్పు

తే. నమ్మహాస్కాందమునకు సారాంశ మనఁగ
నాల్గుపురుషార్థములకుఁ దావక మనంగ
బ్రహ్మవిద్యకు నాదికారణ మనంగ
నఖిలఖండంబులందుఁ బ్రఖ్యాతి వడసె. 71

తే. మూఁడులక్షలుఁ బదియేడు ముగిసిపోవఁ
దాఁ బ్రవర్తిల్లు లక్షగ్రంథంబుతోడ
సమధికస్ఫూర్తి నేపురాణములు సాటి
గరిమ కంచంబునకు మహాస్కాందమునకు. 79

తే. పదియు నెనిమిది యన్యదేవతలఁ దెల్పుఁ
బదిపురాణంబు లీశ్వరుఁ బ్రస్తుతించుఁ

జంద్రమౌళిప్రభావంబు సమధికముగ
శ్రుతులయట్ల [1]పురాణసంహితలు నడుచు. 73

తే. సరవి సర్గంబు నాఁ బ్రతిసర్గ మనఁగ
వరుసతో వంశవంశ్యానుచరితము లనఁ
గ్రమపరిప్రాప్తి మన్వంతరము లనంగ
లలిఁ బురాణంబునకు నైదు లక్షణములు. 74

తే. గ్రంథపరిసంఖ్య నాల్గులక్షలు పురాణ
మది చతుర్దశవిద్యలయందుఁ బెద్ద
చాలఁ గర్త్రర్థ మం దానుషంగిక మన
యాదికారికయందె బ్రహ్మార్థగరిమ. 75

ఉ. అట్టి [1]దివ్యపురాణముమహత్త్వముసూతుఁడుదద్విదుండుగాఁ
బట్టి కనిష్ఠజన్మమునఁ బ్రాకృతుఁ డయ్యునురుప్రభావులై
నట్టిమహామునీంద్రులకు నంబుజసంభవునంతవారికిన్
దిట్టతనంబుమీఱ నుపదేశ మొనర్చుచు నుండు బ్రహ్మమున్.

నైమిశశబ్ద నిర్వచనము

సీ. ఆది మనోమయం బగునొక్కచక్రంబుఁ
గల్పించె బ్రహ్మ జగద్ధితముగఁ
గల్పించి యాబండికలు డొల్చె సత్యలో
కంబుననుండి యాకమలగర్భుఁ
డది డొల్లగిలివిష్టపాంతరంబులు దాఁటి
క్రమముతో భూమిచక్రమున వ్రాలె
వ్రాలి రంహస్స్ఫూర్తి వచ్చివచ్చి ధరిత్రి
నిమ్నోన్నతుల శీర్ణనేమి యయ్యె

1. పురాణతత్త్వము ప్రియంబున.

తే. నేమి విరిసినకతన నన్నైలనెలవు
నైమిశంబయ్యె నదియ తా నైమిశంబుఁ
దన్మహాపుణ్యవనమున ద్వాదశాబ్ది
సత్త్రయాగంబుఁ గావించె శౌనకుండు. 77

వ. ఆసత్త్రయాగంబునందు శౌనకాదిమహామునులును సూతా
న్వయసంభవుం డైనసూతు నర్చించి తన్ముఖంబునం బురా
ణేతిహాససంహితలు వినిరి గావున నమ్మహావిద్యాస్థానంబు
సూతమునిసంవాదాత్మకంబు. 78

తే. స్కాందమందుల నేఁబదిఖండములకు
బహుకథాసంగతులు సేయ బాడి గాదు
ఖండఖండంబులందును గలిగినట్టి
కథలపాలివి సంగతిగ్రహణమునకు. 79

వ. ఇమ్మహాస్కాందమ్మునకు నవయవంబు లాఱుసంహిత లవి
క్రమంబున సనత్కుమారసంహిత పంచపంచాశత్సహస్రిక,
సూతసంహిత షట్సహస్రిక, శాంకరసంహిత త్రింశత్సహ
స్రిక, వైష్ణవసంహిత పంచసహస్రిక, బ్రహ్మసంహిత త్రిసహ
స్రిక, సౌరసంహిత యేకసహస్రిక, ఈసంహితలయందుఁ
(బంచ)నాగరఖండంబు. గమలాలయాఖండంబు, రేవాఖండం
బు, నేకవీరాఖండంబు, మైలారఖండంబు, గోదావరీఖండంబు
నాదిగాఁగల పంచాశత్ఖండంబులందు: 80

కాశీఖండప్రశంస

శా. ప్రాశస్త్యంబు వహించు ద్వాదశసహస్రగ్రంథసంక్షిప్తివి
శ్వేశక్షేత్రవియన్నదీవటుకడుంఠీనాథ సత్కీర్తనో
ద్దేశప్రక్రమశోభితాద్భుతకథాధిష్ఠాన మై శ్రేష్ఠ మై

కాశీఖండమఖండవైభవమునన్ స్కాందాబ్ధిమధ్యంబునన్.

వ. ఈకాశీఖండంబు వేదవ్యాససూతసంవాదాత్మకం బనియు నుం గొందఱు చెప్పుదురు. దీనికిం గథాక్రమణిక వింధ్యనారదసంవాదంబు, బ్రహ్మలోకప్రభావంబు, గోదానమాహాత్మ్యంబు, వారాణసియం దగస్త్యాశ్రమవర్ణనంబు, మునిదేవతాసమాగమంబు, పతివ్రతాచరిత్రంబు, కుంభసంభవప్రార్థనంబు, తీర్థప్రశంస, శివశర్మోపాఖ్యానంబు, సప్తపురీప్రశంస, సంయమనీప్రశంస, మహేంద్రలోకదర్శనంబు, వహ్నిసముత్పత్తి, క్రవ్యాద్వరుణసంభవంబు, గంధవత్యలకావర్ణనంబు, చంద్రలోకప్రాప్తి, యుడులోకవృత్తాంతంబు, శుక్రసముద్భవంబు, శనైశ్చరలోకవర్ణనంబు, సప్తర్షిలోకధ్రువలోకవర్ణనంబులు, కుమారాగస్త్యసంవాదంబు, మణికర్ణికాసముద్భవంబు, గంగామాహాత్మ్యంబు, భైరవావిర్భావంబు, దండపాణిజన్మంబు, కళావత్యుపాఖ్యానంబు, సదాచారంబు, బ్రహ్మచారిప్రకరణంబు, స్త్రీలక్షణంబు, కృత్యాకృత్యప్రకరణంబు, గృహస్థధర్మంబు, యోగనిరూపణంబు, కాలజ్ఞానంబు, దివోదాసవర్ణనంబు, యోగినీవర్ణనంబు, లోలార్కోత్తరార్కసంజ్ఞాదిత్యద్రుపదాదిత్యారుణాదిత్యవర్ణనంబు, దశాశ్వమేధతీర్థమాహాత్మ్యంబు, పిశాచమోచనంబు, గణేశ్వరప్రేషణంబు, గణేశ్వరమాయాప్రపంచంబు, ఢుంఢీప్రాదుర్భావంబు, విష్ణుమాయాప్రపంచంబు, దివోదాససముచ్చాటనంబు, పంచనదోత్పత్తి, బిందుమాధవసంభవంబు, వైష్ణవతీర్థమాహాత్మ్యంబు, మందరాచలంబుననుండి యిందుమౌళి వారాణసీపురంబున కేతెం

చుటయు, జైగిషవ్యోపాఖ్యానంబు, కృత్తివాసుసముత్పత్తి, దుర్గామాహాత్మ్యంబు, ఓంకారమాహాత్మ్యంబు, త్రిలోచన సముద్భవంబు, కేదారేశధర్మేశమాహాత్మ్యంబులు, పక్షి కథ, విశ్వభుజాఖ్యానంబు, దుర్దమకథ, విశ్వేశ్వరాఖ్యానంబు, కామేశ్వరవిశ్వకర్మేశ్వరసరస్వతీశ్వరామృతేశ్వరవర్ణనంబులు, వ్యాసభుజాస్తంభంబు, క్షేత్రతీర్థకదంబవర్ణనంబు, ముక్తిమంటపవర్ణనంబు, విశ్వేశ్వరావిర్భావంబు దేవతాయాత్రావిధానంబు నను బుణ్యాఖ్యానంబు లేకోత్తరశతంబునుం గలిగి.

శా. ఆశాస్యంబులు సంఘటించును బహూపాఖ్యానశాఖోపశా
ఖాశోభాసముదంచితాభ్యుదయమై స్కాందాబ్ధిసంజాతమై
యీశానుగ్రహలబ్ధముక్తిఫలమై యెక్కాలముం శ్రోతకుం
గాశీఖండ మఖండవైభవమునం గల్పద్రుమప్రక్రియన్.

వ. పూర్వఖండంబున బ్రహ్మర్షి నారదుండు తీర్థయాత్ర చరించె నని సూతుండు శౌనకాదిమహామునులకుం జెప్పి వారడుగం గాశీవృత్తాంతం బిట్లని చెప్పం దొడంగె. కృష్ణద్వైపాయనుండు ప్రియశిష్యుండైనసూతున కనంతకథాక్రమంబునం గాశీఖండకథాకథనప్రారంభంబున నిట్లనియె. 84

నారదుఁడు వింధ్యమున కేతెంచుట

తే. ఇవ్విధంబునఁ దీర్థంబు లెల్ల నాడి
నర్మదానది నవగాహనం బొనర్పఁ
దలఁచి గోదావరీసింధుతటము పట్టి
దండకారణ్యవీథిమధ్యంబు దరిసి. 85

వ. ముందట. 86

శా. కాంచెం గాంచనగర్భసంభవుఁ డుదగ్రగ్రావకోటిస్ఖల
చ్ఛంచన్నిర్ఝరవేణికానివహాసంజాతాబ్ధిసాంగత్యముం
బంచాస్యస్ఫుటకంఠనాదహతశుంభత్కుంభిదర్పాంధ్యముం
బ్రాంచద్ధాటకభూమిభృచ్ఛిఖరగర్వావంధ్యమున్వింధ్యమున్.

క. రేవాతరంగశీకర
సేవాహేవాకపాకశిశిరసముత్పి
స్తావపరికంప్యమానజ
టాపలి యగు చతఁడు వింధ్య మల్లనఁ జేరెన్. 88

క. తాపసకులాగ్రగణ్య
శ్రీపాదాంభోజయుగళచిహ్నశ్రేణీ
నైపథ్యపరమపుణ్యశి
లాపట్టం బగుచు నయ్యిలాధర మలరెన్. 89

సీ. త్రసరేణుపరిమాణధాతుధూళీపాళి
యళికంబులకు వింతచెలువ మొసఁగ
ఘన మైనరారాపుచనుదోయిరాయిడి
నిఱుపేదనడిమికి వెఱపు చూపఁ
పొలుపాఱు మెఱుఁగుఁదీఁగెల బోలుకన్నులు
వడ దాఁకి యొక్కింత వాడఁ బాఱ
సిందూరతిలకంబు చెమటచిత్తడిఁ దాఁకి
యళికభాగంబునం దసలుకొనఁగఁ

తే. గనకమేఖల జఘనచక్రమునఁ జాఱ
నీవిబంధంబు నాలోన నెమ్మి వదల
మహతి ధరియించి యొకతనుమధ్య దన్ను
ననుచరించుచు గాంధర్వ మభ్యసింప. 90

## వింధ్యవర్ణనము

సీ. కర్పూరకదలికాకాంతారపవనంబు
లధ్వనీనశ్రాంతి నపనయింప
మదురంగఁ బండినమాలూరఫలములు
చెంచుకన్యలకుచశ్రీలఁ జెనయ
నురగవల్లీగాఢపరిరంభణంబులఁ
బోఁకమ్రాఁకులకింపు పురువుకొనఁగఁ
బాటలీవకుళచంపకసౌరభముతోడ
విచికిలామోదంబు వియ్య మంద

తే. గమియ నామూలచండంబుగా ఫలించి
యంబరము మోచి యున్న యుదుంబరములు
లీల బ్రహ్మాండభాండమాలికలభూష
లవధరించిన వృషభాంకు ననుకరించె. 91

క. దరవికచవకుళకురవక
పరిమళసంభారలోలబంభరమాలా
పరిష జ్ఝంకారధ్వని
తెరువరులకు మన్మథప్రదీపన మొసఁగున్. 92

వ. వెండియుఁ గర్కరేటుకఠోరతారతరరటనంబున్నుదాత్యూహ
వ్యూహకహకహారావకోలాహలంబును గలకంఠకంఠకో
మలకుహూకారంబును మదకలకలవింకచూంకృతంబును, కాక
కాకలీకలకలంబునుఝుంఝానుపుంఖఝిల్లీఝుంకారధారాప్రసా
రంబును సముద్ధతధ్వాంక్షనిధ్వానపాటవాటోపంబును,
సముత్కటోత్కోశవాసితవ్యాఘ్రసంరంభ సంభ్రమం
బును గోయష్టివదననిష్ఠ్యూతనిష్ఠురారావనిష్ఠాసౌష్ఠవంబు

నుం గూడి కిటిశరభగండవేదండశార్దూలసింహగవయసృమరచమరవాతప్రమిహాలులాయఖడ్గరురుకురంగ భల్లూకస్ఫేరవగోలాంగూలాదినానామృగంబులయేలుంగులతోడఁ గిడ్పి ఆసి లతాకుడుంగగర్భంబులం బ్రతిశబ్దంబులావిర్భవింపం జేయఁగిసలయముకుళకుసుమశలాటుఫలభరితంబై బిసరుహబాంధవునికిరణవిసరంబులను సుంగనీయక్రమసుమసుకనియిరులసలుకొనుచు నిసుకచల్లిన రాలనిపసరుడాలవింధ్యవసుంధరాధరప్రాంతకాంతారంబు దశిసి చనువాఁడు ముందట. 93

మ. నలినప్రోద్భవసూతి గన్గొనియె వింధ్యక్షోణిభృత్కందరా
బలవద్దండశిలాభిఘాతవిలుఠత్పాథస్తరంగచ్ఛటా
స్థలసంరంభవిజృంభమాణపటుఝంకారస్ఫుటాంతర్మదా
గలనాతత్పరభక్తలోకపరిరక్షాశర్మదన్ నర్మదన్. 94

తే. దివిజముని నర్మదానదిఁ దీర్థమాడి
విమలభస్మంబు నిఖిలాంగకముల నలఁది
యెలుత రుద్రాక్షమాలిక లనువుపఱచి
భవుని నోంకారనాథునిఁ భక్తిఁ గొలిచి. 95

వ. అప్పుడు. 96

తే. స్థావరంబైనరూపంబు జలదవీథి
నావరించుచు మొదల నున్నట్ల యుండ
జంగమంబైనరూపంబు సవదరించి
యెదురుగా వచ్చె వింధ్యమహీధరంబు. 97

తే. అతిథి గడునల్పుఁడైన నత్యధికుఁడైన
నింటి కేతేరఁ బ్రియ మందు నెవ్వఁ డేని

వానిగౌరవ మది గౌరవంబు గాని
కాదు గౌరవ మాకారగౌరవంబు. 98

సీ. మొగులు ముట్టినమహామూర్ధంబు ధర మోవఁ
బాదాంబుజములకుఁ బ్రణతిఁ జేసి
యంతరంగముకంటె నత్యున్నతం బైన
పృథుహేమపీఠంబు వెట్టఁ బంచి
దధ్యాజ్యమధుపుష్పదర్భాదికము లైన
యష్టాంగములతోడి యర్ఘ్య మిచ్చి
యాత్రాసముత్థితాయాసఖేదము వాయ
నంఘ్రిసంవాహనం బాచరించి

తే. శ్రాంతి దీఱుట యెఱిఁగి హస్తములు మోడ్చి
వినయవినమితగాత్రుఁడై విన్నవించె
తనగుహారంధ్రములు ప్రతిధ్వనుల నీన
వేల్పుఁదపసికి నిట్లని వింధ్యశిఖరి. 99

వ. మహానుభావా! భవదీయకృపాకటాక్షవీక్షాసుధారసప్రవాహంబున రజఃప్రసరంబును ద్వదంఘ్రినఖచంద్రమండలజ్యోత్స్నాసమున్మేషణంబునం దమఃకాండంబును ఖండింపఁ బడియె. ఇంతగాలంబునకుఁ బ్రాగ్జన్మకృతంబు లైనసుకృతంబులు ఫలించె. విశ్వంభరాభారభరణదీక్షాధురంధరంబు లగునాకులంబు వసుంధరాధరంబులలోన మాన్యుండ నైతి ధన్యుండ; గృతార్థుండ; భాగ్యవంతుండ; అది యట్లుండె. యుష్మత్పాదారవిందసందర్శనంబునం బ్రభవించినయానంద ప్రవాహం బుల్లంబున వెల్లివిరిసినకతంబున నేయర్థంబునకు నవకాశంబు లేదు. ఐనను నొక్కవిన్నపంబు సావధాన

మతి వై యవధరింపుము. నీకు సేవాంజలీపుటంబు, పంచాశ త్కోటివిస్తీర్ణంబైనభూమండలంబునందు నీవుచూడనియట్టి మహీధరంబులు లేవ. కొండలు లెక్కకుఁబెక్కు కలుగుం గాక, యెనిమిది దిక్కుంజరంబులకుదిక్కై కూర్మంబునకు నర్మిలి యై క్రీడాక్రోడంబునకుఁ దోడై పాఁపతేనికిం బ్రాపై యేనుబోలె నెక్కటి యీసర్వసర్వంసహాచక్రంబును భరి యింపంగలయదియే? మందరంబు మందరశ్మి, నీలంబు నీల నిలయం, బస్తం బస్తవ్యస్తం, బుదయం బనభ్యుదయంబు, క్రౌంచంబకించనంబు, గంధమాదనంబు పేద, పారియాత్రం బేతన్మాత్రంబు, మలయదర్దురత్రికూటంబు లోకపాటివి, మహేంద్రనిషధద్రోణంబులు దరిద్రాణంబులు, హేమకూ టంబు గిటగిటన, తిక్కుఁజిఱుకొండలఁబేర్కొనం గారణం బేమి? ఇప్పు డిప్పాట నాతోడం బ్రతిభటింపఁ గలయ్యది సుర గరుడఖచరవిద్యాధర యక్ష కిన్నర గంధర్వాదరీకరాశ్ర యంబును, గల్పతరువాటి, కామధుగ్ధేనుమండలంబును, విబుధవేదండశుండాదండచుళికితోద్దీర్ణ స్వర్ణదీకాండగం డూషితబ్రహ్మాండగోళంబును నగు సుమేరుశైలంబు. మా యిద్దఱతారతమ్యంబును నెఱుంగుదు. నాకు నగ్గిరికి నిప్పుడు గొన్ని వాసరంబులనుండి యీరసంబు పెరుఁగం గఱకఱిక నెట్టుకొని సాగుచున్నది. ఇంక నెట్లుండు? భట్టారకా! యొకమాట యుడిగి పక్షపాతంబు పరిత్యజించి యానతిమ్ము.

తే. అని యవష్టంభసంరంభ మతిశయిల్లఁ
బలుకుటయు నాత్మ గర్హించి నలువపట్టి
యొుం డన్నాక యొుక్కింతసే పూరకుండి

యుస్సు రనుచు వేఁడినిట్టూర్పు వుచ్చి. 101

వ. పదంపడి నిలింపమౌనికలహప్రియుండుగావునఁ ద్రిభువనోప ద్రవకారణంబైనను నమ్మహామహీధరంబులసంఘర్షణంబునకు సమ్మతించి శక్తిసంధుక్షణార్థంబు వింధ్యంబున కిట్లనియె. 102

శా. నాతో నీ విపు డెట్టులాడితి ప్రధానత్వం బపేక్షించి ప్ర స్ఫీతాటోపమహాప్రతాపగుణగంభీరార్థయుక్తంబుగా నాతో నట్లన యాడె మేరువు ప్రధానత్వం బపేక్షించి ప్ర స్ఫీతాటోపమహాప్రదీపగుణగంభీరార్థయుక్తంబుగన్. 103

తే. నీ వెఱుంగుదు నీలావు నిక్కువముగ
నెఱుఁగుఁ దనలావు తా నమ్మహీధరముదానె
తప్పకుండ మీయిద్దఱతారతమ్య
మెంతవారును దెలియంగ నెంతవారు. 104

వ. శ్రీశైలవేంకటాహోబలశోణాద్రిసాలగ్రామాది పర్వతంబులు మహానుభావంబున మీయిద్దఱకంటె నధికంబులు. మీగ ర్వాలాపంబులు వినియోర్వవచ్చునే? మిమ్ము నేమనవచ్చును? హెచ్చుకుం దాడ నేరక విషాదంబున నిట్టూర్పునిగుడించితి. మముఁబోటి తీర్థయాత్రాపరాయణులకు నిది యేటిచింత? మీకు మే లయ్యెడుఁ బోయి వచ్చెద నని వారదుం డెం దేనియుం జనియెఁ దదనంతరంబ. 105

తే. విబుధమునిమాట చెవికిఁ గ్రొవ్వేఁడి యగుడు
వంధ్యగర్వోదయుం డైన వింధ్యశిఖరి
చాల నుద్వేగ మంది విచారపరత
నాత్మగతమునఁ దాను నిట్లనుచు నుండె. 106

తే. శాస్త్ర మాచార్యసన్నిధిఁ జదువఁ దేని

నిద్ధబోధంబు మది సంగ్రహింపఁ డేని
దెగువ మీఱి ప్రతిజ్ఞ సాధింపఁ డేని
జ్ఞాతిజయ మందఁ డేని తజ్జనుఁడు జనుఁడె? 107

ఉ. కంటికి నిద్ర వచ్చునె? సుఖం బగునే రతికేళి? జిహ్వకుఁ
వంటక మిందునే? యితరవైభవముల్ పదివేలు మానసం
బంటునె? మానుషంబుగలయట్టిమనుష్యున కెట్టివానికిఁ
గంటకుఁ డైనశాత్రవుఁ డొకండు దనంతటివాఁడుగల్గినన్.

క. ఎవ్వనితో నెచ్చోటం
జివ్వకుఁ జే సాఁపవలదు చే సాఁచినచో
నివ్వల నవ్వల నెవ్వరు
నవ్వక యుండంగఁ బగసనందీర్ప నగున్. 109

శా. ఆచందంబున నంతరంగమున కత్యంతంబుఁ దీవ్రవ్యథా
ప్రాచుర్యంబు ఘటింపఁ జాలదతిఘోరం బైనదావానలం
బేచందంబున నంతరంగమున కి ట్లీజ్ఞాతిభూభృజ్జిగీ
షాచింతాభరమావహించునతిదుస్సాధ్యవ్యథాభారమున్.

సీ. భేషజం బెద్దాని భేదింపఁ జాలదు
లంఘనంబున నెద్ది లావు చెడదు
తఱిగించు బుద్ధినిద్రామహోత్సాహతు
ష్టాకార తేజోబలాది నెద్ది
నాసత్యచరకధన్వంతరప్రభృతివై
ద్యులకు నసాధ్య మై యుండు నెద్ది
దివసంబు లీరే డతిక్రమించినయప్డు
జీర్ణత్వదశ నధిష్ఠింప దెద్ది

తే. ప్రత్యహంబు నవత్వంబు వడయు నెద్ది

యట్టిచింతాజ్వరంబు త న్నలముకొనియె
నేమి సేయుదు నింక నే నెచటఁ జొత్తు
నెట్టు నిర్జింతు మేరుమహీధరంబు. 111

క. ఉప్పర మెగసి యజాండము
చిప్పలు రాలంగ మేరుశిఖరంబులపైఁ
గుప్పించి దాఁటుకొందునొ
తప్పక నామనసులోని తహతహ దీఱన్. 112

ఉ. ఒక్కఁడు మాకులంబున సముద్ధతిఁ జూపిన జాతరోషుఁడై
తెక్కలు దెంచి వేలుపులతేఁ డటు పాపముచేసెఁ గాక యా
తెక్కలు నేఁడు గల్గిన నెటేం గగనంబునఁ బాఱుతెంచి బి
ట్టెక్కనె కూటకోటితటు శ్రేల్లను నుగ్గులు గాఁగ మేరువున్. 113

తే. అడుసులోపలఁ దాటిపం డదిమినట్లు
లదుముదునె కాదె పాతాళ మంటికొనఁగ
వేల్పు లెల్లను విభ్రాంతి విహ్వలింపఁ
బాదముల మెట్టిపాదాయఁ బసిఁడికొండ. 114

శా. ఈదైశ్వర్యముఁజూడఁ జాలుదునె నే నిప్పాటనానాఁటికి
న్రేయిందు గ్రహతారకంబులు పగల్ నీరేరుహాప్తుండు నే
వాయోగంబు మెయిఁ బ్రదక్షిణముగావర్తిల్లఁగానిర్భరా
సూయామానపరీతచేతసుఁడనై సూర్యోదయ ప్రక్రియన్. 115

తే. అడ్డపెట్టెదఁ గాక తీవ్రాంశురథము
ప్రహరిఁ దిరుగక యుండంగ భస్మగిరికిఁ
దరతరంబ యజాండకర్పరము దాఁక
ఘనశిరశ్శృంగశృంగాటకములఁ బెంచి. 116

వ. అని యవష్టభసంరంభంబున. 117

మ. అవరోధించెనువింధ్యభూధరము బ్రహ్మాధ్వంబుదర్పోద్ధుర
వ్యవసాయోద్భవభంగినింగినురులింగాకారుఁడై యీశ్వరుం
డవరోధించినగర్వరేఖ బలిదైత్యధ్వంసినారాయణుం
డవరోధించినలేవమూర్ధమొగి బ్రహ్మాండంబుతో రాయఁగన్. 118

తే. మేదినీధర మిబ్బంగి మిన్ను ముట్టి
నిట్టనిలుచుండి చూచె నిర్నిమిషదృష్టిఁ
దనయనుష్ఠానకాలంబుఁ దప్పకుండ
బ్రాహ్మణుఁడు తేపకడఁ బోలె భానుపొడుపు. 119

వ. * అంత. 120

### సూర్యోదయ వర్ణనము

సీ. చిఱుసానఁ బట్టించి చికిలి సేయించిన
గండ్రగొడ్డలి నిశాగహనలతకుఁ
గార్కొన్ననిబిడాంధకారధారాచ్ఛటా
సత్త్రవాటికి వీతిహోత్ర జిహ్వా
నక్షత్రకుముదకాననము గిల్లెడుపొంటె
ప్రాచి యెత్తినహస్తపల్లవాగ్ర
మరసి మింటికి మంటి కైక్యసందేహంబుఁ
బరిహరింపంగఁ బొల్పడ్డ యవధి

తే. సృష్టికట్టిఱ్ఱి తొలుసంజచెలిమికాఁడు
కుంటి వినతామహాదేవికొడుకుఁగుఱ్ఱ
సవితృసారథి కట్టిఱ్ఱిచాయవేలు
పరుణుఁ డుదయించెఁ బ్రాగ్దిశాభ్యంతరమున. 121

---

* ఇయ్యది కొన్నిమాతృకలలో లేదు.

సీ. ప్రాలేయకిరణబింబంబు వెల్వెలఁ బాఱి
యస్తాచలంబుపై నత్తమిల్ల
వరుసతో నోషధీవల్లీమతల్లుల
కాంతివైభవలక్ష్మి కచ్చువదల
రవికాంతపాషాణరత్నంబులం దుబ్బి
యగ్ని ప్రత్యుత్థాన మాచరింపఁ
బ్రబలాంధకారధారాచ్ఛటాపటలంబు
పంచబంగాళ మై పాఱిపోవ
తే. నుదయపర్వతకటకగండోపలముల
బకుమూలచ్ఛిదావ్రణప్రభవ మైన
నెత్తు రనియెడువిచికిత్స నివ్వటిల్ల
భానుకిరణంబు లాకకొన్ని ప్రాఁకె నభము. 122

సీ. తఱిపివెన్నెలలోని ధావళ్య మొకకొంత
నవసుధాకర్దమద్రవము గాఁగఁ
జిన్నారిపొన్నారి చిఱుతచీఁకటిచాయ
యసలుకొల్పినమషీరసము గాఁగ
నిద్ర మేల్కాంచిన నెత్తమ్మిమొగడల
పరువంపుఁబుప్పొళ్లు హారిదళముగఁ
దొగరువన్నియ లేఁతతొలుసంజకెంజాయ
కమనీయధాతురాగంబు గాఁగ
తే. వర్ణములు గూడి యామినీవ్యపగమమున
జగము చిత్రింపఁ దూలికచంద మైన
కులుకుఁబ్రాయంపునూనూఁగుఁగోదమయొండ
ప్రాచి కభినవమాణిక్యపదక మయ్యె. 123

తే. ప్రాగ్దిశాకాంతనిండుగర్భంబునందు
సూర్యుఁ డుదయింపఁ బ్రొద్దులు చొచ్చి యుండ
మొదలఁ దీండ్రించులేఁతక్రొమ్మొలకయెండ
నింగి యింగిలికాన నభ్యంగ మార్చె. 124

చ. కమలము లుల్లసిల్ల రవికాంతశిలాధమనీలతాసహ
స్రములఁ గృపీటసంభవుఁడు రాజఁగఁ జీఁకటియారుసారు
గాఁ, గుముదము నిద్రవోఁ బొడుపుఁగొండపయిన్ రవి
యొప్పెఁ జూడఁగా, సమధికలీల నింద్రునిహజారపు
మేడకుఁ బైఁడికుండయై. 125

సీ. చరమరింఖాపుటాంచలటంకశిఖరంబు
లుదయాద్రిచఱిఁ జాఱకుండ మోపి
తీఁగ సాఁగినభంగి దీర్ఘదీర్ఘము లైన
యంగకమ్ముల రాజు లలమి యెత్త
నుత్తానుఁ డై వెన్క కొరిగి పిచ్చుకకుంటు
విప్రతీపంబుఁ గా వినుతి సేయ
నపగతవ్యాసంగ మగుటఁ జిత్కారంబు
వెలిగాఁగఁ జక్రంబు విభ్రమింప

తే. నభ్రవీథికి లంఘించె నమ్మహాద్రి
గంధవాహప్రవాహాభిఘట్టనమునఁ
గేతనముమీఁదిపసిఁడికింకిణులు మొరయ
మెఱుఁగు మెఱసినచందాన మిహిరురథము. 126

సీ. ధూర్దండఘట్టనత్రుటితగ్రహగ్రా(వ)మ
ధూళీపాళిమిళద్ద్యుస్థలములు

ధ్వజపటపల్లవోద్ధతమరుత్సంపాత
పరికంపమానోడుపరివృఢములు
గ్రాసాభిలాషానుగతవిధుంతుదపునగ
ప్రాప్తచక్రవ్యథోపద్రవములు
శ్రాంతాశ్వనిబిడనిశ్శ్వాసధారోద్ధుర
స్వర్ధునీనిర్ఝరజలభ(ధ)రములు
తే. గగనపదలంఘనైకజంఘాలికములు
పద్మ (వనజ)బాంధవనిజరథ ప్రస్థితములు
సాఁగె నని దక్షిణాయనసమయ మగుట
దర్ధురముమీఁద మలయభూధరముమీఁద. 127
తే. నడచె భాండీరదేశంబునడిమిచాయ
గగనఘంటాపథంబునఁ గమలహితుఁడు
పాండ్యభూపాలశుద్ధాంతభవనహేమ
దీర్ఘికలయందుఁ దననీడ తేజరిల్ల. 128
సీ. ఒకదీవి కొకకొండ యుదయాద్రియై యుండు
నది యొండుదీవికి నస్తశిఖరి
యొకదీవిఁ దొలుసంజ యున్మేషమునఁ బొందు
నుదయించు మఱుసంజ యొండుదీవి
నొకదీవి నిండుచంద్రికలు మిన్నులు ప్రాఁకు
నొకదీవిఁ బేరెండ యుబ్బి కాయు
నొకదీవి రవణిల్లు నొకఋతుప్రారంభ
మొకదీవి నిగురొత్తు నొండుఋతువు
తే. దక్షిణాయన మొకదీవి దళుకుఁ జూపు
నుత్తరాయణ మొకదీవి నుప్పతిల్లు

నిన్నిటికి యత్ప్రభావంబు హేతుభూత
మట్టిరవితేరు సాఁగె లంకాద్రిమీఁద. 129

సీ. మలయాచలంబుపైఁ జిలువయిల్లాండ్రుర
ఫణరత్నములయందుఁ బ్రతిఫలించి
లంకాపురంబున శాంకరీదేవర
మకుటేందు రేఖతో మచ్చరించి
కాంచీపురోపాంతకంపాతరంగిణీ
నాళికావనరాజి మేలుకొలిపి
ద్రవిళసీమంతినీ స్తనమండలంబుల
నవకంపుఁజెమటబిందువుల నిలిపి

తే. సహ్యగిరిరాజకన్యకాజలనిధాన
సలిలహేలిపరస్పరాస్ఫాలనోత్థ
కణలవాసారనీహారగంధవాహ
సంగమంబులఁ బథపరిశ్రాంతిఁ దొఱఁగి. 130

వ. ఇవ్విధంబున దక్షిణాపథంబునం జనునప్పుడు. 131

సీ. విస్ఫురదధ్వాంతౌఘవిధ్వంసనక్రియా
బరమదీక్షారంభగురుమయూఖ
దళశతపరిషదాధారమండలుఁడైన
చండభానుని కధిష్ఠాన మగుట
భారంబు భరియింప బరువుపడ్డది వోలె
మూఁపుమూఁపున నంది (టి) మొక్కలముగ
ననిలంబు లేదును నంచెలంచెలు గట్టి
యాకాశవీథి నందంద నడవ

తే. నడచురవితేరు మింటినన్నడిమిచక్కిఁ
బ్రగ్గనఁగఁ దాఁకె వింధ్యపర్వతముచఱులఁ
గఠిననిర్ఘోషనిర్ఘాతఘట్టనమునఁ
బంకజాతభవాండకర్పరము వగుల. 132

క. తగులువడి యప్పుడు వడి సెడి
గగనమణిరథంబు దొరఁగలువడి నిలిచెఁ
బొగరు మొగకడలియక్కలి
దగిలి నిలువఁబడినకలపతతి యుంబోలెన్. 133

క. ఒక్కనిమేషము రాహువు
పుక్కిటిలోఁ దగులువడక పోయెడుభానుం
డిక్కొండ ప్రక్కఁ జిక్కెం
జెక్కుఁడులు విధివశంబు పెం పెట్టిదియో ? 134

తే. రెండువేలును నిన్నూటరెండుయోజ
నంబు లర్ధనిమేషమాత్రంబునందు
నంబరంబునఁ బాఱుతీవ్రాంశురథము
నిలిచె బహుకాల మిట్టిదే నియతిమహిమ. 135

క. స్థితిసర్గవిసర్గములకు
గతి భానుఁడు గేవలంబ కాన తదీయ
ప్రతిబంధము త్రైలోక్య
ప్రతిబంధం బై విపత్పరంపరఁ బెనచెన్. 136

సీ. లేవయ్యె స్వాహాస్వధావషట్కారంబు
లుడివోయెఁ ద్రేతాగ్నిహోత్రవిధులు
కాలంబుకొలఁది లెక్కలు వెట్ట నేరక
చిత్రగుప్తాదులు చిక్కువడిరి

యిది సంజ యిది రాత్రి యిది వాసరం బను
సమయపర్వంబులు సంక్రమించె
సావితో వర్షంబు సమకూర కుండుటఁ
బంటలు లేవయ్యెఁ బాడిదొరఁగ
తే. గొన్ని దేశంబు లెండచే గుమిలిపోయెఁ
గొన్ని దేశంబు లీఁదచేఁ గొంకుపోయెఁ
గొన్ని దేశంబు లిఱులచే గుడ్డివడియెఁ
గొన్ని దేశంబు లివచేతఁ గుందువడియె. 137

సీ. పూచినకొరవిపూఁబొదరింటిచందానఁ
గత్తెర యొక్కచోఁ గదలకుండె
నొకచోఁ దగుల్పడె నుపకారికొఱటికిఁ
దర మైనరోహిణీతారకంబు
నొకచోఁ బునర్వసు పూఁగె వృక్షముకొమ్మ
నుడిబడ్డముతొల్లెలజోఁగుపోలె
శయనించె నొకచోట శ్రవణనక్షత్రంబు
గుంటెమీఁదటిప్రత్తికొడుపుపోలె
తే. స్వాతిచిత్తలు తోరణస్తంభయుగము
ననుకరించుచు నొక్కచో నత్తమిల్లెఁ
జిలుపపోయినమూఁకుటిచెలువుఁ దాల్చి
హత్తె నొకచో విశాఖ వింధ్యాద్రియందు. 138

సీ. నేత్రంబు లున్మేషనిష్ప్రహత్వము నొంద
శ్రుతిపుటంబుల శక్తి చొక్కుమడఁగ
జ్ఞానేంద్రియజ్ఞానకళలెొరుసొరుగా
జిహ్వావివేకంబు చిదుపపోవ

నంతరంగమున మహాంధకారము గ్రమ్మఁ
దనువు చేష్టాదరిద్రత వహింపఁ
బ్రాణముల్ శ్వాసమాత్రమునఁ బర్యవసింప
దలచీర యెఱుఁగనిదశ ఘటిల్లఁ

తే. బాము గఱచిన మూర్ఛిల్లి పడినయట్లు
వితతనిద్రాసమావేశవివశు లగుచు
తరణిదీధితి లేమిఁ జైతన్య మెడలి
పడిరి పాశ్చాత్యదేశంబుపంచజనులు. 139

వ. అనిన విని నైమిశారణ్యమునీశ్వరు లటమీఁదివృత్తాంతం
బెయ్యది యని యడిగిన. 140

ఆశ్వాసాంతము

శా. పారావారపరీతవిశ్వధరణీభారోత్థతీవ్రక్రియా
ధౌరంధర్య! సరోరుహేక్షణ! సమిద్గాండీవకోదండ! దా
క్షారామప్రమదాకఠోరకుచకుంభాభోగసంక్లప్తక
స్తూరీస్థాపకముద్రితస్థగితవక్షోవీథికాభ్యంతరా! 141

క. వేమాంబాప్రియనందన!
హేమాచలధీర! భువనహితచారిత్రా!
వేమాధిపానుసంభవ!
రామారతిరాజ! రాజరాజకిరీటా! 142

భుజంగప్రయాతము:—

హరశ్రీపదాంభోరుహద్వంద్వపూజా
పరాధీన! కారుణ్యపాథోనిధానా!

కురంగేక్షణాపుష్పకోదండమూర్తీ! 143
శరచ్చంద్రికాస్నిగ్ధసంసిద్ధకీర్తీ!

గద్య. ఇది శ్రీమత్కమలనాభపౌత్త్ర మారయామాత్యపుత్త్ర సుకవిజనవిధేయ కవిసార్వభౌమ శ్రీనాథనామధేయప్రణీతంబైన కాశీఖండం బనుమహాకావ్యంబునందుఁ బ్రథమాశ్వాసము.

---

# ద్వితీయాశ్వాసము



రాజమహేంద్రవరమ
హారాజ్యశ్రీస్వయంవరాధీశ్వర ! శృం
గారకళాఝషకేతన !
యారాధితభుజగహార ! యల్లయవీరా ! 1

## దేవతలును మునులును బ్రహ్మకడకేగి స్తుతించుట

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె. ఇవ్విధం
బున నకాండప్రళయంబు సంభవించిన నమరాసురోరగం
బగులోకంబు గాందిశీకం బగుటయు మునులును దేవతలును
గూడి బ్రహ్మలోకంబునకుం బోయి బ్రహ్మ నిట్లని స్తుతియించిరి.

తే. బ్రహ్మ! బ్రహ్మస్వరూప! హిరణ్యగర్భ!
యమృత! కేవల! యప్రతర్క్యానుభావ!
వేదవేద్య ! చిదాత్మ ! యనాదినిధన !
చిత్తగింపుము సంస్తుతించెదము నిన్ను. 3

తే. డెందమును వాక్కు నెవ్వాని నందలేవు
కాంతు రెవ్వాని హృదయపుష్కరములందుఁ
బరమయోగీంద్రు లధికతాత్పర్యలీల
నట్టినీకు నమస్కార మఖిలవంద్య ! 4

తే. ప్రకృతిరూప! గుణత్రయోపాధియుక్త!
కాల! కాలాతిరిక్త! నిష్కామహృదయ!
సత్త్వగుణమున హరి వై రజస్తమోగు
ణముల శంభుఁడ వగు నీకు నతి విరించి! 5

సీ. బుద్ధ్యహంకారరూపుని భజింతుము నిన్నుఁ
బంచతన్మాత్రరూపా! భరింపు
పంచకర్మేంద్రియపంచబుద్ధీంద్రియా
త్మక! మనోరూప! యేమఱకు మమ్ము
క్షిత్యాదిపంచకాకృతి మమ్ము రక్షింపు
విషయాత్మకా! మమ్ము విడువ వలదు
బ్రహ్మాండరూప! మాపాలి పెన్నిధి వీవు
పాలింపు మముఁ దదభ్యంతరస్థ!

తే. కొలుతు మిమునీశ్వరాకృతిఁ గోరి నిన్ను
విశ్వరూపుని నిన్ను సేవింతు మెప్పు
డవధరింపుము నిత్యసత్యస్వరూప!
సదసదీశ్వర! యభయహస్తంబుఁ జూపు. 6

సీ. నిగమత్రయంబు నీనిశ్వాసపవనంబు
నీమూర్తి భేదంబు నిఖిలజగము
నీయంఘ్రి మేదిని నీమూర్ధ మాకాశ
మంతరిక్షము నాభి యంద్రు నీకుఁ
జంద్రుండు హృదయంబు చక్షు వబ్జహితుండు
తనురుహవ్రాతంబు దరులు నీకు
నీవు సర్వంబును నీయందు సర్వంబు
స్తోతృస్తుతి స్తవ్యజాత మీవు

తే. మ్రొక్కెదము నీకు నని మహామునులు సురలు
నలికతలమున సేవాంజలులు ఘటింప
ద్రుహిణుఁ డెంతయు నాత్మ సంతోషమంది
యందఱిని జూచి యిట్లని యానతిచ్చె. 7

తే. ఆద్య మగునీ స్తవంబున కనఘులార!
యేను బరితుష్టి నొందితి నిచ్చయందు
నేమి వలసిన నట్టిద యిత్తుఁ గాన
యిది యభీప్సిత మనుఁడు మీ రింపు మిగుల. 8

మ. నిరవద్యస్థిరభక్తితోడి నన్నుఁ గానీ శంభు గానీ రమే
శ్వరుఁ గానీ గుఱియించి యెవ్వరేఁటయీపార స్తవంబుల్ జపిం
తురు వారందఱ కేము ముచ్వురము సంతుష్టిం బ్రసాదింతుమిం
పరుదారఁ ధనధాన్యపుత్రపశురత్నాయుస్సుఖారోగ్యముల్.

వ. మీ కెయ్యది యభీష్టం బట్టివరంబు గోరుం డిచ్చెద. ఇక్క
డికి వచ్చియు నిట్లేటికి నాకులత్వంబు విడువరు? స్వస్థులరు
గండు. నాలోకంబునఁ గామక్రోధలోభమోహమదమా
త్సర్యహింసాసూయాదులు లేవు. మూర్తంబు లగు
నీయామ్నాయంబులు విద్యలు యజ్ఞంబులు దక్షిణలు సత్య
ధర్మతపోబ్రహ్మచర్యముఖ్యంబులు నుల్లసిల్లెడుం జూడుం డని
మఱియు నిట్లనియె. 10

సీ. తల్లిదండ్రులకు నిద్ధపుభక్తి రవణిల్ల
శుశ్రూష చేసిన శుద్ధమతులు
పతులకు నిర్వ్యాజపరమతాత్పర్యతఁ
బరిచర్య సలిపినపద్మముఖులు
సజ్జనావలికి నిష్కారణంబున నుప

కార మొనర్చినధీరగుణులు
దటి దప్ప కుండ సంధ్యాజపహోమాది
తంత్రముల్ నెఱపినధర్మవిదులు
తే. బ్రహ్మరతులు తపస్వులు భవ్యతీర్థ
సేవకులును సద్వ్రతులు నిస్పృహులు మొదలు
గాఁగ నొప్పెడు తత్పుణ్యకర్మపరులు
వీరె కనుగొందు రా సుఖ మున్న వార లిందు. 11

క. నతిచేసి యిష్టధనములు
క్షితిసురులకు నొసఁగినట్టిసిద్ధులు సుండీ!
యతులహిరణ్మయహర్మ్యస్థి
తులు లగుచుఁ జరించువారు చిరశుభలీలన్. 12

తే. ఉభయముఖ లగుగోవుల నొండె నొండెఁ
గపిల లగుధేనువులఁ బుణ్యకాలతిథుల
దాన మొనరించినట్టిసత్యప్రతిజ్ఞు
లీమహోర్వ్యాపీఠంబుల నెసఁగువారు. 13

బ్రహ్మదేవతలకును మునులకును గోబ్రాహ్మణప్రభావంబుసెప్పుట

వ. అనిచెప్పి యప్పరమేష్ఠి బ్రాహ్మణులసామర్థ్యంబును గోవుల మాహాత్మ్యంబును నొక్కించుక వర్ణించుతలంపున నిట్లనియె.

తే. నాకు శంభునకును బద్మనాభునకును
దుష్టికరములు రెండువస్తువులు గలవు
విప్రులును గోవులును నన వినుఁడు మొదల
నొక్కకులము ద్విధాభంగి నొంది యుండు. 15

చ. సకలఫలంబులుం గురియు జంగమతీర్థము లెందు బ్రాహ్మణ
ప్రకరము లట్లుఁ గాక పెడవాయుటయెట్లుతదీయభాషణో

దకముల సేవకావలికి దత్ క్షణమాత్రన జన్మజన్మబం
ధకత సహాగతంబు లగుత త్తదనేకమహాఘసంఘముల్. 16

చ. వినుఁ డనయంబు గోవులు పవిత్రముగోవులు మంగళంబుద
ద్ఘనఖురటంకశృంగపరిఘట్టదళద్ధరణీరజశ్ఛటల్
కనుకని నవ్వుచుండుఁ బురఘస్మరమూర్ధజటాటవీనట
ద్ఘనఘనసింధువార్లహరిగర్వభరార్భటిఁ బావనోన్నతిన్. 17

చ. ప్రతివసియించు గోవులఖురాగ్రములందుఁ సమస్తతీర్థసం
తతియును సర్వపర్వతవితానము గొమ్ములమధ్యసీమ న
ద్భుతచరితుండు శంకరుఁడు భూధరకన్యయుఁ దానునుండుఁద
ద్వితతకుచేభ కుంభపరిదిగ్ధపటీరపవిత్రవక్షుఁడై. 18

క. కొనియాడు బితృగణంబులు
గొనియాడు ఋషివ్రజంబు గురుసమ్మదముల్
జనియించు వేల్పులకుఁ గం
దనిపెంపు(న) నరుండు గోవుదానము సేయన్. 19

శ్లో. గోమయం యమునా సాక్షా ద్గోమూత్రం నర్మదా శుభా,
గంగా క్షీరస్తు యాసాం వై కిం పవిత్ర మతః పరమ్. 20

శ్లో. గవా మఙ్గేషు తిష్ఠన్తి భువనాని చతుర్దశ,
యస్మా త్తస్మాచ్ఛివం మే స్యా దిహ లోకే పరత్ర చ. 21

క. అనుమంత్రంబులు చెప్పుచు
నొనరించును ధేనుదాన మూర్వీసురవ
ర్యున కెవ్వఁ డాతఁ డధికత
వినుతులు గను జగమునందు విశ్రుతలీలన్. 22

క. స్తుతిపూర్వకముగఁ బ్రదక్షిణ
మతిభక్తిఁ జరించు విప్రుఁ డావుల కతనిఁ

ధృతిఁ బొందఁ నపుడు సకల
క్షితికిఁ బ్రదక్షిణము నియతిఁ జేసినఫలముల్. 23

క. ముంగటఁ బిఱుఁదం గ్రేవల
డెందమునం గరము సందడిలవలదా య
స్పందశుభావహములు గో
బృందము లని మాకుఁ బుట్టు బ్రియ మెల్లపుడున్. 24

క. నీరాజనంబు నెఱపుడు
దారఁగ గోపుచ్ఛమున నిజాంగంబుల కె
వ్వారలు వారలయఘములు
దూరమున దొలంగు నిండ్ల దొరకును బ్రియముల్. 25

తే. వినుఁడు గోవులు విప్రులు వేదచయము
సతులు లోభవిహీనులు సత్యపరులు
దానశీలు రియ్యేడ్వురు దాల్తు రెపుడు
నవని నెంతయు విగతభయంబు గాఁగ. 26

గీ. నాదులోకంబునకు మీఁదు నలిననాభు
లోకమున నూర్ధ్వమగు గుహలోక మవల
భర్గులోకంబు దత్సమీపస్థలమున
గోకులంబను లోకంబు గొమరు మిగులు. 27

సీ. ప్రవహించు నెచ్చోటఁ బరిపూర్ణసంపదఁ
దొలుకాడువీచుల దుగ్ధనదులు
సవరిల్లు నెచ్చోట జర డగ్గఱఁగ నీక
సంతతకౌమారసౌష్ఠవంబు
లల రొందు నెచ్చోట నాజ్యనిర్ఝరులతో
బహుసంఖ్యఁ బాయసపర్వతములు

బెడగారు నెచ్చోటఁ గడను యింతయు లేమి
సామగ్రి శుభవస్తుసంచయంబు
తే. నట్టిగోలోకమునయందు నధివసింతు
రభవుచేఁ నెల్ల ప్రొద్దు నెయ్యంబుఁ గనుచు
నలఘుమూర్తులు గోమాతృకలు సుశీల
యాదిగాఁ గలపరమకల్యాణనిధులు. 28

వ. అట్లు గావున గోవులకు మిగిలినయుపాసనీయంబు లేదు. గోప్రదాతలకు మిగిలినపుణ్యవంతులు లేరు. వెండియు నాక ర్ణింపుఁడు. సరస్వతీతీర్థమృతులును, మార్తాండుండుమకరస్థుం డై యుండఁ బ్రయాగతీర్థంబునమాఘస్నానంబుచేసినకృతా ర్థులును, వారణాసియందుఁబంచనదంబునం గార్తికమాసమం దుఁ దీర్థమాడినవిశుద్ధదేహులును, కురుక్షేత్రంబునంగణి కామాత్రంబైనను హిరణ్యంబు దానంబిచ్చినదాతలు మొద లుగాఁగలనానాధర్మపరు లస్మదీయలోకంబున వీరె నిజకర్మో చితపదంబులం గల్పస్థాయి సుఖంబు లనుభవించు చున్నవారు. మీకును నింక భయంబువలదు మీరు వచ్చిన కార్యం బే నెఱుంగుదు వింధ్యం బవంధ్యగర్వోదయం బున గీర్వాణభూధరంబుతో మచ్చరించి శృంగోచ్ఛ్రాయం బులఁ బతంగమార్గంబు నిరోధించి బుధజనంబులకు బాధ సేయుచున్నయది. ఈయకాండప్రళయంబులకు బెగ్గలంబంది యాపత్పరిహారార్థంబు నన్ను శరణు జొచ్చితిరి. అరిష్ట నిరసంబునకు నుపాయంబు చెప్పెద. మహామునియగస్త్యుం డవిముక్తంబనుముక్తిక్షేత్రంబున విశ్వేశ్వరువిరూపాక్షు భోగమోక్షప్రదాయకుందారకబ్రహ్మోపదేశార్థంబు సేవిం

చుచున్నవాఁడు. అతఁడు మీకార్యంబు సంఘటింపంగల వాఁడు. మీరచ్చోటి కరిగి యమ్మహాత్ము నభ్యర్థింపుఁడు.

క. వాతాపీల్వలు లనియెడు
దైతేయులఁ గుపితకపటతంత్రోద్ధతులన్
భ్రాతల వధించె వేల్మిడి
నాతం డెవ్వరును వెఱతు రమ్మునిపతికిన్. 30

వ. పొండు మీకు మే లయ్యెడు నని పుండరీకభవుండు వీడ్కొల్పిన వారును మహాప్రసాదంబని ప్రసన్నాంతరంగులై సత్యలోకంబువెలువడి *(వచ్చువా రంతరాంతరంబుల మూర్తిమంతంబులైనవేదంబుల వేదాంగంబుల యజ్ఞంబుల దక్షిణల సత్యంబు ధర్మంబు దపంబు శ్రుతిస్మృతిపురాణేతిహాసంబులం బతివ్రతల బ్రహ్మచారుల మాతాపితృభక్తుల గోగ్రహణహితుల గాయత్రీజపపరాయణుల నుభయముఖగోప్రదాతలఁ గపిలాదానతత్పరుల బ్రాహ్మణపాదోదకప్రాశనుల సరస్వతీతీర్థమృతుల మకరరాశిస్థితుం డై మార్తాండుం డుండ మాఘస్నానంబు ప్రయాగతీర్థంబునం జేసినకృతార్థుల వారణాసియందుఁ బంచనదంబునం గార్తికమాసంబునం దీర్థంబాడినవిశుద్ధదేహులఁ గురుక్షేత్రంబునం గాకిణికామాత్రం బైనను గనకంబు దానంబు చేసినదాతలను విలోకించుచు.) 31

తే. విమలకైవల్యకల్యాణవిత్తనిధికి
విశ్వనాథుని మొదలిశ్రీవేశ్మమునకుఁ
గాశికాక్షేత్రమున కేఁగఁ గదలి రపుడు
కోర్కు లిగురొత్త బృందారకులును మునులు. 32

వ. హర్షోత్కర్షంబునం దమలోన. 33

సీ. మనభాగ్యమునఁ గాదె కనకాచలేంద్రంబు
విశ్వాధికౌన్నత్యవిభవ మొందె
మనభాగ్యమునఁ గాదె మార్తాండమండలి
వినువీథి రోధించె వింధ్యశిఖరి
మనభాగ్యమునఁ గాదె మర్త్యపాతాళత్రి
విష్టపంబులకు నరిష్ట మొదవె
మనభాగ్యమునఁ గాదె కనకగర్భుండు ప్ర
త్యక్షమై యుపదేశ మానతిచ్చె

తే. నహహా! మనభాగ్యమునఁ గాదె యమరతటిని
దరి వసించినవాఁడు వాతాపిదమనుఁ
డిన్ని సౌభాగ్యములు (సు) గూడియిచ్చె మనకుఁ
గాశికాక్షేత్ర రాజవీక్షాసుఖంబు. 34

క. ఏకక్రియ ఫలయుగ్మము
నాకర్షింపంగఁ జాలు నది లోపాము
ద్రాకాంతుఁ గుఱిచి పోవఁగ
శ్రీకాశీదర్శనంబుచే సిద్ధించున్. 35

**దేవర్షులు బ్రహ్మనియోగంబున నవిముక్తంబునకే తెంచి యగస్త్యునిదర్శించుట.**

వ. అనుచు బ్రహ్మలోకంబుననుండి డిగ్గి వారు వారణాసీపురో
పకంఠంబున శ్రీకంఠజటాటవీకుటజకోరకంబును బరమేష్ఠి
కమండలుతీర్థసలిలధారాధోరణియును గుపితకపిలమునిపరి
వృఢకపిలదృగనలచులికితవపురఖిలసగరసుత స్వర్గారోహణ
సోపానమార్గంబును నగుభాగీరథియందు మణికర్ణికాకుండం

బునఁ దీర్థంబాడి తీర్థోపవాసులకు వాసోహిరణ్యగంధసార
కర్పూరకస్తూరికాకుంకుమంబులను ఖండశర్కరాపూపసూపా
జ్యదధిపయఃఫలాదితర్పణద్రవ్యంబులను నుపానత్పాదుకా
చ్ఛత్త్రంబులనుగుండికాదండరల్లకవ్యజనచామరంబులఁ గాపీ
నశాటికాకరండంబులను దైలలవణేంధనంబులను గుగ్గులు
మహిషాక్షిప్రముఖధూపద్రవ్యంబులను వెండియుం గ్రియా
కాండంబులనుం బరితోషంబు సంపాదించి విశుద్ధహృద
యులుఁ బ్రసన్నాత్ములునై శ్రుతిస్మృతిపురాణేతిహాసప్రతి
పాదితవేదానువచన యజ్ఞ దాన తపోవ్రతాదులచేతం
బ్రక్షీణసకలకల్మషులు భస్మోద్ధూళితాంగులు రుద్రాక్ష
మాలికాలంకృతాంగులునై శంకరుంగురంగాంక శేఖరునిరస్త
సమస్తోపాధిక స్వప్రతిష్ఠారూఢ సంచితానందైకరసాద్వితీయ
స్వరూప విరూపాక్షు విశాలాక్షీహృదయాధీశ్వరు విశ్వే
శ్వర శ్రీమన్మహాదేవు సందర్శించి ప్రణమిల్లి జగన్నిర్మాణ
నియమపరిపాలనాది శక్తియుక్తుం డగునద్దేవుం బంచబ్రహ్మ
పంచాక్షరప్రణవమంత్రంబుల నావాహనస్థాపన సాన్నిధ్య
సన్నిరోధనసంకలీకరణాదులగు దశవిధసంస్క్రియాకలాపం
బుల నుపచరించి వెండియు. 36

క. ఆడిరి ప్రమోదనృత్తము
పాడిరి మంద్రకమహాప్రబంధంబుల మో
మోడిరి తైర్థికులకుఁ గో
ల్లాడిరి కైవల్యలక్ష్మి నమరులు మునులున్. 37

సీ. అందంద చేసిరి యభవుగేహమునకు
ధన్యాత్ములలర ప్రదక్షిణములు

యోగపీఠారూఢ నుమబోటి నర్చించి
రభ్యర్హితులు సువర్ణాంబుజముల
నాడుంఠివిఘ్నేశు నాపూపమోదకా
ద్యుపహారములఁ దృప్తి నొందఁ జేసి
రవధరించిరి పురాణాఖ్యానముఖముల
సమధికం బగుమహాస్థానమహిమ
తే. వీటిపెద్దతలారి నిస్సాటికలికి
దిస్సమొలవేల్పు పార్వతీదేవిపట్టిఁ
గాలభైరవుఁ గుక్కురగణపరివృతు
ననుచరించిరి మునులు నాకౌకసులును. 38

వ. అనంతరంబ. 39

సీ. పంచాక్షరీమంత్ర పారాయణమునకు
నెవ్వానిమానసం బేడుగడయు
దర్పోద్ధతు లగువాతాపికిల్వలునకు
వధశిలాస్థాన మెవ్వానికుక్షి
యాది నెవ్వానిదివ్యావతారమునకుఁ
బూర్ణాంబుకుంభంబు పురిటియిల్లు
మెఱసి లోపాముద్ర మెఱుఁగుఁబోలిండ్లపైఁ
బవళించు నెవ్వానిభవ్యమూర్తి
తే. కసరి యెవ్వానికంఠహుంకారరవము
కొండపాములకులములోఁ కూర్చె నహుషు
నట్టి పరమమహాశైవు నలఘుతేజు
వెదకి రానందవనములో విబుధమునులు. 40

సీ. డుంఠివిఘ్నేశుఁ డుండుప్రదేశ మీక్షించి
లోలారునగరిమోసాల వెదకి
దండపాణ్యాసవభాండేశ్వరంబులు
గుక్కుటస్థానంబుఁ గుద్దలించి
కేశవస్వామిలోఁగిలి పరామర్శించి
కాలభైరవదేవుగవను జూచి
శ్రీవిశాలాక్షిగోష్ఠీవాటి శోధించి
యపవర్గమంటపోపాంత మరసి

తే. విబుధగంగాతరంగిణీవేణిమధ్య
సైకతోత్సేకవేదికాసంప్రరూఢ
తరుణమంజులకుంజవైతసకుడుంగ
వీథికలయందు దృష్టి యావిష్కరించి. 41

వ. కుంభసంభవు నన్వేషించువారు జగద్ధితకార్యారంభులు జంభమథనపురోగము లైనసురలును గీష్పతిప్రధాను లైన మునులును నానందకాననంబన మహాశ్మశానంబన రుద్రావాసంబనఁ గాశియన వారణాసియన నవిముక్తక్షేత్రంబన లోలార్కకేశవులు క్షోట్టిద్వయంబును, భాగీరథి నారియు, ధర్మంబుశరంబును, గలిలక్ష్యంబును, విరూపాక్షుండు ధన్వియుంగాము త్రిపురంధ్రిభూమిలతానుకారంబును, జంద్రరేఖాఛాయాప్రకారం బై తాను గోదండంబుభంగి నంగీకరించి విశ్వేశ్వరశ్రీమహాదేవునకు నిఖిలదేవతా సార్వభౌమునకుఁ త్రైలోక్యసామ్రాజ్యపట్టాభిషేకంబునకుఁ దగిన హేమపీఠంబునుంబోని యమ్మహాస్థానంబుఁ గలయఁ

గ్రుమ్మరి యచ్చోటి పెద్దలవలన గందువ యెఱింగి చని తత్పు
ణ్యాశ్రమంబుఁ బ్రవేశించి యందు. 42

సీ. కండూయనము సేయుఁ గరటి శుండాదండ
పుష్కరమ్మున సింహపోతకంబు
వాలారునఖముల వదన మించుక యెత్తి
ముద్దాడుఁ బులి లేటిముద్దరాలి
నిండుకౌఁగిటఁ జేర్చి నెమ్మిమైఁ దోఁడేలు
గోదమచింబోతును గుస్తరించుఁ
గుంజమంటపకుటీ క్రోడమధ్యంబున
నాఖుతోఁ జెలఁగాడు నడవిపిల్లి
తే. యెండ దాఁకక యుండంగ నెత్తి పట్టుఁ
బగలు ముంగికి భుజగంబు పడగగొడుగు
కోఁతితో మైత్రి వాటించుఁ గొండగోఁటియ
యాార్వ శేయునిపుణాశ్రమాంతరమున. 43

వ. వెండియు నవ్వనంబున నీవారోదనమండం బుష్ణమధురం
బు(గ)గండూషించి క్రొత్తపురిటాలికిం గురంగికి మెత్తమెత్తన
కురంగంబు గ్రోల్చు. ప్రసర్పత్సర్పిరభిఘార(ప్రవాహ)ధారా
గంధపాణింధమం బై కర్కంధూఫలోన్మిశ్రశాకపాకంబుల
తాలింపులకమ్మనికంపుపాంథఘ్రాణంబుల కింపుసొంపుసంపా
దించు, సరసీతీరంబున సారసంబు సారస్యంబు పక్ష్మలింపలక్ష్మ
ణాకంఠోపకంఠంబునంగంఠంబుఁ జేర్చి సుఖపారవశ్యంబునం
జొక్కెనో? ముక్కంటి లోఁగంటం గనుంగొనుచు నిశ్చల
ధ్యానయోగానుసంధానంబున మాధుర్యంబు భజించెనో?
యెఱుఁగరాకుండ నుండు. శ్రుతిస్మృతిపురాణేతిహాసనం

పింతాతాత్పర్యపర్యాలోచనఁ బచేలిమం బైనవివేకంబున మత్స్యమాంసం బభ్యర్హితులు గర్హింతు రని యెఱింగి కాఁబోలుఁ బంకజోత్పలకుముదకల్హారసంకులంబులగు కొలం కులఁ బెద్దమీను కొండుకమీనుం దాఁకదు. దరవికచవకుళ కురవకనాగకేసరపరాగధూసరంబు లగుమధుమాసవాస రంబులందును బంచబాణుం డించువిల్లెక్కు వెట్టఁ జెఱచుం గావునఁ గొంచి కొంచి యప్పశుపక్షిమృగమిథునంబులు నిధువనక్రీడ లాచరించు. కంఠగతప్రాణు లగుజంతువు లకుం గాలకంఠుండు గరుణావశంవదుండై కర్ణోపకంఠంబుఁ జేరి తారకబ్రహ్మమంత్రరాజంబు నుపదేశింప మంతనం బున విని యొఱుంగుటం జేసి మధుమదోల్లాసంబున నది వెల్లి విరి(స్రే)యుచున్నయదియో యన నిందిందిరంబులు మంద స్వనంబున ఝంకారంబు సేయ నక్తభోజనవ్రతస్థులతోడి సంసర్గంబుననో చకోరవర్గంబు నక్తంబులం జంద్రచంద్రికా కరంభంబునఁ గౌతుంభర్యంబు సంభావించు నట్టిపుణ్యాశ్ర మంబు దరిసి చనునప్పుడు మునులు బృందారకులు నిజాం తర్గతంబున. 44

తే. ఎన్నఁడును నేగి లేనట్టి యిమ్మహాశ్మ
శానమున (యందుఁ) గాఁపురంబున్న జంతువులకు
నేటి నాకంబు? పున్నియం బెడలినప్పు
డొాలికమునఁ గూలవలయుఁ గీలూడినట్లు. 45

తే. అపునరావృత్తిశంభులోకాధివాస
సౌఖ్య మొనగూడు నిచ్చోటిజంతువులకుఁ

గాన మనకంటెఁ గడు మేలు కాశినుండు
కీటపక్షిసరీసృపక్రిమికులంబు. 46

సీ. కాశికానగరంబుకడసీమమున నున్న
చండాలుఁ బోల డాఖండలుండు
నానందవనములో ననశనస్థితి నున్కి
భువనసామ్రాజ్యవైభవముఁ బోలు
నవిముక్తదేశస్థుఁ డయ్యెనేఁ బతితుండు
నశ్వమేధాధ్వరాహర్త దొరయు
వారణాసీసంభవం బైనవ శకంబు
నైరావణముతోడి నవఘళించు

తే. నాటుకొని శ్రీమహాశ్మశానమున నున్న
యణుకనగ్నాలవటుఁ డైన నాగ్రహమున
గర్వితోద్ధతి నేతెంచు కాళరాత్రి
మృత్యుదేవతమునిపండ్లు మెలుకఁ జాలు. 47

తే. ఎన్నికల్పంబు లరిగిన నెడలిపోవ
దెంద రింద్రులు గడచిన నెలమి దప్ప
దెన్ని మన్వంతరంబులు చన్న నెపుడుఁ
బసిమి దప్పదు కాశికాపట్టణంబు. 48

ఉ. తత్తరపాటు లేక నదిఁ దాన మొనర్చి పినాకపాణి దే
వోత్తము విశ్వనాథుఁ గరుణోదధిఁ గమ్మనిపూవుగుత్తులన్
బత్తిరిఁ బూజ చేసి నుతిపాఠములన్ శ్రవణించువారికిం
దొత్తులువోలె నుబ్బుదురు దొప్పలుదోరలు ముక్తికామినుల్.

సీ. ధర్మంబు కాశికాస్థానమధ్యంబున
నాల్గుపాదంబుల నడచి యాడు

నర్థంబు కాశీపురాంగణంబునయందు
నానాప్రకారమై నటన మిగులుఁ
గామంబు కాశికాకటకఘంటావీథి
గర్వించు రాజలోకంబు సేవ
మోక్షసంపదలు గాశీక్షేత్రమునయందుఁ
ద్రవ్వి తండంబులై నివ్వటిల్లుఁ
తే. గాశి కల్యాణముల కాదికారణంబు
కాశి యణిమాదిసిద్ధులకాటపట్టు
కాశి జనలోక సంకల్పకల్పకంబు
కలుషపిశితంబు మెసవురాకాసి కాశి. 50

సీ. ఉర్వీధరశ్రేణు లుఱ్ఱూఁత లూఁగంగ
నేడుగాడ్పులు వీచు నెన్నఁ డేనిఁ
జండభానుండు పండ్రెండుమూర్తులు దాల్చి
యొసఁగ నెండలు గాయు నెన్నఁ డేని
బుష్కలావర్తకాంభోధరవ్రాతంబు
లెలగోలు వర్షించు నెన్నఁ డేని
భూర్భువస్స్వర్లోకములు ముంచి జలరాసు
లేకోదకముఁ జూపు నెన్నఁడేని
తే. నెన్నఁడే నుండు గాలంబు మిన్నుదక్క
భూతములు గ్రాఁగ నెన్నఁడేఁ బుట్టినిండ్ల
నపుడు వారణాసీపుర మైదుక్రోసు
లంతమేర యుపద్రవ మడరకుండు. 51

తే. ఉత్తరోత్తర మభివృద్ధి నొందుచుండుఁ
గాశి ధర్మార్థకామమోక్షములు నాల్గు

చంద్రకళయట్లు శుక్లపక్షంబురేలు
నాఁడునాఁటికి గనువర్ధనంబు కరణి. 52

సీ. పాలిండ్లు గదలంగఁ బసపుఁబయ్యెద వీచు
నచలాధిపతికూర్మి యాఁడుబిడ్డ
ఘాత్కార మొనరించుతొండంబుముక్కున
శీకరాసారంబుఁ జిలుక దుంతి
ప్రత్యక్షమై వచ్చి భాగీరథీగంగ
మృదులహస్తము సాఁచి మేను నివురఁ
బ్రమథోత్తముఁడు భృంగి భయరక్షణార్థమై
ఫాలాగ్రమునఁ దీర్చు భసితరేఖ

తే. దక్షిణశ్రుతి మీఁదుగా ధాత్రిఁ ద్రెళ్లి
పెద్దనిద్రకు మ్రాఁగన్ను పెట్టువేళఁ
బంచజనులకుఁ దారక బ్రహ్మవిద్య
యభవుఁ డుపదేశ మొనరించు నపుడు కాశి. 53

వ. అని వారణాసీపురంబు వర్ణించుచు. 54

తే. వృక్షశాఖాంచలంబుపై వ్రేలుచున్న
కోటిసంఖ్యల నీర్కావికౌర్పణములు
విఘ్నమృగములఁ బట్టంగ వేసినట్టి
చీరతెర లనసంస్మృతిఁ జిగురు గొలుపు. 55

సీ. ఎదుర లోపాముద్ర పదపద్మములముద్ర
సికతిలం బగునేలఁ జెలువు మిగుల
శ్యామాకముష్టియాచ్ఛార్థంబు మృగములు
ఋషికన్యకలరాక కెదురుచూడ

దేవార్చనాధూపదివ్యగంధములచే
హోమధూమము తావి యొద్ది వడయ
వటుజనస్వాధ్యాయవర్ణసందోహంబు
శారికశుకంబులు చర్చచేయఁ

తే. గాశికాపట్టణమునకుఁ గ్రోశమాత్ర
గహనగంగా ప్రవాహసైకతికభూమి
బ్రహ్మలోకమునకు ననుప్రాస మైన
కలశజునిపర్ణశాల డగ్గఱిరి వారు. 56

వ. అప్పుడు. 57

మ. శివుఁడేదాత శివుండెభోక్త శివుఁడేచేయు న్మఖాదిక్రియల్
శివుఁడే విశ్వము నేశివుండ ననుచుఁ జింతించుచుఁ జాహ్నవీ
సవిధ శ్రీఫలవృక్షవాటమున భస్మస్నానశుద్ధాంగుఁడై
భవ! కాశీధవ! నీలకంఠ! యనుచుఁ భావించుభవ్యాత్మునిన్.

క. రుద్రాక్షభూతిముద్రా
ముద్రితనిఖిలావయవుని ముక్తిపదశ్రీ
భద్రాసనస్థు లోపా
ముద్రాపరిపూర్ణపార్శ్వ మునిపుంగవునిన్. 59

మ. నిజధామంబున శంభులింగము భవానీవృక్షదంబంబు నం
బుజగర్భాదిసురేంద్రసంచితపదాంభోజంబుఁ గల్పించె మం
త్రజపధ్యానపరాయణుండగుచుఁదత్పార్శ్వంబునన్ దీప్తిరా
డజినాగ్రంబుననున్న పాశుపతవిద్యారాజ్యపీఠస్థునిన్. 60

క. పాటలజటాకిరీటు ల
లాటంతపసప్తసప్తి లలితమనోజ్ఞ

స్ఫాటికమణిజపమాలా
వ్యాటికితకరసరోరుహాంగుళిపార్శ్వ్వన్. త్రి 61

క. పంచబ్రహ్మంబును శ్రీ
పంచాక్షరమును నఘోరపాశుపతంబుఁ గ
గించిత్ప్రస్ఫుటదధరో
ష్ఠాంచలముగ జపము సేయునాదిమశైవున్. 62

మ. అవధానంబున నప్పటప్పటికి భక్త్యావిష్టుఁడై పార్వతీ
ధవ! గంగాధర! నీలకంఠ! మదనధ్వంసీ! మహాదేవ! రు
ద్ర! విరూపాక్ష! భుజంగహార! యనుచుఁ ధారాధరవ్యూహసం
భవగర్జారభటిం బఠించుఁ బరమబ్రహ్మర్షి లేఖర్షభున్. 63

సీ. అంతర్విలోకనవ్యాప్తి యుద్యాపించి
బాహ్యంబునకు దృష్టి పాఱ విడిచి
లీల రుద్రాక్షమాలిక దక్షిణశ్రవ
శ్శష్కులీశిఖయందు సంతరించి
పదిలంబుగా మున్ను పరిఢవించినయట్టి
నలినాసనంబుబంధము వదల్చి
వేదాగమపురాణవిద్యోద్భవము లైన
పురమర్దనస్తోత్రముల పఠించి

తే. యప్పు డప్పుడ యోగసమాధి యుడిగి
యధికశాంతిఁ బ్రసన్నాత్ముఁడైనవానిఁ
బ్రణవపంచాక్షరీమంత్రపరమసిద్ధుఁ
గుంభసంభవమునిఁ గనుంగొనిరి వారు. 64

తే. జయజయధ్వను లెసఁగంగ సంయములును
నమరులును మ్రొక్కి రపు డమ్మహాత్మునకును

బిన్న పెద్దతనంబు రూపింప నీదు
శాంభవంబైన దివ్యతేజంబుమహిమ. 56

వ. అగస్త్యుండును బ్రత్యుత్థానంబు చేసి యందఱకు నాతిథ్య
సత్కారం బొనర్చి సుఖాసీను లైనవారిం గుశలప్రశ్న
పూర్వకంబుగా నాగమనకారణం బడిగిన. 66

తే. మునులు నమరులు నత్యంతవినయపరతఁ
దారు వచ్చినకార్య మంతయును జెప్ప
యావదర్థపదోక్తివిద్యానిరూఢు
డాంగిరసుఁ బ్రార్థనము చేసె రధికభక్తి. 67

వ. బృహస్పతియు నమ్మహా(ను)భాగు నవలోకించి యిట్లనియె. 68

—బృహస్పతి దేవర్షినియుక్తుండై యగస్త్యునితో సంభాషించుట—

సీ. ధన్యాత్మకుండవు మాన్యుండ వెంతయుఁ
గృతకృత్యుఁడవు జగద్ధితకరుఁడవు
ప్రత్యాశ్రమంబును బ్రతినగంబును బ్రత్య
రణ్యంబు శంసితవ్రతులు లేరె?
నీప్రతాపంబును నీ ప్రభావంబును
నీదునౌదార్యంబు లేదు గానఁ
బ్రణవపంచాక్షర బ్రహ్మవిద్యామహో
పనిషత్తు నీపాణిపల్లవాగ్ర

తే. మిట్టి నిను వేఁడ వచ్చితి మిందఱమును
గమలగర్భునియానతిఁ గాశిపురికి
భువనసంక్షోభకారియై పుట్టె నొక్క
కడిఁదియుత్పాత మది నీవు గడపవలయు. 69

వ. అని పలికి వాచస్పతి పుష్పంబునకు వాసనయుంబోలె సవినా
భావసంబంధంబున నమ్మహామునికి సహధర్మచారిణి యై
యరుంధతికి సావిత్రికి ననుసూయకు శాండిల్యకు సరస్వతికి
లక్ష్మికి నుమకు శతరూపకు మేనకకు సునీతికి సంజ్ఞకు స్వా
హాకుం దోడిజో డగులోపాముద్ర వీక్షించి యిట్లనియె. 70

బృహస్పతి లోపాముద్రకుఁ బతివ్రతాధర్మంబులు సెప్పుట

తే. అమ్మ! కుశలంబె? సాధ్వి! యనామయంబె?
దేవి! భద్రంబె? లెస్సలా? పూవుఁబోఁడి!
నీపరమపతివ్రతాచారవైభ
వాధిరాజ్యంబు జరుగుచున్నదియె? తరుణి! 71

సీ. ప్రాణేశుఁ డారగింపక భుజింపవు భర్త
నిద్రింపకయమున్న నిద్రవోవు
నాథుండు మేలుకొనకమున్న మేల్కాంతు
కైసేయ కెన్నఁడుఁ గదియ వధిపు
ధవుఁడు రోషితుఁ డైనతఱి వాడి యుండుదు
పతికి నెప్పుడు మాఱు పలుక వీవు
పురుషునీగికి నల్ప మనక సంతోషింతు
మొగ మెత్త నేరవు మగనియెదురఁ

తే. జెఱఁగుమాసినమూన్నాళ్లు సిగ్గుతోడఁ
బతివిలోకనమార్గంబుఁ బరిహరింతు
సవిత్రుఁ డుదయింప నాల్గాళ్ల జలక మాడి
చూడ వెవ్వారిఁ బెనిమిటిఁ జూతు గాని. 72

మ. పసపుంగుంకుమకజ్జలంబునునుగూర్పాసంబు తాంబూలముం
గుసుమంబుల్ కబ్బర్రీబంధంబు చెవియాకుల్ మంగళాలంకృతుల్

విసువొక్కింతయు లేక తాల్పవలయుఁ వీనిఁ సదాకాలము
న్నసిఁ జక్కంగఁ బ్రియుండు వర్తిలుటకై నాళీకపత్రాక్షికిన్.

తే. రజకితోడ సుదక్యతో శ్రమణతోడ
విధవతో నాథుతో రాయువెలఁదితోడఁ
జెడిపెతోడఁ బోరాములు సేయ వలదు
ప్రాణసంకటములను బుణ్యాంగనలకు. 74

సీ. పతి పిల్వఁబంచినఁ బని యేమి యని వచ్చి
చెప్పినయుడిగంబు సేయవలయు
భర్తయానతి లేక ప్రకృతిబంధునికైన
నేపదార్థంబును నీగి సెట్ట
జీవిత్వేరుఁడు డించినయోగిరంబును
గుత్స సేయక భుక్తి గొనఁగఁదగవు
సుఖసుప్తుఁ డగునిజేశునిఁ బ్రబోధ మొనర్పఁ
గాఁ దనుస్థానభంగముల దప్ప

తే. నొంటి నెచ్చోటి కరుగుట యుక్తి గాదు
తడుపు గట్టక నీరాడఁ దగవుగాదు
కడపమీఁదను మఱి సన్నెకంటిమీఁదఁ
జక్కిమీఁదను గూర్చుండ జాడ గాదు. 75

క. నాగరికత్వము వాచా
ప్రాగల్భ్యము జూపఁ దగదు పతిముందట సం
భోగక్రీడావిభవా
దోర్యగంబులఁ దక్క సతికి నుత్పలనయనా! 76

క. ఇది ధర్మం బిది యీలువు
ఇది వ్రత మిది సద్వివేక మిది యాచారం

బిది దేవపూజ యిది పతి
యుదితం బాలంబు సేయ కుండుట సతికిన్. 77

క. కాంతుఁడు సంతోషించిన
సంతోషింపంగ వలయు సతి కతఁడాత్మన్
సంతాపించినపట్టున
సంతాపింపంగ వలయు జలజేక్షణకున్. 78

వ. కొందఱు కులటలు పతి దురవస్థఁ బొందినఁ దెవులుపడిన శృంఖలాబద్ధుం డైనను బరిత్యజింతురు. కొందఱు దుష్టమతులగుసతులు లేమిం గొఱతుకువడినభర్తనధికకార్పణ్యంబు పచరించి సర్పిర్లవణతైలతండులాదులకై సిబ్బితి వఱుతురు. కొంద ఱిచ్ఛావతులు ప్రియుండు దమకు నేమి యిచ్చిన మెచ్చక హెచ్చు కుందాడుదురు. కొందఱు పరాకులేకేకాకిసులై మగని మొఱఁగి యొక్కడికేనియుం జనుదురు. కొందఱు దుశ్శీల లశ్లీలవాక్యంబుల నందందఁ బ్రియునిముందట ఘుం దెమేలంబునం బ్రేలుదురు. ఇందఱు నాథునిం గులంబు వారిని నరకంబునం ద్రోచి తారును నంద కూలుదురు. 79

సీ. చీఁకటితప్పు చేసిన సరోరుహనేత్ర
గూబ యై చరియించుఁ గోటరమున
వింతవానిఁ గటాక్షవీక్షణంబునఁ జూచు
కిసలయోష్ఠి వహించు గిల్లకన్ను
మగఁడు దన్నొత్తిన మార్గొత్తునలివేణి
వ్యాఘ్రియై చరియించు వనములోనఁ
జిఱుదిండి తనవారి మొఱఁగి యాహారించు
నలినసూకరజాతియందుఁ బుట్టు

తే. నధిపుఁ గోపించి హుంకార మాచరించు
పడఁతి మూఁగౌను సవతిసౌభాగ్యలక్ష్మిఁ
జూడఁ జాలక మదిలో నసూయ సేయు
భామ దుర్భగ యగు నన్యభవమునందు. 80

ఉ. దూరముపోయి యెండఁబడి దూపిలివచ్చిన ప్రాణనాథునిన్
ద్వారకవాటదేహళులదాఁక నెదుర్కొని తీర్థ మార్చి యా
హారము పెట్టి వీళ్యము సమర్పణచేసి విహారశయ్యపై
నూరువు లొత్తి చిత్తమున కు బ్బొనరించుట ధర్మమింతికిన్. 81

తే. తగవు పాటించి యల్పంబు దండ్రి యిచ్చు
నల్ప మల్పంబ భ్రాతయు నాత్మజుండు
ప్రార్థితం బైనధన మెంతయైన నిచ్చు
ప్రాణనాథుని సరియె యేబంధువులును? 82

సీ. ఓర్పుమై నుప్పిండి నుపవాస ముండనీ
మగనాలిసరిఁ బోల్పఁ దగదు విధవ
తిరిగి నానాపుణ్యతీర్థంబు లాడనీ
మగనాలిసరిఁ బోల్పఁ దగదు విధవ
సమధికంబగు నిష్ఠ జపములునేసిన
మగనాలిసరిఁ బోల్పఁ దగదు విధవ
సద్భక్తి దేవతార్చనము సేయంగనీ
మగనాలిసరిఁ బోల్పఁ దగదు విధవ

తే. నిద్ర మేల్కాంచి రేపాడి నియమపరత
నహిమభానుని వీక్షింపనియటకమున్న
తగదు (వీక్షింప) నరునకుఁ జూడంగఁ దల్లి వదినె
నత్తగారిని దప్పించి యన్యవిధవ. 83

ఉ. జీవముతోడఁ బాసి యశుచిత్వముఁ బొందిన మేనుగంధతో
యావబృథాభిషేకము సహస్రఘటంబుల నాచరించినన్
బావన మౌనె? యట్లు పతిఁ బాసి వితంతుత నొందినట్టిరా
జీవదళాయతాక్షి యశుచిత్వము వాయదు వేయుభంగులన్. 84

తే. ప్రియము గలిగిన నంగీకరింపవలదు
ముండదీవన రేపాడి మోముఁ జూచి
బైసిమాలిన పరమనిర్భాగ్యురాలు
విధవ దాని యాశీస్సును విషసమంబు. 85

సీ. పెండిలినాఁడు భూబృందారకులు గన్య
నప్పగించిరొ లేదొ యధిపుఁ గూర్చి
సహచారిణివి గమ్ము సకలకాలమునందు
నిందుఁజందురునిఁ జంద్రికయుఁ బోలెఁ
దొలుకరి మొగులు విద్యుల్లేఖయును బోలె
ననుగమింపఁగఁ బాడి యతివ మగనిఁ
బిత్రువనంబునదాఁకఁ బతివిమానము వెంటఁ
గైసేసి కొలనాడఁ గదలుభంగిఁ

తే. బితిఁకికండ యొకింత లే కబమి వేడ్కఁ
జిచ్చుఱకఁ బోవు పంకజ చరాజీవనేత్ర
కశ్వమేధంబుఫలము తథ్యంబు గలుగుఁ
బద పదమ్మున కిదె వేదభాషితంబు. 86

తే. పుట్టలోపలిపాము నభ్యుద్ధరించు
వశ్యమంత్రుండు పాములవాఁడపోలె
భర్త నభ్యుద్ధరించుఁ బాపంబువలన
నగ్ని నుఱికినయట్టి పద్మాయతాక్షి. 87

గీ. వెక్కుమాటల నిటు జాలిపెట్ట నేల
సాధ్వి గర్హింప నోర్వఁ డెట్టు చాలఁ గలఁడు?
గంధవాహంబు వెఱచు నక్కలువకంటి
పసపుపయ్యెద పాలిండ్లఁ బాయఁ దట్ట. 88

తే. ఔర్వశిఖికంటె జముకంటె నర్కుకంటెఁ
బిడుగుకంటెను దీవ్రమై బిఱుసు చూపు
నాత్మఁ దప్పఁగఁ దలఁచుదురాత్మకులకు
నహహా! పతిదేవతపతివ్రతాతిశయము. 89

చ. తొలఁగుదు రంత నంత యమదూతకిరాతులు భీతచిత్తులై
కలుషసమన్వితుం డయినకాంతునిదారుణలోహపాశముం
ఖలికలు విచ్చి పుచ్చుకొని కాంతచితాగ్ని శిఖాముఖంబునన్
వెలువడియాత్మభర్తవెనువెంటహుటాహుటిఁగూడివచ్చినన్.

తే. ఎన్నికకు రోమకూపంబు లెన్ని గలవు
దివ్యవర్షంబు లన్ని మోదించు సాధ్వి
నాకభువనంబునం దాత్మనాథుఁ గూడి
వెఱ పొకింతయు లేక చిచ్చుఱికె నేని. 91

తే. తండ్రివంశంబునం దేడుతరములకును
దల్లివంశంబునం దేడుతరములకును
ధవునివంశంబునం దేడుతరములకును
శాశ్వతస్వర్గసౌఖ్య మీఁ జాలు సాధ్వి. 92

వ. అని పలికి బృహస్పతి లోపాముద్రం గనుంగొని దేవీ! నీప్రసంగవశంబునంగొన్ని యోషిద్ధర్మంబులు చెప్పితి. నీవు మహాపతివ్రతవు. నీబోఁటిపుణ్యవతులుకొందరుగలుగంబట్టి గదావసుంధరతిరంబై యున్నయది. ఇదె నీకు నమస్కారంబు.

క. మావచ్చినకార్యమునకు
నీ వనుకూలత భజించి నిర్మలకరుణా
శ్రీ వెలయఁగఁ బ్రార్థింపుము
నీవల్లభు భువనకుశలనిర్వాహకునిన్. 94

వ. అని యగస్త్యమహామునిం జూచి వెండియుం బ్రణమిల్లి యాఖండలగురుం డిట్లనియె. 95

బృహస్పతి యగస్త్యునితోఁ దమవచ్చినకార్యంబు నెఱింగించుట

సీ. ప్రణవంబు నీవు నిర్మలగుణాలంకార!
యామ్నాయవిద్య యీయలరుఁబోఁడి
తప మీవు శశికళోత్తంసభక్తినిధాన!
శాంతి యీసంపూర్ణచంద్రవదన
ఫల మీవు వాతాపిఖలదర్పభంజన!
సత్క్రియ యీగంధసారగంధి
మిహిరుండ వీవు విశ్వహితప్రవర్తక!
చైతన్యలక్ష్మి! యీచపలనయన

తే. బ్రహ్మతేజంబు నీయందుఁ బ్రజ్వరిల్లుఁ
బ్రజ్వరిల్లుఁ బతివ్రతాపరమ తేజ
మీలతాతన్వియం దెమా కిందఱకును
నుభయతేజంబులును మహాభ్యుదయ మొసఁగు. 96

తే. శక్రుఁడీతండు శిఖి వీఁడు జముఁడు వీఁడు
రాక్షసుఁడు వీఁడు పాథోధిరాజు వీఁడు
పవనుఁడును వీఁడు కిన్నరపతి యితండు
వృషభవాహనుఁ డీతండు విశ్వవంద్య! 97

వ. వీరె మునులు. వీరె సిద్ధసాధ్యమరుత్కిన్నరకింపురుషగంధర్వ విద్యాధరు లగు దేవయోనులు. మావచ్చినకార్యం బవధరింపుము. వింధ్యం బనుమహీధరంబు విబుధశైలంబుతోఁ బ్రతిస్పర్ధించి యూర్ధ్వాండకర్పరంబు నిజశిరశ్శృంగశృంగాటకంబుల నుద్ఘాటించుచు ననూరుసారథిరథం బవరోధించి నక్షత్రగ్రహతారకాచక్రంబుఁ జిక్కుపఱిచి సప్తసమీరణస్కంధంబులనుం బ్రతిబంధించి శింశుమారాకారంబునం దారకావీథిఁ బవ్వడించిన పాంచజన్యధరు నొరసి యౌత్తానపాదిను త్తరించి గగనగంగనాలింగనంబుచేసి యురులింగాకారుఁడైనధూర్జటిం ద్రివిక్రమాకారంబున విరాడ్రూపుం డగు విష్వక్సేను ననుకరించియున్న యది. త్రుటినిమేషకాష్ఠాకళాముహూర్తాహోరాత్రపక్షమాసర్త్వయన సంవత్సరయుగసంధ్యాసంధ్యాంశమన్వంతరకల్పమహాకల్పాది భేదభిన్నం బై పదార్థంబులం బరిచ్ఛేదించుకాలంబు నిరస్తసమస్తోపాధికస్వప్రతిష్ఠాఖండసచ్చిదానందైకరసాద్వితీయ రూపుండైన విరూపాక్షుండు దప్పించి యన్యులనుం బరిచ్ఛేదించు. అట్టికాలంబునకుం దపనపరిస్పందంబు మూలంబు. మార్తాండుండు కొండప్రక్కంజిక్కికడలిమొగయక్కలిందగులువడిచిక్కిన జోగునుం బోలె నెదురు నడవ మరలం బఱవలేక చీకాకుపడియున్నవాఁడు. ప్రాహ్ణాపరాహ్ణమధ్యాహ్నసమయంబులు గ త్తరఁ గలయుటం జేసి నిత్యనైమిత్తికాదిక్రియాకలాపంబు లుపసంహృతంబు లయ్యె. ప్రాచ్యోదీచ్యదేశంబు లంధకారాతపహిమానిలంబులచేతం జేతనావైకల్యంబు వహించె. భువనంబుల కకాండప్రళయం బావిష్కృవించె. కల్పాంతకా

లంబునందును గసుగందకుండుం గావున నవ్వేసవిఁ గాశీ
క్షేత్రంబునందునుపరతి చూపదు. ఏమును నిమ్మహోపద్రవం
బునకుం బ్రశాంతిఁ గోరి యబ్రహ్మణ్యంబు సేయుచు బ్రహ్మ
శరణు సొచ్చితిమి. అవ్విరించి కరుణాకటాక్షంబున నీక్షించి
యీయాపద యపనయింప వాతాపిహారితాపసుండు దక్క౦
దక్కినవాఁడు సమర్థుండుగాఁడు. అతనిం బ్రార్థింపుఁడు, పొం
డని తాన నీకందువ చెప్పిన నీయానందవనంబున కరుదెంచి
తిమి. ఇఁకమ్మీఁదఁ గోపాటోపావకుంఠకంఠకఠినహుంకార
ధారావష్టంభంబునం ద్రివిష్టపరాజ్యలక్ష్మీమదాంధుం డైన
నహుషుని నిమిషమాత్రంబున ధాత్రీమండలంబునం బడఁ
ద్రోచిన మహానుభావుండవు. నీవ ప్రమాణంబు. 98

క. ఎవ్వఁడు నిసర్గకఠినుం
డెవ్వఁడు సన్మార్గరోధి యీర్ష్యాపరుఁ డై
యెవ్వఁడు దన కధికునితోఁ
జివ్వకుఁ జేసాఁచు వానిసిరు లధ్రువముల్. చు 99

వ. అనిన వాచస్పతిపలుకు లాకర్ణించి యమ్మునిపుంగవుం డిట్లనియె. 100

తే. యత్న మొనరింతు నీకార్య మనువుపడఁగఁ
జనుఁడు మీమీనివాసదేశముల కర్థి
నున్నవాఁడు గదా! వీఁడె యుమయుఁ దాను
గాశికాభర్త మనపాలికల్పతరువు. 101

వ. అనిన వారును మహాప్రసాదం బని సముచితప్రకారంబునం
గుంభసంభవుని వీడ్కొని నిజనివాసంబులకుం జనిరి. అనం
తరంబ యగస్త్యుండు లోపాముద్రం జూచి యిట్లనియె.

అగస్త్యుండు కాశీవియోగంబునకుఁ బరితపించుట

**తే.** కమలలోచన! మనుజుఁ డొక్కటిఁ దలంప
దైవ మొక్కటిఁ దలఁచు నెంతయు నిజంబు
కాశిఁ బెడఁబాయ నని యేను గదలకుండఁ
గాశిఁ బెడఁబాపె దైవంబు కరుణలేక. 103

**తే.** అప్పటికి నియ్యకొంటిఁ గా కంబుజాక్షి!
[1]ఋషులపాశంబులే యింతలేసి పనులు?
కొసల కాఁబోతు నాఁబోతు గ్రుమ్ములాడ
నడిమి లేఁగెయ్యగతి వచ్చె నాకు నిపుడు. 104

**సీ.** వివరించి చూడంగ విసుమానములుగాక
గోత్రారి వెఱచునే కుధరములకు?
యుగవిరామమున నుద్ధూత లూఁపగఁ జాలు
గాలి కొండ దమింపఁ జాల దెట్లు?
సర్వభూతంబుల శాసింపఁ జాలెడు
జములావు గిరియందుఁ జడతవడునె?
దహనునిదాహకత్వంబు మహీధ్రసం
స్తంభంబునకు శక్తి చాల దొక్కొ?

**తే.** రుద్రు లాదిత్యతుషితమరుద్గణములు
దక్కఁగల దేవతలు జగత్త్రయము మ్రింగి
యుమియఁ జాలుదు రట్టివా రోపలేరె?
వింధ్యగిరిగర్వసంరంభవిభవ మడఁప. 105

**తే.** కామధేనువుఁ దనయింటఁ గట్టినాఁడు
కలవు తనతోఁటలోపలఁ గల్పతరులు

---

1. ఋషులపాలిటి వేయింతలేసిపనులు, కొతుక కాఁబోతు...నడిమి యాఁ బెయ్యదన వచ్చె.

అట్టియింద్రుండు ప్రార్థించె నట్టె నన్ను
నింతపని కియ్యకొకుండ నెట్లు నేర్తు? 106

సీ. మాటనిల్కఁడఁ గాదె? మధుకైటభులు ద్రొల్లి
హరిచేతఁ జచ్చి రేకార్ణవమున
గరుడుండు మోమోటఁ గాదె? వాహన మయి
వనజాక్షు నెక్కించుకొనియె వీఁపు
స్వాగతంబునఁ గాదె? చక్రాయుధుఁ డడంపఁ
బాతాళబిలములో బలి యడంగె
విశ్వాసమునఁ గాదె వృత్రాసురేంద్రుండు
సమసె నంబుధివ్రాక శక్రుచేత

తే. మెఱసి యుపకార మొనరింప మేలు వచ్చుఁ
గీడు వచ్చు మనంబులో నోడ వలదు
వాఁడు చేసినధర్మంబు వానిఁ గాంచుఁ
గీర్తి యొక్కటి సాలదే కేవలంబ? 107

చ. ప్రతిదివసంబు విఁదుము పురాణముఖంబునఁ గాశియందు సం
తతముగ నంతరాయములు డాఁకుచునుండు ననంగ నిప్పు డా
శ్రుతి నిజమయ్యె నే నిదె యశోకమవస్కృత నుండఁగా నత
ర్కితగతివచ్చెఁ జూడుమిదెకిన్నరకంఠి! మహాంతరాయముల్.

తే. విముఖుఁ డయ్యెఁ జుమీ! నాకు విశ్వభర్త
గాక యూరక యేభంగిఁ గలుగ నేర్చు
సకలకైవల్యకల్యాణజన్మనిలయ
కాశికాక్షేత్రవిప్రయోగవ్యథార్తి. 109

తే. పాణియాహారకబళంబుఁ బాఱవైచి
కూర్పరము నాకు పిసవెట్టికూళ వోలె

భోగమోక్షములకు జన్మభూమి యైన
కాశి విడిచి నరుం డన్యదేశ మరుగు. 110

చ. తటకున నియ్యకొంటి మతి దప్పి మరుద్గురునంతవానితో
నటమటమింకఁబోకయడియాసల నుండుటఁ బాపు దైవమా!
యిటు ననుఁ జిక్కు వెట్టుదె యనేకవిధంబుల నెట్లు చెప్పినన్
గటకట! యెట్లు వాయనగుఁ గాశిక మోక్షపదప్రకాశికన్.

సీ. పాయంగ వచ్చునే ప్రాలేయగిరికూట
సమవతీర్ణ జలౌఘ జహ్నుకన్య?
మఱువంగ వచ్చునే మందారమధురసా
స్వాదఘూర్ణితనేత్రు వటుకనాథు?
విడువంగ వచ్చునే విఘ్నాంధకారార్కు
డుంఠివిఘ్నేశు మందూకజఠరు?
మానంగ వచ్చునే మధ్యాహ్న కాలంబు
శ్రీవిశాలాక్షికెంజేతిభిక్ష?

తే. సురలు ప్రార్థింపఁగాఁ బ్రతిశ్రుతము చేసి
యెట్టు వోకుండ నేర్తు నే నింతవాఁడ?
నెట్టు వో నేర్తుఁ గాశిఁ బుణ్యైకరాశిఁ
బ్రకటగుణరత్నదుగ్ధాంబురాశిఁ బాసి. 112

క. కాశీక్షేత్రము పంచ
క్రోశము కైవల్యలక్ష్మికులగృహ మని యా
క్రోశించు శ్రుతులు వినియును
దేశాంతర మరుగ సమ్మతింతు రభాగ్యుల్. 113

తే. కాశిఁ బాయుదుఁ గా కేమి కలువకంటి!
యంతరవిముక్తతీర్థంబు నాశ్రయింతు

నంతరవిముక్తతీర్థ మెయ్యదియొ యనిన
వరణయును నసియును నైనవారణాసి. 114

వ. భ్రూఘ్రాణంబులసంధి యవిముక్తస్థానం బది యభ్యంతర తీర్థంబు తీర్థంబులు బాహ్యాభ్యంతరభేదంబున ద్వివిధంబులై యుండు. 115

తే. ఎల్లవియు బాహ్యతీర్థంబు లిందువదన!
యరయ బాహ్యంబు లయ్యు నాభ్యంతరములు
కాశికాతీర్థ మాదిగాఁ గలవు కొన్ని
వాని వినిపింతుఁ బరిపాటి వనిత! వినుము. 116

సీ. శీర్షంబునందలి శ్రీశైలతీర్థంబు
మల్లికార్జునదేవుమనికిపట్టు
ఫాలభాగమునందుఁ బ్రాలేయమయ మైన
విమల కేదారతీర్థము వసించుఁ
గుచచూచుకములందుఁ గురుజాంగలమ్ముల
తీర్థరాజము సంప్రతిష్ఠ నొందు
భ్రూవల్లరీయుగ్మమునకు మధ్యంబున
నానందవనతీర్థ మధివసించు

తే. నంతరంగమునఁ బ్రయోగ మాశ్రయించు యా
నిమ్నగాతీర్థములు పార్వతీశ్వరునకు
విహరణస్థానములు వేదవిశ్రుతములు
వెలుపలను లోపలను నుండుఁ దలిరుఁబోఁడి! 117

వ. బాహ్యాభ్యంతరంబులయందును నవిముక్తతీర్థం బుత్తమో త్తమంబు. అట్టితీర్థంబుననుండి యఖండంబు సచ్చిదానందైక

రసంబు నద్వితీయంబు నగునిష్కళంకస్వరూపంబును నర్ధ
నారీశ్వరాదిరూపం బైనసకలస్వరూపంబును నగువిశ్వనాథు
నుపాసింప నొడఁగూడ దయ్యెం గావున నింక నేను భావ
తీర్థంబున యాంభర్గు నుపాసించెద. సంసారసాగరంబుఁ దరి
యింపసాధనం బగుటఁ దీర్థం బయ్యె. అభ్యంతరం బైనయ
విముక్తతీర్థంబు బ్రహ్మవిష్ణుమహేశ్వరులకుపలబ్ధస్థానంబగుటం
త్రిమూర్తులకు సాధారణం బయ్యెనుమహేశ్వరునకుం
బ్రధానస్థానం బై యుండు. 118

సీ. ఏవిధంబున నాత్మ నెఱుఁగుదు నే నంచు
యాజ్ఞవల్క్యుని నత్రి యడిగెఁ దొల్లి
యవిముక్తమునయం దుపాస్యుఁ డాత్ముఁ డటంచు
యాజ్ఞవల్క్యుం డత్రి కానతిచ్చె
నాయవిముక్త మెం దాశ్రయించినది యం
చడిగెఁ గ్రమ్మఱ నత్రి యాజ్ఞవల్క్యు
నినుపారి వరణయందును నసియందును
నది యుండు నని యత్రి కానతిచ్చె

తే. యాజ్ఞవల్క్యుండు భ్రూమధ్య మాస్థలంబు
వరణ సంసారదోషనివారణంబు
నాశి యింద్రియదోషవినాశనంబుఁ
జేయుచుండుట యిట నిర్వచింపఁబడియె. 119

వ. అభ్యంతరావిముక్తక్షేత్రదర్శనంబు బ్రహ్మనాడీ పవమాన
జయంబునం గాని సిద్ధింపదు. 120

సీ. ప్రకృతిరూపిణి యైనపాఁపపూఁబోడికి
మహదాదివికృతులు మలక లేదు

మొగము విచ్చి సుషుమ్న మూలరంధ్రముఁ గప్పి
వంశాస్థిసంబంధవలనలీల
నది మీఁదు ప్రాఁకి మధ్యమనాడితోఁ గూడి
ద్రుహిణరంధ్రముఁ గప్పఁ దోఁకచివరఁ
జక్కఁజాయఁ జరింప సమకూరకుండుట
నిడఁ బింగళను గాలి యొక్కఁ డిగ్గఁ

తే. కెలనివాఁకిళ్ళు రెండు వేగిరము మూసి
నడిమివాఁకిలిఁ దెఱవ నెన్నండు నేర్చు
సాధకుఁడు నాఁడుగాని వశ్యంబు గాదు.
పవనవిజయంబు వానికిఁ బద్మనయన! 121

క. ఇడ వామనాడి పింగళ
కుడినాడి సుషుమ్న మధ్యగోచర యగు నీ
కుడియెడమ మధ్యనాడుల
కుడురాజానన! త్రిమూర్తు లొగి దైవతముల్. 122

క. హరి యిడకు నలువ పింగళ
కరవిందదళాయతాక్షి! యమృతాంశుకళా
ధరుఁడు సుషుమ్నానాడికిఁ
బరిపాటి నధీశు లనుచుఁ బలుకుదు రార్యుల్. 123

వ. పవనంబునకు సుషుమ్నాప్రవేశలక్షణం బైన యోగంబు వివరించెద. బ్రహ్మలోకప్రాప్తిద్వారం బగుట సుషుమ్న బ్రహ్మనాడి యనం బరఁగు. షణ్ణవత్యంగుళప్రమాణం బైన దేహంబునట్టనడుమఁ ద్రికోణాకారం బై కుక్కుటాండంబు చందంబున నుండునది కందస్థానంబు. 124

తే. నాభికందంబు క్రిందట నలినగంధి!
కుండలీశక్తిదేవత యుండునెలవు
కుండలీశక్తి నాఁగఁ జకోరనేత్ర!
పాముచందాన నుండెడు ప్రథమమని. 125

వ. అది మూలప్రకృతి. మహదాదిప్రకృతివికారంబులేదును దానిమేనిమలకలు. అప్పాఁపచేడియయు సుషుమ్నానాడి తోడం బెనంగొనియుండు. 126

క, గిటగిట నెనిమిదిమలకలఁ
గుటిలీభావము భజించి కుండలి ప్రాఙ్ఞ
నిటలాంతముదాఁకను గ్రిం
దటి మొగ మైప్రేలు నంద్రు దద్జ్ఞులు దానిన్. 127

తే. దానిచుట్టును నుండు లేఁదలిరుఁబోఁడి!
డెబ్బదియు రెండు వేలు నాడికలు మేన
ముఖ్యనాడులు వానిలో ముద్దరాల!
పదియునాలుగు ననుచుఁ జెప్పుదురు బుధులు. 128

వ. ఇడానాడియందుఁ జంద్రుం డధివసించియుండుం గావున నందుఁ బవనం బుద్గమించుకాలంబు రాత్రి. ప్రవేశించు కాలంబుపగలు. పింగళానాడియందు సూర్యుండధివసించి యుండుఁగావున నందుఁ బవనం బుద్గమించుకాలంబు దివంబు. ప్రవేశించుకాలంబు రాత్రి. ప్రాఙ్ముఖస్థితుఁ డగుపురుషునకుఁ బింగళానాడి దక్షిణదిక్కున నిడానాడి యుత్తరదిక్కున నుండుఁగావున మకరాయనసమయంబునదక్షిణదిగవస్థితుండగు సూర్యుండు గర్కటకాయన పర్యంతంబును త్తరంబు నడచు టంజేసి యుత్తరాయణం బయ్యె. ఈచందంబునం బింగళా

స్థితుం డగుపవనుండు యావత్కాలంబు నిడయందు సంక్ర
మించు నంతకాలం బుత్తరాయణం బీప్రకారంబున దక్షి
ణాయనంబు నెఱుంగునది. 129

చ. సమగతి నేకకాలమున సంగతి యాపవతీకళత్రుఁడుర్గ
గమలపితుండుప్రాణమనుగాడ్పులుదారటుకూడిపింగళా
ధమనిని డాసి తీవ్రగతిఁ దార్కొని క్రుంకుదురస్తమింతురే
సమయమునందుఁదాల్చునది చంద్రనిభాస్య! యమాభిధాన

తే. పాము కుండలి చంద్రుండు ప్రాణపవన [మున్.
మాసిరావల్లి యెప్పు డయ్యనిలుఁ గ్రోలు
నది యశేషాంగకగ్రాస మైనయట్టి
గ్రహణకాలంబు సుమ్ము సారంగనయన! 131

వ. ప్రాణంబ యాదిత్యుండు. ఆదిత్యుండ చంద్రుండు. ఆప్రాణా
నిలంబు మూలాధారప్రవేశానంతరంబుదయించు మూర్ధ
ప్రవేశానంతరం బస్తమించు. దేవతలకు మొదలివిషువం
బైనమేషాయణంబున సూర్యుం డుదయించు. విషువాం
తరం బైన తులాయనంబున నస్తమించు. ప్రాణోదయాస్త
మయసమయంబులు విషువద్ద్వయంబు. 132

చ. మొదలసుషుమ్నఁజొచ్చు నిడముట్టినగాడ్పులకొంత సేపునం
బిదప సుషుమ్నఁబుట్టినసమీరము చొచ్చునిడాఖ్యనాడికన్
మొదలనుబిమ్మటంబవనముల్ దిరుగంబడి చొచ్చుఁ గానన
య్యదనులుసంక్రమంబులనియాడుదురాగమతత్త్వకోవిదుల్.

వ. అని యవిముక్తక్షేత్రవియోగదుఃఖంబున మానసాంతర
విముక్తక్షేత్రమాహాత్మ్యం బుపన్యసించి యనంతరంబ

కాశికావిరహవేదనాభరంబు దుస్సహం బగుట నొక్కచో
యుండు కాశిని లక్ష్యంబు చేసి యి ట్లనియె. 134

క. ఆమచ్చిక యాయను వా
ప్రేమాతిశయంబు వి_స్తరింపఁగ వశమే?
భూమండలతిలకమ పర
భూమికి ని న్నెట్లు వాసి బోవుదుఁ గాశీ! 135

మ. నిజ మేఁ బల్కెదబాహువెత్తి శ్రుతివాణీజాహ్నవీగోపతి
ధ్వజదుంఠీశగణేశ్వరుల్ గుఱిగ నోవారాణసీదేవి! యో
గజచర్మాంబరుమూర్తిపట్టణమ! యోకల్యాణి! నీ కెన బోలనం
బుజగర్భాండమునందు లేవు నగరంబుల్ తీర్థరాజంబులున్.

తే. లేవు లింగంబు లవిము_క్తలింగమునకు
సాటిసేయంగ భూర్భువస్స్వస్త్రయమున
రావు దక్కటిపుణ్యతీర్థములు నీకు
సాటిసేయంగ భూర్భువస్స్వస్త్రయమున. 137

వ. అని యెట్టకేలకుం గదలి విరాళిం గొన్నచందంబున మరులు గుడిచినపోల్కి నపస్మారం బెత్తినపగిది నన్నుకొన్నవిధంబున దూపటిల్లినతెఱంగునఁ దూలపోయినరీతి విషం బెక్కిన లీల మ్రాగన్ను వెట్టినలాగున లాహిరి పట్టినభాతి మదం బెక్కినమాడ్కి నుంగిడిగొన్నభంగి నూసరిల్లుచు నుస్సు రనుచు నుమ్మలించుచు నుదిలగొనుచు నుపతాపం బందుచు మాటాడుచు నూర్వశీనందనుం డూర్ధ్వబాహుండై యుఁ చ్చైస్స్వనంబున. 138

సీ. పరమకల్యాణి! యోభాగీరథీ! గంగ!
వార్ధిభామిని! పోయివత్తు నమ్మ!

యమరేంద్రులార! లోలార్క కేశవులార!
వనజసంభవ! పోయివత్తు నయ్య!
శ్రీవిశాలాక్షి! దాక్షిణ్యపుణ్యకటాక్ష!
వాసవార్చిత! పోయివత్తు నమ్మ!
శ్రీపూర్ణభద్ర పారిషదనాయకులార!
వటుకభైరవ! పోయివత్తు నయ్య!
తే. తీర్థసంవాసులార! కృతార్థులార!
పాశుపతులార! భాగ్యసంపన్నులార!
మందిరోద్యానవాటికామఠములార!
పోయివచ్చెద మీకాశిపురము వెడలి? 139

సీ. కలహంసి! రారాదె కదలి నాతోఁ గూడి
నీ వేల వత్తమ్మ నెమ్మి నుండి
కదళికాకాంతార! కదలి రా ననుఁ గూడి
నీవేల వత్తమ్మ నెమ్మి నుండి
శ్రీవిశాలాక్షి! విచ్చేయు నాతోఁ గూడి
నీవేల వత్తమ్మ నెమ్మి నుండి
నాతోడఁగూడి యంతర్గేహ! యేతెమ్ము
నీవేల వత్తమ్మ నెమ్మినుండి
తే. రండు నను గూడి యోపరివ్రాట్టులార!
వత్సలత గల్గి మీ రేల వత్తు రయ్య!
పరమనిర్భాగ్యుఁ డైననాపజ్జఁ బట్టి
కటకటా! సౌఖ్యజలరాశిఁగాశిఁ బాసి. 140

వ. అని యెట్టకేలకుఁ గాశీనగరంబు వెడలి కొంతదవ్వు నడచి
కాశీవిప్రయోగతీవ్రవేదనాదూయమానమానసుం డై వద

నంబు వఱువట్లు పట్టం బాదంబులు గుదివడ నువ్వానుచు నొక
వటవిటపినీడనజ్జటాధరుండుచదికిలంబడిలోపాము ద్ర కిట్లనియె.

తే. భూమిపతిపుత్త్రి ! చెప్పుమా బుద్ధిమతివి
కాశి వెడలంగ వలసె నేకారణమునఁ
గారణము లేక యూరక కలుగు నెట్లు
సుఖము దుఃఖము నరునకు సులభలీల ? 142

వ. కాశ్మీరంబులయందుఁగుంకుమం బనునది దేశాపేక్ష; దివంబు
నంద కమలవికాసంబు, రాత్రియంద యుత్పలవికాసంబు
ననునది కాలాపేక్ష; పుణ్యవంతునకు సుఖంబు, పాపిష్ఠునకు
దుఃఖంబు ననునది యదృష్టాపేక్ష; సర్వంబును నీశ్వరేచ్ఛా
యత్తం బనునది యీశ్వరాపేక్ష; విశ్వంబును గ్రహావశం
బనునది గ్రహాపేక్ష; మాకుఁ జూడ నీశ్వరప్రేరణంబునం
గర్మంబు సుఖదుఃఖంబుల నాపాదించు; ఈశ్వరుం డెవ్వని
రక్షింపవలసె వానిచేఁ బుణ్యకర్మంబులు చేయించు నెవ్వ
నిం జెఱుపవలసె వానిచేఁ బాపకర్మంబులు చేయించు అవి
ద్యాస్మితరాగద్వేషాదిలక్షణక్లేశపంచక మూలంబున గదా
కర్మాతిశయంబు? అక్కర్మఫలం బిహలోకపరలోకంబులం
బ్రాణు లనుభవింతురు. కర్మంబునకుమూలభూతంబైన క్లేశ
పంచకం బెంతకాలం బనువర్తించునంతకాలంబునకుఁ ద్రివి
ధంబు పరిపాకంబు నానావిధయోనిజన్మప్రాప్తియునాయువు,
సుఖదుఃఖఫలోపభోగంబును, జన్మంబునజన్మహేతుకర్మంబు
చరితార్థం బయ్యెనేనియు నవశిష్టంబులై యాయుర్హేతు
వులు భోగహేతువులు నైన కర్మంబులకు ఫలానురూపం
బైనభోగంబులు బరమేశ్వరుండు గల్పించుచుండు. 143

తే. ఏమి చెప్పఁగ నున్నది? యేవిధమునఁ
గాశి వెడలించుచున్నాఁడు కాలగళుఁడు
మనము లోఁగితి మేని లోఁగునె శివాజ్ఞ?
యుడుము నడికెన నడుకునే బడియ పెట్టు? 144

వ. అని వెండియు. 145

సీ. వక్షఃస్థలంబున వైచు మంత్రము చెప్పి
జమిలిపాములరాజుజన్నిదంబు
జడ లల్లి చొల్లియం బిడి యొక్కసకెముఁగా
బాలేందుశకలంబుఁ బదిలపఱచుఁ
గంఠమూలమునందుఁ గస్తూరిమాలుగాఁ
గాలకూటవిషంబుఁ గీలుకొలుపుఁ
గటిభాగమునయందుఁ గట్టు రింగులువాఱ
మెఱుఁగారు మువ్వన్నె మెకముతోలు
తే. గట్టువాలుపడంతి చక్కడముఁ దోఁపఁ
దఱచు గైసేయుచుండు నాతఁడా కాశి
యయిదుక్రోసులపొలములో నంత నంతఁ
జావు కుండంగఁ జచ్చినజంతువులకు. 146

చ. అని యెదురుండి మ్రొక్కి నయనాంబురుహంబుల బాష్ప
బిందువుల్, చినుకఁగ వెక్కివెక్కి కలశీసుతుఁడోయన నేడ్పు
నీరెలుం, గున నొకకొంత కొంత మఱి గ్రుమ్మరు మిన్నున
మ్రోవ నుస్ఫుర, ధ్వనిఁ బఠియింపఁ జొచ్చెఁ బ్రణవంబునఁ
గూర్చినమంత్రరాజమున్. 147

వ. అచ్చోటు గదలి కతిపయప్రయాణంబుల వింధ్యాచలంబు
డాయం జనుదెంచి విషమదృషత్ ఖండవిలసనస్థలంబును

జరత్తరుకోటరజఠరలుఠదజగరగళ గుహానిష్ఠ్యూతనిష్ఠుర
పవనసంధుక్షమాణదవదహనశిఖాకలాపంబును, నుగ్రతరశరభ
చటులచపేటపాతమోహితరోహితంబును సముద్ధత స్తబ్ధరోమ
కంఠకఠోరఘుర్ఘురధ్వానఘుమఘుమాయమానదిక్కుంజర
క్రోడంబును, గ్రీడచ్ఛిక్రోడశిశుచరణనఖశిఖాశిఖరవిశీర్య
మాణశిఖరశేఫాలికాకుసుమకేసరరజగ ప్రసర ధూసరవాసర
కర్కరవ్రాతంబును, బరుషతరుపవనబిలపతితపచేళిమదధిఫల
భక్షణఫుల్లగల్లభల్లూకప్రకరంబును నగు మహాగహన
మధ్యంబున. 148

సీ. యక్షరాజుఁ దలంచి యక్షిగోళంబుల
నశ్రుపూరము నించు నర్తి మిగిలి
పలుమాఱు నట దండపాణిసౌహార్దంబు
భావించి భావించి పలవరించు
సంభ్రమోద్భ్రముల విశ్వాసపాత్రంబుల
సౌవిదల్లుల నర్థి సంస్మరించు
దిగ్గజాఘోరసిద్ధివినాయకకపర్ది
చింతామణీగణేశితులఁ బొగడు

తే. జ్యేష్ఠసౌభాగ్యసుందరీచిత్రకంఠ
వికటదుర్గామహాదేవి విశ్వవాహా
శాటికాదేవతల నిజస్వాంతవీథిఁ
గాంచి గఱువ్రాల్పు సర్వాంగకములఁ దపసి. 149

క. త్రిణయనుని రాణివాసము
నణిమాద్యైశ్వర్యవితరణామరతరువుఁ

మణికర్ణిక ముక్తివధూ
మణికర్ణికఁ దలఁచుఁ దపసి మానసవీథిన్. 150

సీ. కఠవల్లిఁ బఠియించుఁ గఠము సంశోధించుఁ
బ్రాణోపనిషదభిప్రాయ మరయుఁ
బరిపాటి ముండకోపనిషత్తుఁ దాపసీ
యోపనిషత్తు నభ్యుపగమించు
నఱియు నథర్వవేదశిరఃప్రపంచంబు
లారణ్యకముత్రోవ లరసి చూచుఁ
బ్రశ్నోపనిషదర్థపరిమళంబు గ్రహించు
శ్రీభగవద్గీతఁ జిత్తగించుఁ
తే. దల వకారంబు శ్వేతాశ్వతరము ననేకు
నుపనిషత్తులు దలపోయు నొయ్య నొయ్యఁ
గాశికాక్షేత్రవిప్రయోగప్రభూత
హృదయసంతాపశాంతికై యిల్వలారి. 151

వ. అప్పుడు. 152

మ. క్షితిపాలోత్తమవంశభూషణము లక్ష్మీభారతీపార్వతీ
ప్రతిబింబంబు సమగ్రకాంతిమతి లోపాముద్రనీక్షించి య
ద్భుతముంబొందుచువింధ్యనామకమహాభూమీధరారణ్యదే
వత లందంద నమస్కరింతురుమనోవాత్సల్యమొప్పారఁగన్.

మ. నలి వింధ్యాచలకాననాంతరమున న్వారాణసీత్యాగవి
హ్వలభావంబున నిల్చి నిల్చి హర! నీహారాంశుమూర్ధన్య! ని
ర్మల! కాశీశ్వర! నీలకంఠ! యనుచున్మ్రాన్పన్ను వాటిల్లఁద
త్కలశీసూనుఁడు మూర్ఛఁగాంచెఁ గొనుసమగ్రంబైనతద్వేదనన్.

వ. వెండియుఁ గుంభసంభవుండు. 155

చ. దురితము లెన్ని చేసితినొ తొల్లిటిజన్మమునందుఁ గాశికా
పురమున సర్వజంతువులు భూరివిముక్తులు' గొల్లలాడఁగా
హరహర! నెత్తిఁజేతు లిడి యశ్రులు గన్నుల నొల్కనిప్పునే
గరినిభయానతో నిదె షాకాలెవమిన్నులు వడ్డచోటికిన్.

తే. ఏల మ్రింగితి వాతాపి నిల్వలు? నిల
నేల త్రోచితి దివినుండి యొలి నహుషు?
నా ప్రభావంబు గాదె న న్నదిరిపాటు
కాశి వెడలంగఁ ద్రోచె నిష్కారణంబ. 157

సీ. ఎన్నఁడు చూతునో యింకొక్కమాఱేను
ప్రకటకైవల్యాంబురాశిఁ గాశి?
నెన్నఁడు చూతునో యింకొక్కమాఱేను
జగదేకపావని జహ్నుకన్య?
నెన్నఁడు చూతునో యింకొక్కమాఱేను
మహిమాస్పదము ముక్తిమంటపంబు?
నెన్నఁడు చూతునో యింకొక్కమాఱేను
విశ్వలోకారాధ్యు విశ్వనాథు?

తే. నింక నెన్నఁడు చూతునో యేను డుంఠి?
నింక నెన్నఁడు చూతునో యేను దుర్గ?
నింక నెన్నఁడు చూతునో యేను వటుకు?
నింక నెన్నఁడు చూతునో యేను గుహుని? 158

### అగస్త్యుండు లోపాముద్రతోఁ గాశిఁ బెడబాయుట
### వింధ్యగర్వాపహరణము

వ. అనుచు నల్ల నల్లన వచ్చుకుంభసంభవు దవ్వుదవ్వులం గాంచి
కాంచనశిరశ్శృంగశృంగాటకంబులం గమలభవాండకటా

హంబు ఉద్ఘాటించుతనమేటిపొడవు నేలసపాటంబుగా వంచి వింధ్యాచలంబమ్మహానుభావు నెదుర్కొనియె. అప్పు డర్కనిరథంబుచక్కఁ జాయ నడచె. పవనస్కంధంబులు నిర్బంధంబు లుడిగె. ఇందుండు చిందిలిపడసాగె. మంగళబుధ బృహస్పతిశుక్రశనైశ్చరరాహుకేతువులు దమతమతాన కంబులు దప్పకచరింపం దొడఁగిరి. విశ్వప్రపంచంబుసర్వంబును గ్రామంబున యథాపూర్వంబునం బ్రవర్తిల్లె. కాలంబు లేర్ప డియె. అనంతరంబ పురుషాకారంబు దాల్చి యజ్జగతీధరంబు గొన్ని యంజలిం బ్రత్యుద్గమించి. 159

సీ. ప్రణవపంచాక్షరోపనిషత్ప్రపంచంబుఁ
గడదాఁక నెఱిఁగినకఱతలాన్ని
వాతాపిదైత్యు నిల్వలునితోఁ గూడంగ
జఠరాగ్ని వేల్చినసవనకర్తఁ
గోపించి నహుషునిఁ గుంభీనసంబుగా
హుంకార మిచ్చినయుగ్రతేజు
వానకాలమునాఁడు వండుపట్టిననీటి
కాలుష్య ముడిపెడుకతకఫలముఁ

తే. బాండుభసితత్రిపుండ్రాంకఫాలభాగు
భద్రరుద్రాక్షమాలికాభరితవక్షు
భార్యయును దాను నేతెంచుపరమశైవుఁ
గాంచె వింధ్యాచలేంద్రంబు కలశభవుని. 160

క. కాశీనగరీవిరహ
క్లేశభవక్రోధవహ్నికీలల నాశా

కాశధరిత్రీవలయము
లాశుగతిం గాల్పఁ గడఁగునట్టిమహోగ్రున్. 161

వ. కాంచి యక్కుంభినీధరంబు కుంభసంభవు నతిథిసత్కార సంభావనావిశేషంబులం బరితోషంబు సంపాదించి కరాంభోరుహంబులు మోడ్చి 'మహానుభావా! నీయాజ్ఞాప్రసాదభావంబున ననుం గృతార్థుం జేయు' మని పలికిన. 162

సీ. వింధ్యాచలేంద్ర! పృథ్వీభృత్కులశ్రేష్ఠ!
దక్షిణాపథముతీర్థంబు లాడఁ
బోవుచున్నాఁడ నీవువ్వబోఁడియు నేను
బెద్దకాలమునాఁటి పెరిచ గాన పెరువ.
లావు చాలదు జరాశైథిల్యంబుకతమునఁ
బొడ వెక్కునపుడు డిగ్గెడునపుడును
నభ్రంకషము లైనయానీశిఖరశృంగ
శృంగాటకము లిట్లు చిఱుతపఱిచి
తే. యనఘ! నేఁ గ్రమ్మఱఁగ వచ్చునంతదాఁక
నుండవలయు ధరిత్రిలో నొదిఁగి నీవు
చేయు నాయాజ్ఞ లెస్స యాఁ జేయకున్న
నెఱిఁగెదవు గాక రజ్జాడ నేల యిపుడు? 163

వ. అనిన వింధ్యంబు మహాత్మా! చరాచరంబైనజగంబునందు నీయాజ్ఞఁ జేయనివారునుం గలరె? నీవు మరలి విచ్చేయు నంతదాఁకను నిట్ల యుండెద ననినఁ గుంభసంభవుం డతని దీవించి నిజపాదాంభోరుహవిన్యాసంబుల విశ్వవిశ్వంభరాభాగంబు భాగ్యవంతంబు గావించుచు దక్షిణదిశాభిముఖుం

డయి చనియె' నని చెప్పిననైమిశారణ్యవాసు లటమీఁది వృత్తాంతం బెయ్యది యనుటయు. 164

ఆశ్వాసాంతము

ఉ. బలవద్బ్వారహగొంతిమన్నె ధరణీపాలావరోధాంగనా
విలసన్మంగళసూత్రరక్షణకళావిఖ్యాతకారుణ్య! యు
త్కలకర్ణాటతురుష్కరాట్పరమమిత్రా!కుండలిస్వామికుం
డలపూజాపరతంత్రధీవిభవ! పంటక్ష్మాపచూడామణీ! 165

క. భూపాలమథన! జంబూ
ద్వీపేశ్వర! విమతరాయవేశ్యావిట్ఘా
టీపటహధ్వాన్నినాదా
టోపప్రక్షుభితదిక్కుడుంగక్రోడా! 166

ఉత్సాహ—

బంధులోకపారిజాత! పంటవంశపావనా!
సంధివిగ్రహప్రధానషడ్గుణా! విశారదా!
గంధవాహభుక్కలాపకంఠకోణనాభిని
ర్గంధనక్రియామహాప్రగల్భకీర్తినైభవా! 167

గద్య. ఇది శ్రీమత్కమలనాభపౌత్ర మారయామాత్యపుత్ర సుకవిజనవిధేయ కవిసార్వభౌమ శ్రీనాథనామధేయప్రణీతంబైన కాశీఖండం బనుమహాకావ్యంబునందు ద్వితీయాశ్వాసము.

# తృతీయాశ్వాసము



మద్దేసటివంశ
గ్రామణి! మూర్ధాభిషిక్తకంఠీరవ! సు
త్రామనిభవైభవోన్నత!
భామాపాంచాల! వీరభద్రనృపాలా! 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె. 2

ఉ. ఆపృథివీధరంబు హృదయంబున సంతస మందె నెంత
యుం, గోపనుఁ డెల్లకాలమును గుంభభవుం డతఁ డిప్పుడు
గ్రుఁడై, శాపవిషప్రయోగమునఁ జంపఁ దలంచిన నడ్డ
మెవ్వ రఁ, ట్టాపదశైల మిప్పటికి శంక వహింపకయుండుఁ
గావుతన్. 3

వ. అని కుంభసంభవుని ప్రత్యాగమనంబుఁ గోరుచు వింధ్యా
చలంబు వంద్యోదయం బై వసుంధరాగర్భంబున నడంగి
యుండె. 4

తే. ముని జటాధారి శివభక్తుఁ డనఘమూర్తి
యెవ్వఁ డేతెంచు నప్పు డత్తెత్తిచూచుఁ
గుంభసంభవుఁ డనుకోర్కి కొనలుసాఁగ
వసుమతీధర మతఁ డేల వచ్చు మరలి? 5

తే. మొదలగల పెక్కువయు(న్న)బోయి ముడిఁగె నద్రి
కలశజునినేత్రములఁ గెంపు గాన నైన
నొరుని నైశ్వర్య మీక్షించి యుపతపించు
నట్టిఖలునకు నిది పెద్ద యానె? తలఁప. 6

క. సిద్ధింప వీప్సితంబులు
సిద్ధించెన యేనిఁ బిదపఁ జెడు నన్యునిసం
వృద్ధిఁ గనుంగొని యెవ్వని
బుద్ధి నసూయాగ్రహంబుఁ బొందు నతనికిన్. 7

తే. అప్రయోజన మభివృద్ధి నతిశయిల్లు
నప్రయోజన మడఁగుఁ గాలాంతరమున
నకట! యీర్ష్యాగ్రహగ్రస్తుఁ డైనయట్టి
ఖలునిసంపద విధవచన్నులున్న బ్లోలె. 8

వ. ఆసమయ్యంబున్నం, బాకశాసనపావకపరేతరాజపలలాశిప్రాశి పవనపాలస్వ్యపశుపతులు పరమహర్షోత్కర్షంబున నగస్త్యమహర్షిం బ్రస్తుతించిరి. పతంగుండు బసిండికొండనెత్తంబు చక్కటివియత్తలంబున నడనం దొడంగె. 9

సీ. స్ఫటికభూములయందుఁ బ్రతిబింబములు చూచి
యితరాశ్వబుద్ధి హేషిత మొనర్చుఁ
బద్మరాగోపలప్రసభాగములందుఁ
జరమసంధ్యాశంక జాడ్య మందు
మరకతమణిశిలామధ్యంబునందు దృ
శ్యాదృశ్యమూర్తులై యులుకుచుండు
వైడూర్యమాణిక్యవప్రాంతరములందు
సలిలాభిలాష నొచ్చలు వాంచుఁ

తే. గిన్నరస్త్రీలఁ జూచి లంఘింపఁ బోలుఁ
గావరం బెత్తి యుద్దామకామవృత్తి
వాయుజవములు రవితేరివారువములు
వేల్పుగుబ్బలిప్రస్థానవీథియందు. 10

సీ. తమతనుచ్ఛాయ మేఘములు పచ్చనివన్నె
నుభయపక్షములు నై మూఁగియాడఁ
గళ్లేలఁ దెగినసృక్కముల క్రొన్నెత్తురు
లాననంబులకుఁ గెంపావహింప
నుడుపథంబునయందు నుండినగతి ధారగా
గమనవేగంబునఁ గానఁ బడఁగ
శుకముఖద్విజకోటి సులభకౌతూహల
వ్యతిషంగమునఁ జేరి యనుసరింపఁ
తే. జిలుకలును బోలె హేమాద్రిశిఖరశృంగ
కల్పవృక్షాటవీవాటికలఁ జరించె
మహీధరముసేయునంకిలి మానుటయును
వనజవనబాంధవుని తేరివారువములు. 11

సీ. ఆకాశవాహినిసైకతంబుల ఖురాందోళ
చల్లక్షతములు గ్రుంగ జటులుపడిన
శాతకుంభాచలస్ఫుట స్థలంబులఁ
జక్రాభిహతివడి చాలకున్న
బహులదూర్వాశంకఁ బ్రణతదేవకిరీట
మరకతద్యుతులకై మరులుగొన్న
నిందుబింబముఁ జూచి చెందుప్పుగలుపావి
యలు లెత్తి నాకంగ నాసపడినఁ

తే. బసిఁడిగిలుకలచెర్కోలఁ బరిఢవించి
కఠినహుంకార మొనరించి కనకరథము
వారువంబులఁ బఱపె దుర్వారలీల
బిరుసు తహాతహా వినువీథిఁ బిచ్చుకుంటు. 12

అగస్త్యుండు దక్షిణకాశికిం బోవుట

వ. ఇవ్విధంబునం భువనోపద్రవంబుఁ బ్రశాంతిం బొందించి దక్షిణకాశీసందర్శనంబునంగాని కాశీవియోగవేదనాభారంబు డిందుపడ దని డెందంబున నిశ్చయించి మందమంద ప్రయాణంబులఁ గొందలిరాకుఁబోఁడియాకులతం బొందికసు గందకుండ ముందఱఁ బిఱింది నడపించుచు నెడనెడఁ బుణ్యవాహినీతీర్థంబులఁ గ్రుంకులువెట్టి యష్టమూర్తి నర్చింపుచుం గొన్ని వాసరంబులకుఁ గుంభసంభవుండు గోదావరి నొరసి కొనుచు నాంధ్రదేశంబున నరుగుచున్నప్పుడు. 13

మ. అహార్యారంభములందుఁ బ్రసవనశైలాద్యధిత్యకాకందరా
కుహరక్రోడకటాహగద్గదపదద్గోదావరీసింధువా
ర్లహరీశీకరమాలికాశిశిరము ల్పంపాసరుల్ దండకా
గహనగ్రామములున్ మయూఖపుల్ దపసికిం గావించె నాహ్లాదమున్.

తే ఋషికిఁ బంపాసరోవీచిపృషతశిశిర
గంధవాహప్రవాహసంబంధములును
గాశికాక్షేత్రవిప్రయోగప్రభూత
తాపశాంతి యొనర్పంగ నోప వయ్యె. 15

సీ. ప[illegible] శ్రీవీరభద్రేశు సేవించి
యిలసోమనాథునంఘ్రులకు నెరఁగి
పురశాసను ననంతభోగీశ్వరస్వామి

హిమశైలకన్యకాధీశుఁ గొల్చి
పద్మాద్రిపై రుద్రపాదంబు లర్చించి
చేరి మార్కండేయశివు భజించి
కోటిపల్లీతీర్థకుండలాముఖముల
నర్ధేందుధరు విరూపాక్షుఁ దలఁచి
తే. పల్వలపానమున భూతభర్త నిలిపి
కాంతిఘ్నమున వృద్ధగంగలోఁ గ్రుంకువెట్టి
దక్షవాటిక సప్తగోదావరమున
మునిఁగి భీమేశ్వరునిఁ గాంచె మునివరుండు. 16

శా. ప్రాతఃకాలము తీవ్రభానుఁ డుదయింపన్ సప్తగోదావరీ
స్రోతఃపూరమునన్ మునింగి యభవున్ సోమార్ధచూడామణిన్
జ్యోతిర్లింగమయస్వరూపుఁ గొలిచెన్ శుద్ధాంతరంగంబునన్
బాతివ్రత్యమహాప్రభావనిధి లోపాముద్ర భీమేశ్వరున్. 17

మ. మునిచూడామణి యెల్లసత్కళలకున్ మూర్ధాభిషిక్తుండుగా
వున జ్ఞానేక్షణాంగహారముల తావుల్ మించి కీర్తించుచున్
శనివారోత్సవవేళఁ గన్గొనియె నాస్థానంబునన్ రాజనం
దనయుం దానును దేశిమార్గమునగంధర్వాప్సరోనృత్తముల్.

వ. అంత. 19

తే. కుంభజుఁడు దక్షిణాభిముఖుం డగుటయు
నదను వీక్షించి వచ్చె నో యనఁగ వచ్చె
శంబరారిప్రతాపాగ్ని సామిధేని
నవశరద్వేళ శ్రీభీమనాథుఁ గొలువ. 20

తే. జిగురుకొన్న రజస్స్వేదసిక్తిఁ జెఱఁగుమాసి
జలధకుండోదకంబుల జలకమాడి

మలయజాచ్ఛపయోధరమండల లగు
దిగ్వధువులందు రుచిఁ బ్రవర్తించె నిస్తుఁడు 21

సీ. అభినవోన్మేషజృంభై నట్టితొలుచూపు
కౌస్తుభాలోకరేఖలకు నలుఁగ
స్వాంగభంగం బైనయావులింతకు వేల్పు
లంకుటిస్ఫోటనం బాచరింప
సౌఖశాయనికు లై సంవర్తభృగ్వాది
మునులు హస్తాంభోజములు మొగుడ్ప
ధృతచేతనంబు లై దివ్యాయుధంబులు
జయజయధ్వనులతో సంస్తుతింప

తే. నలువ తేనులు బేలె పెంజిలువ తేని
యరవికుబుసంపుఁబొరలు మై నంటియుండ
నిదుర మేల్కాంచి కూర్చుండె నుదధినడుమ
విష్ణుఁ డఖిలేశ్వరుఁడు శరద్వేళయందు. 22

వ. వెండియుఁ బ్రాకృదశావిశీర్ణదిశాశాల లిగుల్ల తూలరాశి దేశీయం బులు వియదురగనిర్మోకశకలవిభ్రమంబులు నభ్రముపతిశరీర శుభ్రంబులు నగుసితాభ్రంబు లభ్రమంబునం బరిభ్రమించి ఖండఖండంబు లై యాఖండలకోదండదండంబుల గగనమండ లంబున నలంకరించె కొదమ మొగుళ్ళు దెరలుచు దండంబడఁ బడు వల్మీదవడగండ్లు పుష్పాంజలులును నుఱుముచప్పళ్ళు మురళీ ధ్వనులుగా గగనరంగస్థలంబునం గ్రొమ్మెఱుంగు సామెఱుంగుఁబోఁడి గొండ్లి పరిఢవించె. మత్తవనమయూరమత్తి కాషిని (స) కలహంస మాధు (ర) కంఠ కేకాగీతికావసానంబునం గళాపించె. కుంభద్రోణంబు లంభోధరంబులు గురిసి వెలిసిన

యనంతరంబ యంతంత నుట్టిపడు నట్టిసలిలబిందువులన రజనీ శు క్తిముక్తాఫలంబులు నక్షత్రంబు లంతరిక్షంబున సంప్రేక్షణీయంబులయ్యె. దాక్షారామకటకాప్సరస్తాటంకినీవదనారవింద లావణ్యబిందునిష్యందంబు చందురుండు కందర్పదిగ్విజయకీర్తి స్ఫూర్తియుంబోని యచ్చవెన్నెల విచ్చలవిడిం గాయం దొడంగె. కుముదంబులు ముకుళించె. లాంగలి చెంగలించె. తెల్లులసిల్లె. కాసర గాచె. దోస దోరగిలంబారె. పయ్యెర విసరె. వా[illegible]యె. కరి మదంబుఁ గురిసె. నందిపోతు పోతరించి ఖణిల్లున ఱంకె వైచె. అస్లదుగువడియె. నెఱెని నిసుక దెస దీవి చూపె. నీడ సవియయ్యె. ఏ[illegible]కులపొన్న క్రొన్నన పెరిఁగె. వరిగ విరిగె. గసగస యొసక మెసఁగె. పెస రుసురుకొనియె, తవిద పొదలె. తెక్కప్రాసంగు దొండముక్క వడియె. మదకలకలహంససంపద సల్లాపకోలాహలవ్యాజృంభ కరంభితకకుబంతంబు లై (న) విహారవేశంతంబులు కాంతా కుచద్వయ ద్వయసవాఃపూరవంతంబు లయ్యె నయ్యవసరంబున.

తే. కార్తికపువేళ భీమశంకరునినగర
వింధ్యసంస్తంభయిత దూర్ఫై విమలబుద్ధిఁ
దొయ్యలియుఁ దాను జిచ్చైఅతోరణంబు
కలుషసంహతిసంహార కారణంబు. 24

క. దక్షిణవారాణసి యగు
దాక్షారామంబు సొచ్చి తరుణేందుధరుఁ
వీక్షించినకోలెను గా
శీక్షేత్రాలోకసుఖమ్ముచేకుతె మునికిన్. 25

క. కేశంబును సౌఖ్యంబును
నాశంబును గుంభజన్ముఁ డభిమర్శించెం
గాశీవిరహము దక్షిణ
కాశీసంగమము వరుసఁ గలిగినకతనన్. 26

వ. పరోపకారపరుండయినవానికిఁ బుంఖానుపుంఖంబు సంపదలు సంభవించు. తీర్థస్నానదానజపహోమదేవతార్చనాదులు పరోపకారంబునుంబోల నేరవు. పరోపకారంబునకంటెనధర్మంబు లేదు. లోకోపకారపరాయణుం డైనవానికి కింతవింత లేసి ప్రయోజనంబులు సమకూఱకుండునె? ఇవ్విధంబున భోగమోక్షనివాసంబైన దాక్షారామంబునం గొన్ని దివసంబు లుండి కొల్లాపురంబునకు శ్రీమహాలక్ష్మి దర్శింపం (బోఁ) దలంచి యమ్మైత్రావరుణుండు.

{ అగస్త్యుండు కొల్లాపురంబున కేఁగుచు మార్గమున వీరభద్రేశ్వరు దర్శించుట }

సీ. అంతరప్రవాహమై యావిర్భవించె నే
ధరణీధరముపొంతఁ దుల్యభాగ
పాతె నేశైలంబుపాదమూలంబునఁ
గల్లేటితో వృద్ధగంగ వాసి
యుదయించె నేకొండయుత్తరాశారసా
తలకుక్షి సప్తగోదావరంబు
జనియించె నేశిలోచ్చయము దక్షిణమున(ఁ)
గణ్వవాహిని యుప్పుఁగడలికొమ్మ
తే. భర్మగిరితోడఁబుట్టు వేపర్వతంబు
బలసియుండు నేయద్రికిఁ బంచలింగ

మట్టిశ్రీవీరభద్రమహాచలమున
కరుగుదెంచెను వింధ్యదర్పాపహారి. 28

వ. ఇట్లరుగుదెంచి లోపాముద్ర కిట్లనియె. 29

తే. దక్షిణానందవిపినమధ్యంబునందు
క్రతువిధిధ్వంసవేళ దేవతల నురిపె (సె) (పి)
వీరభద్రేశుఁ డీయద్రి వెన్నుఁ దన్ని
గౌతమీవారిఁ దన్నవాలు గడిగినాఁడు. 30

తే. పంకజక్ష్మాధరము వీరభద్రగిరియు
నంధ్రభూమికి వక్షోరుహద్వయంబు
భువనచక్షుఃకరండ మంభోరుహాక్షి!
గౌతమీగంగ ముత్యాలకంఠమాల. 31

సీ. ఎవ్వాఁడు డాచేతి క్రొవ్వాఁడినఖములఁ
జిదిమె భాషాదేవిచిగురుముక్కుఁ
గనకమేఖలఁ గ్రుచ్చి కట్టె నెవ్వాఁడు లీలఁ
జెఱఁగుపైఁ బూషాస్యు మెఱుఁగుపండ్లు
కొసర కెవ్వాఁడు పదాంగుష్ఠభాగంబున
నుడురాజుపొట్టగొంజులుకనూఁదెఁ
దఱిగె నెవ్వాఁడు ఖడ్గధారాంచలంబున
నగ్నివాలుక లేదు నంటఁదఱిమి

తే. మోఁదెఁ నెవ్వాఁడు ముప్పదిమూఁడుకోట్ల
వేలుపులఁ బారఁ బార వెన్వెంటఁ దఱిమి
యట్టిశ్రీవీరభద్రుఁ డీయద్రిమీఁద
భద్రకాళియుఁ దా నుండుఁ బద్మనయన! 32

తే. బ్రహ్మసంవేద్య మాదిగాఁ బట్టి సొంత
మతిప ! గోదావరీనదీహారమునకు
నడుమ నాయకరత్న మై నలువు మిగులుఁ
బంచలింగాశ్రయము వీరభద్రశిఖరి. 33

వ. అని చెప్పి యచ్చోటు గదలి ప్రతిదినప్రయాణంబుల. 34

క. శ్రీరారామంబునఁ ద్రా
క్షారామంబునను నాదిమారామమునం
ద్వారాధిపచూడామణి
నారాధించెను మునీంద్రుఁ డతివయ్యుఁ దానున్. 35

వ. అనంతరంబయమ్మునిసింహంబు సహ్యగిరికన్యకా ప్రవాహం
బునఁ గృతావగాహుం డయి కదలి పశ్చిమాంభోధితీరం
బున సౌరాష్ట్రసోమనాథేశ్వరశరచ్చంద్రచంద్రికాధౌతకల్ల
ధౌతసౌధవీథికానముల్లిఖితగగనమండలం బయి పదునెని
మిది యోగపీఠంబులందును సుప్రసిద్ధం బైనకొల్లాపురంబు
నకుం జని యందు. 36

ఉ. శ్వేతవరాహకల్పమున వెన్నుఁడు సూకరవేషధారి యై
యాతతదంష్ట్రికాగ్రఖురమునందు ధరిత్రి వహించియుండఁగా
నాతనిమీఁద లేతపొలయల్క వహించి తొలంగి వచ్చెనో
యీతరలాక్షి? యండ్రు బుధులెప్పుడు నాజగదేకమాతృకన్.

తే. భద్రకాళికయై ఘోరపరశుధారఁ
గ్రూరదైత్యునిఁ బొరిగొన్నఘోరమూర్తి
శౌరివక్షస్థలీభశచ్చంద్రరేఖ
శ్రీమహాలక్ష్మి భక్తి వీక్షించెఁ దపసి.

క. కొల్లాపురిలక్ష్మికిఁ బ్రణ
మిల్లిరి పులకాంకురములు మేనులఁ బొడమఁగ
హ్రాల్లేఖామంత్రోపని
షల్లతికాకుసుమమునకు సతియుం బతియున్. 39

వ. అనంతరంబ కుంభసంభవుం డాత్మగతంబున. 40

అగస్త్యుండు లక్ష్మిని స్తోత్రముచేయుట

సీ. క్షీరోదకన్యకు శ్రీమహాలక్ష్మికిఁ
గమలాయతాక్షికిఁ గంబుకంఠి
కఖిలలోకేశ్వరి కామ్నాయవినుతకుఁ
గనకకేతకపుష్పగర్భగౌరి
కరుణాధరోష్ఠికి నమరకోటికిరీట
కోటివిటంకసంఘాటఘటిత
రత్నాంకురప్రభారాజి నీరాజిత
శ్రీపాదపద్మపీఠోపకంఠ

తే. కంబురుహనాథుదేవికి నాదిశక్తి
కిందిరకు లోకమాతకు సిరుఁబోఁడి
కలరువిల్కానితల్లికి నాశ్రితార్థ
కల్పవల్లికి మ్రొక్కఁగఁ గంటి మంటి. 41

వ. అని అనంతరంబ. 42

తే. చంద్రమునియందు జ్యోత్స్నవు చంద్రవదన!
ప్రభవు వాసరకరునందుఁ బద్మనయన!
దాహశక్తివి పూఁబోఁడి! దహనునందు
మ్రొక్కెదను నీకుఁ గల్యాణమూర్తి! లక్ష్మి! 43

తే. బ్రహ్మ పుట్టించు మనుచు నారాయణుండు
హరుఁడు హరియించు భువనంబు లవసరమున
నెందు సమకూఱు వీరికి నీప్రభావ
మీవు గలుగంగఁ బట్టి కా కిందువదన! 43

ఉ. పండితుఁ డాతఁ డాతఁడు ప్రభావసమగ్రుఁ డతండు శూరుఁ డా
తండు వివేకి యాతఁడు వదాన్యుఁ డతండు మహాకులీనుఁ డా
తండు కళావిదుం డతఁడు ధన్యుఁ డతండు మనోజ్ఞమూర్తియౌ
వ్వాండు భవత్కృపాకలనవైభవలక్ష్మికిఁ బాత్రుఁ డిందిరా! 45

చ. పురుషునియందు భాగ్యమును బోల్తుకయందు విలాసరేఖయుం
గరిహరులందుఁ బక్షిభుజగంబులయందు మహీరుహావళీ
హరితతృణంబులందుఁ బసులందును బెయ్యలయందుఁ గుక్క
లం, దరుదగు బెంపునొప్పు భవదంశముగా దెతలంపనిందిరా!

ఉ. *ఎవ్వని నేని నీవు దయ నించుకఁ జూచిన వానిఁ జూతు ర
ప్పువ్విలుకానిఁగా సతులు భూపతిఁగా బ్రజ కల్పకంబుగాఁ
నవ్విబుధాశ్రితవ్రతతి యంబుధిఁగాఁ గులగోత్రగోత్రముల్
కవ్వడిఁ గాఁ బరద్విషులు గర్ణునిఁగాఁ గవు లెల్ల శ్రీసతీ!

ఆ. కమలనయన! నీవు కలచోట సరసంబు
నీవు లేనిచోటు నీరసంబు
కంబుకంఠి! నీవు కలవాఁడు కలవాఁడు
లేనివాఁడు నీవు లేనివాఁడు. 47

సీ. పరిపూర్ణహేమకుంభములు హస్తంబుల
ధరియించి యిరువంకఁ గర్తులు గొలువఁ

* ఈపద్యము మద్రాసు ఓరియంటలులైబ్రరీలో నుండు నొకతాళపత్ర ప్రతిలోమాత్ర మున్నది. ఇతరము లగు పెక్కుప్రతులయందుఁ గన్పట్టదు.

బహుళమై వరశంఖపద్మమహాపద్మ
మకరాదినిధులు నేమమునఁ గొలువఁ
వింజామరలు దాల్చి వెనుకదిక్కున దేవ
గంధర్వగుహ్యకాంగనలు గొలువ
నెలవంక బలువంక నింద్రాదిదివిజులు
సేవాంజలులు మౌళిఁ జేర్చి కొలువ

తే. భర్మపంకజకర్ణికాభద్రపీఠి
కాగ్రమున నిండుకొలువుండి యఖిలలోక
రక్షణము సేయు ని న్నేను బ్రస్తుతింతు
నసమసౌభాగ్యగుణధన్య! యబ్ధికన్య! 48

వ. సురమార్థవస్తువిభాగంబు సేయవచ్చిన శక్తిమంతుం డైన యీశ్వరునకు శక్తి యగునీకు భేదంబు లేదు, గావున శక్తుం డగు నీశ్వరునకుం గలసృష్టిస్థితిసంహృతి స్వభావస్వరూపంబు లైనకృత్యంబు లైదును నీయవి. దహనునకు దాహశక్తియు, నుష్ణాంశునకు దీధితియుఁ, జంద్రునకుఁ జంద్రికయుంబోలె నీశ్వరునకు నీవు సహజవు ధ్రువవు నై యుండుదు. ఇహజన్మజన్మాంతరంబుల విహితంబు లైనవ్రతదానాదులచేతసంచితంబు లైనదురితంబులు నిరసింపఁబడుటం జేసి యస్తరజస్తము లైనంతయు తమ్ములు విశుద్ధసత్త్వలయి నీతత్త్వంబుఁ జింతింతురు. భోగాపవర్గలక్షణం బైనఫలంబు పరమేశ్వరుండు పశుగణంబున కిచ్చునపుడు నిన్ను మున్నిడి కొనికాని యీఁజాలండు! శబ్దబ్రహ్మంబు కారణబింద్వాత్మకంబై బిందునిష్యందత్వంబున (కుం)బురుమేచ్ఛాయాప్రయత్నంబున మూలాధారావస్థితపవన సంఘటనంబునం జేసి

యభివ్యక్తంబై పరావాక్కనంబడు. ఆబ్రహ్మం బీనాభిపర్యంతం బావాయువుచేత నభివ్యజ్యమానంబై విమర్శరూపంబైన మనంబుతోడం గూడి సామాన్యస్పందప్రకాశరూపిణియుం గార్యబిందుతత్త్వాత్మికయు నీశ్వరాధిదేవతయు నై పశ్యంతీవాక్కనంబడు. ఆబ్రహ్మం బావాయువుచేతన హృదయపర్యంతం బభివ్యజ్యమానంబై నిశ్చయాత్మకబుద్ధియుక్తంబై విశేషస్పందస్వరూపయునాదబిందుమయయుహిరణ్యగర్భాధిదేవతయునై మధ్యమవాక్కనంబడు. ఆబ్రహ్మం బాస్యపర్యంతం బావాయువుచేతన కంఠాదిస్థానంబులయం దభివ్యజ్యమానంబై యకారాదిక్షకారాంతవర్ణమాలారూపంబై (నిశ్చయాత్మయై) శ్రోత్రగ్రహణయోగ్యంబై వైఖరీవాక్కనంబడు. ఈచతుర్విధసూక్ష్మస్థూలమాతృకాస్వరూప విట్టి (దేవీ!) నీకు నమస్కారంబు. 49

తే. అని నుతించినఁ బ్రియ మంది యబ్ధికన్య
కలశజునిఁ జూచి యిట్లను గారవమున
ననఘ! నీస్తోత్రమునకు నాయాత్మ మెచ్చె
నీవు గోరినవర మిత్తు నెమ్మిఁ గొనుము. 50

వ. ఇంకఁ రాఁగలయిరువైతొమ్మిదవద్వాపరంబున నీవు వ్యాసుండవై వారణాశీపురంబున వేదపురాణసంహితాధర్మశాస్త్రంబులు వక్కాణింపంగలవాఁడవు. ఇప్పు డొక్కహితంబు సెప్పెదఁ దుంగభద్రాతీరంబునఁ గిష్కింధాచలోపాంతంబున స్వామిమల యనుకాననంబునం గుమారస్వామి యధివసించియున్నవాఁడు. నీ వాచక్కటి కరిగి యతనివలన వారణాశీస్థానమాహాత్మ్యంబువినుమని పలికి లోపాముద్రంగనుం

గొని యక్కాంతకు ముద్రికాకటకహారకేయూరాదు లగు దివ్యాభరణంబులఁ బ్రసాదించె. ఇవ్విధంబునంగొల్లాపురమహాలక్ష్మిచేతఁ బ్రసాదంబు వడసి దంపతులు చరితార్థులయి సముచితప్రకారంబున నమ్మహాదేవి వీడ్కొని స్వామిమలకుం జను వా(డై)రై కొన్నిపయనంబు లరిగి ముందఱఁగఠోరమధ్యపరిణతి దశావష్టంభసంస్తంభసముజ్జృంభమాన హేరంబదశనకులిశకఠోరకోటిభిద్యమానహాటకకటకటంకారఘట్టి (త) తాళ్రగణంబై చతుర్ద్వారంబులను జతురంతరచతుష్పతఃద్వారంబులషోడశగవాక్షంబులద్వాత్రింశన్నకరతోరణంబులఁ జతుష్షష్టినాట్యకూటంబులనుబంచాశదుత్తరసహస్రదీర్ఘికలను శతసహస్రకోటిలింగంబులను దశసహస్రకోటిశక్తులనుం గోటి తీర్థంబులనుం గలిగి వరాహకుండమల్లికాకుండక్షీరకుండాది కుండంబులచేతనుఁ గదళీవనబదరీవనగౌరీవనబిల్వవనాదిముఖ్య వనంబులచేతను హాటకేశ్వరగుప్తమాహేశ్వర నందిమండల నివృత్త్యాదు లయినదివ్యస్థానంబులచేతను రససిద్ధరసాయన సిద్ధిమూలికాసిద్ధిపాదుకాసిద్ధ్యాదు లగుసిద్ధక్షేత్రంబులచేతను శోభింతబై దివ్యామృతనిర్మలశ్రీస్వయంభూజ్యోతిర్లింగ మూర్తియగుమల్లికార్జున శ్రీమర్మమహాదేవునకు నిజనివాసంబై యభిరామంబై దివ్యంబునగు శ్రీశైలంబుఃజేరవచ్చె నయ్యవసరంబున. 51

అగస్త్యుండు శ్రీశైలంబున కేతెంచుట

మ. పరిరంభం బొనరించె గుంభభవునిం బాతాళగంగాంబుని
ర్ఝరకల్లోలఘటాపృషద్వ్యతికర ప్రాలేయముల్ హాటకే

శ్వరజూటీకృతమాల్యకేసరరజస్సౌరభ్యసంపన్నముల్
కరివక్త్రాభరణాహిపీతపరిముక్తంబుల్ వనీవాయువుల్. 52

శా. ఆమిత్రావరుణాంశసంభవుని వింధ్యాటోపవిధ్వంసి లో
పాముద్రాసహితుం గనుంగొనిరి యుత్పన్నప్రమోదంబునన్
వామగ్రాహ్యపయోధరల్ కుటిలనీలాగ్రాలకల్ తథ్యమి
థ్యామధ్యస్థితమధ్యలాటవికసేవాధీశసీమంతినుల్. 53

సీ. వాతాపిదమనుండు పాతాళగంగయం
దఘమర్షణస్నాన మాచరించె
హాటకేశ్వరదేవు నారగ్వధంబుల
నర్చించె వింధ్యధర్పాపహారి
గగనర్షి వృషభుండు కంఠీరవానను
వైకుంఠబిలమధ్యవాసుఁ గొలిచె
నేకాంతరామేశు నిందుశేఖరుని ద
ర్శించె నీవారముష్టింపచుఁడు

తే. గూర్మి రంభోరువును దానుఁ గుంభభవుఁడు
కుంభినీధరదుహితృవక్షోజశాత
కుంభకుంభికాపరిరంభణోంభితాత్ము
శంభు శ్రీమల్లికార్జును సంభజించె. 54

మహాస్రగ్ధర. [illegible] హృల్లేఖాదిమంత్రాభ్యసననిరతుఁ డై
యాగమోక్తప్రకార, క్రమయుక్తిం గంధపుష్పాక్షతదళ
ములశ్రీకంఠు నర్ధాంగలక్ష్మిన్, భ్రమరాంబాదేవి నంతర్భ్రి
మరఫలరసప్రహ్వచూతద్రుపుణ్యా, శ్రమవాటీహేమ
సింహాసనవిలసదధిష్ఠాన నర్చించె నిష్ఠన్. 55

తే. చెలువయును దాను నాశీతబిలసహస్ర
మార్గశాఖోపశాఖల మౌనివరుఁడు
విధుకిరీటులఁ బూజించెఁ వెదకి వెదకి
యమృతమయలింగమూర్తుల నధికభక్తి. 56

వ. వెండియు నయ్యిల్వలమథనుండు యథావిధి మంథూకకుం డంబునం గ్రుంకె. పంచాక్షరీమంత్రసిద్ధుండు పంచధారాపల్లధార లనునిర్ఝర ప్రవాహంబులఁ గృతావగాహుండయ్యె పాటల జటాకిరీటుండు హాటకకూటశిరః శృంగ శృంగాటకఘట్టంబున్న గోటిలింగంబులం భజించె. లోపాముద్రాధిపతి యద్రికటకభద్రాసనంబున సమున్నిద్రప్రతాపమ్ముద్రావిద్రుతాక్షుద్రోపద్రవుండగుచుద్యానవీరభద్రు శ్రీద్రవహరిద్రాక్షతంబుల భద్రదారుద్రుపారిభద్రద్రుమకురకంబుల నారాధించె. బ్రహ్మర్షి బ్రహ్మపాదారవింద ద్వంద్వంబు హరిచందనచర్చామచర్చికల నర్చించె. సిద్ధతాపసమూర్ధాభిషిక్తుండు ఘంటాసిద్ధేశ్వరునివలన మంత్రసిద్ధి వడసె. మహాభాగుండు భోగవతీతీరంబున భోగేశ్వరు భోగాపవర్గప్రదు భుజంగభూషణు భజించె. నీ వారముష్టింపచుం డిష్టకామేశ్వరునకుం బటిష్ఠనిష్ఠావిశేషంబులం దుష్టిఁ గావించె. భువనగోప్తసప్తమాతృకలఁ దలంచె. సహాఁషదమున్నుండుమ్ముషితసకల కలుషంబగుకదలీవనవిషమభువి నిగ్రహభీషకపరిషదనుగతవృషభగమనుంగపటశబరభటు నట (?) దుహితృపరివృఢు నశితమతిం గొలిచె. అనంతరంబ యొక్కవివిక్తప్రదేశంబున సుఖాసీనుండై. 57

తే. అర్థిఁ గుంభోద్భవుం డిట్టు లనియె సతికిఁ
బద్మలోచన! చూడు శ్రీపర్వతంబు
పాయ కిం దుండుఁ బార్వతీప్రాణవిభుఁడు
మల్లికార్జునదేవుండు మదనవైరి. 58

తే. ధవళలోచన! శ్రీపర్వతంబుమహిమఁ
బ్రస్తుతింపంగఁ శక్యమే బ్రహ్మకైన
గండశిల లెల్ల శంభులింగంబు లిందు
సిద్ధమును లిందుఁ వసియించుచెంచు లెల్ల. 59

క. చూడున్న నీదు ముక్తుల
శ్రీకాశీక్షేత్ర మెవ్వరికి నిది నిక్కం
బీకుధర మిచ్చు శిఖరా
లోకనమాత్రమున ముక్తులు కురంగాక్షీ. 60

వ. అనియె నప్పుడు లోపాముద్ర ముద్రికామణిమయూఖ రేఖలు నఖర శిఖరంబులం జిగురొత్త విద్రుమప్రవాళంబుల యుల్లాసంబు నుల్లసంబాడెడుపాణిపల్లవంబులు మోడ్చిఫాల భాగంబునం గదించిన వినయవినమితోత్తమాంగయై యున్నం గనుంగొని సస్నేహంబును సబహుమానంబును సానురాగంబును సాభిప్రాయంబును సమర్మంబును సవిభ్రమంబును సోపాలంభంబునుం గాఁ గుంభసంభవుండు మహాదేవి కి ట్లనియె. 61

సీ. హృదయంబులో సంశయించి నిగూఢార్థ
మిద మిత్థ మని నిశ్చయింపలేక
యది తేట తెల్లివిఁగ్గా నడుగంగఁ దలఁచి ల
జ్జాసాధ్వసంబులు సందడింప

నవనమ్ర ముఖపద్మ వైయున్న దానవు
ప్రాగల్భ్యసరణి యేర్పడునో యంచు
మాటాడ నేరనిమాఁటినంగవు నీవు శ్రీ
సకలకాలంబు నోసరసిజాక్షి!

తే. కాంత! యేకాంతవేళలఁ గాంతునెదుర
నగుచుఁ దెగడుచు నుండుట తగవుసూవె
వలసిసిగ్గున వెలిపునఁ గలసి బెరసి
యుండకుండుట మాబోఁటు లోర్వఁ గలరె? 62

వ. అనిన విని లోపాముద్ర మౌనముద్ర దిగ్ద్రావి మునీంద్రున
కి ట్లనియె. 63

సీ. చతురశీత్యాయామసంపన్న మై యోజ
నోత్సేధవైభవాభ్యుద్గతమయి
ముప్పది యోజనములం వెడల్పును గల్గి
స్ఫారతి కోటితీర్థాన్విత మయి
సమధోకాష్టాశీతిసాహస్ర సంయమి
జనసమాకుల మయి సప్తకోటి
మంత్రాశ్రయం బయి మహనీయమహిమ మై
తనరారునీపర్వతంబునందు

తే. శిఖర మీక్షించునంతన చేరు నట్టి
ము క్తి జంతువులకు (మఱి) జీవములు దొరంగ
జచ్చినప్పుడు గాని మోక్షంబు లేదు
కాశి కరుగంగ నేఁటికిఁ గాళ్లజాలి. R. C. 64

వ. మఱికొందఱు కేవలవిజ్ఞానంబుఁ బ్రశంసింతురు. కొందఱు
విజ్ఞానంబువలన సముచ్చితం బైనకర్మంబుఁ బరిశీలింతురు.

కొందఱు దానంబులు గొనియాడుదురు. కొందఱు వ్రతం బులు సెప్పుదురు. కొందఱు యజ్ఞంబులు మెత్తురు. కొందఱు తపంబులు గోరుదురు. కొందఱు బ్రహ్మచర్యం బభినందింతురు. కొందఱు గార్హస్థ్యంబుఁ బ్రశంసింతురు. కొందఱువానప్రస్థా శ్రమంబు మన్నింతురు. కొందఱు సన్న్యాసంబుఁ బ్రసంగిం తురు. కొందఱు తీర్థసేవ యావిష్కరింతురు. కొందఱుస్వా ధ్యాయంబు నధికరింతురు. కొందఱు కాశీశ్రీపర్వతాదిశివ స్థానంబు లభ్యర్థింతురు. ఇన్నియు ముక్తిస్థానంబులై యుండు నందులోపల సులభంబగుముక్తిస్థానం బెయ్యది? విన్నవలతు నానతిమ్ము. సంశయబీజభూతంబు లైనయావిప్రతిపత్తివచన సహస్రంబులు వినంగ నాడెందంబు డోలాందోళనం బందు చుండు. 65

క. అని యడిగినఁ గలశసుతుం
డనుమోదరసార్ద్రహృదయుఁ డై దేవికి ని
ట్లను నడుగవలయునర్థమ
వనజానన! యడిగి తుక్తివైభవ మలరన్. 66

**{ అగస్త్యుండు లోపాముద్రకు బాహ్యాభ్యంతర తీర్థమాహాత్మ్యంబుఁ జెప్పుట }**

శా. శ్రీశైలాదులు ముక్తికారణములై చెప్పంబడ్డుం దీర్థముల్
ప్రాశస్త్యంబును నన్నితీర్థముల కప్రత్యూహమై వర్తిలుఁగా
గాశీ ప్రాప్త(ప్తి)కరంబు లైనకతనం గైవల్యలక్ష్మీసమాఖ్యల్
గాశీక్షేత్రముగైకొసుందరుణి! సాక్షాన్ముక్తిహేతుత్వమున్.

వ. ప్రయోగ నైమిశంబు కురుక్షేత్రంబు గంగాద్వారంబు నవంతిక యయోధ్య మధుర ద్వారక సరస్వతి సహ్యంబు

గంగాసాగరసంగమంబు కాంచి త్ర్యంబకంబు సప్తగోదావరంబు కాలంజరంబు ప్రభాసంబు బదరికాశ్రమంబు మహాలయం బోంకారంబు పురుషోత్తమంబు గోకర్ణంబు భృగుతీర్థం బంబుపుష్కరంబు శ్రీపర్వతంబు నా నివి మోక్షకారణంబు లైనమహాతీర్థంబులు. 68

సీ. శంభుప్రసాదంబు సమకూఱకుండినఁ
దీర్థయాత్రకు సమ్మతింప దాత్మ
దీర్థంబు లాడంగఁ దివురు లేకుండినఁ
బ్రతిబంధదురితంబు వాసిపోదు
ప్రతిబంధదురితంబు వాసిపోకుండినఁ
గాశి కేఁగెడునట్టికడఁక లేదు
కాశీపురక్షేత్రవాసమ్ము లేకయే
విజ్ఞాన దీపంబు విస్తరిలదు

తే. జ్ఞానమునఁ గాని మోక్షంబు సంభవింప
దతివ! జ్ఞానం బనంగ వేదాంతవాక్య
సంభవం బైన దదియ పోజ్ఞాన మండ్రు
తరుణి విజ్ఞాన మీసూక్ష్మ మెఱేఁగి కొనుము. 69

క. ధారాతీర్థం బనఁగాఁ
దారాధిపవదన! ఖడ్గధారాంచల మ
ద్ధారాంచలమునఁ ద్రెవ్విన
వీరాగ్రేసరుఁడు ముక్తివిభవముఁ గాంచున్. 70

తే. తీర్థములు మానసములు ముక్తిప్రదములు
తరుణి! యివి మేలు బాహ్యతీర్థములకంటె

మానవుం డివి యేమంటి మధురవాణి!
బాహ్యతీర్థంబు లాడ నిష్ఫలము సూవె. 71

సీ. తీర్థంబు సత్య మింద్రియనిగ్రహము తీర్థ
మనసూయ తీర్థంబు వనరుహాక్షి!
తీర్థంబు దానంబు తీర్థంబు సంతోష
మనుకంప తీర్థంబు కనకగౌరి!
బ్రహ్మచర్యంబు తీర్థంబు తీర్థము ధృతి
యమము తీర్థము విద్రుమాధరోష్ఠి!
సమత తీర్థంబు విజ్ఞానంబు తీర్థంబు
పుణ్యంబు తీర్థంబు పువ్వుఁబోఁడి

తే. తీర్థములు మానసంబులు ధీవిశుద్ధి
యతిశయిల్లంగ నివి యాడ్డ కాడినట్టి
పంచజనులకుఁ గలహంసపక్షిగమన!
బాహ్యతీర్థావలులు తీర్థఫలము నీవు

చ. బిసరుహపత్రలోచన! క్షపీటములందు మునింగియాడవే
మొసళులుమీలుకర్కటకముల్ గమఠంబులు వానికబ్బునే!
యసదృశమైనతీర్థఫల మట్టివిధంబు సుమీ? తలంప మా
నస మగుతీర్థమాడనిజనంబులకుం బహుబాహ్యతీర్థముల్.

తే. సుదతి! యేటికి నంతర్విశుద్ధి లేని
బాహ్యసంశుద్ధి? బహుతీర్థపరిచయమున
వేయుఁగడవలజలమున వెలిఁ గడిగిన
గలుగునే శుద్ధి వారుణీకలశమ్మునకు? 74

తే. రాగదోషమలాపహారక్షమంబు
మానసం బైనతీర్థంబు మందగమన!

యవనిఁ బుష్కరక్షేత్రోపవాసమహిమంబు
బాహ్యతీర్థంబు మేచకోత్పలదళాక్షి! 75

సీ. దర్శించినపుడ చిత్తము నిర్నిబంధనం
బగుఁ బ్రసాదగుణంబు నందు నేనిఁ
గలుషంబు గాని దుర్గంధంబుఁ బొరయని
సలిలంబు నెఱ్ఱమ్ముగ్గాఁ గలుగు నేనిఁ
బావనక్షేత్రపుణ్యావనీధరతపో
వనసన్నికర్షంబు దనరు నేని
శంసితవ్రతులైనసంయమిశ్రేష్ఠుల
యధికపరిగ్రహం బబ్బు నేనిఁ

తే. దీర్థములు పెక్కులాడిన తీర్థ మగునె?
ధవళలోచన! సలిలమాత్రమునఁ జేసి
ముదిత! దేహమునం దంగములకుఁ బోలెఁ
దారతమ్యంబు గలదు తీర్థముల కరివ్వ. 76

వ. సారంగనయన! తీర్థాంగంబు లప్రతిగ్రహం బనహంకారం
బకోపనత్వం బనాలస్యంబు సూనృతంబు సమాధానంబు
శ్రద్ధధానత్వంబు హోమనిష్ఠ క్షేత్రోపవాసంబు పితృతర్ప
ణంబు బ్రాహ్మణభోజనంబు పితృశ్రాద్ధంబు పిండప్రదానంబు
శిరోముండనంబు మొదలుగాఁ గలయవి సాంగోపాంగంబు
లయిఫలంబు నీజాఁలు. మఱియు తీర్థతారతమ్యంబు వివ
రించెద. 77

సీ. చెలువ! శ్రీగిరియందు శిఖరేశ్వరం బను
శిఖరంబు జూచినఁ జేరు ముక్తి

కాంత! శ్రీశైలంబుకంటె వేగంబునఁ
గేదార మీఁ జాలుఁ గేవలత్వ
మంతకంటెను వేగ మరవిందలోచన!
యమృత మీనోపుఁ బ్రయాగతీర్థ
మా ప్రయాగముకంటె నతివేగమునఁ జేయు
నపవర్గ మింతి! మహాశ్మశాన

తే. మతివ! యానందకాననప్రాప్తికరము
లఖిలతీర్థంబులును సందియంబు లేదు
కాశికాతీర్థ మాడక కదియరాదు
లక్షతీర్థంబు లాడిన మోక్షలక్ష్మి. 78

## శివశర్మోపాఖ్యానము

వ. ఈయర్థంబు దేటపడ నొక్క యితిహాసంబు చెప్పెద వినుము. మథుర యనుపట్టణంబున శివశర్మ యనువిప్రోత్తముండు గలఁడు. అతఁడు వేదంబులుచదివి, తదర్థంబు లెఱింగి, ధర్మశాస్త్రంబులు పఠించి, పురాణంబు లధిగమించి, యంగంబు లభ్యసించి, తర్కంబు లాలోడించి, మీమాంసాద్వయం బాలోచించి ధనుర్వేదం బవగాహించి యాయుర్వేదంబు విచారించి, నాట్యవేదంబు గ్రహించి, యర్థశాస్త్రంబు(లు) ప్రాపించి, మంత్రశాస్త్రంబు(లు) దెలిసి, భాషలు గఱచి, లిపులు నేర్చి, యర్థంబు (లు)పార్జించి, ధర్మంబులు చేపట్టి, భోగ్యంబు లనుభవించి, పుత్త్రుల నుత్పాదించి, వారి కర్థంబు విభజించి యిచ్చి, యౌవనంబు పోకకు ముదిమి రాకకు శోకించి వ్యాకులుం డయి నిజాంతర్గతంబున. 79

శా. నానాశాస్త్రము లభ్యసింపను ననంతద్రవ్య మార్జింప సం
తానంబుం బడయంగఁ బుత్త్రులకు నర్థంబు ల్విభాగించి యీఁ
బౌనగపున్యమునన్ సుఖం బనుభవింపంబోయెఁ గాలంబు గౌ
రీనాథున్ భజియింప నేర నయితిన్ శ్రీకాశికావల్లభున్. 80

సీ. కొలువంగ లేనైతి గోపాలకృష్ణుని
  నర్చింప లేనైతి హాస్తివదను
మ్రొక్కంగ లేనైతి మునిజనశ్రేణికి
  సేవింప లేనైతిఁ జిత్రభాను
యజియింప లేనైతి నమరసంఘాతంబు
  బూజింప లేనైతిఁ భూదివిదులఁ
గట్టింప లేనైతిఁ గమలకాసారంబు
  నిలుపంగ లేనైతిఁ దులసివనము

తే. పేరటాండ్రను నర్చింప నేర నైతి
సలిలసత్రంబు సాగింపఁ జాల నైతి
నాజ్యతిలహోమవిధులు మంత్రాన్వితముగ
హుతవహునియందుఁ జేయంగ నోప నైతి. 81

తే. పురుషసూక్తము శ్రీసూక్తమును జపింపఁ
బావమానిఁ బఠింపఁ దత్పరత మీఱ
నర్థి శతరుద్రియంబు పంచాక్షరంబు
ప్రణవమంత్రంబు జపియింపఁ బ్రతిదినంబు. 82

క. ఈహర్మ్యము లీతురగమ్ము
లీహేమము లీభుజిష్య లీధాన్యము లీ
దేహము నాతో వచ్చునె?
యూహింపఁగఁ బుణ్యకర్మ మొక్కటి దక్కన్. 83

సీ. పొడిదగ్గు కంఠంబుఁ బొరివుచ్చకయమున్న
తల ప్రకంపంబుఁ బొందకయమున్న
బొమలు కన్నులమీఁదఁ బొదివి వ్రాలకమున్న
పర నేత్రముల కడ్డు పడకమున్న
శ్రుతిపుటంబుల శక్తి సురిఁగి పోవకమున్న
వళు లాననమునఁ బర్వకయమున్న
హృదయంబులో జాగ్గ పదను దప్పకమున్న
గాత్రంబు శిధిలంబు గాకమున్న

తే. పండ్లు వేర్వాసి కదలుచూపకయమున్న
కాలికడకంటి చూపు పైఁ రాకమున్న
కాలుసేయాడు కాలంబె కదలవలయుఁ
దీర్థసేవకు దేహ మస్థిరము గాన. 84

వ. అని తీర్థయాత్రాపరాయణుం డై యిల్లు వెడలి రెండు మూఁడుపయనంబులకొలఁది తెరువున నొకవటవృక్షంబు క్రింద బరిశ్రమాపనోదార్థంబు విశ్రమించి యంతరంగంబున నిట్లని వితర్కించె. 85

మ. కరికర్ణాంతవిలోల మాయువు శరత్కాదంబినీచంచలా, త
రళంబాత్మ పయస్తరంగచలముల్ తారుణ్యముల్ తీర్థముల్, ప
రిపాటిం జతురంతధాత్రిఁ జరియింపన్వచ్చునే యైనన్, బుర
ముల్ నాలుగుమూఁడుముక్తిజనకంబుల్ మున్నువీక్షించెదన్.

సప్తపురీ ప్రశంస

తే. ఉజ్జయిని కాశి మాయ యయోధ్య కాంచి
మథుర ద్వారక యనెడినామములు గలిగి

పట్టణము లేఁడు గీర్తిసంపద వహించు
మహితకైవల్యలక్ష్మికి మందిరములు. 87

వ. అని నిశ్చయించి. 88

సీ. సాకేతమున కేగి సరయూతరంగిణి
నభిషేక మొనరించె నధికభక్తి
నల్పుఁ దెల్పును నైన నదులకూటము ప్రయా
గాఖ్యంబునందు దేహంబు దోఁచె
గంగలో మణికర్ణికాతీర్థమునయందు
సంకల్పపూర్వంబు గ్రుంకువెట్టి
కైవల్యకల్యాణఘంటాపథం బైన
శ్రీయానందవిపినంబు నాశ్రయించె

తే. తీర్థదైవతకోటిఁ బ్రార్థించి పలికి
యఖిలమును నాచరించి తీర్థాంగకములఁ
దీర్థములయందు శ్రీమహాదేవుఁ గొలిచెఁ
బావనాచారనిరతుండు బ్రాహ్మణుండు. 89

సీ. బ్రహ్మలోకోన్నతప్రాసాదనిశ్శ్రేణి
యాజవంజవభీతి కభయవాణి
కలుషకంఠచ్ఛేదకాలాయసకృపాణి
కైవల్యనవమౌక్తికమున కాణి
[1]వీరావనీస ముద్విష్టకంతర్వాణి
చతురుత్సవగంధసారశోణి
చేతగప్రసాదలక్ష్మీవిహారక్షోణి
కల్పాంతకాలంబు గలపురాణి

1. ఇందిరావణ సమాహితనిజాంతశ్రేణి.

తే. పరమకల్యాణి యాపగాంభస్త్రివేణి
రాజరేఖావతంసముద్యారాపురాణి
సమధికప్రీతిఁ దేలి యాసత్యవాణి
కేవలత్వశుభశ్రేణి గ్రుంకువెట్టె. 90

తే. అఖిలతీర్థంబులును నాడి యవనిసురుఁడుఁ
గోర్కి మెఁ బుణ్యలక్ష్ములఁ గొల్లవెట్టి
నటువిశేషించి గంగాప్రయాగతీర్థ
మధికతాత్పర్యనిష్ఠతో నాడఁ దొడఁగె. 91

సీ. వైకుంఠముననుండి వచ్చి వైకుంఠుండు
దేవీసహాయుఁడై తీర్థమాడు
గోలోకమున నుండి గోమాతృకలు వచ్చి
తీర్థ మాడుదు రతిస్థిరమనీషఁ
గాశికాపురినుండి కాలకంఠుఁడు వచ్చి
దివసంబు దివసంబు తీర్థ మాడు
వరుస దిక్కులనుండి వచ్చి దిక్పాలురు
త్రిదశేశ్వరాదు లాడుదురు తీర్థ

తే. మమరగంధర్వసిద్ధవిద్యాధరర్షి
గరుడకిన్నరయక్షరాక్షసపిశాచ
భూతములు దీర్థమాడు వేఁబ్రోక్షచివరఁ
బూష మకరస్థుఁ డైన యప్పుడు ప్రయాగ. 92

వ. అది ప్రజాపతిక్షేత్రంబు ప్రయాగంబులకంటెను బ్రకృష్టం బగుటం జేసి దానికిఁ బ్రయాగసమాహ్వయం బన్వర్థనామంబై యుండు. మార్తాండుండు మకరరాశిస్థుం డై యుండ మాఘ మాసంబున మఘువమణిశిలాశకలవిసరవిస్ఫురత్కిరణసందోహ

సందేహద్వానదీతూధురంధరంబులగు కాళిందీసింధుకబంధం
బులతో సంబంధించి కర్పూరగంధస్ఫారతారహారనిర్దరా
హారనీహారక్షీరధారాశ్రేణి పాండిమంబై (న) సారసైంధవ
ధవళవాఃప్రవాహంబు ప్రవహింప సితాసితచ్ఛాయాచ్ఛటాపుం
గుళుచ్ఛవ్యతికరంబునం జేసి మోక్షలక్ష్మీకటాక్షవీక్షణంబునుం
బోని యమ్మహాతీర్థరాజంబునం గ్రుంకి బ్రాహ్మణుండు
కృతార్థుం డయ్యె వెండియు. 93

గీ. కాశి కేతెంచు మఱిఁ బ్రయాగమున కేగుఁ
గాశి కేతెంచు మఱిఁ బ్రయాగమున కేగు
మునుఁగు మణికర్ణికాతీర్థమునను మఱియు
మునుఁగు మణికర్ణికాతీర్థమునను మఱియు. 94

శా. కింకుర్వాణపురందరాదికమహాగీర్వాణకోటీకిరీ
టాంకస్థాపితనూత్నరత్నరుచిధారాశ్లేషకిమ్మీరప
త్పంకేజుండుహరుండు జంతువులకుం బ్రాణాంతకాలంబునం
దోంకారాక్షరమంత్రరాజముఁ జెవిన్ యోజించుఁ గాశీస్థలిన్.

గీ. కర్ణికాంతము సేరి యేకతమ శివుఁడు
మునుకు మోక్షచింతామణి జనున కెపుడుఁ
గాన మణికర్ణికాసమాఖ్యత వహించె
నమ్మహాతీర్థ మమరుగంగాంతరమున. 96

క. ఉద్భిజ్జములు జరాయు
ప్రోద్భూతము లండజాతములు స్వేదజముల్
తద్భూమిఁ దలిఁ జచ్చి మ
హోద్భుతముగఁ బుట్టు హాలహాలకంధరులై. 97

గీ. ఎడమప్రక్కయి కాశిలో నీల్గునట్టి
మశకశిశువున కోంకారమంత్రరాజ
మభవుఁ డుపదేశ మొనరింప నమరకోటి
సిగ్గుపడుచుండుఁ దమవృథాజీవములకు. 98

చ. కటకట! కాశికాపురి నొకానొకనాఁడు గన్ను మోడ్చియ
ప్పటఁ గనువిచ్చిచూచికుడిభాగముఁగన్గొనిచోద్యమందుదా
పటిదెసఁజూచి యచ్చెరువుపాటు వహించు మనస్సరోజసం
పుటముననాఁడులాగు మగపోడిమియుంగల జంతుసంతతుల్.

మ. గృహమేధిప్రవరుండు విప్రుఁడమృతక్షేత్రబువారాణసిన్
ద్రుహిణక్షేత్రమువాసిపోవఁదలఁచెన్ దూరంబుగా వెండియు
న్మహిఁగైవల్యపుతీర్థముల్ గలిమి సంభావించి శాస్త్రజ్ఞతన్
బహుధావిప్రతిపత్తిధీవిషయముల్ పాదైనశాస్త్రార్థముల్.

సీ. ఆనందవిపినపుణ్యానుభావాధిక్య
మెఱుఁగఁడా తా నేమి యెల్లయవియు?
దెలియఁడా తా నేమి దేవలోకారోహ
నిశ్శ్రేణి యగుగంగనిత్యమహిమ?
మణికర్ణికాతీర్థమాహాత్మ్యవిభవంబుఁ
జూడఁడా తా నేమి సూక్ష్మదృష్టి?
నరయఁడా తా నేమి యామ్నాయములఁ బురా
ణేతిహాసముల విశ్వేశుగరిమ?

గీ. నకట! పుణ్యప్రమాణాంతరానువృత్తి
నుదక మున్నతభూమియందుండ లేక
పల్లమున కొడ్డగిల్లినపగిది నతఁడు
కదలెఁ దీర్థాంతరమునకుఁ గాశినుండి. 101

వ. కదలి కతిపయప్రయాణంబుల. 102

సీ. ఏవీటిశృంగార మెలదోఁటలోనుండుఁ
గదల కెప్పుడు కాలకంధరుండు
ప్రతిదినంబునను నేపట్టణంబునకు ద్వి
వ్యాభిధానంబు పెంపమర నెగను
జేనెంటఁ జేనెంట శివలింగములు కోటి
సంఖ్య లేపురమునఁ జాల నొప్పుఁ
గల్పాంతవేళ నేకట్టుకంబు మునుఁగదు
నింగితో రాయుమున్నీటివెల్లి
గీ. నట్టిమహిమలయుజ్జని కరుగుదెంచి
కాళి దర్శించె శ్రీమహాకాళుఁ గొలిచె
ముండె శివశర్మ యటరాజయోగపరత
నిఖిలముక్తుల కచ్చోటు నెలవుగాన. 103

ఆ. హాటకేశ్వరుఁడు మహాకాళనాథుఁడు
దారకేశ్వరుండు తలిరుఁబోఁడి!
యుబ్బి లింగము లయియున్నారు పాతాళ
మర్త్యనాకభువనమండలముల. 104

ఉ. కందవు గాజుపోటవు వికారము నొందవు పూతిగంధముం
జెందవు వాడ వప్పురముసీమల నల్లడ వామకర్ణముల్
క్రిందుగ దీర్ఘనిద్రలు ధరించి శయించినజంతుదేహముల్
సుందరి! యిట్టిచోద్యములు చూడము తక్కినతీర్థభూములన్.

క. లీల మహాకాల! మహా
కాల! మహాకాల! యనుచుఁ గడుభక్తిమహా

కాలస్థానాధీశ్వరుఁ
గాలగళుఁ సంస్మరింపఁ గాంతురు ముక్తుల్. 106

గీ. శివు మహాకాళు సేవించి బ్రాహ్మణుండు
గదలెఁ గాంచికి నక్కాంచికాపురమునఁ
గలికి వేడుకకత్తె శ్రీకామకోటి
గవయు నేకామ్రనాథునిఁ గరిమ గిరిశు. 107

ఉ. కాంచికిఁబోయిబ్రాహ్మణుఁడు గాంచెమదావళభూమిభృచ్ఛిరః
కాంచనకంధరానిలయుఁ గైటభమర్దనుఁ గామకోటి ద
ర్శించి భజించె బాలశశిశేఖరు నేకరసాలనాయకు
న్వంచె ననేకపూర్వజననంబులఁ బుట్టినపాతకౌఘముల్. 108

సీ. ముడుసంగ నేర్తురు ముడున దాపటికి రాఁ
జికురబంధము లీఁగ జీరువాఱఁ
బొన్నపువ్వులఁ బోలు పొక్కిళ్లు బయలుగాఁ
గట్టనేర్తురు చీర కటిభరమునఁ
దోడువంగ నేర్తురు నిడువ్రేలుఁజెవులయం
దమరింపకంబుగా నల్లిపువ్వు
పచరింప నేర్తురు పదియాఱువన్నియ
పసిఁడి పాళెములోరపట్టుచెంగు

గీ. పయ్యెదముసుఁగు బాలిండ్లఁ బ్రాఁకనీరు
తఱచు పూయుదు రోల (లి) గంధంబుఁ బసుపు
బందికత్తెలు సురతప్రసంగవేళఁ
గంచికత్తెలుకుసుమాస్త్రఖడ్గలతలు. 109

గీ. కాంతిమందురు గొంద ఆక్కాంచివేరు
కమ్రకురువిందరత్నసత్కాంతిదంతి

నప్పురంబున నేడునాళ్లధివసించి
బ్రాహ్మణుఁడు సర్వదేవతాప్రతతిఁ గొలిచె. 110

వ. అందుండి ప్రభాసక్షేత్రంబుమీఁదుగాఁ జని. 111

క. ద్వారవతీనగరంబునఁ
గోరిక శివశర్మ యుండి కొన్నిదినంబుల్
నారాయణపుణ్యకథా
పారాయణుఁ లైనపరమభాగవతులతోన్. 112

గీ. ధవళలోచన! యొక్కచోద్యంబు వినుము
ద్వారవతియందుఁ జచ్చినవారియొడలి
యస్థిశకలంబులం దంతరాంతరములఁ
దనరు శ్రీపాంచజన్యసుదర్శనములు. 113

ఉ. కాంచనకేతకీకుసుమగర్భదళోదరసోదరప్రభా
భ్యంచితమై పటీరఘుసృణాగురుసౌరభలక్ష్మితో బిసా
ళించుచుఁ గమ్మనై పరిమళించుసముజ్జ్వలగోపిచందనం
బించినవేడ్కతోడ ధరియింతురు భాగవతోత్తముల్పురిన్.

గీ. రమణి! ధరియింతు రూర్ధ్వపుండ్రములు మెఱయ
ఫాలతలమున నప్పీట భాగవతులు
కఠినపాపపరంపరాకంఠనాళ
ఖండనప్రక్రియాక్రూరఖడ్గలతలు. 115

సీ. కమనీయగోపికాగంధసారంబున
నూర్ధ్వపుండ్రములు బాగొప్పఁ దీర్చి
వక్షస్థలంబుల వనజాక్షమాలికా
చారునైపథ్యంబు సంతరించి

దక్షిణశ్రవణరంధ్రములఁ గోమలకృష్ణ
తులసీప్రవాళంబు లలవరించి
నలినలోచనదివ్యనామసంకీర్తనా
భంగికి జిహ్వలఁ బాలువెట్టి!

గీ. ద్వారవతియందు ముక్తికాంతావిహార
మంటపములందు నుంద్రు నిర్మలవివేక
నిరభిసంధికృపాగుణనిర్విరోధ
పరమభాగ్యాన్వితులు మహాభాగవతులు. 116

గీ. ప్రతియుగంబును ద్వారకాపట్టణంబు
ముంచి రత్నంబులెల్లను ముచ్చిలించి
కొంచుఁబోయెడుకతమునఁ గువలయాక్షి!
యబ్ధి కొడఁగూడె రత్నాకరాహ్వయంబు. 117

సీ. కట్టు రింగులువారఁ గటిభాగమునయందుఁ
బసిఁడికమ్ములపచ్చపట్టుచేల
వక్షస్థ్సలంబున వనమాల ధరియించుఁ
గౌస్తుభగ్రైవేయకమునఁ గూర్చి
నేసకొప్పునఁ జుట్టు శిఖిపింఛ్ఛపింఛ్ఛమ్మో
మక్కళించిన జిల్గుమడుగుపాగ
గొజ్జంగిపూనీరు కులికి మేదించిన
కమ్మకస్తురి మేనఁ గలయ నలఁదు.

గీ. ద్వారకాపట్టణముపాలి మేరసీమఁ
గాలవశమున నీల్గిన క్షణమునందుఁ
ఁ కైటభారాతిసారూప్యగరిమఁ గన్న
కీటపక్షిసరీసృపక్రిమికులంబు. 118

ఉ. ఆపృథివీసుపర్వుఁడు ప్రియంబున ద్వారకయందుఁ దీర్థసే
వాపరతంత్రుఁడై యయిదువాసరముల్వసియించి పోయె మా
యాపురి కమ్మహానగర మంబుజపత్రవిశాలనేత్ర! దు
ష్పాపము పూర్వజన్మమునఁ బాపముఁ సేసిన మర్త్యకోటికిన్.

వ. అన్నగరంబును గొందఱు హరిద్వారం బండ్రు కొందఱు మోక్షద్వారం బండ్రు (కొందఱు గంగాద్వారం బండ్రు.) అవ్వలనన్ నిరన్తరాదిక్షేత్రా భాగీరథి భువనపావనిభవజటాజూటోత్తుంగవిశాలకాకుటజకోరకంబు మున్నీటం బెక్కుముఖంబులం గలసె. అట్టిమాయాపురంబునందు. 120

సీ. తీర్థోపవాసంబుఁ దీర్చి జాగర ముండి
    తెల్లవాఱఁగ గంగఁ దీర్థమాడి
పితృతర్పణమ్ముఁ జేసి పిండప్రదానంబు
    యవసక్తుచరువున నాచరించి
యగ్నికార్యముఁదీర్చి హరుని నభ్యర్చించి
    ములుమోదుగాకులఁ బులియఁ గుట్టి
రాగిలో వాణి నన్నాళిలేయ్యు కుండంగ
    వండి డించినయట్టి వంటకంబు

గీ. కుడువఁగూర్చుండి వడ్డించుకొనఁ దలంచు
నంతలోన శివస్వాప మావహిల్లె
మేను గరుదాల్చెఁ జలి బెట్టి మెడలునొచ్చె
వేకి దలచూపె దాహ మావిర్భవించె. 121

వ. అప్పుడు శివశర్మ నిజాంతర్గతంబున. 122

గీ. బ్రతుకుమీఁదియాస పాయంగఁ బెట్టితిఁ
జిచ్చువంటివేకి వచ్చినపుడ

జలధినట్టనడుమ సాంయాత్రికుఁడు కలం
బవిసినపుడు ధనమునాసవోలె. 123

సీ. ప్రతివాసరము గృహారామసస్యక్షేత్ర
పశువీక్షణము సేయఁ బ్రాప్తుఁ డెవ్వఁ?
డిటమీఁద నేభంగి నిందుబింబానన
విధవసంసారంబు వెడలఁబోయుఁ?
దనయు లింకేభంగి ధనవిభాగములకై
పోరితంబులు లేక పొసఁగియుందు?
రఖిలపురాణేతిహాసశాస్త్రాగమ
గ్రంథసంరక్ష యెక్కడిది యింక?

గీ. నకట! మిన్నులువడ్డచో ననద వోలె
దిక్కుమాలినప్రేతనై తిరుగవలసె
శిరసుపై మృత్యువాడెడుశీఘ్రమునను
చావునిక్కంబు బ్రతుకుట సంశయంబు. 124

శా. సంతాపంబునఁ బొంద నేమిటికి నీసంసారయాత్రావ్యథా
చింతాభారము పూని జార్తిదవహానార్చిర్గ్రాహముల్నాలవే
చింతింతు న్మది విశ్వనాయకు శివున్ శ్రీకాశికాధీశ్వరుం
జింతింతున్ సరసీరుహాక్షుని హరిన్ శ్రీద్వారకావల్లభున్.

గీ. ఏల చింతింప నిహామునం దెల్లసుఖము
లనుభవించితి మధురామహాపురమునఁ
బరమునందును ముక్తిసంపదయుఁ గలిగె
నేడుపురములఁ దీర్థంబు లాడఁ గనుట. 126

వ. అని వితర్కించుచుండ. 127

శా. పాటిల్లెం ధరణీసురోత్తమున కప్పాటన్ విదాహజ్వరో
ష్మాటోపంబున నత్యుపద్రవము మైనాపాదమస్తంబుగాఁ
గోటీవృశ్చికకీటపుచ్ఛలతికాకోటీశిఖాకంటక
త్రోటీకుట్టనసంప్రభూతవిషదుర్వారదాహోద్ధతిన్. 128

క. తన్నెఱుఁగ కెవరి నెఱుఁగక
కన్నులు దెఱవంగ నెఱుఁగక వసుంధరపైఁ
గొన్నిదినంబులు బ్రాహ్మణుఁ
డున్నట్లన యుండె గోటి యూరుపుతోడన్. 129

క. ఇటు బహువిధములఁ గడుసం
కటపడి మాయాపురోపకంఠమున మరు
త్తటినీతటనికటమునం
దటుకున శివశర్మ కాలధర్మము నొందెన్. 130

వ. అంత. 131

మ. అసితాంభోధరనీలవర్ణు లురుభద్రాకారు లాజానుదీ
ర్ఘసముత్తుంగభుజాచతుష్టయు లలంకారాన్వితు ల్పుణ్యశీ
లసుశీలాఖ్యులు విష్ణుకింకరులు లీలం బక్షిరాట్కేతనో
ల్లసితం బైన రథంబుఁ దెచ్చిరి ప్రభల్నల్దిక్కులంబర్వఁగన్.

సీ. వెలిదామరలఁ బోలు వెడఁదకన్నులతోడఁ
గౌస్తుభగ్రైవేయకంబుతోడఁ
బసిఁడికమ్ములపచ్చపట్టుఁబుట్టంబుతో
మెఱుఁగారుఁజామన (చాయ) మేనితోడఁ
తళుకొత్తుపసిఁడిగేదంగిరేకులతోఁడ
గస్తూరికాంగరాగంబుతోడ

నటవీమయూరపింఛావతంసంబుతోఁ
జిగురొత్తుమొలకలేనగవుతోడ
తే. నపుడ సాక్షాత్కరించినహరియుఁ బోలె
నెక్కె శివశర్మ గాంభీర్య మెసక మెసఁగఁ
గింకిణీజాలమాలికాలంకృతంబు
గరుడకేతనసహితంబు కనకరథము. 133

వ. ఇట్లు దివ్యవిమానారోహణం బొనర్చి శివశర్మ విష్ణుకింకరులఁ
జూచి యి ట్లనియె. 134

గీ. విష్ణుభక్తులఁ జెప్పంగ విందు నెపుడు
నేఁ బురాణేతిహాససంహితలయందుఁ
బుణ్యశీలసుశీలు రఘపుణ్యపురుషు
లచ్యుతునిసమ్ముఖమున నుం డ్రధికు లనుచు. 135

గీ. వారు కారుకదా మీరు వనజనేత్రు
లంబుధరనీలవర్ణులు కంబుగళులు
భద్రదివ్యాకృతులు చతుర్బాహుదండు
లసితతులసీపలాశమాల్యాభరణులు. 136

వ. అనిన వారు మహాత్మా! నీయట్టిమహానుభావు లెఱుంగనియ
ర్థంబులు గలవె? ఏము నీవు పెద్దలవలనం బురాణేతిహాససం
హితాముఖంబుల విన్న పుణ్యశీలసుశీలుర మగుదుము. అనేక
లోకంబులు గడచికాని వైకుంఠపురంబునకుం బోవరాదు.
అయ్యయిలోకంబులవిశేషంబులు నీకుం జెప్పెదము. సావ
ధానమతివై యవధరింపుము. ఈవును నడుగవలసినయర్థంబు
లడుగు మనిన నట్లకాక యనుచుం జనువాఁడు ముందట.

విష్ణుదూతలు శివశర్మకు సంయమనీస్వరూపంబుఁ దెల్పుట

సీ. కఱకులై వ్రేలినకుఱుచజుంజుఱువెండ్రు
కలును గండ్రైనచాయకాయములును
గలివోసి నాన్చినగ్రచ్చకాయలభంగిఁ
గొఱమాలినట్టిదృగ్గోళకములు
తొట్టివాతెఱలపై దూరంబు సాగిన
గొగ్గిపండులతోడి కుముఖములును
గూనివీఁపులమీఁద గోడిగై బోడెత్తి
తఱివడ్డకంకాళదండములును
గీ. రాసభక్రూరకంఠనిర్హ్రాదకఠిన
ఘుర్ఘురవ్యక్తభాషితోద్గారములును
గలిగి యిదె కొంద ఱున్నారు గగనవీథి
నోరిమోఁ నోడఁగూడుకొని యెవ్వరొక్కొ వీరు? 138

వ. అనిన నద్దివ్యపురుషు లతని కిట్లనిరి. 139

ఆ. ఇది పిశాచలోక మీ ధూమ్రవర్ణులు
విను పిశాచరాజు లనఘ! వీరు
చంద్రశేఖరుని బ్రసంగవశంబునఁ
గొలిచినారు భక్తిఁ గొంచియంబు. 140

వ. అనియిట్లు క్రమంబునఁ బ్రశ్నోత్తరరూపంబునఁ గర్మానురూపంబు లగుఫలంబు లనుభవించుచు [1]నుందారనిన నమరభావంబుల నుత్తరోత్తరాభ్యున్నతంబు లగు నాయాయిలోకంబుల వసియించియున్న పుణ్యపురుషులం గనుంగొనుచు శివశర్మ గుహ్యకలోకంబును గంధర్వలోకంబును విద్యా

1. (తమతమ తరతమ).

ధరలోకంబును నతిక్రమించి యప్సరోలోకంబునకుం బోవు నవసరంబున. 141

చ. ఎదురుగవచ్చి హేమరథ మెక్కి కృతాంతుఁడు సౌమ్యమూర్తి
యై పదురునిజాప్తకింకరులుపార్శ్వయుగంబునభక్తిఁగొల్చిరా
ముదిరనినాదముం జఱచి ముందటిచక్కటిదివ్యదుందుభుల్,
మృదులగభీరనాదములువిన్నులుముట్టఁజెలంగుచుండఁగన్. 142

గీ. ఎదురుగా వచ్చి దక్షిణం బేలురాజు
ధర్మరాజు గరంబు సంతస మెలర్ప
సాధు! సాధు! మహాబుద్ధిబోధమహిత!
మేలుమే! లని శివశర్మ మెచ్చి పొగడె. 143

సీ. అభ్యసించితి వేద మాఱంగములతోడఁ
బరిచర్య చేసితి గురుజనులకు
నాదిపురాణేతిహాసంబులును ధర్మ
శాస్త్రంబు సదివితి సారధిషణ
సమబుద్ధివై మహేశ్వరుఁ బుండరీకాక్షు
సేవించి తేకాంతశీలముననుఁ
గైవల్యకల్యాణ ఘంటాపథము లైన
తీర్థంబు లాడితి తిరిగి యేడు

గీ. ననఘ! నీభాగ్యమునకు నియతియుఁ గలదె?
చూడుమా! యెంతటిదియొ నీసుకృతగరిమ?
భూసురోత్తమ? మాయంత లేసివారి
చే నమస్కారములు గొనఁ జెల్లె నీకు. 144

వ. అని ధర్ముండు శివశర్మ నభినందించి నిజనివాసంబునకుం
బోయెఁ దదనంతరంబ. 145

గీ. విప్రకులముఖ్యుఁ డంతటవినయపరత
నిటుల ననియె హృష్టకేశుపహితులఁ జూచి
యనఘులార! యతిక్రూరుఁ డండ్రు జముఁడు
సౌమ్యుఁ డై యున్నవాఁ డేమిచంద మొకొ ? 146

గీ. యమునిరూపంబు వర్ణింతు రఖిలమునులు
గుండె ఝల్లనునట్లుగా ఘోరలీల
జమునిఁ జూడఁగఁ గన్నులు చల్లనయ్యె
నిప్పు డారౌద్రరసరేఖ లెందుఁ బోయె ? 147

గీ. ఇదియ రూపంబొ ? యీతని కింక నొక్క
రూప మున్నదియో ? మహాక్రోధమునకు
నెఱుఁగ నానతియిండు నా కీ రహస్య
మనఘమతులార ! సందేహ మావహిల్లె. 148

వ. అనిన [1]వారలిట్లనిరి. 149

క. నినుబోటిపుణ్యవంతుల
కనఘా ! శమనుండు సౌమ్య మగు నాకారం
బున నుండు దుర్జనుల కీ
యన రౌద్రాకారుఁడై యుదగ్రత చూపున్. 150

వ. ఈదండధరుండు దంష్ట్రాకరాళవదనుండును, క్రోధరక్తాంత
లోచనుండును, నూర్ధ్వకేశుండును, గృష్ణాంగుడును, ప్రళ
యాంబుదనిస్వనుండును, బరిభ్రమద్భ్రుకుటీకుటిలవిటలతట

1. శివశర్మకు పుణ్యశీల సుశీలు రిట్లనిరి.

విటంకుండును, విశదవికటాకారుండు నై దుర్వృత్తుల నీరీతి శాసించు. 151

సీ. పాదంబు లిరుకేలఁ బట్టి గుంజుండు జ
 ర్జరితంబుగా వీనిఁ జట్టుఱాత
మెడ మెట్టి గోర్గొండి, మెఱికి పుచ్చుఁడు వీని
 గ్రుడ్లు రక్తములు (నెత్తురులు) చెక్కుల స్రవింపఁ
గడికండలుగ వీనికంఠంబు వ్రేయుండు
 గరసానఁ బట్టినఖడ్గధార
బలుత్రాళ్ల బంధించి తలక్రిందుగా వ్రేలఁ
 గట్టుఁడు వీని వృక్షంబుకొమ్మ
గీ. అంపమున వీనికంఠంబుఁ ద్రెంపి విడుఁడు
మడమతాఁపుల వీనిమర్మముల నొంపుఁ
డెట్టిఁగా నగ్నిఁ గ్రాఁచినయినుపయిసుకఁ
గులికి పోయుఁడు వీనిముక్కునను జెవుల. 152

గీ. పరకళత్రంబుకుచకుంభపాళియందు
నఖముఁ దివిచినపాపాత్మునఖమునందు
నెట్టిఁగా నగ్ని గ్రాఁగినయినుపసూదు
లుగ్రదృష్టిని జొన్పుఁ డత్యాగ్రహమున. 153

వ. పరదారముఖాఘ్రాణంబు చేసినపాపిష్ఠువదనంబున నిష్ఠుర నిష్ఠీవనం బొనర్పుఁడు. పరదారభవనగమనం బొనర్చి కర్మచండాలునిపాదంబులు ప్రచండతఖడ్గంబున ఖండంబులుగా ఖండింపుఁడు. పరదారాధరోష్ఠబింబంబు చుంబించునయ్యసంబంధుమూర్ధం బుద్ధతచపేటంబునం దాటింపుఁడు. పరాపవాద పరునివక్షంబు లక్ష్యంబు సేసి తీక్ష్ణముఖనిశితక్షురప్రంబున

నేయుండు. పరసంతాపకారి కటుకవచనుం డగు కుటిల బుద్ధిని నింగలంబుల గ్రాఁగిన మంగలంబునఁ ద్రేల్చుఁడు. పరునియందు మిథ్యాదోషం బారోపించునిర్దయుఁ బ్రవర నవపూయశోణితకర్దమంబున ముంపుఁడు. గురునిందాకర్త యగుధూర్తునోర సంవర్తత ప్తలోహంబు ప్లోయ్యుండు. పరకళ త్రనాశకుం డగు సంక్రుసుకు చెవుల నిశ్శంకకాలాయసశంకువులు గూర్పుఁ డని దండధరుండు ప్రచండకోపాటోపంబునఁ గింక రులం జూచి పలుకు వెండియు. 154

గీ. రౌరవం బనఁగను మహారౌరవ మనఁ
గాలసూత్రంబు గుంభిపాకం బనంగ
నంధతామిస్ర మనఁగ సంహార మనఁగ
నారకంబులు మఱియు నెన్నంగఁ గలవు. 155

వ. ఈనరకంబులయందు దేవస్వభోక్తల బ్రహ్మస్వభుజుల శిశు హంతలఁ గృతఘ్నుల గురుతల్పగుల గోఘ్నస్త్రీఘ్నమి త్రఘ్నులఁ బరక్షేత్రపరాలయాపహర్తలఁ గూటసాక్షుల గర్భఘ్నులఁ బ్రజాపీడాకరుల సురాపులఁ గూటశాల్మలిం బ్రాకించియుఁ బట్టుగార్లం బట్టించియుఁ దలక్రిందుగా(వ్రేలఁ) గట్టించియు నిఱుయంత్రములఁ బీడించియు నంధకూపం బునం ద్రోపించియు నినుపముక్కులకాకులం గఱపించియు యమకింకరులు పెక్కువిధంబుల బాధలు పెట్టుదురు. 156

క. హరినామకీర్తనంబును
హరినామజపంబు నెవ్వఁ డాత్మఁ బఠించుఁ
నరకమహావేదన య
న్నరునకుఁ బ్రాపింప కుండు నయతత్త్వనిధీ! 1.

వ. ఈయర్థంబు నీకుఁ దేటదెల్లంబు గావించెద మాకర్ణింపు మా దివాలంబునం గృతాంతుండు నిజకింకరులతో నిట్లనియె. 153

సీ. గోవింద! భూతేశ! గోప! గంగాధర!
చాణూరమర్దన! చండికేశ!
కంసప్రణాశన! కర్పూరగౌర! గో
పీపతి! శంకర! పీతవసన!
గిరిశ! గోవర్ధనోద్ధరణ! బాలమృగాంక
వర్ణ! మాధవ! భవ! వాసుదేవ!
విషమేక్షణ! మురారి! వృషభధ్వజ! హృషీక
పతి! భూతపతి! శౌరి! ఫాలనేత్ర!

గీ. కృష్ణ! హర! గరుడధ్వజ! కృత్తివసన!
కల్మషారి! గౌరీపతి! కమఠ! శూలి!
యనుచుఁ బఠియింతు రెవ్వ రాఘనులు మీకు
వందనీయులు చెనకంగ వలదు వారి. 150

సీ. హరి! రజనీశకళావతంస! రమేశ్వ
ర! పినాకపాణి! శ్రీరామ! భర్గ!
యనిరుద్ధ! శూలపాణి! నృసింహ! త్రిపథగా
ర్ద్రజటాకలాప! మురహర! యీశ!
రాఘవ! యురగాభరణ! పద్మనాభ! యు
గ్ర! మధుసూదన! పినాకపతి! యాద్య!
ప్రమథాధినాథ! నారాయణ! మృత్యుంజ
య! పురుషోత్తమ! త్రిదశైకనాథ!

గీ. యచ్యుతా! కామశత్రుప! యబ్జపాణి!
దిగ్వసన! చక్రపాణి! భూతేశ! యనుచుఁ

దలఁతు రెవ్వారు వార లుత్తములు భువన
పావనాత్మకు లందఱు ప్రభులు మీకు. 160

సీ. బ్రహ్మణ్యదేవ! శర్వ! ముకుంద! విశ్వేశ్వ
ర! సనాతన! త్రిణేత్ర! రావణారి!
శ్రీకంఠ! ధర్మధురీణ! శంభువ! కమ
లాధీశ! యీశాన! యదుపతి! మృడ!
ధరణీధ[1]ర! హర! యంధకహర! శార్ఙ్గపా
ణి! పురారి! విష్ణువ! నీలకంఠ!
వైకుంఠ! దేవదేవ! మధురిపుఁడ! త్రిలో
చన! కైటభరిపుండ! చంద్రచూడ!

గీ. కేశినాశ! గిరీశ! లక్ష్మీపతి! త్రిపు
రారి! వసుదేవసూనుఁడ! త్ర్యక్ష! యనుచు
జపము సేయుదు రెవ్వ రవ్విపులపుణ్య
ఘనులఁ గదిసినప్పుడ మీకుఁ గల్లవచ్చు. 161

వ. మఱియు వినుండు. శ్రీకాంత! శివ! యసురనిబర్హణ! మన్మథ రిపుఁడ! జనార్దన! ఖండపరశుఁడ! శంఖపాణి! శశిశేఖర! దామోదర! రిపుసూదన! యంబుధరనీల! స్థాణువ! యానందకంద! సర్వేశ్వర! యనునీదివ్యనామంబులు భావించుకృతార్థులు మీకు మాననీయులు సుండి యని యివ్విధంబున నంతకుండు గింకరవర్గంబు ననుశాసించె. ఈహరిహరనామంబులయష్టోత్తరశతంబు విన్నను బఠించిన జనులకు నారోగ్యైశ్వర్యంబులు సంభవించు. 162

---

1 రాయంధకరిపు జనార్దన, చటులఖండ పరశుశార్ఙ్గపాణి, త్రిపురారి విష్ణుదేవేశహారి,త్రిలో.

చ. శమనునిరాజధాని యగుసంయమనీనగరంబునం గరం
దమకురుధర్మసేనదృఢధన్వజయద్రథు లాదిగా నృపో
త్తములు నితాంతనిర్మలినధర్మధురందరు లుండ్రు నిర్వ్యపా
యమున ననర్ఘ్యరత్నమయహారిహిరణ్మయహర్మ్య వీథులన్. 
వ. అని యివ్విధంబున. 164

అప్సరోలోకవృత్తాంతము

తే. శమనలోకాభివర్ణనశ్రవణపరత
నుబుసుపోవంగ శివశర్మ యొయ్యఁ జేరె
నప్సరోలోక మది ప్రసూనాశుగునకు
లోకవిజయైకపట్టాభిషేకభూమి. 165
వ. అప్పుడు శివశర్మ విష్ణుశీలసుశీలుర కిట్లనియె.
తే. ఎవ్వరో కో? వీరు విమలపూర్ణేందుముఖులు
దివ్యభూషామహారత్నదీప్తిజాల
పరిధిచక్రావరణమధ్యభావ్యమాన
భువనమోహనమూర్తు లిప్పురమునందు. 167
వ. అనిన వార లిట్లనిరి. 168
సీ. ఏయిందుబింబాస్య లిక్షుకోదండుని
త్రైలోక్యరాజ్యాధిదైవతంబు
లేయింతులకుఁ బుట్టినిల్లు దుగ్ధాంభోధి
మధుకైటభారాతిమడుఁగుఁబొన్పు
ఏచకోరాక్షుల కింద్రచంద్రజయంత
నలకూబరాదులు ననుపుమిండ
లేపువ్వుఁబోడులయిరియింతచూపుల
ఋషులవంటిమనంబు లిగురువెట్టు

తే. మహితభక్తి నేభామలమనుమరాంద్ర
దక్షిణానందవనమహాస్థానసలికి
భీమనాథేశ్వరునకు సుత్రాముఁ డిచ్చె
ననఘ! వీరు సుమ్మయ్య! యయ్యప్సరసలు. 169

వ. ఊర్వశీ, మేనక, రంభ, ఘృతాచి, చంద్రరేఖ, తిలోత్తమ, వపుష్మతి, కాంతిమతి, లీలావతి, యిల్వాలావతి, యలంబుస, గుణవతి, స్థూలకేశి, (కళావతి), కలానిధి, (గుణనిధి), కర్పూర తిలక, యుర్వర, యనంగతిలక, మదనమోహిని, చకోరాక్షి, చంద్రకళ, మునిమనోహర, చారునాద, సువర్ణిక, దారు సంజీవని, క్రతుశుల్క, శుభానన, తపశ్శుల్క, తీర్థశుల్క, దానశుల్క, హేమావతి, పంచాశ్వమేధిక, రాజసూయా ర్థిని వీరు మొదలుగా నఱువదివేలు దివ్యాప్సర లీలోకం బునం దధివసింతురు.

సీ. బ్రహ్మచర్యం బొక్కరాత్రి దైవికమున
మఱచి తప్పినయట్టిమాస (చ)కమ్మ
కలకాల మెల్లను గామితవ్రతములు
సలిపినట్టిచకోరశాబనయన
బలిమి నొక్కనికి లోఁబడి వాని నవ్వేళఁ
బతిఁ గాఁ దలంచినపద్మగంధి
పురుషుఁడు లేనియప్పుడు ప్రమాదంబున
మోసపోయినయట్టిముద్దరాలు

తే. భోగదానవ్రతంబులఁ బూని యెపుడు
మకరకేతను నర్చించుమాఁటినంద
కన్నెవయసునఁ గన్నెఱికంబుఁ దప్పి

పిదపఁ బతిభక్త యగునాతి త్రిదశవేశ్య. 171

తే. మాంత్రికుం డైన యొకసిద్ధమౌని నొండె
నొక్కవేలుపు నొండెఁ బ్రియుండు వనుప
పుత్త్రసంతానలబ్ధికై పొందినట్టి
లోలలోచన కప్సరోలోక మబ్బు. 172

## సూర్యలోకవర్ణనము

వ. అని చెప్ప నప్సరోలోకంబుఁ గనుంగొనుచు భాస్కర లోకంబు సేరం జని యేకచక్రంబును సప్తసప్తియు ననూరు సారథికంబును నప్సరోమునిగంధర్వామరోగసమన్వితంబును నగు రథంబుమీఁదఁ గరధృతారవిందద్వయుం డయి నభోమార్గంబునం జను కమలబాంధవునిం జూపి విష్ణుకింకరు లి ట్లనిరి. 173

సీ. సిద్ధాంతసంసిద్ధి సిద్ధసంఘంబును
విధ్యుక్తపరిపాటి విబుధకోటి
చాటుధారాప్రౌఢిఁ జారణవ్యూహంబు
కిన్నరవ్రాతంబు గీతసరణి
ఖచరసంఘము విశృంఖలమణి వైచిత్రి
యాతుధానశ్రేణి యధికభక్తి
గరుడలోకము నమస్కారవాక్యంబున
నేకాగ్రమతి దందశూకసమితి

తే. ప్రతిదినంబును బ్రాతరారంభవేళ
నిర్నిబంధననిరుపాధినిరవగాధ
నిర్విరోధనిరాఘాటనిరుపమాన
భక్తి సంభజియింతు రీపద్మబంధు. 174

సీ. సంచారలోలుఁ డౌ జగదుపక్రియకు నై
సమధికస్థైర్యంబు జరుపుఁ గాని
జనులదృష్టికి వెక్కసం బై విభాసిల్లు
లోనఁ జైతన్యంబు నీనుఁ గాని
సంతాపహేతు వౌ సంయమిశ్రేణికి
నిర్వాణలీల యీ నేర్చుఁ గాని
ఖరరుచిత్వముఁ బూనుఁ గాలక్రమంబున
శీతలామృతము వర్షించుఁ గాని

తే. ప్రాగవస్థాభ్యధికతరోపరవ్యవస్థ
నతిశయిల్లుచు భువనంబు లఖిలములును
వార కత్యంతచాతుర్యవైభవమున
ననఘ! రక్షించుచుండు నీయబ్జహితుఁడు. 175

వ. అని రప్పుడు శివశర్మ దా నొనర్చునమస్కారంబు లంగీక రించుచు నిమేషార్ధమాత్రంబున రెండువేలు నిన్నూట రెండుయోజనంబు లతిక్రమించినం జూచి యాశ్చర్యం బంది గోవిందకింకరుల కి ట్లనియె. 176

తే. అనఘులార! ఖరాంశుబింబాంతరమునఁ
బురుషు నొక్కని నుండఁ జెప్పుదురు బుధులు
పరమతాత్పర్యగరిమ నప్పురుషు నెట్లు
సేవసేయుదు రొక్కొ సంసిద్ధపరులు? 177

వ. అనిన వార లి ట్లనిరి. 178

సీ. ఆకాశమధ్యస్థ మగుభానుబింబంబు
వినులక్ష యోజనవి స్తృతంబు

తన్మధ్యమందున ధవళాంశుశేఖరు
నుద్గీతవిద్యాప్రయోగసరణి
హైమరూపుఁడు హిరణ్యశ్మశ్రుకేశుండు
నానాప్రముఖహిరణ్యనయవుఁడు
గాగ భాగించి యాకమలలోచనుఁ డుండు
నతఁడ యే నని సదాధ్యానపరత

తే. విమలమానసుఁ డగుచు భావింపవలయు
బ్రహ్మవిద్వాంసుఁ డగువాఁడు ప్రాహ్ణవేళ
నర్కునర్ధోదయమున గాయత్రిఁ గూర్చి
యర్ఘ్యమెత్తినయాచమనాంతరంబు. 179

వ. కాలలోపంబు సేయవలదు. కాలంబు ప్రతీక్షించునట్టిది. కాలంబునం గదా యోషధులు ఫలించు. కాలంబునం గాక పాదపంబులు పూచునే? కాలంబుననే మేఘంబులు వర్షించు. మందేహదేహనాశార్థం బుదయాస్తమయంబుల బ్రాహ్మణోత్సృష్టంబగు గాయత్రీమంత్రతోయాంజలిత్రయంబు చిత్రభానుం డపేక్షించుచుండు. కాలంబు దప్పకుండ సదుపాస్యమానుం డయి భానుం డాయురారోగ్యైశ్వర్యంబులు ప్రసాదించు. 180

సీ. మేలైనరెండుతొమ్మిదులు విద్యలలోన
మననీయ మగుచు మీమాంస వెలయు
మీమాంసకంటెను మిగులు ప్రాభవమునఁ
దర్కశాస్త్రము శుభోదర్కగరిమ
తర్కశాస్త్రముకంటెఁ దా సముభ్యధికంబు
వివరించి చూడంగ వేదరాశి

యామ్నాయములకంటె నభ్యర్హితంబులు
చర్చింప నుపనిషత్సముదయములు

తే. నుపనిషత్తులకంటెను నూర్ధ్వపదవి
మంత్రరాజంబు గాయత్రి మహిమఁ గాంచుఁ
బ్రణవ మనుక్రేపుతోఁ గూడి పాడిఁ బిదుకు
నవనిసురులకు గాయత్రి యనెడిసురభి. 181

తే. మంత్రములలోన గాయత్రిమహిమఁ గాంచు
నగరములలోనఁ గాశి యున్నతి వహించు
దైవతంబులలో సుధాధామమౌళి
విశ్వనాథుండు ప్రాధాన్యవిభవ మొందు. 182

స్రగ్ధర. గాతారం త్రాయతే నాఁగలిగిన తెలివిఁ
గల్గె గాయత్రి కర్థా
న్వీతం బై నామధేయం బితరమనువులం
దీప్రభావంబు లే దీ
ప్రాతస్సంధ్యాహ్నసాయోపగమములఁ బర
బ్రహ్మవిద్వాంసు లార్యుల్
జ్యోతిర్మూర్తిఁ భజింతు రసురగణవినుతుఁ
సూర్యునిఁ సిద్ధవిద్యన్. 183

క. గాయత్రి పరబ్రహ్మము
గాయత్రి కధీశ్వరుండు కమలాప్తుఁడు శ్రీ
గాయత్రీమంత్రమునకు
నేయవియును సాటి వచ్చునే మంత్రమ్ముల్? 184

వ. ఈవేదమూర్తి హంసుండు, భానుండు, సహస్రాంశుండు, తప
నుండు, తాపనుండు, రవి, వికర్తనుండు, వివస్వంతుండు,

విశ్వకర్మ, విభావసుండు. విశ్వరూపుండు, విశ్వకర్త, మార్తాండు(ండు, మిహిరుం), డంశుమాలి, యాదిత్యుం, డుష్ణగుండు, సూర్యుం, డర్యముండు, బధ్యుండు, దివాకరుండు, ద్వాదశాత్ముండు, సప్తహయుండు, భాస్కరుం, డహస్కరుండు, ఖగుండు, సూరుండు. ప్రభాకరుండు, శ్రీమంతుండు, లోకచక్షువు, గ్రహేశ్వరుండు, త్రిలోకేశ్వరుండు, లోకసాక్షి, తమోరి, శాశ్వతుండు, శుచి, గభస్తిహస్తుండు, తీవ్రాంశుండు, తరణి, మహారణి, ద్యుమణి, హరిదశ్వుం, డర్కుండు, భానుమంతుండు, భయార్దకుండు, ఛందోశ్వుండు, వేదవేద్యుండు, భాస్వంతుండు, పూష, వృషాకపి, యేకచక్రరథుండుఁ మిత్త్రుండు, మందేహారి తమిస్రహుండు, దైత్యహుండు, పాపహర్త, ధర్ముఁడు, ధర్మాధర్మార్థహేళి, చిత్రభానుండు, (కళిందుండు) తార్క్ష్యవాహనుండు, దిక్పతి, పద్మినీనాయకుండు, కుశేశయకరుండు, హరి, ఘర్మరశ్మి, దుర్నిరీక్షుండు, అరుణుండు, కశ్యపాత్మజుం డను నీడెబ్బదినామంబులుఁ గలిగియుండు. 185

సీ. మోకాళ్లు భూమిపై మోపి హస్తాంబుజ
ద్వయమునఁ దామ్రపాత్రము ధరించి
యర్ఘ్యోదకంబులయందు దూర్వాంకురా
క్షతలును నవరక్తచందనంబు
కరవీరముఖ్యరక్తప్రసూనంబులు
వైచియొక్కొక్క పేర్వరుసతో న
మోంతంబుగాఁ జతుర్థ్యంతంబుగాఁ బ్రణ
వాదిగాఁ బఠియించు చర్ఘ్యపాత్ర

తే. మౌళిపర్యంత మెత్తుచు మాటిమాటి
కర్ఘ్య మిచ్చినఁ బ్రీతుఁ డై యర్కుఁ డొసఁగు
సేవకుల కాయురారోగ్యధీవివేక
భాగ్యసౌభాగ్యవైభవప్రాభవములు. 186

సీ. అది గుహ్య మై యకారాదిక్షకారాంత
పంచాశదక్షరప్రకృతి యైన
మాతృక యై మహామంత్రరాజంబు నై
దవయవంబులఁ బుట్టె నం దకార
మునకును నోంకారమునకు మకారంబు
నకు బిందువునకును నాదమునకుఁ
బ్రత్యేకమ పదేసిపదియేసివర్ణంబు
లనఘ! జన్యంబు లై యతిశయిల్లు

తే. నట్టిప్రణవంబు హేమసింహాసనమున
భాస్కరుం డనుమాణిక్యపదకభూష
యలుత ధరియించి దేవి గాయత్రి యొప్పఁ
గడుపుచల్లంగ వేదాళిఁ గన్నతల్లి. 187

క. సంశితవిజ్ఞానచతు
ర్వింశతితత్త్వంబులకును వేడుకతో నీ
యంశుమదధిపతిమంత్ర మ
సంశయముగ నెపుడు మన కొసఁగు నభిమతముల్. 188

సీ. మూఁడువేదంబులు మూఁడుపాదంబులు
నాభి యాదిమపురాణవ్రజంబు
క్రిందు మీఁదును జతుర్దిశలు నాల్గతులు
భువనంబు దేహంబు దివి యుదరము

ధర్మశాస్త్రంబు హృత్సరసీజముకుళంబు
ఛందోవితతి కుచ స్తబకయుగము
సాంఖ్యశాస్త్రంబులు శ్రవణపాశంబులు
జాతవేదుఁడు వక్త్రచంద్రబింబ
తే. మైదఁ తలలును శిక్షాదులంగకములు
చేష్ట యాథర్వణశ్రుతి శిఖ శివుండు
బ్రహ్మ మూర్ధంబు హరి యాత్మ భావలక్ష
ణములు మీమాంస సావిత్రి కమలచరిత! 189

క. వ్యాహృతులతోడఁ బ్రణవో
ద్గ్రాహముతో శిరముతోడఁ గమలాప్తమనగ
ప్రాహుణికం బై యీమను
వాహుతిఁ గొనుఁ బాతకముల నగ్నియుఁ బోలెన్. 190

మ. క్షితిదేవోత్తమ! బ్రాహ్మణుండు వెలిగా జిహ్మాభిచారక్రియా
క్రతుతంత్రంబునశాత్రవుఁ గుఱిచి యీగాయత్రి వర్ణావళిన్
బ్రతిలోమంబున నుచ్చరించివిడువన్ బ్రహ్మాస్త్రమైతాఁకియా
ప్రతిపక్షుం దెగటార్చునంగుళిశిఖాప్రస్ఫోటమాత్రంబునన్.

సీ. గాయత్రి విష్ణుండు గాయత్రి శంభుండు
గాయత్రి పరమేష్ఠి కర్మనిష్ఠ
గాయత్రి విధివిష్ణుకమలసంభవమూర్తి
యైనమార్తాండుండు మౌనివర్య!
గాయత్రి జపియించి గాయత్రిఁ గొనియాడి
కాంచు విప్రుఁడు ముక్తి కలితపుణ్య!
గాయత్రి సేవించుకాలంబు గాలంబు
మంత్రతంత్రములు నిర్మలవివేక!

తే. యనఘ! సావిత్రి యనఁగ గాయత్రి యనఁగ
విశ్వజనయిత్రి యనఁ జతుర్వేదమాత
యనఁ బరాపరబ్రహ్మాద్వయం బనంగ
నమ్మహాదేవికి సమాహ్వయాంతరములు. 192

వ. అని పుణ్యశీలసుశీలురు సూర్యలోకమాహాత్మ్యం బభివర్ణింప నాకర్ణించుచు శివశర్మ ముందట నయనానందసందోహాసంధాయి యగు నొక్కపట్టణంబుఁ గనుంగొని యవ్విష్ణుకింకరుల కిట్లనియె. 193

తే. పుండరీకాక్షులార! యీపురవరంబు
నెఱియ నుత్సవ మొనరించె నేత్రమునకు
నెఱుఁగఁ జెప్పుఁడు నా కది యేభువనము
శోభితం బైనకారుణ్యవైభవమున? 194

స్వర్గలోకవర్ణనము

తే. అనిన వా రిది నముచిమర్దనునివీడు
కనకగోపురకనకాట్టకనకసౌధ
కనకకుట్టిమవేదికాకనకభిత్తి
కనకరాజీవసరసీప్రకాశితంబు. 195

సీ. చికిలించుకొనియుండు జిలుఁగుతెప్పలలోనఁ
గుసుమసాయకవైరినొసలికన్ను
పద్మనాభునికౌస్తుభముకాంతి వెలిపోయెఁ
బద్మచన్నులమీఁదిపసుపు దాఁకి
ధళధళుక్కన నింగిఁ దాటించి చనుఁ గాని
నిలువనేరదు ప్రోదినీప్రకాశ

మ_స్తినా_స్తిప్ర కాశానుసారంబున
మినుమిన్కు_మను చుండు ననలుదీ_ప్తి
తే. పగలు పగ లయ్యె శశివిభా ప్రసరమునకు
దాన పో దిక్కు_ దీ_ప్తిసంతానమునకు
ననఁగ గనఁగనఁ గనకవర్ణాభుఁ డైన
భానుఁ డేతత్పురీసమీపమున నడచు. 196

చ. అమవసలందు నా సరసిజాప్తునిగర్భము దూఱఁ బోవునా
సమయమునన్ స్వకీయమగుచంద్రిక నిల్లడవెట్టెనో సుమీ
యమృతమయూఖుఁడీనెలవునందను సంశయమావహించె ను
త్తమకుల! చూడు మిప్పురిసు ధాధవళోన్నతసౌధవీథికల్.

శా. ప్రానఃపున్యముసంఘటింపఁదొడఁగెన్ బ్రహ్మాద్వయోత్తంస!
గో, క్షీనాగ్రంబున లేఁగ పెయ్య యిది కంటే కామధేనూద్భ
వం, బానందంబున డెందముబ్బఁగజనన్యాపీనవాపీసుధా,పా
నోత్పుచ్ఛమనూనవాచటులఝంపాతాండవాటోపమున్.

శా. కంటే స్వగకరికంఠపీఠవిలుఠద్గ్రైవేయలోహార్గళా
ఘంటాటాంకృతి నాదసౌధవలభీగర్భంబులందారొ్కనం
ఘంటావీథి: జరించుచున్నది పురాగారంబు వీక్షించి వె
న్వెంటన్ దివ్యకరేణు వభ్ర ముపధావింపంగ దర్పోద్ధతిన్.

క. నందనవన మిదె ధరణీ
బృందారక! యల్ల పెద్ద పృథివీరుహముల్
మందారకల్పతరుహరి
చందనసంతానపారిజాతాహ్వయముల్. 200

మ. దివిజాధీశసుధర్మ యన్ సభ సముద్వీక్షింప భూదేవ! రెం
డవకైలాసమువోలె నున్నయది బ్రహ్మాండంబుతో రాయు

చుక్, ధవళాభీలసుధాట్టహాసవిమలద్రాఘిష్ఠశృంగాగ్రమై
యవదాతధ్వజశాటికాంచలచపేటాధూతజీమూతమై. 201

సీ. చెలువు లేటికి రేలు శిశిరాంశుకరముల
కరఁగుచంద్రోపలగిరులు గలుగఁ?
గల్పవృక్షంబులు గలుగంగ నేటికి
వలువలకై తంతువాయసమితి?
గణకు లేమిటికి సంకల్పార్థచింతకుఁ
జింతామణీశిలాశ్రేణి గలుగఁ?
గామధేనువులు గల్గఁగ నేమిటికి మఱి
యోదనంబునకు నై యోదనికులు?

తే. నాఁగ సర్వపదార్థజన్మస్థలంబు
భూరికల్యాణవై భవకారణంబు
విశ్వభువనైకవినుతంబు విబుధరాజ
పట్టణం బిది పంకజప్రభవవంశ్య! 202

శా. క్షీరాంభోనిధి సంభవించినఘృతాచీ మేనకామంజుఘో
షారంభాహారిణీతిలోత్తమలు విశ్వాచీచకోరాక్షులుక్
స్వారాజప్రియవారభామినులు నానాభూషణాలంకృతల్
గారా మూరఁగఁ జూతురున్మనలనీకంజాక్షులంజూడుమీ!

వ. ఈయింద్రలోకంబునందుఁ దరురత్నంబు పారిజాతంబు, గాం
తారత్నం బూర్వశి, వనరత్నంబు నందనంబు, తురగరత్నం
బుచ్చైశ్శ్రవంబు, గజరత్నం బైరావతంబు, రత్నరత్నంబు
చింతామణి, సప్తార్చిః ప్రభృతు లగుసప్తలోకపాలురు, నార
దాదిమునులు, దనుజమనుజదైత్యులు, గంధర్వయక్షకిన్నర
కింపురుషులు, నగరనలనహుషమాంధాతృదుందుమారాదివ

సుంధరాధిపతులు, జ్యోతిష్టోమాదియాగంబులు చేసినసోమ
యాజులుం, దులాపూరుషాదిమహాదానంబులొనర్చినదాతలు,
సంగ్రామంబులనపరాఙ్ముఖులై యక్లీబవాదులై యీల్గినవీరులు
వసియింతు రని యనంతరంబ యగ్నిలోకంబున నర్చిష్మతీపు
రంబు చేరం గొనిపోయి శివశర్మకుం బుణ్యశీలసుశీలు రిట్లనిరి.

సీ. అమరావతీపురం బమరవల్లభుఁ డేలు
నర్చిష్మతీపురం బగ్ని యేలు
శ్రాద్ధదేవుం డేలు సంయమనీపురం
బసురనాయకుఁడు పుణ్యావతి నేలు
నమలవతీపురం బంబునాయకుఁ డేలు
వాయు వేలును గంధవతిపురంబు
నలకాపురంబు యక్షాధీశ్వరుం డేలు
నైశాని యేలు జన్మార్ధమాళి
తే. యనిరి దిక్పాలపురములం దవనిసురుఁడు
రెండవపురంబు నీక్షించి ప్రీతి నుండె
నపుడు వర్ణింపఁ దొడఁగి రయ్యగ్నిలోక
మహిమసంపద గోవిందమాన్యహితులు. 205

సీ. శిఖ కర్మఠులకు నిశ్శ్రేయసశ్రీప్రదాత
ధరణీసురులకుఁ దీర్ఘంబు వహ్ని
యాశుశుక్షణి గురుం డవనినిర్జరులకు
నగ్రవర్ణుల కగ్ని యాశ్రమంబు
దహనుఁ డేడ్గడయు నుత్తమవర్ణభవులకుఁ
బావకుం డీశుండు బ్రాహ్మణులకుఁ
బ్రత్యయంబు తనూనపాత్తు బాడబులకుఁ

బాణుల కనలుండు పారిజాత
తే. మాశ్రయాశుండు ప్రాణుల కంతరాత్మ
చంద్రశేఖరమూర్తి యుపర్బుధుండు
సకలజగదుద్భవస్థితిసంహృతులకుఁ
గేవలము హేతుభూతుండు కృష్ణవర్త్మ. 206

మ. వివిధాజ్యాహుతిధూపదీపములునై వేద్యంబు నీయగ్ని ముఖ
జవి గోఁ బిమ్మట భుక్తిముక్తుల నవశ్యప్రీతి గా నెప్పుడుఖ
జవి గొం డ్రంబుజసంభవాచ్యుతమహేశానాదిబృందారక
ప్రవరు ల్సర్వహృషీకతర్పణముగా బ్రహ్మార్థపారంగతా! 207

వ. అనిన విని శివశర్మ వైశ్వానరుం డనంగ నెవ్వం? డెవ్వానితనూజుం? డేప్రకారంబున నాగ్నేయం బైనతేజం బతనికి సంభవించె? మహాత్ములారా! యెఱింగింపుం డనిన వారు వైశ్వానరమాహాత్మ్యంబు వివరింపఁ దొడఁగి యి ట్లనిరి. 208

## వైశ్వానరమాహాత్మ్యము

సీ. విశ్వానరుండు నానీశ్వరభక్తుండు
శాండిల్యగోత్రసంజాతుఁ డనఘుఁ
డభినుతబ్రహ్మచర్యాశ్రమనిష్ఠుఁ డై
బ్రహ్మాయజ్ఞములు తప్పక యొనర్చు
నిరతుఁ డై విజ్ఞాతనిఖిలశాస్త్రార్థుఁ డై
లోకతత్త్వజ్ఞుఁ డై యేకతమున
నొకనాఁడు చింతించు చుండె నేయాశ్రమం
బొక్కొ నాల్గింటిలో నుత్తమంబు!
తే. భక్తి నేయాశ్రమంబు చేపట్టినప్పు
డైహికాముష్మికఫలంబు లందవచ్చు?

నిదియ మే లన్నియ ట్లుండు నిపెయ లెస్స
యన్నియ ట్లుండు నొక్కొక్క యాశ్రమంబు. 209

వ. అది యెట్లనిన వర్ణాశ్రమాచారంబు శివప్రసాదద్వారంబున జ్ఞానసాధనంబు అందు వర్ణధర్మంబులు బ్రాహ్మణుండు బృహస్పతిసవనంబునను, రాజు రాజసూయంబునను, వైశ్యుండు వైశ్యస్తో (ష్టో) మంబునను యజియింతురనునివియాదిగాఁగల యవి. మఱి యాశ్రమధర్మంబుః లధ్యయనాదులు బ్రహ్మచారి ధర్మంబులు, గృహస్థధర్మంబు లగ్న్యాధానాదులు, వానప్రస్థ ధర్మంబు లరణ్యావాసాదులు, యతిధర్మంబులు శ్రద్ధాదులు, బ్రహ్మచారిగృహస్థవానప్రస్థభిక్షు(కు)లయాశ్రమంబులు త్తరోత్తరంబు లుత్కృష్టంబు, లీచతురాశ్రమంబులవారును నిజ కర్మానుష్ఠానంబులు వప్పక యీశ్వరపూజాతత్పరులై సంసిద్ధి వడయుదురు. నాకుం జూడ నన్నియాశ్రమంబులకు నాధార భూతం బై (వ)గృహస్థధర్మంబు ముక్తిసాధనం బై తోఁచుచున్నయది. సర్వాశ్రమంబులకుస్వరూపలాభంబుగృహస్థాశ్రమ నిబంధనంబ. కొందఱు 'వర్ణాశ్రమాచారనిష్ఠునకు బ్రహ్మనిష్ఠ సిద్ధింపదు. బ్రహ్మనిష్ఠ యన సర్వవ్యాపారపరిత్యాగంబున ననన్యచిత్తంబునం జేసి బ్రహ్మంబు నెఱుంగుట, యది కర్మానుష్ఠానకర్మత్యాగంబులకు స్వరూపంబుఁ బరస్పరవిరోధంబుఁ గావునఁ గర్మకారునియందు సంభవింప' దండ్రు. వర్ణాశ్రమకర్మానుష్ఠానవంతునకు యథావశంబున బ్రహ్మనిష్ఠా తాత్పర్యంబు సుకరంబు గావునఁ గర్మపరుండు బ్రహ్మంబు నెఱుంగండను నిషేధోక్తి(కి)ంబనిలేదు. పరదారపరిత్యాగంబుననునాత్మదారపరితోషంబునను ఋతుకాలాభిగమనంబునను

బ్రహ్మచారియుఁ రాగద్వేషకామక్రోధవర్జనంబున వానప్రస్థుం డును' నయాచితోపస్థితదేహయాత్రామాత్రంబున భిక్షుకుండును నై గృహస్థుం డఖిలాశ్రమంబులు తాన కైకొను. దేవయజ్ఞంబు, పితృయజ్ఞంబు, భూతయజ్ఞంబు, మనుష్య యజ్ఞంబు, బ్రహ్మయజ్ఞం బనుపంచమహాయజ్ఞంబులం జేసి విధివిధిపామఖంబున గృహస్థుండు ముక్తుం డగు. కావున గార్హస్థ్యం బగుధర్మంబునం గైవల్యంబు వడసెద. 210

మ. అని యత్యుత్తమవంశసంభవ వివాహం బయ్యెశాస్త్రోక్తవి
ధ్యనురూపంబునభాగ్యలక్ష్మిగ(వ)తికల్యాణికి గుణాన్వితశో
భనపుణ్యాకృతి విప్రకన్యక మహాభాగుండు విశ్వానరుం
డనురూపస్థిరపుణ్యలగ్నమున వంశానందసంధాయియై. 211

ఉ. చేడియనామధేయము శుచిష్మతి యాచిగురాకుఁబోఁడికిం
బ్రీడయుఁ గేశభారమును వృత్తపయోధరము ల్నితంబముం
బాడబునెమ్మనంబు రతిభావముతోడన నాఁడు నాఁటికిం [న్.
వీడఁగఁ జొచ్చె బాల్యమును వీడఁదొడంగెదదీయచింతతో

సీ. అనుదినంబును బ్రాతరారంభవేళల
నోలగందంబుతో నుదకమాడి
యంచువన్నియతోడ నంద మైనమడుంగు
నిద్దంపుఁ బుట్టంబు నెఱికి గట్టి
నెఱియంగఁ గూడనినెఱికూఁకటులు పాఁచి
పొంకంబుగాఁ గమ్మపూలు దుఱిమి
కాశ్మీరతిలకరేఖామధ్యమునయందుఁ
బుణ్యంపుఁజిఱుబొట్టు పొందుపఱచి

తే. విసువు లే కగ్నిహోత్రంబు వేల్వఁ బెట్టు
దీపధూపంబు లొడఁగూర్చు దేవపూజ
కోగిరంబులు గావించు నొప్పుగాఁగ
బాల ప్రాణేశుహృదయంబు పల్లవింప. 213

వ. అనంతరంబ యౌవనారంభమున నారంభోరువు వినయవతియు, వివేకవతియు,విలాసవతియు, విభ్రమవతియు, శాంతిమతియు, సౌజన్యవతియు, సౌహార్దవతియు నై శుశ్రూషా తాత్పర్యంబునం బతిడెందంబున కానందంబు సంపాదించుచుండం బెద్దకాలం బరిగిన. 214

తే. కానరా దయ్యెఁ బుత్రసంతానలబ్ధి
యెన్ని నోములు నోఁచిన నిందుముఖికి
నంత నొకనాఁడు తరుణి యేకాంతవేళ
విభునిపాదంబులకు మ్రొక్కి విన్నవించె. 215

ఉ. కట్టితిఁ బట్టుఁబుట్టములు కాంచనభూషణముల్ ధరించితిం
బెట్టితి బంధుకోటికి నభీప్సితవస్తుచయంబు గీర్తి చే
పట్టితి మీపదాబ్జములు పాయక నిచ్చలు సేవసేయఁ గాఁ
బట్టి వసుంధరం గలరె భామలు నాసరి భాగ్యసంపదన్? 216

క. సకలైశ్వర్యసమృద్ధులు
నొకతల సంతానలాభ మొకతల యిది యే
టికిఁ దడసె? నిందురేఖా
మకుటునికృప యేల లేదు మన కిప్పాటన్? 217

క. చింతించి చూడవచ్చిన
సంతానము వంశమునకు సకలంబునకుఁ

సంతానము సురధేనువు
చింతామణి సిద్ధరసము! చిరతరపుణ్యా! 218

వ. సంతానంబు గలుగునట్టియుపాయంబు చింతింపు మని ప్రార్థించిన. 219

ఉ. ఇంతవిచార మేమిఁటికి నిందునిభానన! నెమ్మనంబులో
సంతతిలబ్ధికై విడువు శంక శశాంకకళాకిరీటుఁ గా
లాంతకుఁ గాశికానగరవాటకనిర్మలహర్మ్యమాలికా
భ్యంతరవర్తి విశ్వపతి నాశ్రితవత్సలు నాశ్రయించెదన్. 120

వ. అనిన విని శుచిష్మతి దేవి యర్థిప్రహృష్టభావుం డగుభర్తకు వెండియుం బ్రణమిల్లి పాణిపల్లవంబులు మొగిడ్చి వినయవినమితోత్తమాంగ యై యార్య (పుత్రా!) పుత్రసంతానలాభంబు నాయందుం బడయ నభిమతంబ యేని నేనుం బ్రసాదభాజనంబ నగుదు నేని నిందుశేఖరసదృశుం డైన నందనుం బ్రసాదింపు మనుటయు. 221

తే. ధర్మగేహినిపైఁ గలకూర్మి పేర్మి
శంసితవ్రతుఁ డైనవిశ్వానరుండు
వనరుహాయతనేత్ర కోరినవరంబు
మునికులశ్రేష్ఠుఁ డిచ్చితి ననుచుఁ బలికె. 222

సీ. ఇంతి మనోరథం బెట్లు నీయఁగ వచ్చు?
నేయింతి పతి వేఁడె నిట్టివరము?
వరము వేఁడిన వేఁడవచ్చుఁ గా కిబ్భంగి
నీ నేరవచ్చునే యీప్సితార్థ?
మాగమంబులు సమానాధికరహితుఁ గా
శీతాంశుశేఖరుఁ జెప్పుచుండు

నారుద్రు లీలావతార మీచపలాక్షిఁ
దనకుఁ గారణముఁ గాఁ దలచె నొక్కొ.

తే. కానినాఁ డిట్టితలఁ పెట్లు గలుగనేర్చుఁ
దరుణి? కంచు వితర్కించి తరతరంబ
యొకముహూర్తంబుతడవు నైష్ఠికతఁ బూని
శంభుభక్తిపరుండు విశ్వానరుండు. 223

వ. అనంతరంబ యమ్మునీశ్వరుండు తపగప్రభావంబున భవుని ఫాలలోచను భర్గు భాగీరథీతీరభవను భక్తనిధి భక్తిభావను భావనాసులభస్వభావు భజింతుం గాక యని భవభయోదన్వదుత్తారయానపాత్రం బైన కాశీక్షేత్రంబునకుం జని. 224

సీ. మందాకినీవారి మణికర్ణికాంబువు
వాపికాకూపపల్వలజలంబు
కుండికాసలిలంబు కుల్యాప్రపూరంబు
సెలయేటిపాథస్సు చెలమనీరు
ధారాకృపీటంబు తమ్మిబావిపయస్సు
కాసారనీరంబు గ్రయ్యతోయ
మూటకాండము బుగ్గయుదకంబు జలపుష్క
రము నదప్రాదశంబరంబు లివియుఁ

తే. మొదలుగా సర్వసర్వతోముఖము కాశి
తీర్థరాజంబులుగ సమర్థించు శ్రుతులు
గాన యిన్నింటియందు విశ్వానరుండు
దేవసంకాశుఁ డతిభక్తిఁ దీర్థ మాడె. 225

తే. అవని దివిజుండు మణికర్ణికాదిపుణ్య
తీర్థములయందు దేహంబుఁ దేల్చి తేల్చి

శాంతిఁ బొందించెఁ బ్రాగ్జన్మశతసహస్ర
పరిచితం బైనబహులతాపత్రయంబు. 226

సీ. భద్రేభముఖులకు భద్రకాళికలకుఁ
గాలభైరవులకు గణపతులకు
నాదికేశవముఖ్యు లైనకేశవులకు
లోలార్కముఖు లైన హేళులకును
బ్రణమిల్లి సురనదీమణికర్ణికాదితీ
ర్థములఁ బిండప్రదానములు చేసి
పాయసాపూపాదిబహువిధాన్నంబుల
జగతీమరుత్సహస్రంబుఁ దనిపి

తే. కానవచ్చినయబ్బులింగంబులకును
కానరానినిగూఢలింగంబులకును
బుణ్యవాసరముల మహాపూజ చేసి
యాతఁ డిట్లు వితర్కించె నాత్మలోన. 227

వ. ఓంకారేశ్వరుండు, కృత్తివాసేశ్వరుండు, కాళేశ్వరుండు, వృద్ధకాళేశ్వరుండు, గళేశ్వరుండు, కేదారేశ్వరుండు, కామేశ్వరుండు, చంద్రేశ్వరుండు, త్రిలోచనేశ్వరుండు, జ్యేష్ఠేశ్వరుండు, జంబుకేశ్వరుండు, జైగిషవ్యేశ్వరుండు, దశాశ్వమేధేశ్వరుండు, ద్రుమిచండేశ్వరుండు, (దృక్కేశ్వరుండు,) గరుడేశ్వరుండు, గోకర్ణేశ్వరుండు, గణేశ్వరుండు, డిండీరేశ్వరుండు, గజసిద్ధేశ్వరుండు, ధర్మేశ్వరుండు, తారకేశ్వరుండు, చండికేశ్వరుండు, మోక్షేశ్వరుండు, గంగేశ్వరుం, దత్రీశ్వరుండు, వ్రీహికేశ్వరుండు, (త్రిపురేశ్వరుండు, మార్కండేయేశ్వరుండు,) మణికర్ణికేశ్వరుండు, యమునేశ్వ

రుండు, లాంగలీశ్వరుండు, శ్రీవిశ్వేశ్వరుండు, అవిముక్తేశ్వ
రుండు, విశాలాక్షీశ్వరుండు, వ్యాఘ్రేశ్వరుండు, వారాహే
శ్వరుండు, వ్యాసేశ్వరుండు వృషభధ్వజేశ్వరుండు, వరుణే
శ్వరుండు, విధీశ్వరుండు, వరిష్ఠేశ్వరుండు సోమేశ్వరుం,
డింద్రేశ్వరుండు, సంగమేశ్వరుండు, హరిశ్చంద్రేశ్వరుండు,
(త్రిసంధ్యేశ్వరుండు,) భవానీశంకరుండు, కపర్దీశ్వరుండు,
కందుకేశ్వరుండు, (మఖేశ్వరుండు, మిత్రావరుణేశ్వరుండు)
ననసిద్ధామృతజ్యోతిర్లింగాదు లగుమహేశ్వరులు శతసహస్ర
సంఖ్యలం గలరు. ఈమహేశ్వరులసిద్ధస్థానంబుల యందేను
దివ్యస్థానంబునం దపం బాచరించి శీఘ్రసంతానలాభంబు
నొందుదు. 228

తే. అహహా! తెలిసితి విస్మయం బైనయర్థ
మేల సందేహ మందంగ హృదయవీథి?
సిద్ధసంసేవితము సర్వసిద్ధికరము
దర్శనస్పర్శనములఁ దీర్థములరాజు. 229

సీ. ఉద్ఘాటితంబు లైయుండు రేలుఁబగళ్లు
గవనితల్పులు నాకకటకమునకు
సర్వజంతువులకు సంసిద్ధిసంపద
గరతలామలక మై కానవచ్చు
వికటామహాదేవి విశ్వనాథునిభామ
పర్వతాధిపుపుత్రి పాయ కెపుడు
సిద్ధివినాయకక్షేత్రపాలకు లుంద్రు
పరిరక్షణైకతత్పరతఁ బూని

తే. భూమి తిలమాత్రమును నుడివోవ కుండ

నమృతలింగంబు లర్బుదన్యర్బుదములు
గలవు తీర్థరాజంబులు గాశియందు
మహిమ కావాస మవిముక్తమండలంబు. 230

క. ఎందుండును విశ్వేశ్వరుఁ
డిందుకళాధరుఁడు గిరిదుహితృసహితుం డై
యందుండు భుక్తిముక్తులు
సందేహము లేదు తప మచట నొనరింతున్. 231

సీ. అప్సరోంగన లెల్ల నాటపాటలవెంటఁ
బ్రాపించిరి మనోరథార్థసిద్ధి
గంధర్వుఁ డొక్కఁడు గానవిద్యాప్రౌఢి
శిక్షింబునంద సంసిద్ధిఁ గాంచె
యక్షపుంగవుఁడు విద్యాధరశ్రేష్ఠుండు
కోకిలాలాప యన్ కోమలియును
శతరుద్ర్యమంత్రై ర్నికజపపరాయణుఁ డైన
వేదశీలుం డనువిప్రవరుఁడు

తే. చంద్రమౌళి భరద్వాజసంయములును
హంసవతి యనునొకకిన్నరాంగనయును
నాప్రవాళోష్ఠిమగఁడు వేణుప్రియుండు
సిద్ధిఁ బొందిరి యవిముక్తసీమయందు. 232

క. సిద్ధమరుత్సాధ్యాదులు
సిద్ధిం బ్రాపింతు రం దచిరకాలమునన్
సిద్ధమతి యగుట శంభుం
డద్ధరణిని సిద్ధలింగ మనఁగా వెలయున్. 233

## భీమేశ్వర ప్రభావవర్ణనము

వ. అమ్మహాజ్యోతిర్లింగమూర్తి విశ్వేశ్వరుండనం బ్రసిద్ధివహించె. అమ్మహేశ్వరుండు జయద్రథునకు, విదూరసునకు, మగధాధిపతికి, వసుదత్తునకు, మనోరథార్థంబులచిరకాలంబునందఁ బ్రసాదించె. నేనును విశ్వేశ్వరమహాదేవు నారాధించి యభిమతార్థంబు(లు) వడసెదం గాక యని చంద్రకూపజలంబున నభిషేకం బొనరించి సంకల్పపూర్వకంబుగా నియమంబు వహించి యొక్కమాసం బేకాహారుండును, నొక్కమాసంబు నక్తాశనుండును, నొక్కమాసం బయాచితాశనుండును, నొక్కమాసంబు నిరశనుండును, నొక్కమాసంబు పయోవ్రతుండును, నొక్కమాసంబు శాకఫలాశనుండును, నొక్కమాసం బష్టతిలాహారుండును, నొక్కమాసంబు పానీయుండును, నొక్కమాసంబు పంచగవ్యాశనుండును, నొక్కమాసంబు చాంద్రాయణవ్రతుండును, నొక్కమాసంబు కుశాగ్రజలపాయియు, నొక్కమాసంబు వాయుభక్షుండును నై సంవత్సరంబు గడపి త్రయోదశమాసంబునం బ్రథమదివసంబున. 234

సీ. హరు లేదు నేడుకక్ష్యాంతరంబులు గాఁగ
నియమంబునా నాజ్ఞ నిలుపువాఁడు
వెండికట్టులతోడి వేత్రంబుమాలుగా
బంగారుముని(లు)కోల పట్టువాఁడు
ఝుంకించి వెరపుతర్జనకోటిచందానఁ
గఱకుచీఁకటి వెన్ను సఱచువాఁడు
వసుమతీభృచ్ఛ్రేణి వరుసతో గుఱి చూపి

యొండొండఁ గాన్పించుచుండువాఁడు

తే. త్రిభువనస్థానపతి యైనదివసకరుని
ప్రాక్పృతీహారపాలుండు ప్రాచిపోసలి
ఘుసృణలీలాలలామంబు బిసరుహాప్తు
కుంటుసారథి తీండ్రించెఁ గొమరు మిగుల. 235

సీ. ప్రథమసంధ్యాకాలబలిశంఖనినదంబు
ప్రభవించె శ్రీవిశ్వవిభునినగరఁ
గదిసె నంగుళియుగ్మకం బంతరము గాఁగ
గగనగంగారథాంగద్వయంబు
నెఱయంగఁ గైసేసి నిలువుటద్దము చూచె
నవిముక్తమున విశాలాక్షి గౌరి
కొక్కొరొకో యని కుక్కుటంబులు మ్రోసెఁ
గడఁగి చతుష్కుట కంబునడుమఁ

తే. బ్రహరిఁ దిరుగుట చాలించి తైరవుండు
గవని మొగసాలయరుఁగుపైఁ గన్ను మొగిచె
డుంఠివిఘ్నేశుఁ డొనర గండూష సేసి
యుమిసె వినువీథిఁ జంద్రకుండోదకములు. 236

సీ. ముక్తిప్రయోజనంబునఁ గుటీరకకోటి
సావిత్రితత్త్వంబు సంగ్రహించెఁ
బరమహంసలు పరబ్రహ్మార్థమీమాంస
శోధించి రుపనిషద్వీథులందు
నిగమాంతవాసనానిర్వృతస్వాంతు లై
హంస లుండిరి ద్రుహిణు కాంతపరతఁ
బ్రత్యగ్రగోపాలరజ్జుసంబంధంబు

దండత్రయము బహూదకుఁడు దాల్చె
గీ. భసితముద్ధూళనము చేసి పాశుపతుఁడు
దీర్ఘపాటలజటల బంధించె మౌళిఁ
గలుమఠంబులమీఁద శృంగములనడుమఁ
గొక్కొరోకో యనుచుఁ గోడికూయుటయును. 237

వ. అంత సూర్యోదయంబున. 238

సీ. ధరణీధరములందు ధాతుపాషాణంబు
పాదపంబులయందుఁ బల్లవంబు
పాథోనిధులయందుఁ బవడంపు లేఁదీఁగ
కాలాభ్రములయందుఁ గోలమెఱుపు
హరిదంతనాగంబులందు సిందూరంబు
భూమిమండలియందు హేమభూష
యాకాశవీథియం దబ్జవందనమాల
నబ్జజాండగృహంబునందు దివియ
గీ. యగుచు బాలాతపము జగం బాక్రమింప
నంధకారము దిక్కుల నస్తమింప
భానుబింబంబు దోఁచెఁ బ్రభాతలక్ష్మి
కబరిభారంబుమీఁద చెంగలువకచ్చు. 239

వ. అయ్యవసరంబున విశ్వానరుండు సకలకలికలుషవిషభంగ జాంగలికం బగుగగనగంగాప్రవాహంబున నఘమర్షణ స్నానం బాచరించి, విరజానలసంభవం బైనభస్మంబున సర్వాంగోద్ధూళనం బొనర్చి, తిర్యక్పుండ్రంబు లురశ్శిరోబాహుమూలంబుల ధరియించి, రుద్రాక్షమాలికాధరుండయి సరస్వతీస్కందవిఘ్నేశ్వరులకు నాదిత్యానిలాగ్నులకు మ్రొ

క్క, పుండరీకచర్మాసనంబునం బ్రాఙ్ముఖుండై దక్షిణజానూరు మధ్యంబున వామపాదంబును వామజానూరుమధ్యం బునదక్షిణపాదతలంబును విన్యసించి, సమగ్రీవామూర్ధకా యుండును, సంభృతాస్యుండును, నిశ్చలుండును నై నాసా గ్రంబున సుధాధారాబిందునిష్యందంబునందు నిందుబింబం బు(న) వీక్షించుచుం బ్రాణాయామంబు నేసి, ప్రాణాయామం బువలనఁ జిత్తశుద్ధి వడసి, చిత్తశుద్ధివలన వేదాంతజ్ఞానంబు విశదీకరించి, విశుద్ధవేదాంతజ్ఞానవాసనావశంబున శ్రోతవ్యుం డును, మంతవ్యుండును, నిధిధ్యాసితవ్యుండును, నిరస్త సమస్తోపాధిక స్వప్రతిష్ఠాఖండసచ్చిదానందైకరసాద్వితీయ స్వరూపుండును, పరమశివపరమజ్యోతిర్లింగమూర్తియు నైన యవిముక్తవిశ్వేశ్వరశ్రీమన్మహాదేవు నందు భావించి భావించి చూచుచుండం బ్రాచీనంబు పచేళిమంబై భవ్యం బైనభాగ్యాతిశయంబున. 240

సీ. శ్రీపాదములఁ బైఁడిచిగురుగజ్జెలతోడ
 రవళించుగండపెండార మమర
వెలిదామరలఁ బోలువెడఁదక్రాల్గన్నులు
 మద్దికాయలతోడ నుద్దివడయ
మొలకనూఁకటిఁ గ్రాలు[1]ముత్తాలలామంబు
 భసితంపుబొట్టుతో బాదరింపఁ
బాలబుగ్గలదీప్తిపల్లవంబులతోడఁ
 జిన్నిలేనగవుతోఁ జెలిమి సేయ
గీ. లజ్జ యొఱుఁగనికటిమండలంబుమీఁద
వలుదవజ్రాల కమనుగర్వంబు సూప

1. ముత్యాల రాకేక భసితంపు.

దివ్యబాలకుఁ డొకరుండు దేజరిల్లెఁ
గాశివిశ్వేశశంభులింగంబునడుమ. 241

చ. ప్రవిశదభంగిదివ్యశిశురత్నముసప్రణవాక్షరంబుగా, శ్రవణ
మనోహరంబుగఁ బ్రసన్నముగాఁ బలియింపఁజొచ్చె మూఁ
డవసవనంబునన్ శ్రుతిసమభ్యధికంబుగఁ దత్ప్రతిస్వనం
బవిరళలీల గర్భభవనాంతరభూముల నుద్భవింపఁగాన్. 242

వ. అప్పుడు విశ్వానరుం డానందాశ్రుపూర్ణలోచనుండును, రోమాంచకంచుకితాఖిలావయవుండును, గద్గదికానిరుద్ధకంఠ ధ్వనియు నయి యంజలీపుటంబు లలాటతటంబున ఘటియించి యేకతంబుగా బ్రహ్మం బద్వితీయంబు నిత్యంబు సత్యం బొక్కరుండ రుద్రుం డొక్కరుండ కర్త యెవ్వం డట్టినీకునమస్కారంబు. రజ్జువందుసర్పంబును, శుక్తియందు రౌప్యంబును, మరుమరీచికయందు సలిలంబును బోలె నెవ్వానియందుఁ బ్రపంచంబు గానంబడు నట్టినీకు నమస్కారంబు. తోయంబు నందె శైత్యంబును, వహ్నియందు దాహకత్వంబును, దపను నందుఁ దాపంబును, జంద్రునందుఁ బ్రసాదంబును, బుష్పంబు నందు సుగంధంబును, దుగ్ధంబునందుఘృతంబునుంబోలె సర్వం బునం దెవ్వం డంతరాత్ముఁడై యుండు నట్టినీకు నమస్కారంబు. శబ్దంబు గ్రహించు నశ్రవణుండు, గంధం బాఘ్రాణించు నఘ్రాణుండు, దూరంబు నడచు ననంఘ్రి, చూచు నలోచనుండు,రసంబుఁ గొనునరసజ్ఞుం డెవ్వం డట్టినీకు నమస్కారంబు. నిజభక్తుండు దక్క విష్ణువిరించిపురందరాదిబృందారకు లెవ్వానికందువ యెఱుంగ రట్టినీకు నమస్కారంబు. గోత్రంబు, జన్మంబు, నామంబు, రూపంబు, శీలంబుఁ దెలియ

రాకుండనుండియు నిజభక్తులకు నభీప్సితంబులొసంగు నెవ్వాం
డట్టినీకు నమస్కారంబు. ఎవ్వనివలన సర్వంబును నెవ్వాండు
సర్వంబును గనుంగొను, నెవ్వాఁడు సంపన్నుం, డెవ్వాఁడు
దరిద్రుఁ, డెవ్వాండువృద్ధుం, డెవ్వాండు యువ, యెవ్వాండు
బాలుం డట్టి నీకు నమస్కారంబు. అని సంస్తుతించి సాష్టాం
గదండప్రణామంబుచేసిన నతనిం గరుణాతరంగితం బగున
పాంగవీక్షణంబునం గనుంగొనివృద్ధవృద్ధుండగునబ్బాలుండు
ముగ్ధస్మితజ్యోత్స్న చిన్నిబుగ్గలంజిగురొత్తనిట్లనియానతిచ్చె.

మ. క్షితిదేవోత్తమ! నీమనోరథము సంసిద్ధిన్ వహింపన్ బతి
వ్రతకున్ శోభనపుణ్యలక్షణకు విశ్వస్తుత్యచారిత్రక
ప్రతిమప్రాభవభాగ్యవైభవకళాపారీణకున్ మీశుచి
ష్మతికిం బుట్టెదఁ గాశికాపురతపశ్చర్యాఫలం బల్పమే? 244

గీ. అచిరకాలమునంద యే నవతరింతుఁ
బరమపావని యైన నీభార్యయందుఁ
జను నిజాశ్రయమునకు సంశయము మాని
విమలపుణ్య! విశ్వానర విప్రముఖ్య! 245

వ. అని చూడం జూడ నయ్యిందుచూడుం డానందక్రీడావాటి
కాక్రోడక్రీడావిహారహేలాచిక్రోడంబుపదంబులోని నీడ
యుంబోలెఁ బొడచూపి యవిముక్తక్షేత్రవిడంబనంబగువిశ్వే
శ్వరలింగంబునందుఁ గుడుంగంబునందునుంబోలె లోనడాఁగి
యుండె. విశ్వానరుండును విశ్వాసభక్తితాత్పర్యంబులు
మనంబునం బెనఁగొన నయ్యనంగమథనుం దలంచి తలంచి
శుచిష్మతియుం దానుఁ దమయంజలిపుటంబులు లలాటతటం
బులం ఘటియించి ప్రస్తుతించుచుం బ్రమోదించుచు నిజనివా

సంబునకుం జని రనిన విని నైమిశారణ్యవాసు లీశ్వరుం
డెబ్భంగి శుచిష్మతికిం జన్మించె నని యడిగిన. 246

ఆశ్వాసాంతము

శా. కర్ణాటోత్కలపారసీకనృపసంఖ్యా! ప్రాభవశ్రీనిధీ!
యర్ణోరాశిపరీతభూభువనమధ్యాంధ్రక్షమాధీశ్వరా!
కర్ణాభ్యర్ణవిశాలనేత్ర! జగదేకప్రాజ్యసామ్రాజ్య! దృ
క్కర్ణాధీశ్వరహారభక్తినిరతక్ష్మాపాలచూడామణీ! 247

క. పంచారామవధూటీ
పాంచాల! త్రిలింగరాజపరమేశ్వర! య
భ్యంచితదయాధురంధర!
చెంచూమలచూరకార! చిరపుణ్యనిధీ! 248

భుజంగప్రయాతము.

త్రిలోకీనికాయ్యప్రదీపప్రతాపా!
కలాభోజ! యౌదార్యకల్పావనీజా
నలేఘ్వాకుదుష్యంతనాభాగలీలా
కలా! రెడ్డిభూపాల! కల్పాంతకాలా! 249

గద్యము. ఇది శ్రీమత్కమలనాభపౌత్ర మారయామాత్య
పుత్త్ర సుకవిజనవిధేయ కవిసార్వభౌమ శ్రీనాథనామధేయ
ప్రణీతం బైనకాశీఖండం బనుమహాప్రబంధంబునందుఁ
దృతీయాశ్వాసము.

శ్రీరస్తు

# చతుర్థాశ్వాసము



కంఠచరణసేవా
వైకుంఠ ! యకుంఠశౌర్యవైభవ ! లోకా
లోకగిరిప్రాచీన
శ్లోకల్పయశగప్రసార ! యల్లయవీరా ! 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె. నంతఁ
గొంతకాలంబునకు. 2

## వైశానసరజననము

క. నెల మసలె నిందువదనకు
జలజాక్షికి నల్ల నయ్యెఁ జన్నులముక్కుల్
తలిరుంబోఁడికి నలినీ
దళపాండువు లయ్యె గండదర్పణతలముల్. 3

గీ. గర్భగోళస్థితుం డైనకాలకంఠు
కంఠహాలహలచ్ఛాయకాళిమంబు
నాభిబిలమున వెడలి కన్పట్టినట్లు
కమలపత్రేక్షణకు నారు గారుకొనియె. 4

సీ. సరసిజానన యహర్విరతి సంధ్యాకాల
మానందతాండవమాడఁ దలఁచె

జంతుకోటికి ముముక్షావేళఁ గాశిలో
నోంకార మానతీ సువిద గోరెఁ
బసిఁడికమ్ములతోడిపచ్చి యేనికతోలు
పచ్చడంబు ధరింప భామ తివిరె
నతివ యువ్విళ్లూరె నారకూటపిశంగ
మకుటాగ్రమునఁ జందమామఁ దుఱుమ

గీ. ముదిత కాంక్షించె నేనికమోముకొడుకు
నంకపీఠమునందుంచి యాదరింప
నహరహంబును గర్భంబునందుఁ బెరగు
కాలకంఠునియనుభావగౌరవమున. 5

వ. వెండియు. 6

శా. ఆచంద్రానన యధ్వరంబులఁ బురోడాశంబుతో మంత్రస
ధ్రీచీనంబుగ యాయజూకులు సమర్పింపంగ నాజ్యాహుతుల్
ప్రాచుర్యస్థితి నారగింపఁ దలఁచుఁ బ్రాగ్వంశమధ్యంబునన్
శౌచిష్కేశుఁడు గర్భగోళమునఁ దొల్చూపులున్నతిం బొందఁగాన్.

వ. అనంతరంబ యాహంసగమనకుఁ బుంసవనసీమంతంబులు
గృహ్యోక్తప్రకారంబున నిర్వర్తించిన. 8

మ. నవమాసంబులు నిండఁగా గురుఁడు కేంద్రస్థాయియైయుండఁగా
శివలగ్నంబున నుద్భవించె సుతుఁ డర్చిష్మంతునంశంబునన్
ధవళాంభోరుహపత్రనేత్ర కవిముక్తస్థానవిశ్వేశశం
భ్వవతారాంతర మప్రధృష్యతరదివ్యాకారతేజంబునన్. 9

వ. అప్పుడు గంధవాహంబులు దివ్యగంధంబులు వహించె.
ఘనాఘనంబులు పుష్పవర్షంబులు గురిసె. దేవదుందుభులు
మొరసె. దిఙ్ముఖంబులు ప్రసన్నంబు లయ్యె. వాహినులు

విమలసలిలప్రవాహంబులయ్యె. సకలభూతంబులమనంబులు తెలివొందె. విద్యాధరయక్షగంధర్వులు వసిష్ఠవాలఖిల్యాది మునులు బ్రహ్మ విష్ణు మహేశ్వరులుఁ గుమారావలోకన కౌతూహలాయత్తచిత్తు లయి యేఁగుదెంచి రాసమయంబున.

క. ద్రుహిణుండు కైటభారియు
నహికటకుఁడు గూడి యిచ్చి రక్కొడుకునకున్
గృహపతి యనియెడునామము
మహనీయకృపావిధేయమానసు లగుచున్. 11

వ. పదునొకండవదినంబున నామకరణంబు గల్పించి వేల్పులు చన్నపిమ్మట గురుజనంబులు క్రమంబున. 12

సీ. గృహనిష్క్రమంబు సాగించిరి నాల్గవ
మాసంబునందుఁ గుమారునకును
వత్సరార్ధమునందు వాలాయముగఁ జేసి
రన్నసంప్రాశనం బర్భకునకు
నంతఁ జూడాకర్మ మాచరించిరి బిడ్డ
నికి గృహ్యసంప్రోక్తనియమపరతఁ
దఱితోడఁ గర్ణవేధంబు గల్పించిరి
శ్రవణర్క్షమున నాత్మసంభవునకు

గీ. బ్రహ్మతేజోభివృద్ధికై పంచమాబ్ద
వేళ సల్పి రుపాకర్మవిధి సుతునకుఁ
జదువఁ బెట్టిరి వేదంబు పదముఁ గ్రమము
సాంగముగ బాలకుని నుపాధ్యాయునొద్ద. 13

వ. అంతనొక్కనాఁడు నారదుండు యదృచ్ఛాగతుండై యతిథి

సత్కారంబు వడసి తనకు నమస్కరించిన గృహపతిం గనుం
గొని దంపతుల కిట్లనియె. 14

గీ. ఓయి! విశ్వానరుండ! విశ్వోపకారి!
యోశుచిష్మతి! పరమపుణ్యోజ్జ్వలాత్మ!
బాలుఁ డీతండు మీమీఁద భక్తి గలఁడె?
చేయునా వీఁడు సులభుఁడై చెప్పినట్లు? 15

గీ. తల్లిదండ్రులయాజ్ఞ యథగకరింప
కుండుటయ సూవె! ధర్మ మత్యుత్తమంబు
దైవ మనఁగ గురుండు నా ధర్మ మనఁగ
సర్థ మనఁ దలిదండ్రులె యాత్మజునకు. 16

క. జననీజనకులఁ గొలుచుట
తనయునకును ముఖ్యమైనధర్మము జననీ
జనకులఁ గొల్చుటకంటెను
దనయున కభ్యధిక మైనధర్మము గలదే? 17

సీ. సవదరించుట యెట్లు జఠరగోళమునందు
నవమమాసావసానంబు దాఁక?
ప్రేఁక మైన ప్రసూతివేళాసముద్భూత
సంకటం బోర్వంగఁ జాలు టెట్లు?
కుత్సింపకుం టెట్టు లుత్సర్గవిణ్మూత్ర
లాలాద్రవశ్లేష్మజాలమునకు?
నందంద వక్షోరుహాంబులింపులువోవఁ
దోడుక నిచ్చుట యెట్టు దుగ్ధరసము?
గీ. పంచకరపాట్లు వడి తన్నుఁ బెంచి పిశికి
యాపదలఁ బాప రక్షించినట్టితల్లి

దేవతాబుద్ధి వాటించి తెలియవలయుఁ
గొడుకు వంశాభిసంవృద్ధి కొనలు సాఁగ. 18

క. రేపాడిఁ గొడుకు జననీ
శ్రీపాదములకు నమస్కరింపఁగఁ దగుఁ ద
చ్ఛ్రీపాదక్షాళనసలి
లాపోశనమునను సుతున కాయుష్య మగున్. 19

గీ. సర్వతీర్థాంబువులకంటె సమధికంబు
పావనం బైనజనయిత్రి పాదజలము
వరతనూజున కఖిలదేవతలకంటె
జనని యెక్కుడు సన్నుతాచారనిరత! 20

వ. అని నారదుండు గృహపతిం జూచి యన్న! వైశ్వానర ?
ఇటు రమ్మని చేరం బిలిచి తొడలమీఁదఁ గూర్చుండ నిడు
కొని దక్షిణహస్తంబు చూచి లక్షణంబులుపరీక్షించి యంతం
బోవక. 21

సీ. ఆపాదమస్తకం బంగకములు నుపాం
గకములుఁ బ్రత్యంగకములు వరుసఁ
దను వైనకార్పాసతంతుసూత్రంబునఁ
గుంకుమార్ద్రంబునఁ గొలిచి కొలిచి
తప్ప కయ్యయి చోట్లు దర్శించి దర్శించి
యంగుళీముఖముల నంటి యంటి
నడపించి నిలిచియుండఁగఁ బెట్టి కూర్చుండ
నియమించి పరికించి నిశ్చయించె

గీ. లక్షణములు శుభాశుభాలంబనంబు
లంబురుహసూతిసుతుఁడు సంయమివరుండు

సకలసాముద్రికాగమజ్ఞానశాలి
నారదుఁడు సర్వవిద్యావిశారదుండు. 22

వ. ఇట్లు నిశ్చయించి. 23

గీ. తిర్యగూర్ధ్వంబు గొలువంగ దేహయష్టి
యెవ్వనికి వ్రేళ్లు నూఱును నెనిమిదియును
మానమున వాఁడు ధరణిసామ్రాజ్యపట్ట
బద్ధయోగ్యుఁడు భాగ్యవైభవముకలిమి. 24

గీ. ముక్కు భుజములు లోచనంబులును జాను
హనువులును నైదుదీర్ఘంబు లగుట మేలు
మెడయు జంఘాయుగంబును మేహనంబు
హ్రస్వములు గాఁగ వలయు భాగ్యాన్వితునకు. 25

గీ. నాభిరంధ్రంబు సత్త్వకంఠస్వరములు
మూఁడు నత్యంతగంభీరముగను వలయు
నంగులీదేశజత్రుత్వగంఘ్రిగుల్ఫ
పంచకము సూక్ష్మమై యుండు భాగ్యనిధికి. 26

గీ. కరములును గుక్షియును గటిస్కంధములును
ఫాలమును మోము నున్నతి వడయవలయు
హస్తరేఖాదృగంత జిహ్వాధరోష్ఠ
తాలునఖములు రెం పైన తథ్యచరిత. 27

గీ. కటియు వక్షఃస్థలంబును నిటలతటము
విస్తృతము లెవ్వనికి వాఁడు విభుతఁ గాంచుఁ
బదము గోమల మయ్యును బాణి కఠిన
మయ్యు నైశ్వర్య మొసఁగు మహానుభావ! 28

గీ. తాల్చు నెవ్వఁడు భ్రూవిలతాంతరమునందు
వర్తులం బైనదక్షిణావర్తరేఖ
యాతఁ డేకాతపత్త్ర మహానట్లుగాఁగ
ధరణిరాజ్యంబుఁ బాలించు ధన్యచరిత! 29

క. కమలోదరారుణము లై
సమగుల్ఫము లై మృదుత్వసంయుక్తము లై
విమలారుణనఖరము లై
చెమరింపనియడుగు లొసఁగు సిరి మనుజునకున్. 30

సీ. లింగంబు కృశ మైన లెస్స మూత్రము దక్షి
ణావర్తవిస్సృతం బైన మేలు
మధుగంధ మైనను మత్స్యగంధం బైన
నింద్రియంబు శుభంబు నీకుఁ జాలుఁ
గంఠనినాదంబు క్రౌంచదుందుభిఘోష
గంభీర మగుట సౌఖ్యప్రదంబు
చతురకనీనిక సరఘామధుచ్ఛాయఁ
బింగళం బై యిచ్చు మంగళంబు

గీ. నైదు రేఖలనొసలివాఁ డాయురిత్తుఁడు
భాగ్యనిధి ముప్పదియు రెండుపండ్లవాఁడు
కంబునిభ మైనమెడవాఁ డఖండకీర్తి
నూర్ధ్వరేఖలపదమువాఁ డుత్తముండు. 31

గీ. హస్త మిఱియించి పట్టినయపుడు కదిసి
యంగుళులు రంధ్రహీనంబు లయ్యె నేని
నతనిఁ గల్యాణలక్షణాన్వితునిఁ గాఁగఁ
జెప్పు సాముద్రికజ్ఞానసిద్ధబుద్ధి. 32

వ. ఏను జెప్పినయీభాగ్యలక్షణంబు లెన్ని గల వన్నియు నిక్కు-
మారునియందు సంపన్నంబు లై యున్నయవి. 33

గీ. ఇన్ని గుణములు గలిగినయేనినరున
కన్ని గుణములు నో బలే! యవయవంబు
లకట! యత్యంతనిర్దయుం డగువిధాత
యచ్ఛలమునఁ బరాఙ్ముఖుం డయ్యె నేని. 34

గీ. చెప్ప నోరాడ దే మని చెప్పువాఁడ?
నెఱిఁగినర్థంబు చెప్పక యెట్లు దాతుఁ
బదియు రెండవయేఁట నీబాలకునకు
గండ మొక్కటి దంభోళికారణమున. 35

వ. అని చెప్పి నారదుం డరిగిన శుచిష్మతియు విశ్వానరుండు
నశనిపాతాదారుణం బైనయమ్మునిభాషితంబునకు భయం
బంది హాహాకారం బొనర్చి మూర్ఛాంధకారంబున మునింగి
యెట్టకేలకుఁ దెలిసి బహుప్రకారంబుల విలపించుచుండి
రాసమయంబునఁ దల్లిదండ్రులకు వైశ్వానరుం డి ట్లనియె. 36

సీ. ఓయమ్మ! యేలమ్మ యుపతాప మందెద!
వోతండ్రి! యేలయ్య! భీతిఁ బొందె?
దస్మన్నిమిత్త మై యకట! మీశ్రీచర
ణాంభోజధూళి నా కవరవాంబు
సర్వాంగరక్షయై సంధిల్లు చుండంగ
మృత్యు వెబ్బంగి నామీఁదఁ గవయుఁ
గవిసె నేనిఁ గఠోరకంఠహుంకారంబు
పొనరించి మీయాన యొడుచువాఁడ

గీ. నానయును ద్రోచి వచ్చిన నాగ్రహమున

దీర్ఘనిర్ఘాతసంపాతనిర్ఘృణోగ్ర
కఠినతరవామపదపార్ష్ణిఘట్టనమున
దానిపండులు రాలంగఁ దన్నువాఁడ. 37

మ. వినుఁడీనాదుప్రతిజ్ఞ మీరు హృదయోద్వేగంబువర్జించి యో
జనయిత్రీ జనకుల్! గురుల్! భవదనుజ్ఞాముద్ర చేపట్టి యేఁ
జని కాశీపతివిశ్వనాయకు శివుం జంద్రార్ధచూడావతం, సుని మృ
త్యుంజయు నాశ్రయించి విగతాసుం జేసెదన్ మృత్యువున్.

వ. అనిన విని దంపతు లపయోధరంబైనవర్షంబును, నదుగ్ధాబ్ధియైన సుధోదయంబును, ననిందుబింబంబైన చంద్రికాలోకంబును నైనయామాటకుఁ బరితోషంబు నొంది యెట్టెట్టా యని క్రమ్మఱ నడుగుచు సుతున కిట్లనిరి. 39

సీ. కావఁడే యాభీలకాలపాశనిబద్ధు
శ్వేతకేతునిఁ బ్రాణవిగమభీతు?
రక్షింపఁడే కాళరాత్రిపాల్పడకుండ
నేనిమిదేఁడులశిలాదునితనూజుఁ?
బాలింపఁడే విష్టపంబు లీరేడును
గాలకూటాగ్నిచేఁ గాలకుండ?
మనుపఁడే యాయుగప్రమాణంబు నిండినఁ
గారుణ్యబుద్ధి మృకండుతనయు?

గీ. నంధకాసురవ్యాఘ్రజలంధరేభ
దక్షమఖపుష్పశరపురధ్వంసనునకు
విశ్వభర్తకుఁ గాశికాధీశ్వరునకు
నిందుమౌళికి నినుఁ గాచు టెంతభరము. 40

వ. అని శుచిష్మతియు విశ్వానరుండును గొడుకు నాశీర్వదించి యనిచిన నతండును గాశి కరిగి మణికర్ణికాతీర్థమాడి విశ్వనాథు దర్శించి తద్దివ్యజ్యోతిర్లింగంబుఁ గనుఁగొని పరమానందకందం బనియును, బిండభూతం బైన త్రైలోక్యసారసర్వస్వం బనియును, దుగ్ధాబ్ధిసముద్భవం బగుసుధాపిండం బనియును, స్వాత్మావబోధపాదపంబునకుఁ బ్రథమాంకురం బనియును, బ్రహ్మరసాయనం బనియును, లింగకైతవంబున నాకారంబు భజించిన యనాకార(త)త్త్వం బనియును, నానారత్న(ప్ర)పూరితం బైన బ్రహ్మాండభాండం బనియును, మోక్షవృక్షఫలం బనియును, బుష్పగర్భం బైననిర్వాణలక్ష్మీకేశపాశంబనియును, గైవల్యమల్లీ వల్లీమతల్లీస్తబకం బనియును, (నిశ్శ్రేయసశ్రీకరక్రీడాకందుకం బనియును,) నపవర్గోదయాద్రిసుధాకరబింబం బనియును, సంసారమోహవ్యూహగాఢాంధకారవిధ్వంసనబ్రధ్నమండలం బనియును, (నమృతకళ్యాణశ్రేణి రమణీశృంగార లీలాదర్పణంబనియును) భావించి భావించి వితర్కించి వితర్కించి నమస్కరించి యొక్కపుణ్యాశ్రమంబు చేసికొని శుభవాసరంబున లింగసంస్థాపనంబుచేసి తత్సమీపంబున వత్సరద్వయంబు ఘోరం బైనతపం బొనర్చె నంత నొక్కనాఁడు. 41

శా. ఆవిర్భావము నొందె నిర్జరవిభుం డై రావణారూఢుఁ డై
యావైశ్వానరుచక్కఁ గట్టెదుర బాహాస్తంభదంభోళి
యుక్, గ్రీవాలంకృతతారహారలతికారింఛోళికేళీసఖ
గ్రైవేయాభరణాభిశోభియును నై కాశీప్రదేశంబునన్. 42

గీ. జంభదైత్యవిరోధి సాక్షాత్కరించి
వరము వేఁడుము నీతపోవైభవమున
ననఘ! మెచ్చితి నముచిసూదనుఁడ నేను
నాపుడును నాశుచిస్మితీనందనుండు. 43

క. ఏవరము వేఁడ నిన్నును
దేవేంద్రా! నీకు నా కధీశ్వరుఁ డగు కా
శీవిశ్వనాయకమహా
దేవుని నర్థింతు వర మధికతరభక్తిన్. 44

వ. అనుటయు. 45

గీ. శ్రీమహాదేవుఁ డనఁగఁ గాశీపతి యన
విశ్వనాయకుఁ డన నొకవేల్పు గలఁడె?
యేను పాలింతు త్రైలోక్య మేను నిఖిల
దేవతాచక్రవర్తి సందియము లేదు. 46

క. నాకంటె నధికుఁ డెవ్వఁడు
లోకత్రయమునను? మనములో విశ్వాస
స్వీకార మేల వదలెద?
వాకాంక్షింపంగ రాదె యభిమతవరముల్? 47

వ. అనుటయు. 48

క. ఏలా యీమాటలపని?
పౌలోమీరమణ! నీప్రభావము కంటే
కాలుని ప్రభావమును నీ
త్రైలోక్యం బెఱుఁగు వలదు తగవతిపలుకుల్. 49

మ. అడుగన్నిన్ను వరంబు వేఁడఁగ నహల్యాజార! విచ్చేయునా
కుడు రాజార్ధవిభూషణుండువరమీనున్నాఁడుయుష్మాదృశు

ల్బడుగులాఽంఛితమీాసమర్థులె? వృథాలాపప్రబంధోక్తులన్
జడివెట్టం బనిలేదు మిన్నక తపశ్చర్యావిరోధంబు గాన్. 50

వ. అని యుల్లసం బాడినం గటకటం పడి బిడౌజుం డుద్గీర్ణసురా యుధుండును విబుధవిరోధివధూవైధవ్యదీక్షాదానదేశికంబును, నిర్ధూమధూమకేతుజ్వాలాజాలజటిలంబును నగు వజ్రంబు గేలం బూని వైశ్వానరుముంవఱ ఝుళిపించిన. 51

శా. దంభోళిజ్వాలనాభిఘట్టనమునన్ ధైర్యంబు వోనాడియున్
గంభీరస్థిరభక్తివైభవమునం గాశీపురాధీశ్వరున్
శంభున్ శంకరు నీలలోహితు నుమానాథున్ విగూపాక్షువి[భన్.
స్రంభంబొప్పఁదలంచుచుం ద్విజుఁడుమూర్ఛం బొందెఁదీవ్రవ్యథ

వ. ఆసమయంబున. 53

సీ. వికటపాటలజటాఛకుటకోటిపినద్ధ
ముగ్ధచంద్రుఁడు జగన్మోహనుండు
గంఠమూలకఠోర కాలకూటకళంక
కజ్జలుం డర్థార్థికల్పతరువు
కుటిలకుండలిరాజకుండలాలంకార
మండితుం డానతాఖండలుండు
భసితధూళిచ్ఛటాపాళిసముద్ధూళి
తాఖిలాంగుండు విశ్వాధికుండు

గీ. విశ్వనాథుండు గాశికాధీశ్వరుండు
లీలఁ బ్రత్యక్షమై వచ్చి లెమ్ము వత్స!
యనఁగ జైతన్య మంది దిగ్గనఁగ లేచె
శంభుభక్తిపరుండు వైశ్వానరుండు. 54

వ. ఈశ్వరుండును వైశ్వానరు నాదరించి విశ్వోత్తరం బైన

యాయగ్నిలోకంబున కధీశ్వరునిఁజేసి యంతర్హితుండయ్యె.
గృహపతి పరమేశ్వరానుగ్రహంబున దీర్ఘాయుష్మంతుండును
దిక్పతియు నై చరితార్థత్వంబు నొంది నిజవాసంబునకు
వచ్చె. ఇది వైశ్వానరువృత్తాంతంబు. 55

## నిర్ఋతిలోకవృత్తాంతము

గీ. అనినఁ బ్రియమంది శివశర్మ యంబుజాక్షు
కింకరుల కిట్టు లనియె నక్షీణభక్తి
నిర్ఋతిలోకంబు మొదలైననిఖిలలోక
ములును జూపుఁ డనుక్రమంబునను నాకు. 56

వ. వైవస్వతలోకంబు మున్నయెఱింగితి. అటమీఁదిలోకంబు
లెఱుంగవలతుం జెప్పరే యనిన వారు మహాత్మా! సంయమనీ
పురంబున కవ్వల జాతిమాత్రంబున రాక్షసులై యనుష్ఠిత
లయ్యనుగతశ్రుతిమార్గులు నపరద్రోహులుదీర్ఘస్నానపరులు
దేవపూజాపరాయణులు దానదయాక్షాంతిదాంత్యాస్తేయ
సత్యాహింసానిరతులు సర్వభోగసములు నై పుణ్యజనులకు
నివాసం బై నిర్ఋతిలోకం బొప్పుచుండు. 57

గీ. తీర్థములయందు విధి మీఱి తెగినపుణ్యు
లనఘ! యీలోకమున నుందు రాత్మహానన
మొక్క కాశీపురంబునఁ దక్క నొందు
తీర్థములయందుఁ బాపంబు దెచ్చు నంద్రు. 58

వ. ఈలోకంబున కధీశ్వరుం డైనదిక్పతిచరిత్రంబు చెప్పెదము
సావధానమతి వై యాకర్ణింపుము. 59

సీ. వింధ్యాద్రినడుమ నిర్వింధ్యాతటంబునఁ
గానలో నొక్క పక్కణము గలదు

పింగాక్షుఁ డనియెడు పేరివాఁ డావెంటఁ
బల్లె యేలెడు భిల్లపరివృఢుండు
క్రూరకర్మపరాఙ్ముఖుం డక్కిరాతుండు
వ్యాఘ్రాదిదుష్టసత్త్వములఁ దక్క
దండింపఁ డితరసత్త్వముల నేణాదుల
నాఖేటమార్గంబునంద బ్రతుకు
గీ. విశ్వసించిన నీరు ద్రావినను నిద్ర
పోయినను జాలుగొన్నను బొర్లుచున్న
దెవులువడ్డను గుందిన ధృతిసెడినను
జంపఁ డనుకంప నెట్టిహింస్రంబు నైన. 60

సీ. ఫలమూలముల శాకపక్వాశనంబుల
దధిపయఃక్షౌద్రాజ్యతక్రములను
శిశిరాంబువులఁ దృప్తి సేయ సంబడ మిచ్చుఁ
బాదరక్షలు నాతపత్త్రములును
దాళవృంతములు వస్త్రములు గోర్పడుములు
నొసఁగు రోగార్తుల నుపచరించుఁ
దస్కరబాధ నొందక యుండ నెడ వన
యటవీస్థలంబున ననుప్పఁ బెట్టుఁ
గీ. దీర్థములు పోవువారికి దివసదివస
మటు విశేషించి కాశికి నరుగునట్టి
పుణ్యులకుఁ జేయు సత్కారములు నెరవుగఁ
బింగళాక్షుండు శబరరాట్పుంగవుండు. 61

గీ. సంతతంబును నాశీర్వదింతురతనిఁ
దీర్థముల కేగువారు సంతృప్తినొంది

యగ్నిహోత్రాంతములను జపాంతములను
భోజనానంతములను దృష్టిపూర్వకముగ. 62

క. దక్షత నివ్విధమునఁ బిం
గాక్షుఁడు సతతంబు తీర్థయాత్రాపరుల
రక్షింప నటవి నగరస
దృక్షుం బై యుండెఁ గొన్నిదినములు పేర్మిన్. 63

వ. అంత నొక్కనాఁ డతనిపితృవ్యుండు దారకుం డనులుబ్ధకుండు తెరువు గట్టి తీర్థయాత్రాపరు లైనకార్పటికుల దోఁచి కొనియె. అప్పు డప్పురుసవారు కలంగంబాఱి మొఱయునుం గూఁతయునుం బెట్టిరి. నెట్టఁబడిబెట్టి (నిట్టపిడింబెట్టి) గల్పాంతసమయసముజ్జృంభమాణ కపటకిటికైటభారాతికంఠనాళకఠోరఘుర్ఘురధ్వాన ఘుర్ఘుంబైనయానిర్ఘోషంబాకర్ణించి యటమున్న దైవయోగంబునం దోరంపువేఁటకు వెడలి నికట ప్రదేశంబున నున్నపింగాక్షుం డుచ్చైస్స్వనంబున నోహో! వెఱవకుండుఁడు. ఏను గలుగంగ మీకు భయం బేల? యని పేరువాడి క్రీడి కురుబలంబులపైఁ గవిసినచందంబునం గవిసి పుంఖానుపుంఖంబుగాఁదీవ్రమార్గణంబులునిగుడించిలుంఠ (బ్ధ) కులం దోలియోటు వడకుండ సార్థవాహులం గడపిపుచ్చి విమతశబర(వర) సుభటకఠినతరభుజపరిఘువలయవలయితపృథులధనురుదితనిశితశరశతఖచితసకలశరీరుండై వేదు పెరిగిన చందంబున వీరశయనంబున శయనించి విగతప్రాణుండై పరోపకారపుణ్యానురూపఫలంబున దిగీశ్వరత్వంబు నొంది నిరృతి యయ్యె. అది నిరృతిలోకవృత్తాంతంబు. ఈనిరృతి లోకంబున కనంతరంబున. 64

## వరుణలోకవృత్తాంతము

గీ. వరుణదేవునిలోకంబు ధరణిదేవ !
ఇందు నుండెడుపుణ్యాత్ము లెవ్వ రనిన
వాపికాకూపకాసారవారిపాన
వాటికోద్యానకల్పనావ్యాప్తిపరులు. 65

సీ. తరణేందుమాళిపై ధారాంబుకుంభంబు
నియమవ్రతంబుగా నిలిపినారు
తనియఁ దియ్యనిపంచదారపానకములు
భూసురోత్తములకుఁ బోసినారు
చల్లఁగా నెడరుచోఁ జలివెందరలు పెట్టి
యధ్వనీనులదప్పి యార్చినారు
దీర్ఘయాత్రాపరాధీనమానసులకు
నుదకుంభపాదుక లొసఁగినారు

గీ. వెల్లిలో నేయుపాయంబు వెంట నైన
మునుఁగ కుండంగఁ బ్రాణుల మనిచినారు
గారవంబున వరుణలోకంబునందు
నిందు వేడుక సుఖియించు చుండువారు. 66

గీ. పుణ్యతటినుల కవతారభూములందు
శిలల సోపానపంక్తులు చేసినారు
పసులసంకెళ్లు విడిపించి పనిచినారు
వరుణలోకంబునం దుండువార లనఘ. 67

## వరుణోత్పత్తి

వ. ఈలోకం బేలువాఁడు వరుణుండు. జలా (శయా) ధిపతి, యాదగపతి, సర్వకర్మసాక్షి. ఇతనియుత్పత్తియాకర్ణింపుము.

కర్దమప్రజాపతినందనుండు శుచిష్మంతుం డనువాఁడు ధైర్య మాధుర్యవైశారద్యాదిశోభనగుణసంపన్నుండు. అతఁడు చిఱుతవయసున సంగశీలయినబాలకులతోడం గూడియచ్ఛోదం బనుకొలన సలిలక్రీడలుసలుపుచు నొక్కశింశుమారంబుచేతం బట్టుపడినం దోడిబాలకులు భయభ్రాంతస్వాంతులై యేతెంచి దేవార్చనా సమయంబున సమాధినిష్ఠుం డైన యాతనితండ్రి కత్తెఱంగు విన్నవించిరి. విజ్ఞాతసుతవిపత్తియయ్యును జిత్తంబు చలింపనీక యత్తపోధనసత్తముండభిధ్యానమార్గమున బ్రహ్మాండంబుల, భువనంబుల, భూతంబులఁ, జంద్రసూర్యర్క్షతారకంబులఁ, బర్వతంబుల, వనంబుల, నదుల సముద్రంబుల, నంతర్ద్వీపంబుల, నానాదేవయోనులఁ, దదీయ స్థానంబుల, వాపీకూపతటాకకుల్యాపుష్కరిణులంజూచియం దొక్క కెందమ్మికొలన మునికుమారులతోడం గూడి నిమజ్జనోన్మజ్జనంబుల రంజిలం గరయంత్రనిర్ముక్తసలిలధారాభిషేచనంబుల సముడ్డమరుకాండమడ్డుడిండిమధిమధిమధ్వానంబుల దారకుండు విహారంబు సలుపుటయు, సపూర్ణేందుబింబవదను నిందుబింబంబుఁ బట్టం బఱతెంచు రాహువుంబోలె నొక్కమహాగ్రాహంబు సమగ్రాగ్రహంబునం బఱతెంచి పట్టుటయు, నమ్మొసలి సరసబిసరుహకిసలయ కుసుమసుకుమారదేహుండగు నక్కుమారున(ను)క్కుఁదండసంబులువోని తన రెండుకోఱలం బిట్టూఁదికఱవక మెయిమెయింగబళించికసుగందకుండ జలాధిదేవతాసమీపంబునకుం దెచ్చుచుండె, నచ్చిగురాకుఁబోఁడి యతని సరిత్పతిసమ్ముఖంబునం బెట్టుటయు, నంతలో సక్రోధరక్తాంతలోచనుండును త్రిశూలపాణియు నగు

నొక్క_దివ్యపురుషుండు పరుషదృష్టి వీక్షించి సలిలాధ్యక్షు నధిక్షేపించి, యోయివరుణాలయ! కరుణారహితుండవై కర్దమప్రజాపతితనయు శివభక్తు శిశువు నక్రంబుం బంచి దంష్ట్రాక్రకచంబులం గఱపించి తెప్పించితి! మేలు గా కేమి? నీలలోహితుని ప్రభావంబు నీ కెఱుంగవచ్చునే? యని జంకించి పలుకుటయు, నాతంకంబు నొంది యుదన్వంతుం డా డింభు నలంకరించి శంభుకింకరున కిచ్చి పాశనిబద్ధం బగునమ్మకరంబు నతని కొప్పనంబుచేసి తత్సమేతుండై పరమేశ్వరుని సన్నిధికిం జని బహుప్రకారంబుల స్తుతియించి యపరాధంబువలన విముక్తుం డగుటయు, నద్దేవుండు పనుపం బ్రమథుండు జలగ్రాహంబులతోడం గూడం గుమారుని దన యొద్దకుం గొనివచ్చుటయుం గాంచె. అదియ ప్రణిధానావసానంబయ్యె నేత్రోన్మీలనం బాచరించి యప్పరమమాహేశ్వరుండు. 68

సీ. గ్రాహదంష్ట్రాటంకికాశిఖాగ్రము సోఁకి
కందినజంతుభాగంబుతోడ
నుదకబిందుకలాప ముట్టి యుట్టిపడంగఁ
గర మొప్పు ముద్దుగూఁకట్లతోడ
నరుణాంచలంబు లై యరవిందగర్భప
త్రములఁ బోలువిలోచనములతోడ
బహుఁలయాతాయాతపరిపాటి పెల్లున
గలువంపునిట్టూర్పు గాడ్పుతోడ

గీ. సంభ్రమంబున నచ్ఛోదసరసి వెడలి
మేటినక్రంబు బట్టెడ త్రాటఁ బట్టి

వచ్చి తనకట్టెదుర నున్నవానిఁ బుత్త్రుఁ
గాంచె దుర్దమతేజుండు కర్దముండు. 69

వ. అట్లు కాంచి. 70

క. చరణాంభోరుహయుగళీ
పరిసరమునఁ జక్క సాఁగి ప్రణతియొనర్పన్
గురుఁడు ప్రమోదం బారఁగఁ
బరిరంభము చేసెఁ జచ్చి బ్రతికినకొడుకున్. 71

గీ. అనఘ! శివశర్మ! యిట్టిచోద్యంబు గలదె?
యభవు నర్చించువేళ సమాధి నుండి
కొమరుదెస నైనయన్నిపోకలును జూడఁ
గడచె నూఱును నైదేండ్లు కర్దమునకు. 72

వ. కర్దముండును నతిక్రాంతం బైనయదీర్ఘకాలంబు మహాకాళ
ధ్యానతాత్పర్యనిష్ఠాతిశయంబున ముహూర్తమాత్రంబు
నుంబోలెఁ గడపినయనంతరంబ శుచిష్మంతుండును సము
చితప్రకారంబునఁ దండ్రియనుజ్ఞ వడసి వారణాసీపురం
బున కరిగి లింగస్థాపనంబు సేసి పంచవర్ష సహస్రంబు
దపం బొనరించి ప్రత్యక్షం బైనపరమేశ్వరునివలన వరుణ
పదంబు వరంబుగాఁ బడసి రత్నాకరంబులకురత్నంబులకుసరి
త్సరగపల్వలంబులకు వాపికాకూపతటాకంబులకుఁ బడమటి
దిక్కునకు నధీశ్వరుం డయ్యె. కాశియందుఁ గార్దమప్రతిష్ఠితం
బైనమణికర్ణేశ్వరలింగంబునకు నిరృతిభాగంబున వరుణేశ్వ
రాహ్వయం బైనశంభులింగంబు సుప్రతిష్ఠితం బై యుండు.
ఆలింగంబు సేవించినవారికి సంతాపభయంబును నపాయమరణ

భయంబులును జలోదరాదిభయంబును మొదలైనభయం
బులు పుట్టక యుండు. ఇది వరుణలోకవృత్తాంతంబు. 73

## గంధవతీవృత్తాంతము

సీ. అదె గంధవతిఁ జూడు మవనీసురోత్తమ!
వరుణునివీటి కుత్తరమునందు
నిమ్మహాపట్టణం బేలు గంధవహుండు
భవకృప నీతఁ డీపదముఁ గాంచె
నాదిఁ గశ్యపునిదాయాదుండు పూతాత్ముఁ
డనుపేరిబ్రాహ్మణుం డనఘ! యితఁడు
తరుణేందుధరురాజధాని వారాణసి
నయుతాబ్దములు తపం బాచరించి

గీ. లింగసంస్థాపనంబు గల్పించి లింగ
మధ్యమునయందుఁ గందర్పమథ(దమ)నుఁ గాంచి
జ్యోతిరభ్యంతరస్థు నావ్యోమకేశు
సంస్తుతించె నతండు విస్పష్టఫణితి. 73

వ. దేవదేవ! మహాదేవ! దేవా! (య) భయప్రద! నారాయణేం
ద్రాదిసర్వదేవవరప్రద! సంస్తుత్యుండవు, స్తోతవు, స్తుతివి,
సగుణుండవు, నిర్గుణుండవు, నామరూపవివర్జితుండవు, ఇచ్ఛా
జ్ఞానక్రియాశక్తులు నీయవి. ఒక్కరుండవయ్యును శివశక్తి
భేదంబునను ద్వైతంబు భజియింతువు. నీదక్షిణాంగంబు
బ్రహ్మ. నీవామాంగం బచ్యుతుండు. చంద్రసూర్యాగ్నులు
నీనేత్రంబులు. నీనిశ్వాసంబు శ్రుతులు. నీప్రస్వేదాంబు
వులు నదులు. నీశ్రోత్రంబులు సమీరణంబులు. నీభుజంబులు
దిక్కులు. నీముఖంబులుబ్రాహ్మణులు. నీబాహువులురాజన్యు

లు. నీయూరువులు వైశ్యులు. నీపదంబులు శూద్రులు. నీకేశంబు లంబుధరంబులు. నీవు ప్రకృతిపురుషరూపంబున బ్రహ్మాండంబు సృజియింతు. నీయంద సర్వభూతంబులుద్భవిల్లు. నీవ సర్వభూతమయుండ వని యనేక ప్రకారంబులం బూతాత్ముండు సంస్తుతింపం బ్రసన్నుండై పరమేశ్వరుం డతని కోరినదిక్పాలపదం బిచ్చి తనమూర్తులయందు నంశంబు ప్రసాదించి సర్వగత్వంబును, సర్వావబోధకత్వంబుc, బ్రాణాపానాదిపంచమూర్తిత్వంబు నొసంగె. అతఁడు కాశీక్షేత్రంబున జ్యేష్ఠేశ్వరుని పశ్చిమభాగంబున వాయుకుండంబు నుత్తరంబునఁ బ్రతిష్ఠించిన యప్పరమేశ్వరునకు నవ్యాత్మీపథంబున భోగమోక్షప్రదత్వంబు సంపాదించి యంతర్హితుం డయ్యె. ఇది గంధవతివృత్తాంతంబు. 75

## కుబేరవృత్తాంతము

క. నిగమజ్ఞ ! గంధవాహుని
నగరమునకుఁ దూర్పుదిక్కున గుణోదారం
బగుపట్టణ మదె యలకా
నగరం బది యేలు యక్షనాథుఁడు గరిమన్. 76

వ. అక్కుబేరునిచరితంబు చెప్పెద నాకర్ణింపుము. 77

తే. భూసురోత్తమ! కాంపిల్యపురమునందు
యజ్ఞదత్తాఖ్యుఁ డొక్కబ్రాహ్మణుఁడు గలఁడు
వేగవేదాంగవేదార్థవిత్తముండు
యజ్ఞవిద్యావిశారదుం డాద్విజుండు. 78

తే. అతనిపుత్త్రుండు గుణనిధి యనెడివాఁడు
దర్పకునితోడిజోడు సౌందర్యరేఖ

నెయ్య మలరంగ గుహు లుపనీతుఁ జేసి
చదువఁ బెట్టిరి వాని నాచార్యునొద్ద. 79

క. ద్యూతక్రీడారతుఁడై
యాతఁడు కితవులును దాను నాసాయం బా
ప్రాతస్సమయము దిరుగ న
పేతనిజాచారుఁ డగుచు నెల్లెడ వీటన్. 80

సీ. బ్రాహ్మణాచారంబు పరిహాసకము సేయు
నగ్నిహోత్రవిధాన మన్న నలుగు
సంధ్యాభివందనశ్రద్ధ యుజ్జన సేయు
గీతవాద్యవినోదకేళిఁ దగులుఁ
బాషండభండదుర్భాష లావర్తించు
ద్యూతకారులతోడి యుద్ది వడయు
ధాతువాదులమీఁదఁ దాత్పర్య మొనరించుఁ
జెలిమి వాటించు నాస్తికులతోడ

తే. నటుల మన్నించు హర్షించు విటులఁ జూచి
పీఠమర్దుల కొనరించుఁ బెద్దఱికము
కొలఁ చేయులఁ బాటించు గారవించుఁ
శిష్టకుల దీక్షితునిపట్టి సిగ్గు విడిచి. 81

వ. సజీవనిర్జీవద్యూతంబుల నోడినధనంబులు గితవులకుం దల్లి
మేనిరవణంబుల నమ్మి పెట్టుచుండు. 82

తే. తల్లి బోధించుఁ దత్పరత్వంబు గలిగి
యన్న ! మీయన్న చెప్పినయట్ల చేయు
ధూర్తసంగతి విడువు సాధువులతోడఁ
బరిచయము సేయు మని పుత్త్రు ప్రతిదినంబు. 83

వ. దీక్షితుండును గృహకార్యాభ్యంతరవ్యగ్రుండై కొడుకు వర్తనంబుఁ బరామర్శింపక యుండు. 84

తే. ఎడపఁ దడపఁ దనూభవుం డెచట నుండు
గానరాఁ డంచు గృహభర్త కాంత నడుగ
నింతదడవును నాయొద్ద నిచట నుండి
యరిగెఁ జదువంగ నని భర్త కలిప మొఱఁగు. 85

తే. స్నాన మాడెనె? వార్చెనే సంధ్య? యగ్ని
హోత్ర మొనరించెనే? యింతి? పుత్త్రుఁ డనిన
స్నాన మాడెను వార్చెను సంధ్య యగ్ని
హోత్ర మొనరించె ననుచును నువిద మొఱఁగు. 86

ఆ. గొడ్డువీఁగి కన్నబిడ్డండు కావున
నొక్కఁ డుండ కాన నుత్పలాక్షి
ధూర్తుఁ డైనవానిదుశ్చేష్టితము లెల్ల
నధిపుఁ నెఱుఁగనీక యడఁచుచుండు. 87

వ. చూడాకర్మానంతరంబున షోడశవర్షంబున గృహ్యోక్తప్రకారంబున నతనికి వివాహంబు చేసి ప్రత్యహంబును. 88

క. స్నేహార్ద్రహృదయ యై యతి
సాహసకృత్యములు మాన సమకొల్పుట కై
యూహాపోహవిచారస
మాహితగతిఁ దల్లి సుతుని మఱి బోధించున్. 89

తే. అన్న! మీతండ్రి కోపగాఁ డౌనొ కాఁడొ?
యేవు వొనరించుదుర్వృత్త మెఱిఁగె నేనిఁ
గల్లతనమున పలుమాఱు గప్పి పుచ్చు
నట్టినామీఁద జంపంగ గలుగ కున్నె? 90

సీ. సచ్ఛ్రోత్రియులు ననూచానులు సోమపీ
థులు నైనకులముపెద్దలఁ దలంచి
రాజమాన్యుఁడు సత్యరతుఁడు వినిర్మలా
చారవంతుఁడు నైనజనకుఁ దలఁచి
భాగ్యసంపదఁ బుణ్యపతిదేవతలలోన
నెన్నంగఁ దగియెడుననృ దలఁచి
వేదశాస్త్రపురాణవిద్యానిరూఢు లై
వాసికెక్కినతోడివారిఁ దలఁచి

తే. చెడ్డయింటిచెదార మై శివునికరుణ
నివ్వటిలునిర్వదేనేండ్లనిన్నుఁ దలఁచి
పదియునార్వత్సరంబులభార్యఁ దలఁచి
గోరతనములు మానురా! కొడుకుఁ గుఱ్ఱ! 91

తే. అఖిలకల్యాణగుణగణాయత్త యత్త
మామ యౌదార్యతేజగతమామహితుఁడు
మాతులుండు యశోమహిమాతులుండు
తనయ! యేలయ్య కైకోవు వినయబుద్ధి? 92

చ. విడువక నీవు పట్టణమువీథులవీథుల వెఱ్ఱివాఁడ వై
చెడుగులఁగూడి ధౌర్త్యములు సేయమహీరమణుండెఱింగెనే
విడుచును సోమయాజి మనువృత్తులు చేకొను నెల్లభంగులన్
జెడుదుము నీకతంబుననుఁ జీకయుఁ గూడును లేక పుత్త్రకా!

తే. పట్టణములోన నీవు దర్పమునఁ జేయు
కొయ్యతనములు వీక్షించి కూర్మితనయ!
నవ్వుదురు నిన్ను మొదల నానావిధముల
నవ్వుదురు దీక్షితుని ననంతరమ జనులు. 94

వ. అని యంత నిలువక. 95

తే. తల్లిబడి కొల్లి!చ(చె) ట్టంచు నుల్లసంబు
లాడుదురు నన్నుఁ గూర్చి ని న్నహరహంబు
దుర్ణయం బుల్ల నామీఁదఁ ద్రోచి జనులు
డబ్బఱలు పల్కువారి కడ్డంబు గలదె? 96

క. అవినయనిధాన మగునీ
నవయౌవనశైశవముల నడిమివయసునం
గవిసెడు వ్యసనోద్రేకం
బవగాఢము దీని మానవయ్య తనూజా! 97

వ. అని యనేకప్రకారంబుల బోధించినతల్లిమాటలు చెవులు సోఁకనీక యిట్టట్టనక యూరకుండె. మృగయామద్యపైశున్య వేశ్యాచౌర్యదురోదరపరదారాభిలాషంబు లనుదోషంబులు నవయౌవనారంభంబున సంభవించెనేని వానిం బరా వర్జింప నెవ్వరు నేర్తురు? గురువచనం బతినిర్మలంబయ్యు సలిలంబునుంబోలె శ్రవణస్థితం బైయభవ్యునికి శూల పుట్టించు నయథార్థనామధేయుం డగునగ్గుణనిధి యథాపూర్వంబు దుర్వర్తనంబులఁ దిరుగుచుండ నొక్కనాఁడు. 98

సీ. దర్శనం బిచ్చె నెద్దానిఁ గోమటి క్రొత్త
పాడచూప నేతెంచి భూభుజునకుఁ
దన కిచ్చె నెద్దాని ధారాంబుపూర్వంబు
పుణ్యకాలమునాఁడు భూమిభర్త
దా నిచ్చె నెద్దాని ధర్మగేహిని యైన
సోమిదమ్మకు మనఃప్రేమ మలరఁ

దఱి చూచి యిచ్చె నెద్దాని బట్టికిఁ దల్లి
జూడ మోడినపైఁడి సుట్టికొనిన
తే. న(య)ట్టినవరత్నమయ మైనయంగుళీయ
కంబు యజ్ఞావభృథపుణ్యకర్మసాక్షి
వీటిలో నొక్కజూదరివ్రేల నుండ
జూచెఁ గనుఱెప్ప వెట్టక సోమయాజి. 99

వ. చూచి తనసొమ్మౌట యెఱింగి దీక్షితుం డక్షక్రీడాజీవనుం గదిసి యెలుంగెత్తి యీయంగుళీయకంబు నీకెట్లు గలిగె? ఉన్నరూపు చెప్పు. తప్పఁ జెప్పితేని భూపాలుసన్నిధిం బెట్టి నిజంబు దెలిపి దండింతు ననిన జూదరి నీతనయుండు గుణనిధి నెత్తంబున నోడ్డినవిత్తంబునకై యీయంగుళీయకంబు నా కిచ్చె. మఱి బంగారుభృంగారుకర్కరీకలాచికలు, తలియలు, పళ్లెరంబులు, తామ్రపాత్రంబు, లారకూటఘటంబు లన్నియుం దాకట్టువెట్టియు దురోదరక్రీడాపరాయణుం డై పట్టణంబులోనం జరియించుచున్నవాఁడు. 100

తే. అక్షధూర్తులలోన నీయనుఁగుఁగొడుకు
దొరయునంతటి యక్షధూర్తుండు లేఁడు
క్షితితలంబున యాగదీక్షితులలోనఁ
గీర్తి నీయట్టియాగదీక్షితుఁడు లేఁడు. 101

వ. అనిన విని లజ్జాక్రోధంబులు మనంబున ముప్పిరిగొన యజ్ఞదత్తుం డర్థముండితం బైనమూర్ధంబున నీర్కావిదోవతి నఱిముఱిఁ జుట్టుకొని యింటికే తెంచి మొగంబు గంటువెట్టుకొని సోమిదమ్మ! ఏమిచేయుచున్నదాన! ఇటు రమ్ము! నీకొడు కెక్కడం బోయెఁ? బోవుఁ గాకేమి! విను మని యి ట్లనియె.

శా. అంగోద్వర్తనవేళ నీవు దరహాసాంకూరము ల్లోచనా
పాంగప్రాంతములం దిగుర్ప నొకసయ్యాటంబుఁ గల్పించి నా
యంగుళ్యాభరణంబుపుచ్చుకొనవా? యాయుంగరంబిప్పుడే
శృంగారింపనిచేతఁ బావకునకుం జేయం హావిర్దానమున్.

వ. అనిన నద్దీక్షితాయని దీక్షితున కిట్లనియె. 104

సీ. మధ్యాహ్నసంధ్యాసమాగమం బిది తీర్థ
మవధరింపుము నిత్యమాచరింపు
మగ్నికార్యముఁ దీర్పు మభవుఁ బూజింపుము
పంచమహాయజ్ఞపరుఁడ వగుము
మొగసాల నున్నారు జగతీసుపర్వులు
గ్రాసార్థు లగుచుఁ బెక్కండ్రతిథులు
పక్వాన్నములు శాకపాకాదికంబులు
చల్ల నాఱెనయేనిఁ జవులు దప్పుఁ

తే. బదిలముగ మందసమునందు బరిణలోన
నునిచి దాఁచినదాన మీయుంగరంబు
దీర దిప్పుడు పెట్టె శోధించి చూడ
నారగించినపిదప నే నధిప! తెత్తు. 105

తే. అనిన విని సోమయాజి కోపాగ్రహమునఁ
దత్తరించుచు వడి సోమిదమ్మఁ బలికె
నౌనె సత్పుత్రజనయిత్రి! యౌనె సాధ్వి!
యౌనె సూనృతభాషిణి! యౌనె దేవి! 106

సీ. స్వాధ్యాయ మెన్నండుఁ జదువఁగఁ బోకుండఁ
బోలునే చదువంగఁ బోయె ననుట?

తెల్లవాఱంగ నీటఁ దీర్థమాడక యుండ
　　ననురూపమే తీర్థమాడె ననుట?
సమయానుకూలత సంధ్యవార్వక యుండ
　　వైదగ్ధియే సంధ్యవార్చె ననుట?
తఱితోడ నగ్నిహోత్రము వేల్వకుండంగ
　　విజ్ఞానసరణియే వేల్చె ననుట?
తే. కల్లలాడంగ ఫల మేమి గలిగె నీకు?
మాటి మాటికి నేను నీమాట నమ్మి
యరసి రక్షింప నేరక యనుఁగుఁగొడుకు
భ్రష్టుఁ జేసితి నేమి చెప్పంగఁ గలదు? 107
సీ. ఏడఁ బోయెనో కదా మేడలో మంజిష్ఠి!
　　పెనుబందువునఁ నైన బెట్టఁ జాలఁ
డాకట్టు వడదె యింతకు వైశ్యగృహమున
　　కనకకర్కరిలభృంగారుకంబు?
పట్టుసూత్రమయంబు పసిఁడియొడ్డాణ మే
　　యిగురుఁబోఁడికటీర మెక్కె నొక్కొ!
శశికాంతపీఠికా స్తంభలీలారత్న
　　సాలభంజిక యెందు సాఁగె నొక్కొ!
తే. ఎచట నున్నదియొకొ రత్నఖచిత మైన
హంసతూలిక డోలావిహారతల్ప
మూఁచముట్టుగ నీవు నీయొంటికొడుకుఁ
బాడుచేసితి గృహము నిర్భాగ్యురాల! 108
తే. చాలు నింక నాపాలికిఁ జచ్చినాఁడు
కొడుకు గుణనిధి యనువాఁడు కులవిషంబు

తిలలు దర్భయు నుదకంబుఁ దెత్తుగాఁక
యే నివాపాంజలుల వాని కిత్తు నిపుడు! 109

వ. కుపుత్రత్వంబుకంటె నపుత్రత్వకంబు మేలు. కులపాంసనుం డైనవీని నొక్కనిం ద్యజించి కులంబు రక్షించుట నీతియ కదా! యని పలికి కోపావేశంబునఁ బెదవు లదరఁ గటంతటం బులు చిటుల భ్రూకుటి నిటలంబున నటింపఁ గటాక్షం బులు గెంపు గదురం గటకటం బడుచు నాహ్నికం బైన క్రియాకలాపంబు నిర్వర్తించి యాగ్రహంబునఁ గృతార్థత్వం బునొందఁ గొన్నిదివసంబులకు నొక్కశ్రోత్రియునిపుత్రిం బెండ్లియాడి యజ్ఞదత్తుండు గృహస్థధర్మంబు నిర్వర్తించు చుండె. అంతకమున్న గుణనిధి తండ్రికోపం బెఱింగి యిం టికిం బోవక యెందేనియుం జనువాఁడ నని మనంబున నిట్లని వితర్కించె. 110

తే. ఏమిసేయుదు? నెక్కడి కేగువాఁడ?
ధనము నిష్పచ్చరంబు విద్యయు హుళిక్కి
పెట్ట సాఁగెడునాచేయి భిక్ష సేయ
నెట్లు నేరుచు? దైవంబ యెఱుఁగు నింక. 111

తే. ఏభయంబుల నెచ్చోట నెనయలేదు
నరున కేప్పాట విద్యాధనంబ ధనము
చోరబాధాదికముచేతఁ జూఱవోవు
ధనము ధన మానె యెన్నిచందములఁ దలఁప? 112

గీ. అక్కటకట! దురోదరవ్యసన మెట్లు?
యాయజూకవిశిష్టాన్వవాయ మెట్లు?
ఎట్లు చేసినఁ జేసెఁ గాకే మనంగ

1. కములచేఁజూఱ.

నేర్చువారము? విధి దయానిస్వహృదయు. 113

చ. అరుణగభస్తిబింబ ముదయాద్రిపయిం బొడతేర గిన్నెలోఁ
బెరుఁగును వంటకంబు వడపిందియలుం గుడువంగఁ బెట్టుని
ర్భరకరుణాధురీణ యగుప్రాణముప్రాణము తల్లి యున్న దే?
హరహర! యెవ్వరింకఁ గడుపారఁగఁ బెట్టెద రీప్సితాన్నముల్.

వ. అనుచు నెందేనియుం జనియె నంత. 115

మాలిని.—

ఘుసృణకుసుమమాలాకోటిపాటల్యలీలన్
గిసలయములచాయం గ్రచంచూపుటశ్రీ
విసృమరసృమరోర్ణావిభ్రమప్రౌఢి మింటన్
బిసరుహహితదీప్తుల్ పింగళత్వంబు నొందెన్. 116

తే. పాటలాంశుజటాభారభాసురుండు
భార్గవుఁడు వోలె నోలాడె భాస్కరుండు
రాగరక్తచ్ఛటానిర్ఝరప్రపూర్ణ
చరమసంధ్యాశమంతపంచకనదముల. 117

వ. వెండియు ధాతారకూటపాటలకోమలాతపంబై వాసరంబు
పలుచం బాఱె. అస్తాద్రికిరీటకూటంబున దరవికచనిచులకుసు
మమంజరీపుంజంబునుం బోలె మిహిరబింబంబు చూపట్టె.
చరమధరాధరధాతుధారాప్రవాహంబునుం బోలె సంధ్యా
రాగంబు గగనమండలంబు నాక్రమించె. చైత్యద్రుమం
బులు నిద్రా(వ్ర)ణద్రోణకాక కాకాకారకాకుకోలాహలంబు
కులకులాయమానంబు లయ్యె. అంధకరిపుకంధరామూల
కాలకూటచ్ఛాయాశ్రేణిపాణింధమం బై యంధకారంబు
బ్రహ్మాండమండలంబు నాచ్ఛాదించె. రజనీశుక్తిముక్తాఫలం

బులు చుక్కలు వొడిచె. భవిష్యద్వాసరకరకరప్రరోహ
బీజాంకురంబులుంబోలెఁ బ్రదీపంబులు భవనాంతరంబుల
వెలింగె. అప్పుడు గుణనిధి పేరాఁకలిపేర్చు కార్చిచ్చునుం
బోలెఁ బెచ్చుపెరిఁగి యందంద కడుపు మండింప వంటకం
బెక్కడఁ గలుగునో యని చింతాక్రాంతుండై యున్నయవస
రంబున నద్దినంబు రాత్రి శివరాత్రి యగుటంజేసి శైవుం
డొక్కరుండు నగరబాహ్యప్రదేశంబున నొకశివలింగస్థానం
బున జాగరణంబుఁజేసి నాలుగుజాములు నుపహారంబులు
సమర్పించువాఁడై నియమవ్రతంబుఁ బూని భక్తివిశ్వాస
తాత్పర్యాతిశయంబున. 118

సీ. మరిచిథూళీసాళిపరిచితంబులు మాణి
బంధాస్మలవణపాణింధమములు
బహుళసిద్ధార్థజంబాలసారంబులు
పటురామఠామోదభావితములు
తింత్రిణీకరసోపదేహధూర్ధురములు
జంబీరనీరాభిచుంబితములు
హైయ్యంగవీనధారాభిషిక్తంబులు
లలితకుస్తుంబరూల్లంఘితములు

తే. శాకపాకరసావళిసౌష్ఠవములు
భక్ష్యభోజ్యలేహ్యంబులు పానకములు
మున్నుగాఁ గల యోగిరంబులు సమృద్ధి
వెలయఁ గొనివచ్చె నొండొండ వివిధములను. 119

వ. అప్పుడు భూసురప్రవరుండు నాసికాపుటకుటీకుటుంబి యగు
పక్వాన్నగంధంబు గాలివెరవున నాఘ్రాణించి యాయ

న్నంబు నాకు నెబ్బంగిఁ గుడువ సమకూఱునొకో యని యప్పరిమళంబుసవ పట్టుకొని పోయి శంభుభవనద్వారం బునం గూర్చుండి నృత్తగీతవాద్యంబులు ప్రవర్తిల్ల సరిప్రొద్దు వోవునం దాఁక వీక్షించుచు జాగరంబు చేసి యంతంత సాగి ప్రజలు చొక్కు మడంగి యుండఁ దా నయ్యవసరంబున. 120

సీ. కట్టాయితంబుగాఁ గటిమండలంబునఁ
దీర్చి దట్టీచేల దిండు గట్టి
తలుపు గిట్టిన కుండఁ దరిమి కొంచెం బైన
యోరవాకిట దేహ మొయ్యఁ జొనిపి
మునివ్రేళు లొయ్యొయ్య మోపి చప్పుడు గాని
పరిపాటి బవనంబుఁ బట్టి నడచి
దీపాంకురచ్ఛాయఁ దెలివి చాలనియట్టి
కోనచీఁకటి లోని కొనరఁ జొచ్చి

తే. పళ్లెరములం దపూపసూపములతోడ
ననఁటిపండులతోడ నాజ్యంబుతోడ
దధిపయఃగ క్షౌద్రబహుపదార్థములతోడ
ధవళకలమాన్న మీక్షించె ధరణిసురుఁడు. 121

తే. గర్భమంటపదీపికాకలిక యపుడు
దశ చెడఁగ గాలి నిర్వాణదశ వహింప
దీప్తిసంధుక్షముగఁ జేసి తెలివి పడఁగ
నన్న మీక్షింపఁ దలఁచె బ్రాహ్మణకులుండు. 122

శా. గ్రుక్కిళ్లిఁగుచునొక్క యోదనమహాకుంభంబునీక్షించువాఁ
డక్కోణంబున మందరశ్మియగుదీపాంకూరముల్ మీఁదికై

యొక్కండ్రోచిఘృతంబు నించి నిజవస్త్రికాంశముంజించిచే
నొక్కవత్తిగ నేఁతఁదోఁచెనుశిఖనొ్యజించెవైశ్వానరున్.

సీ. పక్వాన్నపాత్రంబు పాణిఁ గైకొని బహి
ర్ద్వారభూమి భుజించువాంఛ నపుడు
వెల్వడి వచ్చుచో విధివశంబున వాని
కాలివ్రే లొకనియంగంబు దాఁకెఁ
దాఁకిన వాఁడు తత్తఱపాటుతో మేలు
కని మ్రుచ్చు మ్రుచ్చని కళవళించెఁ
గళవళింప గతానుగతికమార్గంబున
నాక్రోశ మొనరించి రఖిలజనులు

తే. నన్నపాత్రంబు విడువక యవనిసురుఁడు
పాఱె భయవిహ్వలుం డయి బయలువట్టి
వెంటఁ దగిలి తలవరులు వెణగుపడఁగ
బాణముల నేసి చంపి రా బ్రహ్మకులుని. 124

తే. అతనిఁ గొనిపోవఁ బనిఁ బూని యమునిభటులు
వరుణపాశోగ్రహస్తులై వచ్చి రపుడు
వానిఁ గొనిపోవఁ బనిఁబూని వచ్చి రపుడు
త్ర్యంబకునికింకరులు విమానంబు గొనుచు. 125

వ. అనంతరంబపట్టిస త్రిశూలఖట్వాంగ ప్రముఖబహువిధ ప్రహరణపాణు లగుపినాకపాటిభటులం జూచి భీతులై కృతాంతకింకరులు కరపంకజంబులు మొగిచి వారి కిట్లనిరి. 126

తే. అభవుకింకరులార! మహాత్ములార!
తగవు ధర్మంబు పాడి పంతంబు దెలియు
మీరు నడ్డంబు గలరె ముల్లోకములను?

నెంతవారము మేము మీయొదుర నిలువ? 127

వ. వీఁడు కులాచారహీనుండు, పితృవాక్యపరాఙ్ముఖుండు, సత్య శౌచపరిభ్రష్టుండు, సంధ్యాస్నానవర్జితుండు, శివనిర్మాల్యా పహర్త. వీనియందొక్క ధర్మంబు లేశంబు గలిగిన నానతిండు వినియెదము. వీనిపుణ్యాపుణ్యావివేకంబునకు మీర ప్రమాణం బనినఁ గృతాంతకింకరులవాక్యము లాకర్ణించి శివ కింకరులు వారి కి ట్లనిరి. 128

క. శివధర్మం బతిసూక్ష్మము
శివధర్మము లేశమైన సిద్ధించినచో
వివిధమహాపాపోప
ద్రవములు చేరంగ రావు ధన్యుని నతనిన్. 129

తే. స్థూలదృష్టి వీక్షించినఁ దోఁపకుండు
సూక్ష్మదృష్టి వీక్షించినఁ జూడ్కి కందుఁ
గాన శివభక్తిధర్మం బగాధమహిమ
కానవచ్చినయ ట్లుండ గానరాదు. 130

క. ఆచారం బిది యనఁగ న
నాచారం బిది యనంగ నజునకు నైనన్
గోచరము గాదు శివధ
ర్మాచారము సూక్ష్మరూప మై వర్తిల్లున్. 131

వ. ఇతఁడు చేసినపుణ్యకర్మంబు వినుండు. 132

సీ. అశన మబ్బక యున్న నైనను శివరాత్రి
యోరంతప్రొద్దును నుపవసించి
నోగిరంబు హరింప నొన వెట్టుకొని యైన
వేగునంతకుఁ జేసె జాగరంబు

పాత్రావలోకనోపాయంబునకు నైన
వెల యించెదీపంబు వెలుఁగఁ బాఱఁ
జూడ నొల్లక యైనఁ జూచె నీశ్వరుమౌళిఁ
బరులు చేసినయట్టిప్రసవపూజఁ

తే. జచ్చె విధి మూఁడి యైనను జంద్రధరుని
నగరిమోసాలఁ బెంద్రోవనట్టనడుమ
సూక్ష్మదృష్టి విచారించి చూచినప్పు
డింతకంటెను ధర్మంబు లెవ్వి గలవు? 133

వ. అని పారిషదులు యమదూతల వీడ్కొలిపి యతనిదివ్య విమానారూఢుం జేసి శివలోకంబునకుం గొనిపోయి శివుని సన్నిధిం బెట్టిరి. శివుండును బ్రదీపతేజస్సంధుక్షణాదిక పుణ్యానురూపం బైనఫలంబునం గళింగదేశాధిపతి యైన యరిందమునకుఁ దనయుండై దముం డనుపేర నాదేశంబునకు రాజుగా ననుగ్రహించి పుత్తెంచె. ఈశ్వరానుగ్రహంబునం బట్టాభిషిక్తుండై. 134

క. చాటించెఁ గళింగేంద్రుఁడు
వీటను దేశమున శంభువేశ్మంబులలోఁ
బాటించి దీపకళికా
కోటు లసంఖ్యములు మెండుకొని యుండుటకున్. 135

క. ఇలువరుసఁ జంద్రశేఖరు
నిలయంబున దీపకళిక నిలుపనివారిన్
దలఁ ద్రెవ్వఁగ వ్రేయుం డని
తలవరులం బంచె రాజు తనదేశములన్. 136

వ. దీపికాదానపుణ్యప్రభావంబున నక్కళింగాధిపతి జన్మాంతరంబు

నం గుబేరుం డై యీశ్వరునకు సఖుం డయ్యె. ఆవృత్తాంతంబు వివరించెదము, సావధానమతి వై యాకర్ణింపుము.

సీ. పద్మకల్పమునందు బ్రహ్మమానససరో
జమునఁ బులస్త్యుండు సంభవించె
నాపులస్త్యునకు మహామునిప్రవరుఁ డా
విర్భావమునఁ బొందె విశ్రవస్సు
విశ్రవస్సునకుఁ దపశ్శ్రీసనాథుండు
వైశ్రవణుఁడు సముద్భవము నొందె
వైశ్రవణుండు సర్వజ్ఞు నెచ్చెలికాఁడు
పాలించె లంక యక్షపట్టణంబు
తే. ఘనయశుఁడు మేఘవాహనకల్పవేళ
యాజ్ఞదత్తి ధనేశ్వరుం డయ్యెఁ బిదపఁ
జిత్రకాశికఁ గాశికఁ జేర వచ్చి
శివుఁ బ్రతిష్ఠించె నవిముక్తసీమయందు. 138

మ. అవిముక్తంబున యాజ్ఞదత్తి శివు నీహారాద్రిరాట్కన్యకా
ధవునిం దప్పకచూచుచుండె నయుతాబ్దంబుల్ నిమేషక్రియా
వ్యవహారస్పృహ లేని నేత్రములఁ జర్మాస్థుల్సిరావల్లరీ
నివహంబుల్ పరిశుష్కముల్గ నభివర్ణింపంగఁ ద్రైలోక్యమున్.

సీ. గజదైత్యదమనుండు కార్పాసఫలతూల
వర్తిప్రరోహభావము భజింప
వడఁకుగుబ్బలిరాచవారికూరిమికన్య
యాలంబనస్తంభయష్టి గాఁగఁ
బరమవిశ్వాసతాత్పర్యనిర్భరభక్తి
సంపద్విశేషంబు చమురు గాఁగఁ

ప్రవితతధ్యానధారాసముచ్ఛ్రాయంబు
సమధికోజ్జ్వలతరజ్వాల గాఁగ

తే. గామమును గ్రోధమును నాదిగాఁగఁ గలుగు
శాత్రవులు పాతకము లైనశలభములుగ
విమలసుజ్ఞానదీపంబు వెలుఁగఁ జేసె
నప్రతిమధైర్యసంపత్తి యాజ్ఞదత్తి. 140

తే. విమలవిజ్ఞానదీపంబు వెలుఁగుచుండ
శాంతిధారాజలంబుల జలక మార్చి
భవునిఁ బూజించె భావపుష్పముల భక్తి
నతివిశుద్ధమనోవృత్తి యాజ్ఞదత్తి. 141

వ. అవ్విధంబున యాజ్ఞదత్తివిజాతీయప్రత్యయాన్యరహితసజాతీయప్రత్యయసంతానానువృత్తిరూపం బైననిదిధ్యాస(న)ంబున నివాతనిష్కంపదీపంబునుం బోలెఁ బెద్దగాలంబు కాలకంఠు మంగళ జ్యోతిర్లింగమూర్తి నంతరంగంబున జన(న)ంబు సేయుచుండిన నాఖండేందుమౌళి ప్రసన్నుండై వత్స! వరంబు వేఁడు మనిన నర్ధనిమీలితంబు లైన లోచనంబు దెఱచి కనుంగొనునప్పుడు శతసహస్రకోటిసూర్యప్రభాభాసురం బైనతేజోమండలంబునడుమ ఫణికుండలుండును, దప్తారకూటపాటలజటాజూటకోటీపినద్ధముగ్ధేందునడును, దుగ్ధధారాధవళస్నిగ్ధభసితదిగ్ధశుద్ధదేహుండు నయిం యద్దేవతామూర్ధాభిషిక్తుం డర్ధాంగలక్ష్మి యైనభవానితోడం గూడి పొడ చూపినవిధూమధూమకేతనజ్వాలాజాలంబుతో మేలంబాడునమ్మృడునొడలిదీప్తిమిఱుమిట్లుగొనుచు వెఱచ ఱవ నఱిముఱిం జఱచినం దూరఁదారుపోయి యతనికన్నుల

శక్తి గడతేర నంధుం డై యంధకారాతి నందంద తలవ
కారఛాందోగ్యముండకైతరేయబృహదారణ్యకశ్వేతాశ్వత
రాద్యుపనిషత్తులనుబంచబ్రహ్మపంచాక్షర ప్రణవాదిమంత్రం
బుల నారాధించి యంజలిపుటంబు లలాటతటంబున ఘటి
యించి నిర్నిరోధనిరవగాఢకరుణాసుధాపూరపూరితాంతః
కరణ! శరణు; దేవతాకోటికోటీరకోటీఘటితమణిమయూఖ
రేఖాపుంజకింజల్కితంబులు, త్రయ్యంతవిద్యాసీమంతినీసీ
మంతసీమాసిందూరపరాగపాటలంబులు, కుటిలకృతాంత
దంతతాడనక్రీడానిష్కృపంబు లగు మీశ్రీపాదపద్మం
బులు దర్శించునట్టిసామర్థ్యంబుఁ గృపసేయవే! యిదియ
నాకు వరం బనినఁ ద్ర్యంబకుండు బింబఫలారుణాధరంబునం
జిఱునవ్వు చిగురుకొనం దపస్వికి దివ్యదృష్టి యొసంగినం
గృతార్థుండై యతండు. 142

చ. చులుకన మేలుకన్నతొలుచూపునఁ జూచెఁ బినాకపాణిదా
పలిదెస షోడశబ్దముల ప్రాయము మత్తచకోరనేత్ర ను
త్పలదళకోమలామలవిభారమణీయమనోజ్ఞగాత్రిఁ గుం
డలకనకాంగులీయకకనద్బహురత్నవిభూషణోజ్జ్వలన్. 143

వ. అయ్యవసరంబున. 144

చ. వకుళఫలానుకారు లయి వట్రువలై మెఱుఁగారుక్రొత్తమా
క్తికములపే రొకింత తళుకింపఁగ వీనుల హేమరత్నక
ర్ణికలు చలింప నందియలక్రేంకృతిఁ గంకణమేఖలాధ్వనిం
బ్రకటము సేయు మందగతి భాస్వరనవ్యవిలాసమేర్పడన్.

తే. అసమబాణపునర్జీవనౌషధంబు
రాగజలధివిధూదయారంభవేళ

సకలజగదేకసౌభాగ్యజన్మభూమి
శంభుఁ డాయంగ వచ్చె నాశైలకన్య. 146

వ. ఇవ్విధంబున డాయవచ్చి కాలోన్మీలితశిరీషకుసుమకేసర
మాలాసుకుమారంబు కస్తూరికాస్థాసకముద్రాభిముద్రితం
బును నైనభుజంబు భుజగాభరణభూషితం బైనఫాలలో
చనుభుజం బొరయునట్లుగా నిలిచినం జూచి యాజ్ఞదత్తి
చిత్తంబునందు. 147

సీ. ఎవ్వతె యొకర్తె యీయిందుబింబానన?
జగదేకసౌభాగ్యజన్మభూమి!
కమలాయతాక్షి నాకంటె వెగ్గలముగా
నెటు చేసె నొకర్తె తా నీతపంబు?
పరమేశుఁ డిబింబఫలపాటలాధర
నను మీఱ మన్నించినాఁడు మేలె?
భాగ్యంబు గా కేమి బాలేందుశేఖరు
కృపఁ గాంచె నీరాజకీరవాణి!
తే. యనుచుఁ గ్రేగంట నీరసం బావహింపఁ
గినుపుకిలికించితము నాత్మఁ గీలుకొనఁగ
సవతి వీక్షించుప్రౌఢయోషయును బోలె
బ్రాహ్మణుఁడు చూచెఁ బర్వతరాజతనయ. 148

వ. అప్పుడు. 149

సీ. కృత్యపంచకము సాగింపలేఁ డేయింతి
ప్రాపు లేక కృతాంతభంజనుండు
నిండుఁజందురుని జంద్రిక వోలె నేభామ
పంచబాణవిరోధిఁ బాయకుండు

నేలేమ శశిమౌళి కిచ్ఛాక్రియాజ్ఞాన
 శక్తులై కల్పించు సకలజగము
నేగంధగజయాన హృదయ మువ్విళ్లూర్చి
 భవునిమై చక్కఁ బాఁబాలుఁ గొనియె
తే. మహితహృల్లేఖ కామమహామంత్రమునకు
నేవరారోహ ముఖ్యాధిదైవతంబు
సకలజగదధిష్ఠాత్రి యాశైలపుత్రి
విభున కిట్లని మధురోక్తి విన్నవించె. 150

ఉ. త్ర్యంబక! యీతఁడెక్కడిదురాత్మకుఁ? డీయవలక్షణం బపాం
గంబుల మాటిమాటికిని గన్గొనుచుం బహుభంగులన్వికా
రంబులు చూపెడుం దరతరంబ యబద్ధము లాడెడుం రహ
స్యంబున వీని కిట్టిచన వబ్బుట నీకృప పెంపునం జుమీ! 151

క. నారూపమునకు మదిలో
నీరసపడుచున్న వాఁడు హృదయేశ్వర! ని
ష్కారణముగ నీచందం
బారసి యెఱుఁగంగవలయు నని పలుకుటయున్. 152

వ. మందస్మితసుందరవదనారవిందుం డై యిందుధరుండు ధరా
ధరపుత్త్రి కిట్లనియె.

చ. మనమునయందు నెగ్గులును మానుము పర్వతపుత్త్రి! వీఁడునీ
తనయుఁడు నందనుల్బహువిధంబుల ధౌర్త్యములాచరించినం
గినియునె తల్లి భావమునఁ? గీ ల్పరికించిన దేవతావలం
బనపరభావ మై పరఁగుభావవిలాసము లీప్రకారముల్. 154

క. ఈకాశీక్షేత్రమున న
నేకాబ్దము లాచరించె నీతఁడు తప మ

స్తోకగుణా ! యీపుణ్య
శ్లోకునిఁ గరుణార్ద్రదృష్టిఁ జూడఁగ వలయున్. 155

క. ఏ వర మిచ్చెద వీనికి
నీవును వర మిమ్ము నాకు నీకును భేదం
బావిష్కరింపవచ్చునె ?
యేవారికి నైనఁ బర్వతేశ్వరతనయా ! 156

వ. అనిపలికి పరమేశ్వరుండాయాజ్ఞదత్తికి యక్షకిన్నరగుహ్యక
లోకాధిపత్యంబును తన సఖ్యంబును నిచ్చె భవానియు. 157

సీ. ఎడమలోచనము గ్రుడ్డెగసి గవ్వయుఁ బోలె
నుబ్బూఁత లూఁగంగ నుండుఁ గాక
కుడికన్ను తారకాగోళంబు పల్లయై
యొండులోచనముతో నొరయుఁ గాక
యీశుండు గృప చేసి యిచ్చినట్టివరంబు
లట్ల యౌఁ గాకయం చానతిచ్చె
నాయొప్పిదమున కసూయ సేసితి గాన
నభిధఁ గుబేరుండ వగుదు గాక

తే. కాశియం దీవు నిలిపిన కాలకంఠ
దివ్యలింగంబు సర్వసిద్ధిప్రదంబు
నఖిలలోకాభివర్ణనీయంబు నిఖిల
పాపహారమును నగుఁ గాక భవ్యచరిత ! 158

వ. అని పార్వతీదేవి యతని గారవించె నిది యాజ్ఞదత్తి పుణ్య
చరితంబు. 159

మ. ధనవంతుండగు బుద్ధిమంతుఁడగు విద్యావంతుఁడౌ సాధునం
దనవంతుండగు బుత్రవంతుఁడగుఁ గాంతావంతుఁడౌ నిత్యశో

ధనవంతుండగుఁగీర్తిమంతుఁడగుసత్పుత్రధాన్యవంతుండగుఁ
ధనదాధీశ్వరు మానవోత్తముఁడు సందర్శించి కాశీస్థలిన్.

వ. విశ్వేశ్వరశ్రీమన్మహాదేవు దక్షిణభాగంబునఁ గుబేరేశ్వరస్థా
నంబునందుఁ గుబేరేశ్వరుసేవించినవారికి నణిమాద్యష్టైశ్వ
ర్యంబులు సిద్ధించు నని యిట్లు యాజ్ఞదత్తికి నభిమతంబులం
బ్రసాదించి దేవుండు దేవీసహితుం డై యనతిదూరం బైన
పదంబు ప్రవేశించె. ఈ ప్రకారంబున శంభుతోఁ జెలికా
రంబు వడసి ధనదుఁడు. 161

సీ. ఏపట్టణమునకు నెలదోఁట నందనా
రామంబుతోఁ జైత్రరథవనంబు
క్రీడావిహారదీర్ఘిక యేపురమునకు
మధురామృతాంబువు మానసంబు
మాణిక్యముకురబింబంబు కైలాస మే
నగరివారవధూజనప్రతతికి
నేవీటిపొలిమేర యింత యం తనరాని
దవ్వుల నున్న యుత్తరపుదిక్కు

తే. యట్టియలకాపురము నిధానాధివరము
రాజధానిగఁ దారకారాజమౌళి
రాజితం బైనకృపపెంపు ప్రాపు గాఁగ
రాజరాజేలె నెరవైనరాజసమున. 162

వ. ఆరాజరాజు రాజీవభవహరిపురందరాదిబృందారకమకుట
సందానితవికచమందార కుసుమమాలా మకరందబిందుధా
రాధౌతచరణారవిందుమందరాచల మంథాన మథ్యమాన
దుగ్ధజలనిధిగర్భావిర్భూత కాలకూటకృపీటభవపిండగండూ

పాకళంకితకంఠమూలోపకంఠకంఠోక్తభువన రక్షాదాక్షిణ్య
దాక్షాయణీకుచకలశపాలికేలి కస్తూరికామకరికా ముద్రాభి
ముద్రితవక్షఃకవాటుఁ బశ్వల్లలాటుఁ గుటిలసుధామయూఖ
శకలవిచికిలకలికాకల్పితావతంసుఁ బాంసుక్రీడాపరిచయవేళలం
బగుశైశవ స్నేహానుబంధంబునంబోలె నిరభిసంధిస్నేహ
బాంధవంబున భజియించు. ఇది యక్షాధిపలోకస్వరూపంబు.
ఈయాఖ్యానంబు సర్వపాపహరంబు. ఇంకనీశానలోక
స్వరూపంబు వివరించెద మాకర్ణింపుము. 163

ఈశానలోకవృత్తాంతము

తే. అలకయాల మహోదయ మన్పురంబు
బ్రాహ్మణోత్తమ! యీశాను రాజధాని
యందు నుందు రజైకపాదాదు లైన
పదురు నొక్కండు రుద్రులు పారిషదులు. 164

సీ. ఫాలభాగముల నంబకము లందఱికిని
నవతంసశశిరేఖ లందఱికిని
డమరుఖట్వాంగఖేటకము లందఱికిని
హస్తిచర్మపటంబు లందఱికిని
శ్యామకంఠప్రదేశమ్ము లందఱికిని
నౌపవాహ్యవృషంబు లందఱికిని
బవమానభుక్కలాపంబు లందఱికిని
నాపాండుదేహంబు లందఱికిని

తే. నందఱికి నగ్నితాపతప్తారకూట
పాటలచ్ఛాయఘనజటాబంధనములు

దేరికోనఁ జూడు మీశానుదిక్కునందు
బ్రాహ్మణోత్తమ! రుద్రుల పారిషదుల. 165

వ. ఇందటు నానందకాననంబుననందు నీశానదేవుదివ్యలింగంబుఁ బ్రతిష్ఠించి యారాధించి తత్ప్రసాదంబున నీశానదిక్కునందు శాశ్వతసుఖైశ్వర్యంబులనొందినారు. 166

తే. కాశి నీశానదేవు శ్రీకంఠుఁ గొలిచి
కాంచు మనుజుఁడు హృదయసంకల్పసిద్ధి
కాశికాక్షేత్ర మష్టదిక్పాలకులకుఁ
గామనావాప్తిసంకల్పకల్పతరువు. 167

వ. అనిన విని (యనంతరంబ) కొంతద వ్వరిగి శివశర్మ వారల కిట్లనియె. 168

సీ. ఆవేశఘూర్ణంబు లఖిలేంద్రియములకు
శృంగారరససముజ్జీవనములు
శంబరాంతకభుజాజయకీర్తిమహిమలు
కోకదంపతులదృక్కూలశిఖలు
బ్రహ్మాండపురవీథిరత్నతోరణములు
యామినీకర్పూరహారలతలు
నీరదాధ్వాంభోధినిబిడాంకురంబులు
కుముదకాననములకూర్మిచెలులు

తే. గరళకంఠాట్టహాసంబుగర్వరేఖ
కైటభారాతినవనాభికమలశోభ
చంద్రికలు గాయుచున్నవి సాంద్రలీల
భువన మిది యెద్ది? మిగులనద్భుతమొనర్చె. 169

వ. అనినఁ బుణ్యశీలసుశీలు రతని కిట్లనిరి. 170

## చంద్రలోకవృత్తాంతము

మ. మధురాపట్టణవిప్రముఖ్య! శివశర్మా! వేదశాస్త్రాగమాం, బుధి
చంద్రోదయ! చంద్రలోక మిది యాప్రో లేలుచుండుంగళా
నిధి యాత్మీయమయూఖకందళశిఖానిష్ఠ్యూతధారాసుధా
విధులం భానుగభస్తితప్త మగునీవిశ్వంబు రక్షించుచున్.

వ. సర్గాదియందు శతానందుండు నేత్రంబులను మరీచి, హృద
యంబున భృగువు, శిరంబున నంగిరసు, నుదానంబునం
బులస్త్యు, వ్యానంబునం బులహు, నపానంబునం గ్రతువు,
ఘ్రాణంబున దక్షు, శ్రోత్రంబున నత్రి, సమానంబున వసిష్ఠు,
సంకల్పంబున ధర్ము సృజియించె. అందు నత్రి యనుము
నీశ్వరుఁడు. 172

క. త్రిసహస్రదివ్యవర్షము
లసదృశధృతి నాచరించె నాతఁడు దపముం
విసమాన మతనితేజో
రసపూరం బెగసె బ్రహ్మరంధ్రము దాఁకన్. 173

సీ. బ్రహ్మరంధ్రము మోవఁ బ్రాఁకి యయ్యింద్రియ
ద్రవ మోడిగిల్లె నేత్రములలోన
నేత్రగోళంబులు నిండంగఁ బర్వె యా
వీర్యంబు కలధౌతవిమలకాంతిఁ
బదిధార లై పాఱెఁ బదిదిక్కులందును
నమరాపగానిర్ఝరమునుబోలె
స్రవియించుచున్న యాచరమధాతురసంబు
ధరియించి చూలయ్యె దశదిశలును

తే. నెలలు తొమ్మిది మోచి కాష్ఠలు గఠోర
గర్భ లై సూతిమాసంబు గదియుటయును
సత్త్వభారంబు భరియింప శక్తి లేక
వ్రాలె భూమండలంబుపై వడఁకి వడఁకి. 174

వ. ఆదిగ్దేవతలగర్భంబున నుద్భవించిన తేజం బేకీభవించి చందు
రుండై యఖిలజగద్ధితార్థం బయ్యరవిందభవునాజ్ఞ నతనిదివ్య
స్యందనం బెక్కి యష్టాదశద్వీపంబులం జరియించి తనకుం
దాన వృద్ధిఁ బొందె. అతనితేజోనిస్సరణంబున సకలజగదు
పకారం బగునదీనివహం బుద్భవించె. అట్లు వర్తించి యాసు
ధాకరుం డవిముక్తస్థానంబున నమృతలింగమూర్తిఁ జంద్రేశ్వ
రాహ్వయు నీశ్వరుం జంద్రమౌళిఁ దనపేరం బ్రతిష్ఠించి
యమృతోదర(క)ం బనుకుండంబు నిర్మించి తత్సమీపంబున
బహుదివ్యవర్షంబులు దపంబుచేసి యాదేవదేవుని ప్రసాదం
బుననోషధీతోయంబులకు నగ్రజన్ములకు రాజయ్యె. అమ్మహా
దేవుననుగ్రహంబున వెండియు నాజైవాతృకుండు. 175

ఉ. ఏటికిఁ దానకం బయినయిక్షుశరాసనవైరిజూటికా
కోటికి మల్లికాకుసుమగుచ్ఛము తేవ వహించి కైకొనుఁ
బాటలిమంబు మేనపరిపాటివినోదనవేళఁ బార్వతీ
పాటలగంధిచారుపదపద్మనఖంబుల క్రొత్తలత్తుకన్. 176

తే. రాజరా జయి పాలించె రాజసమున
వసుధ యెల్ల నేకాతపవారణముగఁ
గాశికాక్షేత్రమునఁ బెద్దగాల మేనిఁ
దపము చేసిన బహులఖేదంబు వాయు. 177

వ. అంతనక్కాశియందు హిరణ్యగర్భాత్రిభృగువులు ఋత్విజు

లుగా హరి సదస్యుండుగా సినీకుహూవాద్యతిపుష్టిప్రభావ
సుకీర్తిధృతిలక్ష్ములనం దొమ్మండ్రుధర్మపత్నులతోడం గూడి
యుమామహేశ్వరప్రీత్యర్థంబు రాజసూయాధ్వరంబు
నొనర్చి యవార్యం బైనయౌదార్యంబున. 178

ఉ. దక్షిణ యిచ్చె ముజ్జగము దానగుణప్రవరుండు లీల ఫా
లాక్షునిసన్నిధిన్ మఖసమాపనకాలమునందుఁ దారకా
ధ్యక్షుఁడు కాశికాపురమునందు సదస్యులకున్ బ్రసాదసం
రక్షితసర్వవిష్టపుఁడు రాజు ప్రతాపవిరాజమానుఁ డై. 179

తే. ఇంద్రుకుండంబు కెలనఁ జంద్రేశునొద్దఁ
గాశిలోనవిముక్తోపకంఠభూమిఁ
దపము చేసినచోటన ధవళకిరణుఁ
డాహరించెను రాజసూయాధ్వరంబు. 180

వ. ఇట్లు రాజసూయాధ్వరంబు చేసినసుధాకరునవభృథస్నా
నానంతరమున. 181

సీ. సకలలోకాహ్లాదసంధానహేతు వై
వెలయు నీకౌముదీవిభ్రమంబు
వర్తింతు వీవు నామూర్తిభేదంబులం
దొకమూర్తి వై సమగ్రోదయమున
శ్రీకాశిలోఁ బ్రతిష్ఠించినాఁడవు నన్నుఁ
జంద్రేశ్వరుం డనుసంజ్ఞఁ గూర్చి
బ్రహ్మదత్తం బైనరథ మెక్కి యవలీలఁ
దిరిగి తష్టాదశద్వీపములను

తే. నాహరించితి రాజసూయాధ్వరంబుఁ
దత్పరత మీఱఁ ద్రైలోక్యదక్షిణముగఁ

చంద్ర! నీయట్టి ధన్యుండు జగతిఁ గలఁడె?
యనుచు వర్ణించె రాజు ఖట్వాంగపాణి. 182

వ. ప్రతిమాసంబునఁ బూర్ణిమాదివసంబున జపహోమార్చన ధ్యానదానబ్రాహ్మణభోజనంబులు చంద్రేశ్వరస్థానమునఁ జేసిన ననంతఫలము నొసంగు. ఎవ్వండేని మత్కాలంబునఁ గుహాయోగంబునఁ జంద్రోద(య)వారి నభిషిక్తుం డై చంద్రేశ్వరుని సందర్శించి వసురుద్రాత్యతర్పణం బొనర్చు నన్నరుండు పితృప్రసాదంబు వడయు. నతని పితృపితామహు లానందంబున నర్థించి వర్తింతు రని వెండియు. 183

సీ. ప్రత్యష్టమీతిథిఁ బ్రతిచతుర్దశి సిద్ధ
యోగీశ్వరీదేవి యోగపీఠి
కాధిరూఢభవాని నకఠోరశశిమౌళి
హాటకతాటంకహారకటక
కేయూరమేఖలాకింకిణికంకణా
ద్యఖిలదివ్యాభరణాభిరామఁ
బింగళాహ్వాయ నమద్బృందారకశ్రేణి
నాదిభైరవశక్తి నఖిలజననిఁ

తే. గాళిఁ జంద్రేశదేవోపకంఠనిలయఁ
జంద్రకుండోదకంబున జలక మార్చి
గంధపుష్పోపహారాదికల్పనముల
సేవ చేసిన విఘ్నంబు చేర కుండు. 184

వ. ఇది చంద్రలోకమాహాత్మ్యంబు. ఈయుపాఖ్యానంబు విన్నను బఠియించినను జనున కాయురారోగ్యైశ్వర్యంబులు సమ

గ్రంబు లై సంభవించు ననిన విని శివశర్మ పుణ్యశీల సుశీలుర కి ట్లనియె. 185

తే. భాగవతులార! భాగ్యసంపన్నులార!
ఇంత యొప్పు నె యుడులోక మెట్టునెదుర
గగనలక్ష్మిలతాతన్వికబరిమీఁద
గుంతరించిన ముత్యాలజల్లి వోలె? 186

వ. ఈలోకవృత్తాంతంబు వినవలతుం జెప్పుం డనిన నతనికి వార లి ట్లనిరి. 187

## నక్షత్రలోక వృత్తాంతము

సీ. సర్గాదిఁ బరమేష్ఠి చరణంబు పెనువ్రేల
దక్షుండు పుట్టె నాతనికిఁ బుట్టి
రఱువండ్రు కన్యక లాకన్నియలు రూప
లావణ్యలీలావిలాసవతులు
రోహిణీప్రముఖ లారుక్మగౌరాంగలు
శివుఁ గూర్చి యాచరించిరి తపంబుఁ
గాశిలో దివ్యలింగంబు నక్షత్రేశ
సంజ్ఞంబు నొకప్రదేశమున నిలిపి

తే. వరణదరి యందు సంగమేశ్వరునియొద్ద
దివ్యవర్ష సహస్రంబు త్రిపురవైరి
మెచ్చి పొడచూపి యడుగుఁడు మీరు వరము
లనిన వార లిట్లనిరి కాలాంతకునకు. 188

క. నీయట్టివాఁడు పురుషుం
డాయెడు మా కభవ! యనిన నట్టేఁడ మీకుఁ

నాయకుఁ డయ్యెడు నని దా
క్షాయణులకు వరము నీలకంఠుం డొసఁగెన్. 189

వ. వెండియు సమస్తజ్యోతిశ్చక్రంబునడుమనగ్రగణ్యలయ్యెదరు. మేషాదిరాసులకుం గారణంబులయ్యెదరాదోషాధీశ్వరుండు బ్రాహ్మణాధిపతి యైనతారకాపతికిం బత్ను లయ్యెదరు. మీచేతం బ్రతిష్ఠితం బైననక్షత్రేశలింగంబు భజించువారలకు భోగమోక్షప్రదం బయ్యెడు. మృగాంకలోకంబునకు మీలోకం బూర్ధ్వలోకంబు గాఁగలయది. సర్వతారకామధ్యంబున మీరు మాన్య లయ్యెద రని యానతిచ్చి శివుం డంతర్హితుం డయ్యె. ఇది తారకాలోకవృత్తాంతం బనిన విని యనంతరంబ ముందట బుధలోకంబుఁ గనుంగొని. 190

## బుధలోకవృత్తాంతము

సీ. ప్రతిబింబమో కాని రజనివల్లభున క
ర్ధ్యాహారమో కాని యమృతరుచికి
వినిమయంబో కాని విధున కన్వాదేశ
మో కాని యత్రి నేత్రోద్భవునకు
వీప్సయో కాని పూవిలుకానిసఖునకు
నామ్రేడితమొ కాని యబ్ధిజునకు
నభిధాంతరమొ కాని యరవిందవైరికి
సారూప్యమో కాని చందురునకు
తే. ద్రుమికి నూడ్పినవాఁడు భర్గునికిరీట
కోటి కాభరణం బైన కువలయాప్తు
మిగులఁ జక్కనికొడుకండు మింటినడుమ
గ్రహములం దితఁ డెవ్వండు ? గణములార ! 191

వ. ఈతఁ డీలోకంబు సంభ్రమమయంబు విలాసమయంబు రాగ
మయంబు శృంగారమయంబును గావించుచుఁ జక్షు రాకర్షణ
సిద్ధాంజనం బన మనోవశీకరణమంత్రం బన నింద్రియావేశ
చూర్ణం బనఁ గౌతుకంబునకు సంతోషంబును, సౌభాగ్యం
బునకు సిద్ధయోగంబును, మన్మథునకు జన్మాంతరంబును, యౌ
వనంబునకు సామ్రాజ్యంబును గల్పించుచున్నవాఁడు.
షోడశవర్ష దేశీయుం డీగ్రహాగ్రామణి యెవ్వం డనినఁ బుణ్యా!
శీలసుశీలురు శివశర్మ కి ట్లనిరి. 191

చ. విను మథురామహానగరవిప్రకులోత్తమ ! బ్రహ్మవంశవ, ర్ధన
శివశర్మ! పుణ్యకథ ధర్మకథల్ పరిపాటిఁ జెప్పఁగా, విన నతి
మాత్రదూర మగు విష్ణుపదంబున కేగుచున్నచో, మనకుఁ
బథప్రయాసములు మానెడు, విఘ్నములుం దొలంగెడున్.

వ. ఇది బుధలోకంబు. 194

సీ. రాజసూయమహాధ్వరం బెవ్వఁ డొనరించెఁ
ద్రైలోక్యహంతకారంబుగాఁగ
నెవ్వాని ప్రియభామ లిరువదేడ్వురు నల
ధవళాయతాక్షులు దక్షసుతలు
మన్మథాంతకుజటామకుటకోటికి నెవ్వఁ
డవతంసకుసుమమాల్యత వహించె
నెవ్వాఁడు నలువతే రెక్కి యష్టాదశ
ద్వీపియం దసివాఱు దిరిగె లీలఁ

తే. జంద్రికాపాండుకౌశేయశాటి యైన
యతనుజగజంపుగోడు గెవ్వఁ డవ్విధుండు

పెద్దకాలంబు ముత్యాలగద్దె యెక్కి
వసుధఁ బాలించె నేకోష్ణవారణముగ. 195

తే. శైశవంబున శాస్త్రంబుఁ జదువఁ వచ్చి
గురునిప్రియభామ యని చేయుఁ బరమభక్తి
యెవ్వతెకు నట్టితార పూర్ణేందువదన
నాఁటనుండియుఁ గామించె నలినవైరి. 196

మ. జడసుళ్లంబును బట్టుదట్టియును రత్నాహాటకాలంకృతుల్మై
డహారంబులు చుట్టివన్నియరుచుల్ లీలావిలాసంబు పెంపడ
రంజేయఁగ యామినీధవుఁడువిద్యాభ్యాసకాలంబున, న్నిడు
వాల్గన్నులకుం బ్రమోద మొసఁగున్నిత్యంబునుందారకున్.

సీ. ఆచార్యప్రియభామ యని కొన్ని దివసంబు
లిచ్ఛగింపఁడు తెప్ప లెత్తి చూడ
నుల్ల ముప్పిళ్లూర నొకకొన్ని దినములు
వీక్షించుఁ జూడని వేళయందు
నొకకొన్ని తిథులు గర్భోక్తిచాతుర్యంబు
మెఱయ నేకాంతంబ మేలమాడు
నొకకొన్ని ఘస్రంబు లొక్కొక్కనెపమున
నంగాంగసంస్పర్శ మాచరించు

తే. వలచి పైఁబడు నొకకొన్ని వాసరములు
హృదయ మనురాగసంపద నిగురుకొలిపి
కవయఁ దొడఁగినయది యాదిగాఁగ నునిచెఁ
జందురుఁడు తార శుద్ధాంతసదనభూమి.

తే. చదివె గురువొద్ద ధర్మశాస్త్రంబు తొలుతఁ
బరమవిశ్వాసతాత్పర్యభక్తిగరిమఁ

జదివెఁ జంద్రుండు కామశాస్త్రంబు పిదపఁ
దలిరుఁబోఁడిపైన నసురక్తిఁ దారయొద్ద. 199

తే. ఆదిగర్భేశ్వరుం డౌట యనుచితంబు
మిగులఁ జక్కనివాఁ డౌట మేలు గాదు
పాప మభినవయౌవనోద్భాసి యగుట
యరయ మంచిగుణంబుల యవగుణములు. 200

వ. అవినయనిదానం బైన స్వాతంత్ర్యంబునను గుతూహల బహుళం బైన స్వభావంబునను ధైర్యప్రతిపక్షం బైన యౌవనారంభంబునను నెవ్వనికే మనోవికారంబు పుట్టకుండునే? అదియునుం గాక. 201

సీ. ఘనతరాహంకార కాలకూటవిషాన
లాభీలములు గటాక్షాంచలములు
దుర్వారతరతీవ్రగర్వగళగ్రాహ
కలితగాద్గద్యఘుర్ఘురము మాట
యస్మితాసంప్రభూతస్మయాపస్మార
విస్తృతధైర్యంబు వినయగరిమ
యుద్దామదర్పభారోష్ణదాహజ్వరా
రంభసంభృతవికారంబు మనసు

తే. చరణచంక్రమ దభిమానసన్నిపాత
జాతసర్వాంగకమ్ములు జనపతులకు
భూభుజులతప్పె యది వారిఁ బొందియున్న
ధరణిసామ్రాజ్యభారంబుతప్పు గాక? 202

సీ. భువనైకధన్విచేఁ బుష్పాయుధునిచేతఁ
బ్రసవాస్త్రమున నేటు పడనివాఁడు

నతిగాఢ మైన క్రోధాంధకారంబునఁ
గన్నుల నంధుండు గానివాఁడు
నిర్నిబంధనలోభనిద్రాభరంబునఁ
బారవశ్యంబుచేఁ బడనివాఁడు
లక్ష్మీకటాక్షలీలాసీధుమదమున
మనములోపల నన్నుఁగొననివాఁడు
తే. లేఁడు భూపతిఁ గలిగెనా వాఁడు నృపుఁడె
విశ్వధాత్రీజనులపాలివేల్పుగాక ?
బాహ్యశత్రుల బరిహరింపంగ వచ్చు
నంతరారుల నిర్జింప నలవిగాదు. 203

వ. అది యట్లుండెఁ దదీయవృత్తాంతంబు విను మని యి ట్లనియె.

తే. తాల్చె గర్భంబు తార సుధాకరునకుఁ
గువలయేక్షణ రాగంబు గొనలు సాఁగ
జంభరిపుదిక్కు ప్రత్యూషసమయముసను
తామరసబంధుగర్భంబు దాల్చినట్లు. 205

తే. గర్భసంస్థితుఁ డగుగ్రహాగ్రణి విశుద్ధ
సితయశస్స్ఫూర్తి వెలిఁ బ్రకాశించినట్లు
దారమైదీఁగ వికచలోధ్రప్రసూన
పాండురచ్ఛాయ నొయ్యొయ్యఁ బలుకఁ బాఱె. 206

తే. గర్భసంస్థితసద్గుణగౌరవమునఁ
బోలె గాత్రంబు భరియింపఁ జాల దయ్యె
నమృతధారారసాస్వాదసముపజాత
తృప్తియును బోలె నాహారతృష్ణ వదలె. 207

శా. ప్రత్యుత్థానము సేయఁ బెద్దలకు నాప్రాఢేందుబింబాస్య య
ప్రత్యూహస్థిరభక్తిభావమునఁ దోరం బైనగర్భంబుచే
నత్యంతాలస యయ్యు నగ్గురుజనం బందంద వారింపఁగాఁ
బ్రత్యాసన్నసఖీసమర్పితకరాబ్జాతావలంబంబునన్. 208

క. అంగన యొక్కొకమఱి యు
త్తుంగ మణిస్తంభ యష్టితో నొత్తిగిలుఁ
మంగళభవనాంతరమున
బంగారు మెఱుంగుపాలభంజిక పోలెన్. 209

ఉ. బింబఫలాధరోష్ఠి మణిభిత్తిపుటంబులయందు నాత్మబిం
బంబు గరావలంబనసమర్థముగా మదిఁ గోరుఁ గేలిసా
ధంబుపయిఁ సమున్నతనితంబపయోధరభారగర్భభా
రంబునఁ గోమలాంగకము త్రాడ్పడఁ గేలివిహారవేళలన్.

తే. భవనశృంగారవనలతాపాదపముల
నబలకై దండ పట్టుట యద్భుతంబె?
విహృతసౌధమణిస్తంభవిస్మయాంశు
కందళుల నూఁత గొనఁ బోవు గర్భగరిమ. 211

తే. పనులు పంపంగఁ జాలదు ప్రాణసఖుల
భవనకార్యప్రవృత్తికై పద్మనయన
తాను గర్భభరాలసత్వంబుకతనఁ
జేయఁ జాలదు మఱి వేఱ చెప్ప నేల? 212

మ. అట మున్నొక్కడు కేలిశైలమున నధ్యారోహణంబాచరిం
చుటకై నెచ్చెలికత్తియఁ నగుచుసంసూచించినఁ గాంతయొ
క్కటసంత్రాసమునొందుఁజన్నుఁగవయాకంపింపఁ గానిండు వే
కటిభారంబునఁ జేసి ధీరహృదయల్ గారాదిగర్భేశ్వరల్.

వ. అంత నట బృహస్పతి పత్నీవియోగవేదనాదూయమాన మానసుం డై చంద్రుండు చేసినయపరాధంబు హరిహర హిరణ్యగర్భులకు నింద్రాదిసురులకు నెఱింగించిన. 214

సీ. తగవు గా దనియె మంతన ముండి వృత్రారి
యనుచితం బనియె హుతాశనుండు
పాతకం బని చెప్పి పలికె దండధరుండు
దౌరాత్మ్య మనియెను దానవుండు
దుష్కర్మ మని చెప్పెఁ దోయాధినాయకుఁ
డపకీర్తి యని తూలనాడె గాలి
యన్యాయ మనియె గుహ్యకసార్వభౌముండు
కాదు కా దనియె శాక్వరగముండు
తే. హేతుదృష్టాంతములు చూపి యెల్లసురలు
నన్వయవ్యతిరేకమార్గానువృత్తి
బుద్ధిఁ జెప్పిరి యివ్విధమున శశాంకుఁ
డమరగురునకు మగుడ నీఁ డయ్యెఁ దార. 215

వ. అంత. 216

చ. ప్రమథులతోడఁ గూడ నతిభైరవఘోరతరాట్టహాసుఁ డై
శమనవిరోధి దాఁకుటయుఁ జంద్రుఁడు వేల్పులతో నెదిర్చిన
న్సమరము తారకామయమనంగనభోంగణభూమిఁ దారకా
సముదయభీతిహేతువయి సాఁగెఁ బురారికి నబ్జవైరికిన్.

తే. ఈశ్వరునితోడ నని సేయ నెట్లు వచ్చు
నన్యులకు నెంతవారికి నాగ్రహమున?
నీశ్వరునిమూర్తి గావున నెదిరి నిల్చి
యుద్ధ మొనరించెఁ గాక యనుష్ణకరుఁడు. 218

వ. అప్పుడు. 219

శా. చండీశుం బోదివె న్ని శాకరుఁ డవష్టంభంబు జృంభింప బ్ర
హ్మాండక్రోడము శింజినీధ్వనులచే నాఘూర్ణతంబొంద ను
చ్చండాటోపభుజావలేపకలనాసంరంభచక్రీభవ
ద్గాండీవప్రవిముక్తభీషణమహాకాండప్రకాండంబులన్. 220

వ. ఇవ్విధంబునఁ బ్రతిఘటించి గెంటింపరాని మగంటిమిం బెచ్చు
పెరిఁగి కలువలనెచ్చెలి చిచ్చులుమియు శిలీముఖంబు లొడలఁ
గ్రుచ్చి యార్చి శంఖంబు పూరించి సింహనాదంబుచేసి
గాండీవజ్యారావంబు రోదసీకుహరంబు నిండవిధుండుదండ
మహాకాళనికుంభకుంభోదరవీరభద్రాదిప్రమథవర్గంబుతోడం
గూడఁ దన్ను నొప్పించినం గోపించి కించిదారజ్యమాన
లోచనాంచలుండై లలాటలోచనుండు పురనిశాటతాటంకినీ
కపోలకస్తూరికా(కరి)మకరికాముద్రాద్రోహియు, జలంధర
హృదయగర్వసర్వంకషంబును, సింధురాసురశిరఃకూటపాక
శంబును, దక్షాధ్వరమృగధ్వంసక్రీడానృశంసంబును, దుషా
రగిరికన్యకా భ్రూవల్లీవిలాసరేఖాలలితశృంగంబును నగు
నజగవంబున బ్రహ్మశిరోనామకంబైన దివ్యాస్త్రంబు సంధించిన.

శా. ఆకంపించె జగత్త్రయంబు దెస లల్లాడెన్ సముద్రంబు లు
ద్రేకించెన్ భయమందె భూతలము ఖేదిల్లెన్ గులక్ష్మాధ్రముల్
శ్రీకంఠుం డవికుంఠవిక్రమమునన్ దివ్యాస్త్రముం గూర్చి వి
ల్లాకర్ణాంతముగా వెసం దివిచి శీతాంశు న్నిరీక్షించినన్.

తే. అప్పు డడ్డంబు సొచ్చి పద్మాసనుండు
ప్రమథనాథునిరోషసంభ్రమము మాన్పి
చంద్రునికి బుద్ధిఁ జెప్పి మాత్సర్య ముడిపి

యాలి నిప్పించె నయ్యుపాధ్యాయునకును. 223

చ. అమృతమయుండుగావున సుధాంశునితోడిసమాగమంబునన్
రమణి కశుద్ధి లే దనుచు బ్రహ్మర్షులు సంఘటింపఁగా
నమరగురుండు హైకొనియె నంబుజలోచనఁ దారఁ దారకా
రమణముఖిం దృజించె నుడురాజును భామిని నెట్టకేలకున్.

వ. అనంతరంబ గర్భం బాలోకించి గురుండు దాని కిట్లనియె.

తే. అతివ! యీగర్భ మెవ్వరి కైత చెప్పుమ
చంద్రునికో? నాకొ? యని రహస్యమున నడిగె
సిగ్గుపడి యెంత యడిగినఁ జెప్పదయ్యె
నాంగిరసునకుఁ దార తారాధిపాస్య. 226

తే. చెప్ప కున్నను గోపించి యిషిక యెత్తి
చూలు గరఁగంగ వైవంగఁ జూచె గురుఁడు
వేల్పు లా యిందుముఖిఁ జీరి వెఱక చెప్పు
నిజము చెప్పిన నీకు నేనెగులు లేదు. 227

ఉ. నావుడు తార యొక్కవచనంబును బల్కక యూరకుండె ల
జ్జావనతాస్య యై సరసిజాసనుఁ డప్పుడు నేర వచ్చి యో
దేవి! నిజంబు చెప్పు హిమదీధితిసంగతి నైన గర్భమో?
జీవుఁడుదొంటికాలమునఁజేసినగర్భమొ? యంచుఁ బల్కినన్.

తే. తోయజదళాయతాక్షి కేల్దోయి మోడ్చి
పలికె నెత్తమ్మిచూలితోఁ బ్రస్ఫుటముగ
వనజసంభవ, తారకావల్లభుండు
చూలుచేసినవాఁ డంచు సూక్ష్మఫణితి. 229

వ. గురుండును దారకు జన్మించినట్టికుమారునిం జంద్రుని కిచ్చె.
చంద్రుండు నిజనందనునకు బుధుం డనుపేరు వెట్టె. బుధుం

డును దండ్రియనుమతి వడసి కాశి కరిగి బుధేశ్వరుం డను
శివలింగంబుఁ బ్రతిష్ఠించి పెద్దకాలంబు తపంబు చేసి యాబు
ధేశ్వరలింగంబునందు సాక్షాత్కరించినవిరూపాక్షుం బ్రస్తు
తించి యమ్మహేశ్వరువలన నక్షత్రలోకంబునకు నూర్ధ్వం
బున నున్నలోకంబున కధీశ్వరుం డయ్యె. 230

తే. చంద్రకుండచంద్రేశ్వరస్థానమునకుఁ
బ్రాగ్దిశాభాగమునయందు భక్తి నరుఁడు
కాశికాక్షేత్రసీమ బుధేశుఁ గొలిచి
పరమబోధంబు దప్పఁడు ప్రాణవిరతి. 231

తే. అనుచు గోవిందకింకరు లనఘమతులు
బుధునికథ చెప్పుచుండ నభోంతరమున
బోయె దివ్యవిమానంబు పుణ్యకర్మ
కగులనెల పైన శుక్రలోకంబు డాయ. 232

## శుక్రలోకవర్ణనము

వ. అప్పు డయ్యిద్దఱు శివశర్మ కిట్లనిరి. నిశితశతక్రతుప్రయోగ
ప్రక్రియాక్రమసమర్థశుక్రలోకం బిది. ఇందు దానవగురుండు
గావ్యుం డధివసియించు. ఆభార్గవుండు భర్గువలన వర్ష
సహస్రంబు కణధూమంబాహారంబుగా దుస్సహంబైన తపం
బాచరించి మృతసంజీవనీవిద్యారహస్యంబును సకీలకంబుగా
నెఱింగినాఁడు. 233

తే. ఎఱుఁగ రీవిద్య యెవ్వార లిజ్జగమున
బ్రహ్మవంశాగ్రగణ్య! వాక్పతి మొదలుగ
గుహుఁడు దక్కంగఁ గరటివక్త్రుండు దక్క
బార్వతీదేవి దక్కంగ భవుఁడు దక్క. 234

తే. హరునితోడ విరోధించి యంధకుండు
యుద్ధ మొనరించి చొక్కనాఁ డోహటించె
నజగవోన్మత్తఘననిశాతార్థచంద్ర
బాణనిర్భిన్నవక్షగ్రపాతుఁ డగుచు. 235

వ. కాలకంధరునకు నంధకాసురునకు నైన యమ్మహాయుద్ధంబున నీల్గినరాక్షసులను మృతసంజీవనీ విద్యాప్రభావంబున భార్గవుండు బ్రతికించుచుండ దండనికుంభకుంభోదర ప్రముఖు లగు పారిషదులు పరమేశ్వరున కిట్లనిరి. 236

సీ. దేవ! మహాదేవ! త్రిపురదైత్యధ్వంస!
యభవ! మావిన్నప మవధరింపు
మీచేత బడసిన మృతజీవనీవిద్య
బ్రతికించుచున్నాఁడు భార్గవుండు
దైత్యవర్గము నెవ్విధంబున మా కెట్లు
జయము సిద్ధించు? నాఁ జంద్రమౌళి
నందికేశ్వరుఁ బంచి బందిగ్రహణలీలఁ
గావ్యుఁ దెప్పించి శ్రీకంధరుండు

తే. కరతలమునఁ బరిపాండుకాంతి నతనిఁ
దాల్చి దధితోడిచలిదిముద్దయును బోలె
విషము మ్రింగినపెన్నుద్ది వేల్పుతేఁడు
మనసిజారాతి మ్రింగి గబ్బునఁగఁద్రేఁపె. 237

వ. అంధకాసురుండును భార్గవుండు లేనిపిమ్మటం గొంతకాలంబు నకుఁగృతాంతమర్దను చేత హతుండయ్యె. బహుకాలంబు కాలకంఠజఠరగోళంబునం దుండి కావ్యుండును. 823

మ. ప్రవియించెఁ దుహినాంశుశేఖరుని మేఢ్రద్వారమార్గంబు

నఁగ, గవిశుక్లంబయితత్తిణంబున నిజాకారంబుఁదాల్చెన్నహో,
భవవిద్వేషి నిజాత్మసంభవునిఁ గా భావించి వీడ్కొల్పె భా
ర్గవు నాతండు దపంబు సేయ నరిగెం గాశీపురిసీమకున్. 239

వ. అరిగి యానందకాననంబున లింగప్రతిష్ఠ చేసి యాలింగంబు
నందు విశ్వేశ్వరశ్రీమన్మహాదేవు భావించుచుఁ జంపక
దత్తూర కరవీర కుశేశయ మాలతీ కర్ణికార కదంబ వకులో
త్పల మల్లికా శతపత్త్ర సింధువార కింశు కాశోకపున్నాగ
నాగకేసర క్షుద్ర మాధవీ పాటలా బిల్వ మందార ద్రోణ
గ్రంధిపర్ణి దమన చూతపల్లవ దర్భ తులసీ నంద్యావర్త
దేవదారుకాంచన దూర్వాంకురాదులశంకరు ననేకకాలం
బారాధించి శుక్రుండీలోకంబున కధీశ్వరుండయ్యె. 240

క. వారాణసి శుక్రేశ్వరు
నారాధించినవరుండు ప్రాపించు సమ
గ్రారోగ్యాయుఃపుత్త్ర
శ్రీరాజ్యైశ్వర్యశౌర్యచిరసౌఖ్యంబుల్. 241

## అంగారకలోకవృత్తాంతము

వ. అట నూర్ధ్వంబున నున్నయదిలోహితాంగలోకంబు. 242

సీ. తొల్లి దాక్షాయణితోఁ బాసి శంభుండు
విరహాసంతాపాగ్ని వేఁగుచుండె
నావేళ నొక్కనాఁ డభవుఫాలంబునఁ
బ్రస్వేదబిందు వుత్పన్న మయ్యెఁ
బరిపక్వకూశ్మాండఫలసన్నిభం బైన
యాఘర్మజలకణం బవని వ్రాలె

వ్రాలి తత్క్షణము యవ్వసుమతీస్థలమునఁ
బద్మరాగోపల ప్రతిమకాంతి
తే. నొక్కదివ్యకుమారుఁడై యుండె నెదుర
నతని నందనుఁ గాఁ శంభుఁ డాదరించె
ధాత్రియును వాని భావించెఁ దనయు గాఁగ
నతఁడు ధృతిమెయి దపము సేయంగఁ గోరి. 243

సీ. భాగీరథీగంగ ప్రవహించు నేపీటి
పరిసరంబున కుదగ్భాగమునను
వరణాతరంగిణీవార్నిర్ఝరములతో
నసి(ళి) వేణి యపీటియవధిఁ గూడెఁ
దప్తంబు హాతమును దత్తంబు నేపీటి
యైదుక్రోసుల నిచ్చు నమృతలక్ష్మి
వలచు నేపీటి కవ్యాజరాగస్ఫూర్తి
శైలకన్యకకంటెఁ జంద్రమౌళి
తే. యట్టికాశికి గురునాజ్ఞ నరుగుదెంచి
పరమనైష్ఠికుఁ డగుచుఁ దపం బొనర్చెఁ
గలుషసంతానకాననాంగారకుండు
ధారకుఁడు భూతధాత్రి కంగారకుండు. 244

తే. పాంచముద్రమహాస్థానపదమునందుఁ
గాశి శాశ్వతదేశోపకంఠభూమి
నిష్ఠనంగారకేశుఁ బ్రతిష్ఠ సేసి
కాంచె నీలోక మేల నంగారకుండు. 245

వ. ఇది యంగారకలోకవృత్తాంబుంత. 246

## బృహస్పతిలోకవృత్తాంతము

క. అదె వీక్షింపు బృహస్పతి
పదము ధరామరవరేణ్య! బహువిధశుభసం
పదలకు నాస్పద మీతఁడు
చదివినవాఁ డర్థశబ్దశాస్త్రములెల్లన్. 247

వ. అయ్యాంగిరసుండు కాశీక్షేత్రమున కరిగి యందుఁ దనపేర శంభులింగంబుఁ బ్రతిష్ఠించి తత్సమీపంబున బహుదివ్యవర్షంబులు దపంబుసేసి తనకుం బ్రత్యక్షం బైన విరూపాక్షు నిట్లని సంస్తుతించె. 248

తోటకము. జయశంకర! శాశ్వత! చంద్రధరా!
భయనాశ! గిరీశ్వర! భక్తపరా!
నయనత్రయభాస్వర! నాగహరా!
యయవర్ధన! శాంత! దయామధురా! 249

తోటకము. భువనావన! పావన! భూతపతీ!
భవ! పన్నగభూషణ! భద్రకృతీ!
శివ! దేవ! మహేశ! విశిష్టమతీ!
భవభంగ! ఫలప్రద! పాపహృతీ! 250

తోటకము. శ్రితపాపవిభంజన! సిద్ధనతా!
క్షితిజార్ధవపుర్ధర! చిద్విదితా!
మృతిజన్మవిధూత! హరిప్రణుతా!
సతతప్రణ ధ్వనిసాధరతా! 251

క. చాటుకవితాకళాపరి
పాటిం బాటించి యారభటిభక్త్యావే

శాటోపంబున గీష్పతి
తోటకవృత్తములఁ బొగడెఁ దుహినాంశుధరున్. 252

శా. ఆటోపారభటి న్మునీశ్వరుఁడు దన్నుం బంద వర్ణింపఁ దద్
చ్చాటుప్రౌఢికిఁ జేసె ధూర్జటి మహాశ్లాఘాశిరఃకంపముల్
జూటీకూటవిటంకకోటివిలుఠత్స్రోతస్వినీవీచికా
కోటీఘాటిరటత్కరోటికుహరక్రోడావగాహంబుగాన్. 253

వ. ఇట్లు ప్రీతుం డై. 254

సీ. బృహదుగ్రతపము సంభృతనిష్ఠఁ జేసిన
సామర్థ్యమున బృహస్పతివి కమ్ము
ప్రాణంబు ప్రాణ మై భక్తిఁ జేసితి గాన
జీవాహ్వయము నీకుఁ జెల్లుఁ గాక
వాగ్డంబరమునఁ గైవారంబు నేసితి
తగుదు వాచస్పతిత్వమున కీవు
పఠియించువారికిఁ బ్రాభవస్ఫురణంబు
దొరకించు నీచాటుతోటకములు

తే. లోహితాంగుఁడు పాలించులోకమునకు
నూర్ధ్వ మైన పదంబున నుండు వత్స
యనుచు వరములు కృపచేసి యసితగళుఁడు
బ్రహ్మఁ దలఁచెను దేవతాప్రతతితోడ. 255

వ. సంస్మరణమాత్రంబున నేగుదెంచిన బ్రహ్మాదిదేవతలచేత నవ్వా
చస్పతికి దేవతాచార్యపదవీసామ్రాజ్యంబునకుం బట్టాభిషే
కంబు చేయించి యప్పంచాననుండు చంద్రేశ్వరునికి దక్షిణ
(భాగ)ంబున విశ్వేశ్వరునికి నిరృతిభాగంబున ధిషణుండు
ప్రతిష్ఠించిన ధిషణేశ్వరునియందు సంక్రమించె. గురుండును

నీలోకంబున కధీశ్వరుం డయ్యె. ఇది బృహస్పతిలోక
వృత్తాంతంబు. 256

తే. దివిజగురునిపదంబు నతిక్రమించి
శౌరిభువనంబు గాంచి యాశ్చర్య మంది
పుణ్యశీలుండు శివశర్మ పుణ్యశీలు
నకు సుశీలున కిట్లనుఁ బ్రకటఫణితి. 257

ఉ. పాండురపద్మలోచనునిపార్శ్వగులార! మహాత్ములార! మా
ర్తాండసమానతేజ మిదె ప్రాంతమునందు సముజ్జ్వలప్రభా
మండలమధ్యవర్తియు సమగ్రవిలాససమన్వితంబునై
రెండవనాకలోక మన దృష్టికి నిం పొనరించె నెంతయున్.

శనైశ్చరలోకవర్ణనము

వ. ఇది యెవ్వరిలోకం బనిన వార లిట్లనిరి. 259

తే. శంసితవ్రత! యిది శనైశ్చరునిలోక
మితఁడు గ్రహములలో నెల్ల నతివిశిష్టుఁ
డిమ్మహాత్ముని శుభచరిత్రమ్ము వినుము
విశదముగఁ జెప్పెదము నీకు విస్తరించి. 260

సీ. నారాయణునినాభినలినమధ్యంబున
జనియించె బ్రహ్మ యావనజజునకు
సంభవించె మరీచి సంయమిగ్రామణి
గలిగె నమ్మౌనికిఁ గశ్యపుండు
ప్రభవించె నాకశ్యపప్రజాపతికి మా
ర్తాండుఁ డబ్భానుండు త్వష్టకూఁతు
సంజ్ఞాభిధాన రాజనిభాస్య వరియించెఁ
దరణికి నది యపత్యత్రయంబుఁ

తే. గాంచె మను వన యముఁ డనఁగాఁ దనయుల
యమున యనుకన్య నక్కాల మప్పురంధ్రి
యోర్వలే దయ్యె మగనియత్యుష్ణ మైన
తేజమున కతికోమలదేహ యగుట. 261

వ. అంత. 262

తే. ఛాయ యనుదాని సృజియించె సంజ్ఞ యొక్క
మానినీమణి నాత్మసమానమూర్తి
నగ్రమునయందుఁ బ్రాంజలి యగుచు నుండె
నతిప్రతిచ్ఛాయ లలితమాయాస్వరూప. 263

వ. సంజ్ఞాదేవి సవర్ణ యగు నాఛాయ కిట్లను: కల్యాణీ! యేఁ బుట్టినింటికిం బోయి వచ్చెద. నామూర్తి నీవు మదీయాజ్ఞ సూర్యునికిఁ బరిచర్య సేయుము; మనువును, యముండును, యమునయు ననునీయపత్యత్రయంబు త్వదీయంబుగాఁ దలంపుము. ఈరహస్యంబు కచగ్రహణశాపపర్యంతం బెవ్వరికిం జెప్పకు మని యప్పగించి పితృగృహంబునకుం బోయె; నిట సవర్ణయు. 264

తే. అష్టముం డగు సావర్ణి యనెడుమనువు
మఱి శనైశ్చరు భద్రాసమాఖ్యఁ గన్యఁ
గాంచె నుష్ణాంశువలన నక్కలువకంటి
తరణియును దాని సంజ్ఞఁగాఁ దలఁచి యుండె. 265

వ. ఆసవర్ణయు సర్వస్త్రీస్వభావం బగు సాపత్న్యగుణంబున సంజ్ఞాసంతానమునకంటెం దనసంతతియందు నత్యంతవాత్సల్యంబు వాటించి భోజనాలంకారలాలసంబులపట్టున వైషమ్యంబు గలిగియుండ నొక్కనాఁడు భవితవ్యతావిలాసంబు

ననో! బాల్యచాపలంబుననో! మమతాస్వాతంత్ర్యంబున
నో! జముండు సంజ్ఞాస్వరూపిణియైన పినతల్లి ఛాయాదేవిం
గోపించి తన్నుం దలంచి పాదం బెత్తిన. 266

సీ. తనకు సంజ్ఞాదేవి మనములోఁ గడు నమ్మి
యిల్లడ పెట్టుట యెట్లు మఱచెఁ?
బసిబిడ్డ నేరమి పట్టి పాలార్పంగఁ
దగవు గా దని యేల తలఁప దయ్యెఁ?
దా నేమి బిడ్డలఁ గానదా? సవతాలి
కొడుకు త ప్పొకటి లోఁ గొన్న నేమి?
యల్పదోషంబున కనురూపం బైన
ప్రబలదండన మొనర్పంగఁ దగవె?

తే. జముఁడు దనమీఁదఁ బాదంబు చాఁచినపుడు
కనికరం బింత లేక యక్కలువకంటి
కంటికొనఁ గెంపు గదురంగఁ గనలి చూచి
పదము దెగి పడ శపియించె బాలు నతని. 267

వ. అవ్విధం బెఱింగి భానుండు ఛాయాదేవిం జూచి యిట్లనియె.

తే. ఎట్టియపరాధ మొనరించెనేనిఁ దల్లి
కొడుకు శపియింప దిబ్భంగిఁ గ్రూరబుద్ధి
నతివ! సత్యంబు చెప్పు మెవ్వతవు నీవు?
నావుడును శాపభీతి నన్నలిననేత్ర. 269

వ. తనవృత్తాంతంబు సెప్పె; చెప్పిన దానియం దపరాధంబు పొడ
గానక యమునిం జూచి మాతృశాపంబు నివర్తింప శక్యంబు
గాదు. నీచరణంబునం గలమాంసంబు కృమికీటంబులు
తొలిచి భక్షింప భూమిపయిఁ బడియెడు నని పలికి కొడుకు

నూఱడించి త్వష్ట్రప్రజాపతిభవనంబునకుం బోయి యతని
వలన నిజభార్యా దపంబు సేయం జనుటయు, నున్నగులు
తును నెఱింగి యరిగి యగ్రభాగంబున. 270

సీ. కఠినరింఖాపుటీఘట్టనంబుల భూమి
పటహానిస్వానంబు ప్రస్తరింప
ధవళలాంగూలపల్లవచాలనంబులు
కౌముదీచ్ఛాయలఁ గ్రాపి యుమియ
వెలిదామరలఁబోలు వెడఁదకన్నులయందుఁ
దారంబు నళులచందము వహింపఁ
బ్రోథసంపుటపరిస్ఫురణావసరముల
దంతకోరకకాంతి దళుకు సూపఁ

తే. గొడమగోడిగ యై కురుక్షోణియందు
విపినవీథుల నేకాంతవృత్తిఁ దిరుగు
పరమపుణ్యాంగనాజన ప్రథమగణ్య
సంజ్ఞఁ బొడగాంచె దవ్వులఁ జండకరుఁడు. 271

ఉ. ఘోటిక యై చరించు తనకూరిమిభామినిఁ జూచి క్రమ్మఱన్
ఘోటకరూపుఁడై యతఁడు క్రొవ్వెసలారెడుకావరంబుపై
పాటున డాయవచ్చి నిరుపాధికసౌహృదవిభ్రమంబునన్
జీటికి మాటికిం దిశలు చిల్లులువోవఁగఁ జేసె హేషలన్.

తే. అశ్వరూపుఁ డైన యరవిందబాంధవుఁ
డశ్వ యైన సంజ్ఞ నల్లఁ జేరి
కావరంబుతోడికందర్పవిక్రియ
మోర మోర మోపి మూరుకొనియె. 273

వ. ఇవ్విధంబున సాక్షాత్కరించిన తపోలక్ష్మియుం బోలె నబ్బ

డబ బడబానలజ్వాలాజాలలీలాప్రీడావహామహాగపటలపాట
లిమపల్లవితదశదిశాభోగ భోగింపం దలంచి వృషవిషమ
బాణుచిటకంబున నకఠోరదూర్వాంకురచర్వణక్రియాసమ
భిహారహారితఫేనచ్ఛటాచ్ఛేదపిచ్ఛిలంబును, దారుణ్యదర్ప
భరకవోష్ణనిశ్శ్వాసధారాధురంధరంబును, జలాచలప్రోథ దళ
సంపుటంబును నగు నాఘోటీవదనంబు చుంబించె. సంజ్ఞయు
నిజాంతఃకరణప్రవృత్తియ ప్రమాణంబుగా నతిప్రమాణ
మూర్తిస్ఫూర్తి యగునత్తురంగంబుఁ బతంగుండ కాఁదలంచి
యిచ్ఛగించె. అత్తఱివైనయమ్మత్తకాశిని కించిదున్నిద్ర
పారిభద్రకలికాచ్ఛాయాముద్ర కుద్ది యగు ముద్ర విరి
యించుచు మొగుచుచుం గదలకుండిన మోర మోరతో
మోపియుఁ, గండంబు గఱచియు, డాసియుఁ, బాసియు,
ఆవలిచేసియుఁ, గొంతిదడవు వినోదంబునొంది యక్కుహానా
హాయంబగ్గోడిగ డగ్గఱి క్రీడించి యుండె. అప్పు డమ్మావునకు
ముకుగ్రోళ్ల నెక్కి చరమధాతుద్రవంబు కదంబకుసుమకేసర
పరాగగంధపాణింధమంబై స్రవించె. అయ్యింద్రియంబున
జంద్రబింబానను లిద్దఱు గవలవారు నాసత్యు లనం
బ్రభవించిరి. అక్కుమార ద్వయంబు. 274

తే. విబుధవైద్యద్వయం బయ్యె విమలచరిత!
యంత నిజమూర్తి ధరియించె నబ్జహితుఁడు
సంజ్ఞయును దాల్చె నిజమూర్తి సంతసించి
*దంపతులు చని రాత్మీయసదనమునకు. 275

* యతిభ్రంశము. కానయిట్లు పాఠముండి యుండును. చనిరి దంపతు లాత్మీయ సదనమునకు. (ఉ. వేం. రం)

వ. అంత నక్కడ శనైశ్చరుండు వారాణసికిం జని లింగస్థాప
నంబు చేసె. ఆశనైశ్చరేశ్వరుండు విశ్వేశ్వరదేవునకు దక్షిణ
భాగంబున శుక్రేశ్వరున కుత్తరంబున సంప్రతిష్ఠితుండై
భజియించువారికి భోగమోక్షంబులు ప్రసాదించు. శనైశ్చ
రునకుఁ దత్ప్రసాదలబ్ధం బీలోకంబు. ఇది శనైశ్చరలోక
వృత్తాంతంబు. 276

సప్తర్షిలోకవృత్తాంతము

క. సప్తమహామునిలోకము
సప్తార్చిగప్రతిమతేజ! సకలైశ్వర్యా
వాప్తికరం బిది చూడుము
ప్రాప్తాఖిలవిద్య! భూసుపర్వవరేణ్యా! 277

వ. మరీచి యత్రి పులస్త్యుండు పులహుండు క్రతు వంగిర
సుండు వసిష్ఠుండు వీరు బ్రహ్మమానసపుత్రులు, సప్తబ్రహ్మలు.
వీరికి ధర్మపత్నులు క్రమంబున సంభూతి యనసూయ క్షమ
ప్రీతి సన్నతి స్మృతి † యూర్జ. వీరివలన నా ప్రజాపతులు
నానారూపప్రజలసృజియించి బ్రహ్మాదేశంబున నయ్యవిముక్త
క్షేత్రంబునఁ దపంబుచేసి మరీచ్యత్రీశ్వరాదిలింగంబులం
బ్రతిష్ఠించిరి. సంభూత్యనసూయాదు లగు పతివ్రతలును
దమపేర శివలింగంబులం బ్రతిష్ఠచేసిరి. తత్ప్రసాదలబ్ధం బైన
యీలోకంబున సప్తమహామునులును బరమసుఖం బనుభ

---

† 'యక్ష' యని పెక్కుప్రతులఁ గనఁబడుచున్నది. ఇది 'సంభూతి
రనసూయాచ క్షమా ప్రీతి శ్చసన్నతిః, స్మృతిరూర్జా క్రమాదేషాం పత్న్యో
లోకస్య మాతరః' అను మూలమునకు విరుద్ధము అరుంధతి యని వేఱొక పా.

వించు చున్నవారు. ఇది సప్తమహామునిలోకవృత్తాంతంబు.
ఈలోకంబున కూర్ధ్వంబున. 278

## ధ్రువపదవర్ణనము

సీ. త్రైలోక్యమంటపస్తంభసంభారంబు
గగనలక్ష్మీకంఠకనకభూష
బ్రహ్మాండకేతకీపాదపప్రసవంబు
గంగాతరంగిణిక్రౌంచఖగము
బలిదైత్యమథనాంఘ్రిపంకేజనఖరంబు
దారకావళితులాదండయష్టి
ధాతృలోకద్వారదంతకవాటంబు
గ్రహమండలీపశుగ్రామవేది
తే. తారకాశింశుమారకాకారుఁడైన
యాదినారాయణునితోడఁ గయలఁచివ(వు)ర
తప్ప కీర్తింపు ధరణిబృందారకేంద్ర!
వివిధకల్పపరంపరాధ్రువుని ధ్రువుని. 279
వ. ఈతనిలోకవృత్తాంతంబు వినుము. 280
క. స్వాయంభువమనుధాత్రీ
నాయకుఁ డుత్తానపాదుఁ డనఁ గాంచె సుతుఁ
దోయజనేత్రలు గేహిను
లాయయ్యకు నిరువు రంబుజాసనవంశ్యా! 281
తే. కాంత యొక్కత సురుచి యొక్కత సునీతి
సురుచి కుత్తముఁ డనుపేరిసుతుఁడు పుట్టె
ధ్రువుఁడు పుట్టె సునీతి కాధ్రువునికంటె
నుత్తమాహ్వాయు మన్నించుచుండుఁ దండ్రి. 282

తే. ఒక్కనాఁడోలగంబున నున్నవేళ
గురునితొడమీఁదఁ గూర్చుండె సురుచికొడుకు
ధ్రువుఁడు నేతెంచి వాఁ డున్నతొడయె యెక్క
సురుచి వారించె భూపతి చూచుచుండె. 283

వ. అప్పుడు మఱలి వాఁ డంతఃపురంబున కరిగి యావృత్తాంతం
బంతయుఁ దల్లి కెఱిఁగించి పిన్నయయ్యును నుత్తమక్షత్త్రియ
తేజోవిశేషంబునం బరిభవంబు సహింపఁ జాలక తల్లి యనుజ్ఞ
వడసి తపంబు సేయం జనువాఁడై యదృచ్ఛాగతు లగు సప్త
ఋషులఁ గాంచి సముచితప్రకారంబునం దనవృత్తాంతంబు
వారి కెఱిఁగించి వారివలన ద్వాదశాక్షరమంత్రంబుపదేశంబు
గొని పరమభక్తిపరాయణుం డైన నారాయణు మధువన
ప్రాంతంబున యమునాతటంబునఁ బెద్దకాలంబు పెక్కు
విఘ్నంబులకు మనంబు చలింపనీక యారాధించి సాక్షాత్క
రించిన యప్పుండరీకాక్షువలన విశ్వోత్తరం బైన యిప్పదం
బుఁ గాంచె. 284

తే. ధ్రువుని కిచ్చినవరమును ధ్రువము గాఁగ
నతఁడు దాను వారాణసి కరిగె శౌరి
వానిఁ దనవెన్కదిక్కున వైనతేయు
మీఁద నెక్కించుకొని చిట్టమిడుచు నంత. 285

మ. శివుఁ గాశీపతి విశ్వనాయకుని సంసేవించి యప్పార్వతీ
ధవునాజ్ఞన్ గ్రహచక్రవాళమున కూర్ధ్వం బైనలోకంబునన్
ధ్రువ! వర్తింపు మనేకకాలమనుచున్ బోధించి యేగెన్ మనో
జవనుం డైనఖగేంద్రు నెక్కికొని విష్వక్సేనుఁ డెందేనియున్.

వ. ధ్రువుండును. 287

సీ. మణికర్ణికావారి మజ్జనం బొనరించి
యవిముక్తమునయందుశివుని నిల్పి
యాశివలింగంబు ననిశంబు సేవించి
యందు విశ్వేశ్వరు నావహించి
పంచాక్షరీమంత్ర పారాయణంబును
బ్రణవమంత్రంబును బరిచరించి
విశ్వనాయకుకృపావిభవంబు పెంపునఁ
బరమోన్నతం బైన పదము గాంచెఁ
తే. గాశిలోన ధ్రువేశ్వరుఁ గాలగంధు
భక్తి సేవింప ధ్రువ మైనపదము గలుగుఁ
బంచజనులకు నిది సిద్ధభాషితంబు
సమధి కస్వార్థశుభకర్మ! శంబుశర్మ. 288

వ. అని చెప్పి గంత నవ్విమానంబు ధ్రువలోకంబు గడచి క్రమం
బున మహాలోకజనోలోకతపోలోకంబు లతిక్రమించి సత్య
లోకంబు గదిసె. అప్పు డవ్విష్ణుకింకరులు శివశర్మ కి ట్లనిరి.

శివశర్మ బ్రహ్మవిష్ణుమహేశ్వరలోకంబుల కేగుదెంచుట

క. ముందఱిది సత్యలోకము
సందర్శింపుము త్రిణేత్రశర్మ! ధరిత్రీ
బృంధారక! యిది పరమా
నందస్థానంబు ద్రుహిణునకు నెల వగుటన్. 290

వ. అనుచు నతనిం బద్మగర్భసన్నిధికిం గొనిపోయి రప్పు
డవ్విభుండును వారలం బ్రసాదబహుమానంబులం దనిపి
ప్రసంగవశంబున నమ్మహాశ్మశానంబున మృతుండు గానివానికి
ముక్తి సిద్ధింప దని సముచితప్రకారంబుగా వీడుకొలిపె.

శివశర్మయు నమ్మాటకు సంశయాకులుండగుచుఁ దదూర్ధ్వం బుగాఁ జని చని పుణ్యశీలసుశీలురం జూచి మన కింక నెంత దవ్వరుగవలయు నెఱింగింపుఁడు. ఇప్పుడు పితామహుండు కాశియందు శరీరంబు విడువనివారికి మోక్షంబు లే దనియె. నాకు నిశ్శ్రేయసంప్రాప్తి యెట్లుగల్గు? అవ్విధంబును వివరింపుఁ డనిన వార లిట్లనిరి. 291

తే. ఉర్వి కెనిమిదికోటుల యోజనముల
పాడవునం దుండు నాబ్రహ్మభువన మనఘ!
యీప్రమాణంబునం దుండు నిందుమీఁద
విష్ణులోకంబు సతతవర్ధిష్ణు వగుచు. 292

వ. అవ్వైకుంఠంబునకు మీఁదఁ బదాఱుకోట్లయోజనంబుల పొడవున శివలోకంబు కైలాసాహ్వయం బనం దనర్చు దానికిం బరమం బగు లోకంబు లేదు. 293

తే. సంశితాచారపర! దాని సంస్తుతింప
నాక కా దచ్యుతునకైన నలినభవున
కైన శంభున కైనను నహివిభునకు
నైన గీష్పతికైనను నలవి గాదు. 294

వ. అప్పరమస్థానంబునందు నిందుధరుండు గిరినందనాసహాయుం డై దణాధిస్కందనందికేశ్వరాదులుగొలువ నుదార విహా రంబులం బ్రవర్తిల్లుచుండు. అవ్విశ్వేశ్వరుండువిశ్వరక్షణార్థం బుగాఁ జతుర్భుజుఁ జతుర్దశభువనాధిపత్యంబునకుం బట్టాభి షిక్తుం జేసి యనంతరంబ. 295

## విష్ణుపట్టాభిషేకవర్ణనము

సీ. ముందు వేసవినాఁటిమార్తాండబింబంబు
గోడగించుఁబసిండిగుబ్బతోడఁ
దోలుకారుక్రొమ్మెఱుంగులధాళధళ్యంబు
తవణించురత్నదండంబుతోడ
నచ్చువెన్నెలచాయ హెచ్చుగుం దాడెడు
వెలిపట్టుజగజంపువలువతోడఁ
గడలియం దేకోదకము వేళఁ బుట్టిన
పవడంపుఁదీఁగలపంజుతోడ

తే. వేనవేల్వ్యజనంబులవిరివి నొప్పు
లక్షకోటిశలాకికాలంకృతంబు
తారకాస్థూలమౌక్తికస్థాపితంబు
విష్ణునకుఁ బట్టె వెనకయ్య వెల్ల గొడుగు. 296

తే. పార్వతీదేవి కై సేసె బహువిధములఁ
బలుకుఁదొయ్యలి రత్నదర్పణము చూపె
శచి నివాళించె మణిదీపసంచయమున
శేషశయనునిపట్టాభిషేకవేళ. 297

సీ. చాముండి యొనరించు జంపెతాళమునకు
భృంగీశ్వరుం డాడె బ్రేంకణంబు
వెనుకదిక్కున నుండి కనకభూషలు మ్రోయ
సూర్యుండు శశియు వీచోపు లిడిరి
వెండికట్టులతోడ వేత్రదండము పూని
సంపడి నెడఁ గల్గ ఇడిసె జముఁడు
గాలోచితంబుగాఁ గైవార మొనరించెఁ
బలుకుఁదొయ్యలి గద్యపద్యసరణి

తే. నఖిలలోకములకును బ్రహ్మాండములకు
నాధిపత్యంబు వూని సింహాసనమున
మునులచే వేలుపులచేత మ్రొక్కు గొనుచు
నచ్యుతుం డోలగంబున్న యవసరమున. 298

లయగ్రాహి. మ్రొక్కిరి గణేశ్వరులు మ్రొక్కె జలజాసనుఁడు
మ్రొక్కె మునిమండలము మ్రొక్కిరి దిగీశుల్
మ్రొక్కెను మరుద్గణము మ్రొక్కె గరుడవ్రజము
మ్రొక్కె దనుజావళియు మ్రొక్కి రురగేంద్రుల్
మ్రొక్కె నిగమప్రతతి మ్రొక్కె మనుయూథములు
మ్రొక్కె నితిహాసములు మ్రొక్కె నచలంబుల్
మ్రొక్కెఁ దటినీకులము మ్రొక్కెఁ జతురంబుధులు
నక్కమలనేత్రునకు నక్కజపుభక్తిన్. 299

వ. ఇవ్విధంబున జతుర్భుజు నిర్భరస్నేహంబున భూర్భువస్స్వ
ర్భువనంబులసామ్రాజ్యభారభరణంబునకుం బట్టాభిషేకంబు
నేసి ఫాలలోచనుండు ప్రావృషేణ్యపయోధరధ్వానగంభీరం
బగునెలుంగున స్వాయంభూజంభారిప్రముఖులగు బర్హిర్ముఖు
లాకర్ణింప, విష్ణుండ యే ననియును, నేన విష్ణుం డనియును,
నాకు విష్ణునకు భేదంబు లే దనియును, హరి మంగళాయ
తనం బనియును, విష్వక్సేనుండు మాననీయుం డనియును,
నారాయణుండు జగద్రక్షాపరాయణుం డనియును, నచ్యు
తుం డనాదినిధనుం డనియును, నరవిందలోచనుం డాది
పురుషుం డనియును, హరి సర్వపాపహరుం డనియును,
నానతిచ్చి తనయిచ్చ నెచ్చోటికేనియు విచ్చేసె. ఈయా
ఖ్యానంబును చతుర్భుజాభిషేకం బండ్రు. దీనింబఠియించినను,

వినినను, వ్రాసినను నరుల కాయురారోగ్యైశ్వర్యాభి
వృద్ధులు సంభవించు. శివశర్మ! నీ వీరహస్యధర్మమర్మం బెఱింగి
హరిహరత్వంబులయందు భేదంబుసేయ కుండుమని చెప్పిరి.
అంత నవ్విమానంబు విష్ణులోకంబు గదియుటయు నాతనిం
జూచి, యిది వైకుంఠలోకంబు. ఇందు లక్ష్మీసహాయుండై
వైకుంఠుం డుండు. నీ విందుఁ బరమానందంబున శతానంద
పరివత్సరపర్యంతంబు వసియింపుము. ఇటమీఁదివృత్తాం
తంబు చెప్పెదము. పుణ్యతీర్థోపాంతమరణంబునయైన ఫలం
బునను, భూతసుకృతశేషంబునను, భూమండలంబునకు డిగ్గి
నందివర్ధన నగరంబున వృద్ధకాలుం డనుపేరిరాజ వై పెద్దకా
లంబు రాజ్యంబు సేయంగలవు. నీరాజ్యంబునందు. 300

క. కురియు నెలమూఁడువానలు
సురభులు చన్నవిసి పితుకు సుకృతము జరుగుఁ
ధరఁ గొండ్ర వేలు పండును
బరఁగుం బురుషాయుషంబు ప్రజలకు నెల్లన్. 30

వ. ఇవ్విధంబునఁ బెద్దకాలంబు రాజ్యంబు నేసి సుతవిన్యస్తరా
జ్యభారుండ వై కాశి కరిగి యయోధ్యావంతీమధురామా
యాద్వారావతీకాంచ్యుజ్జయినీతీర్థసేవాఫలంబున విశ్వనాథు
ప్రసాదంబున నపవర్గంబుఁ గాంచెద వని పలికి విష్ణుకింకరు
లతని దివ్యవిమానంబువలన డించి నారాయణదేవు సమ్ము
ఖంబునం బెట్టిరి. అప్పుణ్యశ్లోకుండును విష్ణులోకంబునం బెద్ద
కాలంబు సుఖం బనుభవించి పుణ్యశీలసుశీలురు చెప్పిన
ప్రకారంబున మోక్షంబు నడసె నని లోపాముద్రకుఁ
గుంభసంభవుండు శ్రీశైలకటకంబునందు సకలతీర్థంబులుం

గాశీప్రాపణద్వారంబున నానాసదుపకారంబు లై మోక్షంబు సిద్ధించు, కాశి యవ్యవధానంబున ముక్తినిచ్చు ననునర్థంబుఁ దేటపఱిచె. ఇది శివశర్మనిర్వాణం బను నుపాఖ్యానంబు. దీని విన్నను బఠియించినను వ్రాసినను నరుల కాయు రారోగ్యైశ్వర్యములు సంభవించు నని చెప్పి. 302

ఉ. చేసెఁ బ్రదక్షిణంబు కలశీసుతుఁ డద్రికి మల్లికార్జునా
వాసశిఖాంతరంబునకు వామవిలోచనతోడఁ గూడ విశ్వా
సముభక్తియుక్తహితముశాంతియుదాంతియునొప్పనంతరా
ధ్యాసితశంభులింగసముదాయము వారక సంభజించుచున్.

వ. చేసి కతిపయప్రయాణంబుల. 304

అగస్త్యుండు కుమారస్వామిని దర్శించుట

లయగ్రాహి. సామిమలకుం జని మహాముని ఘటోద్భవుఁడు
భామయును దాను గడునేమమునఁ బుణ్యా
రామతరువాటి మణిధామమున నున్న యభి
రామసుకుమారతరహేమనిభగాత్రుక్
సామజముఖానుజు సుధామధురమం[illegible]సి
తామలకపోలవదనామృతమ[illegible]యుక్
హైమవతిపట్టి నఖిలామరశరణ్యు నత
కామితకరుక్ గొమరసామి భజియించెన్. 305

వ. అనిన విని నైమిశారణ్యవాసులు కుమారస్వామి దర్శించిన యటమీఁది వృత్తాంతం బెయ్యది? యని యడిగిన. 306

ఆశ్వాసాంతము

శా. వేమక్షోణివరానుసంభవ! దిశావేదండగండస్థలీ
సీమాపిచ్ఛిలదానగంధలహరీశ్లేషానుభూతిక్రియా

సాను గ్రిపటుకీర్తివైభవ! కుభృచ్ఛార్దూల! సౌభాగ్యరే
ఖామత్స్యధ్వజ! మత్స్యవంశనృపరత్నాకేలిపద్మేక్షణా! 307

క. అరిరాడ్గజకంఠీరవ
బిరుదాలంకారపృథులభీషణబాహా
కరవాలనిశితధారా
పరిఖండితదుర్మదాంధపరిపంథినృపా! 308

ఉత్సాహ. అసమబాణనిభవిలాస! యాజిగాండివాయుధా
బసవశంకరా! విశుద్ధషంటవంశవర్ధనా!
కసిమికోట మేకరాయి కప్పకొండ కిల్లెడా!
దృసుహృదవనిపాంతరంగహాలహాలవిషానలా! 309

గద్య. ఇది శ్రీమత్కమలనాభపౌత్ర మారయామాత్యపుత్ర సుకవిజనవిధేయ కవిసార్వభౌమ శ్రీనాథనామధేయ ప్రణీతంబైన కాశీఖండం బను మహాప్రబంధంబునందుఁ జతుర్థాశ్వాసము.



శ్రీరస్తు

# పంచమాశ్వాసము



క. శ్రీమార్కండేయయశః
స్వామికృపాలబ్ధధరణిసామ్రాజ్యరమా
హేమాద్రిదానదీక్షిత!
వేమాంబాప్రియకుమార! వీరనృపాలా! 1

కుమారాగస్త్యసంవాదము

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె. కుమారస్వామి పత్నీసహితుండైన మహాముని నగస్త్యు నాదరించి కుశలం బడిగి కూర్చుండ నియమించి వచ్చిన ప్రయోజనంబుఁ దెలిసి వారాణసీమాహాత్మ్యంబు వినిపించువాఁడై యక్కుంభసంభవుని కి ట్లనియె. 2

తే. ఆఱుముఖములు గలవాఁడ నౌదుఁ గాని
నిగమశాస్త్రార్థములు గాన నేర్తుఁ గాని
యధికవైదగ్ధ్యవంతుండ నగుదుఁ గాని
కడఁగి వర్ణింప నోప శ్రీకాశిమహిమ. 3

వ. అయినను విను. నానేర్చుభంగిఁ గాశికామాహాత్మ్యంబు వినిపించెద. అడుగవలసినయర్థంబు లడుగుము. కొల్లాపురము మహాలక్ష్మి పుత్త్రేర నేతదర్థంబు నీవు వచ్చుట యెఱుంగుదు నని

పలికినఁగుంభసంభవుండుకుమారస్వామిపాదాంభోరుహాంబుల కెరఁగి యిట్లనియె. మహాత్మా! యవిముక్తంబు మోక్షస్థానం బనియును, మణికర్ణికాతీర్థంబు తీర్థరాజం బనియును, అప్పుణ్యక్షేత్రం బవిముక్తం బానందకాననంబు మహాశ్మశానంబు రుద్రావాసంబు వారణాసి కాశి యను నామధేయంబులు ధరియించు ననియునుం జెప్పుదురు. అన్నియుం బరిపాటి విన వలతుం దేటపడ నానతిమ్ము. 4

తే. అనినఁ బర్వతరాజకన్యాసుతుండు
కలశసూతికి నిట్లను గారవమున
నిల్వలారి! భవత్సముదీరిత మగు
ప్రశ్నభావంబు విస్తరింపంగ భరము. 5

వ. ఈయర్థంబు మాతల్లి పార్వతీదేవి మజ్జనకు హరు నడిగె. ఆసర్వజ్ఞుండు నాజగన్మాతకు నానతిచ్చినప్రకారంబు నీకుం జెప్పెద; సావధానమతి వై యాకర్ణింపుము. 6

వారాణస్యాదినామనిర్వచనము

సీ. అంబుజాసనునాయురవసానములయందు
గ్రస్తసమస్తలోకప్రపంచ
యై మాయ నిర్వికల్పాకారమునఁ దను
నాశ్రయింపఁగఁ బరమాత్మ యుండె
నిస్తరంగసముద్రనిభ మై నిరస్తప
మస్తావధిక మయి ప్రాణికర్మ
పరిపాకకాలంబు ప్రాప్త మయ్యెడునంత
దాఁక నవ్వేళ విధాతృసృష్టి

తే. గగన మొక్కండ చిక్కంగఁ గ్రాఁగిపోవ
నంధకారంబు నీరంధ్ర మగుచుఁ బ్రబలె
సత్తును నసత్తు సదసత్తు రిత్త యయ్యె
నెఱుక పడదయ్యె నేమియు నేమి సెప్ప? 7

వ. అనర్కచంద్రగ్రహతారకానక్షత్రం బనహోరాత్రం బనగ్ని భూసలిలమారుతం బప్రధానంబ శబ్దస్పర్శం బగంధంబ రూపం బదిఙ్ముఖం బై భువనప్రపంచం బంధకారావశేషం బై యుండ బ్రహ్మాండంబు నిష్ప్రపంచకం బై కేవలత్వంబు భజియింప, ననామరూపవర్ణంబు నస్థూలంబు నకృశంబు నహ్రస్వంబు న దీర్ఘంబు నలఘువు నగురువు ననపచయంబు ననుపచ యంబు నవాఙ్మానసగోచరంబు సత్యజ్ఞానానందరూపంబు నప్రమేయంబు ననాధారంబు నిర్వికారంబు నిర్గుణంబు నిర్వి కల్పంబు నిరాలంబంబు నిర్మాయంబు నిరుపద్రవంబు నై పరబ్రహ్మంబు నిరుద్యోగి యై తూష్ణీంభావంబు గైకొని నిష్క ళంకం బై విహరించుచు లీలాకైవల్యంబున లోకమర్యాద యాచరించి నిజశరీరంబున నొక్కశక్తిం గల్పించె. ఆశక్తి ప్రకృతిరూపంబ వగు నీ వాపరబ్రహ్మంబ. పురుషరూపుం డైన యేను కల్యాణి ! నాటికాలంబునందు. 8

తే. ఉండఁ బ్రోవెచ్చుటను లేక యుత్పలాక్షి !
మనము చేరితి మవిముక్తమండలంబు
నాఁడు మొదలుగ నిపుడు గన్నార మందుఁ
గాశికాపురశుభసంజ్ఞకంబునందు. 9

సీ. అనిశంబు మనచేత నవిముక్త మై యున్కి
ముగ్ధాక్షి ! యిది యవిముక్త మయ్యె

మనకు నానందంబు నొనరించుఁ గావున
నానందవిపినాభిధాన మయ్యె
సంవసింతు మహాశ్మశానభూములఁ గాన
నే నుంటను మహాశ్మశాన మయ్యె
నోరంత ప్రొద్దును నుందు రుద్రుండ నే
నటుగాన రుద్రగేహాఖ్య మయ్యె
తే. నసియు వరణయుఁ గూడుటనక్షరముల
సరవితో వారణాసి యన్సంజ్ఞ యయ్యెఁ
గాశ్యదీప్త్యా వనంగ విఖ్యాత మైన
ధాతువునఁ గాశి యయ్యె భూతలమునందు. 10
శా. నక్షత్రగ్రహతారకంబులు నరణ్యంబుల్ నదు లాబ్ధి వి
శ్వక్షోణీధ్రములున్ దిశల్ వసుమతీచక్రంబు కాలంబుచేఁ
బ్రక్షీణత్వముఁబొందియున్న యెడవిభ్రాంతిన్ సుఖంబుండఁగా
శీక్షేత్రం బిది యంబుజాక్షి! మనకున్ సిద్ధించె నెక్కాలమున్. 11
తే. †[ఈరహస్యంబు చెప్పకు మెవ్వరికిని
శంభుభక్తున కత్యంతశాంతిమతికి
శ్రద్ధధానున కధికవిశ్వాసమతికి
ననఘమానసునకు ముముక్షునకుఁ దక్క.] 12
వ. అని భవుండు భవాని కానతిచ్చె. మణికర్ణికామాహా
త్మ్యంబు వినుము. 13

## మణికర్ణికామాహాత్మ్యము

ఉ. నిండుమనంబుతోడ ధరణీధరకన్యయుఁ దాను గాశిఁ గాఁ

---

†[] కుండలీకృతభాగ మొకమాతృకలోమాత్రము లేదు. పెక్కుమాతృకలం దున్నను నధికపాఠముగా గ్రహింపఁబడియున్నది.

వుండి కుటుంబభారము మహోన్నతిఁబొందుటఁ జూచివిశ్వనా
థుం డొకనాఁడు శైలసుతతోడ విచారము చేసె దక్షుఁడొ
క్కండుహితుండు భారకుఁడు గావలదామనయింతయింటికిన్]

తే. అని విచారంబు చేసి కాలాంతకుండు
చూచె నరకంట గిరిరాజసుతముఖంబు
ప్రభవమందె నాచూపునఁ బ్రావృషేణ్య
ముదిరనీలాంగుఁ డగునొక్క ముద్దుకొడుకు. 15

వ. అబ్బాలునిం జూచి బాలేందుధరుండు. 16

సీ. పుండరీకేక్షణ! పురుషోత్తమాహ్వయ!
శిఖిపింఛసంఛన్న చికురభార!
యాజానుదీర్ఘ బాహార్గళద్వయయుగ్మ!
హరినీలసింహాసంహనన కాంతి!
గంభీరనతనాభికాసారభవపద్మ!
శ్యామపిశంగవాసగకిరీట!
శంఖచక్రగదాసిశార్ఙ్గదివ్యాయుధ!
కందర్పకోటిరేఖావిలాస!

తే. కాశికాపట్టణమునైదుక్రోశములును
పటుతరక్షేత్ర మిది రాజ్యపదవి నాకుఁ
బరమపుణ్యాత్మ! యీకుటుంబము భరింపు
తత్పరత మీఱ భారకత్వంబుఁ బూని. 17

వ. అని పల్కి మహేశ్వరుండు బుద్ధితత్త్వస్వరూపి యగు
విష్వక్సేనుం గాశికాపురిసామ్రాజ్యభారంబు భరియింప
నియోగించె నజ్జనార్దనుండును. 18

తే. చక్రమునఁ ద్రవ్వి యొక్కపుష్కరిణి సేసి
ఖననవేళా ప్రయాససంజనిత మైన
ఘర్మజలమునఁ బూరించెఁ గైటభారి
యమ్మహాపల్వలంబుఁ గాశ్యంతరమున. 19

క. వేయును నెనిమిదియేడులు
తోయజలోచనుఁడు చేసె దుస్సహతప మ
త్తోయాధారముదరిఁ గా
త్యాయన్యధిపతి గుఱించి యతులితభక్తిన్. 20

వ. అనతంతరంబ. 21

శా. ఇందూత్తంసుఁడు కాశికాధిపతి విశ్వేశుండు ప్రత్యక్షమై
కందర్పారి ముకుందనిర్మితమహాకాసారముం జూచి యా
నందంబొందివృషధ్వజుండుబహుమానశ్లాఘఁగావించెఁ దా
మందాందోళితమౌళిరై వడి శిరోమాల్యావలుల్ మ్రోయఁ [గాఁ.

క. ఫణిభూషణుండు వాపీ
ప్రణుతిశ్లాఘాపరంపరల నొనరింపఁ
ద్రిణయనునివతంసశ్రుతి
మణికర్ణిక మిట్టి సరసిమధ్యమునఁ బడెన్. 23

వ. పరమేశ్వర శ్రవణమణికర్ణికా ప్రపతనస్థలం బగుటం జేసి య
చ్చక్రపుష్కరిమణికర్ణికాహ్వాయం బై యుండు. 24

తే. చక్రపుష్కరిణీతీర్థసవిధభూమి
శంఖచక్రగదాపాణి శంభు నడిగెఁ.
గాశికాతీర్థమాహాత్మ్యగౌరవంబు
శివుఁడు నాకతి యిచ్చె నక్షీణకరుణ. 25

## కాశీతీర్థమాహాత్మ్యకథనము

వ. అది వివరించెద నాకర్ణింపుము. మణికర్ణికాతీర్థంబునందు సంధ్యాస్నానజపహోమవేదాధ్యయనంబులు వ్రతోత్సర్గంబులు వృషోత్సర్గంబులు లింగస్థాపనంబులును నక్షయమోక్షఫలంబు నొసంగు. భూతభావిభవత్తీర్థంబు లీతీర్థరాజంబుతో సరిగావు. సాంఖ్యయోగం బాత్మావలోకనంబు వ్రతతపోదానంబులు భవత్తీర్థస్నానంబునకు సమానంబులుగావు. శశమశకకీటపతంగోరగాదులు పంచక్రోశియందుఁ బంచత్వంబు నొంది నిర్వాణలక్ష్మిం గైకొను. కాశీక్షేత్రంబునం దెప్పుడుఁ గృతయుగంబు. ఎప్పుడు నుత్తరాయణంబు. ఎప్పుడు మహోదయంబు. చతుర్వేదాధ్యయనపుణ్యంబు కాశిం బంచాహోరాత్రంబులు వసియించినవారికిం గలుగు. అశ్వమేధరాజసూయాధ్వరంబుల నుపార్జితము లైనఫలంబు(లు) కాశిం ద్రిరాత్రశయనంబున సమకూఱు. తులాపురుషదానఫలంబు కాశిందర్శించినమాత్రంబునంగలుగు. రాజస్థానంబుననాయాజ్ఞ దక్క నితరులయాజ్ఞ చెల్లదు. యోజనశతదూరస్థుం డైన నరుండు కాశీస్మరణంబువలన దోషంబువలనంబాయు. పంచక్రోశప్రవేశసమయంబునం బంచజనునిపాపప్రపంచంబు బహిరంచలంబునన వసియించు. కాశిం బెద్దకాలంబుండి దైవయోగంబునం బరస్థలంబున కరిగి మృతుండైన మనుజునకుఁ గాశీమరణఫలంబు సంభవించు. అవిముక్తక్షేత్రోపవాసంబు కర్మనిర్మూలనక్షమంబు. మణికర్ణికం గృతాభిషిక్తుం డై తిలవ్రీహియవంబుల బిత్రాదితర్పణం బొనర్చిననరుండు సర్వయజ్ఞంఫలంబునం బ్రాపించు. మణికర్ణికాస్నానానంతరంబున

మౌనంబున జితేంద్రియుండై విశ్వేశ్వరశ్రీమన్మహాదేవుని దర్శించు నెవ్వండేని వాఁడు సర్వవ్రతఫలంబులం జేకొను. స్నానదేవతార్చనాజపాదుల మూత్రమలవిసర్జనంబులసమయంబుల దంతధావనహోమకాలంబుల వాచంయముండై విశ్వేశ్వరు నర్చించిననరుం డేకవాసరంబునన యావజ్జీవశివార్చనాఫలము నొందు. విశ్వేశ్వర ప్రీణనార్థంబు కాశియందు నిధనంబు నొందుమానవుండు కైవల్యధనలాభంబు లంగీకరించు. నిష్ప్రీత్యాగం బైనయాగంబున యోగంబున నానాజన్మోపార్జితం బైనఫలంబు కాశియందుఁ దనుత్యాగంబు చేసినజనునకు సిద్ధించు. కాయంబు పాపాయం బనియును ప్రసూతిమరణక్లేశంబులు దుస్సహంబు లనియును, వితర్కించు నరుఁ డాయురవసానపర్యంతంబుఁ గాశిన యుండునది. 26

శా. అర్ణోరాశిపరీతభూభువనమర్త్యస్వర్గంఖండంబు సం
పూర్ణైశ్వర్యసమృద్ధి కాశిఁ గృతపాపుం డైనఁదత్పట్టణాభ్య
ర్ణక్షోణులనైదుఃక్రోశములఁ బ్రాణాంతంబునఁ గామర్త్యుఁడా, క
ర్ణింపండు కృతాంతవాహమహిషగ్రైవేయఘుంటాధ్వనుల్.

వ. అని శంభుండు విశ్వంభరు నిరీక్షించి యింకొక్కవిశేషం బాకర్ణింపుము. భగీరథుం డనురాజన్యుండు కపిలముని ప్రదీప్తకోపానలదగ్ధు లగుసాగరుల నిరయంబువలన నుద్ధరించుటకై తపోవిశేషంబున మందాకినిం గొనితేర నమ్మహానది యిమ్మకర్ణికమీఁదం బ్రవహింప నది మొదలుగాన తీర్థంబు సురాసురులకు వర్ణింప నశక్యం బై విలసిల్లుచుండు. 28

సీ. భాగీరథీస్నానపరతఁ బోలంగ లే
దామ్నాయశాస్త్రాగమాధ్యయనము

వాఙ్మాయమును మనోవాక్కాయదురితాళి
విదళించు గంగాభివీక్షణంబు
శ్రీకంఠుకృప లేక సిద్ధింపనేరదు
త్రిదశగంగానదీతీరవసతి
బ్రహ్మవిజ్ఞానసంపత్ప్రాప్తిహేతువు
జహ్నుకన్యాసింధుసలిలసేవ

తే. కలియుగంబునఁ గలుషచిత్తులకు శఠుల
కన్యవిత్తాపహర్తల కనియతులకు
నాత్మయందుఁ బ్రాయశ్చిత్తమాచరింపఁ
గాంక్ష గలయప్డు నరునకు గంగ దిక్కు. 29

తే. ఆదియుగమునఁ దీర్థంబు లఖిలములును
త్రేత ద్వాపరమునయందుఁ దివ్యమునకుఁ
బుష్కరంబుఁ గురుక్షేత్రమును సుపర్వ
నిమ్నగయుఁ దీర్థములు బ్రహ్మనిర్మితములు. 30

తే. కృతయుగంబున ధ్యానంబు కేవలంబు
తపము త్రేతాయుగంబున ద్వాపరమున
నధ్వరంబులు గలివేళయందు గంగ
జనుల కిష్టార్థసంసిద్ధిసాధనములు. 31

శా. స్వారాజావరజాత! సార మగు ప్రాగ్జన్మాంతరాభ్యాససం
స్కారంబున్మదనుగ్రహంబు వెలిగా స్నానంబు సిద్ధించునే?
వారాణస్యుపకంఠదేశవిలుఠద్వార్వేణివీచీఘటా
ధీరధ్వానపరంపరాకలకలోద్విగ్నాఘుభాగీరథిన్. 32

క. ఆకంఠకరటిదుంఠి
శ్రీకంఠజగండమదమషీచంద్రకితా

నేక ప్రవాహజాహ్నవి
వైకుంఠా! యద్ది యెట్టివారికిఁ గలదే! 33

క. గంగానది గంగానది
గంగానది యనుచు తేపకడ మేల్కనుచో
గంగఁ గొనియాడు నెవ్వఁడు
భంగించు నతండు ఘోరపాతకచయముల్. 34

ఉ. పాయునలక్ష్మివాయునశుభంబులువాయునుదుర్నిమిత్తముల్
వాయునకీర్తివాయుఁ బ్రతిబంధము వాయుమహాఘసంఘము
ల్డాయుశుభంబు డాయుఁ గుశలంబులుడాయు మనోరథార్థ
ముల్, పాయక కాశికన్బెగుదఁ బాయుపియన్నదిఁ దీర్ఘమాడినన్.

క. ఏలా యుపవాసవ్రత?
మేలా యష్టాంగయోగ? మేలా యజ్ఞం?
బేలా తపంబు గంగా
కూలంకషఁ దీర్థ మాడఁ గూడెనె యేనిన్. 36

క. శ్రద్ధాపురస్సరంబుగ
సిద్ధస్రోతోవహాంబుశీర్షాప్లవసం
బద్ధహృదయు లగువారికి
సిద్ధించును మోక్షలక్ష్మి చేరువన హరీ! 37

ఉ. వానికులంబునుం గులమె? వానితపంబులునుం దపంబులే?
వానికృతంబునుంగృతమె? వానిశ్రుతంబుశ్రుతంబె?కృష్ణ!యె
వ్వానిమనంబు పక్వమయి వ్రాలకయుండును విశ్వనాయకా
స్థానమహాశ్మశానదివిషత్తటినీముఖతీర్థసేవకున్. 38

క. విస్మయ మేల? వియన్నది
యస్మత్తేజోగ్నిగర్భ, యటు గావున్నన

భస్మము సేయునె కైటభ
ఘస్మర! నిమిషమున సకలకలికలుషములన్? 39

చ. నడచుచుఁగూరుచుండుచును నవ్వుచునిల్చుచుఁ బారియాడు
చున్,గుడుచుచుఁబవ్వళించుచునుగూర్కుచు మేల్కనుచున్
రమించుచున్, బడుచును లేచుచున్నరుఁడు భావమునందవి
ముక్తసీమసంగడిఁ బ్రవహించుశ్రీగగనగంగఁదలంచి త్యజిం
చుఁ బాపముల్. 40

క. జిహ్మాగవిరోధివాహన!
జిహ్మామతుల్ దెలియువారె? చిరకాలమునన్
బ్రహ్మాండమునగుమఁ బర
బ్రహ్మమయపయఃప్రపూరభరసురతటినిన్. 41

క. అంగీకరించు మనుజుఁడు
సాంగోపాంగాధ్వరక్రియాఫలము వియ
ద్గంగాపులినంబున శివ
లింగార్చన మాచరించి లెస్సగ శౌరీ. 42

ఉ. రోదన మాచరించు వగఁ గ్రోధమనోభవరాగరోగమో
హాదులఁ గూడి తీరములయం దఘముల్ దలఁబట్టు పట్టనే
డాదిగ దీనఁ బాయఁబడెనా! మన కంచును గాశికాసమ
రాశ్యదమునన్వియత్తటినినాడఁగమర్త్యుఁడుగట్టుడిగ్గుచోన్.

తే. గంగ కరుగంగఁ మిగుల విఘ్నములు సేయుఁ
బ్రేతరక్షఃపిశాచికాభూతతులు
గంగ డాసినసిదప విఘ్నములు సేయ
వాసవుఁడు లేఁడు నరునకు వానితర మె? 44

మ. అనుషంగంబున నొండెనొండెను విహారాపేక్ష నొండేనిఘు,

ర్మనిరాసంబున నొందెఁ దీవ్రభయసంత్రాసార్థమొం దేనిన,
న్మనియోగంబున నెవ్వఁడే మునుఁగు గంగాంభఃప్రవా
హంబుఁ, జనుఁ డాతండును బుండరీకనయనా! శాసించుఁ
బాపౌఘముల్. 45

తే. ఇచ్ఛ లేకుండినను నగ్ని యెట్లు గాల్చుఁ
దన్ను నంటినవారి నిదాహశక్తి
నిచ్ఛ లేక క్రుంకినను దహించు నట్ల
తైర్థికునిఁ బొంది యున్న పాతకము గంగ. 46

క. కంసాంతక! నరుఁ డంతకు
సంసారక్లేశముల విషాదము నొందుఁ
సంసేవించుం గాశ్యవ
తంసాభరణంబు గంగఁదా నెపు డేనిన్. 47

చ. తెరలక కాశికానగరి దేవతరంగిణిఁ దీర్థమాడకై
యరుగుచు నెవ్వఁ డేని మృతుఁడౌ భవితవ్యథ కారణంబుగాఁ
దెరువున నామనుష్యుఁడును దీర్థఫలంబఖిలంబుఁగాంచియం
బురుహదళాక్ష! పాపములఁ బోకడవెట్టుఁబురార్జితంబులన్.

సీ. అరుణాంశుమండలం బంధకారముఁ బోలె
దంభోళి వసుమతీధ్రములఁ బోలె
ఖగసార్వభౌముండు కాద్రవేయులఁ బోలెఁ
గంఠీరవము భద్రకరులఁ బోలె
దివ్యౌషధంబు వ్యాధినికాయములఁ బోలె
మందువేసవి యెండమడువుఁ బోలె
జంఝానసమీరంబు జలధరంబులఁ బోలె
మానదంభంబు ధర్మంబుఁ బోలె

తే. భక్తి సేవించువారిపాపము లడంచు
దురితతరుషండశతఖండపరశుధార
మదనవైరిజటాటవీమల్లికళిక
యభ్రరోధిపయోభంగ యమరగంగ. 49

క. యావజ్జీవము గంగా
ప్లావం బొనరించునరుఁడు పంకజనయనా!
జీవన్ముక్తుఁడు త్రిజగ
త్పావనుఁ డని చెప్పుదురు తపస్విప్రవరుల్. 50

తే. వలదు తిథివారనక్షత్రవర్గణంబు
తీరసంవాసజనులకు వారిజాక్ష !
సంచితము లైననిఖిలదోషములు వాయు
నాకవాహిని నేకాభిషేకమునను. 51

సీ. వలుదచన్నులమీఁదియులుపచ్చిగందంబు
కమ్మతావులు దిఙ్ముఖములఁ బొగవ
శశికాంతమణిశిలాశకలపాండుర మైన
మెయిచాయ చంద్రికామృతముఁ గురియ
జలదేవతాహస్తచామరానిలములు
కుటిలాలకములకు గొండ్లిఁ బరవ
ధవళాతపత్త్రముక్తాదామకంబులు
గురుసువర్ణకిరీటకోటి నొరయఁ

తే. బూర్ణకుంభంబుతో సితాంబుజముతోడ
దరముతోడ నభీతితోఁ గరము లలర
నదనదీపల్వలంబులు గదిసి కొల్వఁ
గాశిఁ బేరోలగం బుండు గగనగంగ. 52

న. మండూకమకరకచ్ఛప
గండూపదఝులికుళీరకలహంసికకా
రండవబకముల వెండిఁ బ
సిండిని గావించి గంగఁ జిరుముదురు వ్రతుల్. 53

వ. అని యిందుధరుండు ముకుందున కానతి యిచ్చె. గంగయు పూర్వోక్తప్రకారంబునన యరుగుదెంచి కాశీస్థానంబున కపూర్వాలంకరణం బయ్యె. ఇంకఁ గుంభినీధరపుత్త్రికి నద్దేవు డాన తిచ్చినప్రకారంబునం గాశీమాహాత్మ్యంబుఁ జెప్పెద. కుంభసంభవ! అవధానపరుండవై యాకర్ణింపుము. 54

తే. పరిహరించును వేదాంతభాగ మన్న
నుపనిషత్తన్న వీనుల నోకలించుఁ
గంటగించును సాంఖ్యయోగంబు లన్నఁ
గాశి నున్నజనుండు మోక్షమునఁ దనిసి. 55

క. దేహత్యాగము దానము
దేహనిపాతంబు దపము ధృతిఁ బరికింపన్
దేహవియోగమ యోగం
బాహా! కాశీపురీకృతావాసులకున్. 56

తే. విశ్వనాథుండుఁ దేహాలి విఘ్నరాజు
గవనిమొగసాల నధికారి గా నొనర్చి
గాశిఁ జొరనీఁడు తనముద్రగానియొరుని
ముక్తినిధి నెవ్వఁ డోడుచునో మోస మనుచు. 57

క. వరణ నసి రెండుదిక్కులఁ
దరుణేందుధరుండు నిలిపెఁ దలవరులం గాఁ

బరు నెవ్వనిఁ దా నెఱుఁగక
చోరనీకుం డనుచు ముక్తిచోరవిశంకన్. 58

వ. ఈశ్వరాదేశంబునం గాని కాశీనగరం బెవ్వరికిం జొరరాదు. ఈయర్థంబు దేటపడ నొక్కయితిహాసంబు గల దాకర్ణింపుము. దక్షిణాబ్ధితటంబున సేతుబంధసమీపంబున నొక్క గ్రామంబున ధనంజయుండను నొక్క వైశ్యోత్తముండు గలండు. అతండు మాతృభక్తుండు. తల్లి జరాభారంబునం బెద్దకాలం బునకుఁ గాలధర్మంబు నొందిన. 59

తే. గాసివడి గంగ నస్థులు గలపకున్నఁ
దల్లిఋణ మెట్లు వాయుఁ బుత్రకున కనుచుఁ
గదలెఁ గోమటి యానందకాననమున
కంబదేహాస్థిశకలసంహతులు పూని. 60

సీ. పంచగవ్యముల నాప్లవనంబు గావించి
పంచామృతముల నభ్యంగ మార్చి
యక్షకర్దమమున ననులేప మొనరించి
పుష్పమాల్యంబులఁ బూజ సేసి
పట్టువస్త్రంబునఁ బరివేష్ట మొనరించి
యామూటఁ దిత్తిలో నదిమి తుఱిమి
పుటవిగాఁ గంబళంబున ధ్రువంబుగఁ గట్టి
ముద్దగా మన్నద్ది ముద్ర వెట్టి

తే. జతనముగ రాగిపెట్టెలో సంగ్రహించి
యరవఁ దాలంబు నీని చిక్కలవరించి
యంబయస్థుల కుపచార మాచరించె
నొడయనికిఁ బోలె గురుభక్తుఁ డూరుభవుఁడు. 61

వ. ఆయస్థిపేటికయు లోహీండియుఁ దండులంబులుఁ గంబళం
బులుం దగినసంబడంబును వహించి యొక్కరుండునుం దెరు
వుతోడునం బెక్కుదేశంబులు గడచి హవిష్యాశనుండును,
స్థండిలశయనుండును నై పథపరిశ్రాంతి నభిఘాతజ్వరంబునోఁకిన
లెక్కసేయక తటిమి నడచి మార్గమధ్యంబున నొక్కవేఁట
పల్లె నొక్కయాటవికునికిఁ భృతి యిచ్చి మూటమోపించు
కొని యెట్టకేలకుం గాశీపట్టణంబు చేరి. 62

క. ఆనందవనమునం దొక
వానెవణిజునింట నుండి వైశ్యుండు పదా
ర్థానయనార్థము వోయెం
దా నొక్కఁడు హట్టమునకుఁ దదవసరమునన్. 63

వ. మూటలోఁ దామ్రసంపుటకంబున ధనం బున్నయది యని
చెంచు వంచనాపరుం డై బొక్కసం బెత్తుకొని తప్పు తెరు
వునందన(గాఁ) పల్లెకుం బోయె. ఇటఁ గోమటియును. 64

ఉ. అంగడినుండి బియ్యము పదార్థములుం గొని వచ్చి దప్పిమై
నంగము దూల నుస్సూసుచు నల్లన కోమటిసెట్టి మందిర
ప్రాంగణసీమవేదిపయిఁ బందిరినీడను విశ్రమించి పి
ల్చెంగటముం బ్రసేవమును జెచ్చెరఁ దెమ్మనెబంటుల్మెచ్చునిన్.

క. విలిచి ప్రతివచన మొదవమిఁ
గళవళమున నిల్లు సొచ్చి కాననచరు న
న్నెలవునఁ గానక వైశ్యుఁడు
నలుమూలలు వెదకి నెమ్మనము దలఁ కొందన్. 66

తే. అస్థిగర్భితతామ్ర పేట్యన్వితమగు
బొక్కసము నెత్తికొని పోయె బోయ యనుచు

జననిఁ దలఁచి ప్రయాసంబు సంస్మరించి
మోసఁ దర్కించి యవ్వైశ్యముఖ్యుఁ డుండ. 67

సీ. మధ్యాహ్నకాలంబు మందాకినీవారి
నభిషేక మొనరింప నబ్బ దయ్యె
శివుని విశ్వేశ్వర శ్రీమన్మహాదేవు
మదనారి వీక్షింప నోదవ దయ్యె
దండపాణిని డుంఠి దక్షిణామూర్తిని
గాలభైరవుఁ గొల్వఁ గలుగ దయ్యె
శ్రీవిశాలాక్షికిఁ జేదోయి మొగిడించి
శిరసుపైఁ జేర్పంగ దొరక దయ్యెఁ

తే. గోమటికిఁ దల్లి యస్థులకోకమూట
పాపకర్ముండు చెం చర్థభార మనుచు
వంచనాపాటవంబునఁ గొంచుఁ బోయి
యారివేరంబు చేసినకారణమున. 68

శా. జాలింబొందియు డప్పిఁజెందియు బుభుక్షావేదనంగుందియున్
వ్యాళాభీలకరాళతీవ్రతరమధ్యాహ్నార్కరోచిశ్ఛటన్
జాలం గుందియునుం గిరాటుఁ డరిగెన్ సంరంభశుంభద్గతిన్
వైలక్ష్యంబునఁ జెంచువెంట జననీవాత్సల్యనిఘ్నాత్మతన్.

వ. అంతక మున్న (యొక్క) కాంతారంబున నమ్మూట విడిచి యాయాటవికుండు పెట్టెఁ దెఱచి యస్థిశకలంబులు చూచి తనవృథావస్థకుఁ జిన్నఁబోయి యవి యచ్చోటన పారం జల్లి తన పల్లెకుం బోయి మఱుఁగుపడి యుండె. ధనంజయుం డును నప్పక్కణంబునకే తెంచి. 70

తే. చెంచునింటికిఁ బోయి చెంచెతకుఁ బ్రియము
చెప్పి నమ్మించి తలమీఁదఁ జెయ్యి వెట్టి
వెలకు మని తన్ముఖంబున నెలుకుఁ జేని
గాంచి యాతనితోడ సఖ్యంబు చేసి. 71

వ. అతఁడుం దానునుం గూడి యయ్యస్థిశకలంబులు పారం
జల్లిన కాంతారప్రదేశంబున కేతెంచి నప్పుడు. 72

తే. ఎమ్ముకలు చల్లినట్టిచో టెఱుఁగఁ డయ్యె
దైవవశమున నాభిల్లతస్కరుండు
దిగ్భ్రమం బెత్తి యందంద తిరుగుచుండెఁ
గానలోపల నెచ్చోటఁ గానలేక. 73

క. వచ్చినయడవిక వచ్చుం
జొచ్చినకాననమ చొచ్చుఁ జోరపుళిందుం
డెచ్చో నస్థులు గానక
యచ్చెరుపడె దైవమతము లవి యల్పములే? 74

వ. అయ్యస్థులు చల్లినచోటు దప్ప నడచుకొని కిరాతుండు
బహుళ క్షుత్పిపాసాపరవశుం డయి హాహాకారంబు సేయు
చుం [1]గ్రమ్మఱం గాశీపురంబున కరిగి తన మందభాగ్యత్వంబు
ప్రకటించుచు మందాకినీస్నానంబుచేసి మఱలి నిజస్థానంబు
నకుం బోయెం గావున. 75

తే. అనఘచారిత్ర! విశ్వేశ్వరాజ్ఞఁ గాని
రాదు వారాణసీనగరంబుఁ జొరఁగ
బలిమిఁ జొచ్చిన యేని నప్పంచజనుఁడు
పడనిపాటులఁ బడు విఘ్నపంక్తిచేత. 76

---

1 జనియె. నిటవైశ్యుండును అస్థియుం గిరాతునింగానక అగ్గిదాఁక.

వ. అనుటయు నాకుమారస్వామికిఁ గుంభసంభవుం డిట్లనియె. 77

తే. కార్తికేయ! కృపాలబ్ధి గలుగె నేని
శ్రవణయోగ్యుండ నేనును నవుదు నేని
నాన తీఁ దగు నానందకాననమునఁ
బ్రతివసించినక్రోధభైరవునిమహిమ. 78

వ. అనినం గుమారుండు మైత్రావరుణి కి ట్లనిగెు. 79

కాలభైరవచరిత్రము

క. వారాణసీకథాశ్రుతి
పారాయణుఁ డైనపుణ్యపరునకు నీకుఁ
నేరిచినభంగిఁ జెప్పెద
భైరవచరితంబు వినుము పరమమునీంద్రా! 80

తే. హస్తములు రెంట నందంద యదిమి పట్టి
తాటిపం డారగించెడు తమకమునను
నవ్యయంబైన బ్రహ్మాండ మాస్వదించు
భైరవుం డిచ్చుఁ గాత శోభనము మనకు. 81

మ. క్షయకాలంబున సీధుసాగరరసాస్వాదాతిరేకంబునఁ
నయనాబ్జంబులు ఘూర్ణితంబులుగ సంధ్యాకాలరాత్రీకర
ద్వయతాళానుగతిప్రకారమున మత్తల్లీమహానృత్తముం [డ్రి
బ్రియమొప్పారఁగనాడుభైరవుఁడుగల్పించుమ్మహైశ్వర్యము

వ. అని తత్కథాకథనశ్రవణహ్లాదయంబున ని ట్లనియె. 83

క. హాటకవసుంధరాభృ
త్కూటస్థలియందుఁ దొల్లిఁ గొలువుండె నిరా
ఘాటవిభవాభిజృంభిత
హాటకగర్భుండు జగము లన్నియుఁ గొలువన్. 84

వ. అయ్యవసరంబునఁ దత్సభాసదు లగుమునీంద్రు లప్పరమేష్ఠికిం బ్రణమిల్లి యి ట్లనిరి. 85

తే. వరద ! వాగ్వధూవల్లభ ! వనజగర్భ !
యడుగఁ గల దొక్కసంశయి తార్థ మిప్పు
డవ్యయం బగుతత్త్వ మెయ్యదియొ తెలియ
నంతవట్టును బ్రీతి మా కానతిమ్ము. 86

వ. అనిన విని భారతీవల్లభుండు శ్రీమహాదేవమాయామోహావశంబునం [1] బరమాత్మవివేకంబు లేక వారలం జూచి జగద్యోని యగునే నొక్కరుండన యీశ్వరుండ. నాకధికుండు (నీశ్వరుండు) లేఁడు. మీ రివ్విధంబు దెలిసి యవ్యయతత్త్వంబు నన్నకా భావింపుఁ డనియె. అయ్యహంకారంబు సహింపక తత్సమీపంబున నున్న విశ్వంభరాంశసంభవుం డగు క్రతుపురుషుండు నిటలభ్రూకుటిదుర్నిరీక్షుండును గ్రోధతామ్రాక్షుండు నగుచు నతని కి ట్లనియె. 87

క. పరతత్త్వ మెఱుఁగ కూరక
పరమర్షులతోడ నేన పరముఁడ ననుచుఁ
సుర లెల్లఁ గాకు చేయఁగ
దురహంకృతిఁ సేయఁ దగునె? తోయజగర్భా ! 88

వ. విను మేను సాక్షాన్నారాయణుండను, యజ్ఞపురుషుండ, జగత్ప్రభుండ, నవ్యయుండ. నవ్యయ(తత్త్వ)శబ్దవాచ్యత్వంబు నాయంద సంప్రతిష్ఠితంబు. నీ విట వలవని పెద్దతికంబున నడిచి పడకుండు మనియె. ఇ ట్లిద్దఱుఁ బరస్పరజయార్థ

1 పరాత్మపరామర్శ: పరామర్శవివేకంబు.

లగుచు వాదడిచి యడిచి తమతారతమ్యం బామ్నాయం
బుల నడిగి రప్పుడు ఋగ్వేదం బిట్లనియె. 89

సీ. సవరించు నెవ్వాఁడు జఠరగోళంబున
బొడ వడంగక యుండ భూతగణము
నెరయించు నెవ్వాఁడు నిజసనాతనమాయ
సకల ప్రపంచంబు సంతతముగ
విహరించు నెవ్వాండు వివిధోపనిషదర్థ
హర్మ్యాగ్రములయందు నహరహంబు
చరియించు నెవ్వాఁడు శాశ్వతమంగళ
ప్రోద్దామరార్భటి నొక్కరుండు

తే. నహహ! యయ్యాదిదేవుఁ డనామయుండు
రుద్రుఁ డవిచింత్యుఁ డాద్యుఁ డరూపుఁ డుండ
నవ్యయం బగుతత్త్వ మే నన వశంబె
యన్యులకు నెట్టివానికి? ననఘులార! 90

వ. అనవుడు యజుర్వేదం బి ట్లనియె. 91

సీ. సకలాధ్వర క్రియాసంచయంబులఁ జేసి
యిజ్యమానుం డగు నెవ్వఁ డలరు
నధ్యాత్మవిద్యారహస్యమార్గంబునఁ
దక్క నెవ్వాఁడు గానఁ దరము గాఁడు
మాయందుఁ గరము ప్రామాణ్యవిశేషంబు
లెడపకుండఁగఁ జేయు నెవ్వఁ డెపుడు
ప్రకటకూటస్థస్వభావత నఖిలంబుఁ
గదల కెవ్వాఁడు సమీక్షణ మొనర్చు

తే. నట్టిశివుఁ డోంకారుండు గా కర్తుఁ డగునె
యవ్యయప్రదత్త్వ మనుసమాహ్వయము దాల్ప ?
నితరుఁ డెంతటివాఁ డగు ? నేతదర్థ
మాత్మ సంశయింపకుఁడు ధన్యాత్ములార!. 92

వ. అనిన సామవేదం బి ట్లనియె. 93

సీ. విశ్వంబు నెవ్వనివిపులక్రియాశక్తిఁ
పెరుగుచున్నది తీఁగ పెంపు గాఁగ
జింతింతు రెవ్వనిఁ జిత్ప్రకాశాత్మకుఁ
బరమార్థవిదులు తాత్పర్య మొదవ
రవిసుధాకరశిఖిగ్రహముఖ్యముల కెల్ల
భాసకం బెవ్వనిభవ్యతేజ
మితరదుర్ధర మగునీశ్వరశబ్దంబు
వలచి యెవ్వనిఁ బాయ దలఘులీల

తే. నతఁడు మరణోద్భవవ్యవహారదూరుఁ
డజుఁడు ఫాలాక్షుఁ డిందురేఖావతంసుఁ
డవ్యయప్రదత్త్వ మాఁగాక యల్పు లొరుల
కమ్మహత్త్వంబు గలుగునే? యనఘులార!. 94

వ. అనిన నథర్వవేదం బి ట్లనియె. 95

సీ. ఎవ్వాఁడు రవణిల్లు నెల్లజీవులయందు
బూసలలో నుండుబొందువోలె
నెవ్వనిఁ బొడగందు రూత్పద్మపీఠుల
భక్త్యనుగ్రహులగు భవ్యజనము
లెవ్వాఁడు వికసిల్లు నింతయుఁ దా నయ్యు
నేమియుఁ దాఁ గాక యేకహేలి

నెవ్వనిసద్భావ 'మిదమిత్థ' మని చెప్పఁ
జాలవు నేడును శాస్త్రఫణితు

తే. లతులకై వల్యమంగళాయతను డభవుఁ
డప్రతర్క్యుండు శంకరుఁ డప్రమేయుఁ
డతఁడ యవ్యయం బగుతత్త్వ మనఁ దనర్చు
మఱువుఁ డొండుతలంపు ధీమహితులార! 96

వ. అని యిట్లు చతుశ్శ్రుతు లుపన్యసించిన విని విరించిమఘ పురుషు లహాహా! పరేతనిలయంబునఁ గాంతాపరవశుం డై యుండు ప్రమథనాథుం డెక్కడ? అవ్యయతత్త్వం బెక్కడ? పరబ్రహ్మభావం బతని కెట్లు సమకూఱు నింక మీమాటలు పొసంగ వనునవసరంబునఁ బ్రణవంబు మూర్తిమంతం బై వారి కి ట్లనియె. 97

క. శితికంఠుఁ డలఘులీలా
ధృతవిగ్రహుఁ డట్లు గానఁ దెల్లం బాత్మా
వ్యతిరిక్త యగుసరోజా
యతలోచనతోడఁ గూడఁ డతఁ డెన్నండున్. 98

తే. అర్ధశశిభూషణుండు స్వయంప్రబుద్ధుఁ
డున్నతుండు నిత్యోన్నతజ్యోతి యతని
సంతతానందశక్తి యాసరసిజాక్షి
విశ్వజనయిత్రి వారికి వేఱు లేదు. 99

వ. అనియివ్విధంబున నెంత చెప్పిన విధాత్మమఘమూర్తులం జుట్టుకొన్న యజ్ఞానతిమిరంబు దొలంగ దయ్యె. అప్పుడు దశదిశావకాశపరిపూర్ణం బగు నొక్కయఖండదివ్యతేజంబు వారలనడుమ నుద్భవించె. అనంతరంబ తన్మధ్యంబునందు.

సీ. కటిభాగమున గంధకరటి రాట్చర్మంబు
కపటంపుఁజిమ్మచీఁకట్ల నీన
వక్షస్స్థలంబునఁ జక్షుశ్శ్రవణభర్తృ
తారహారము శేవఁ దళుకుసూపఁ
గేలుదామరయందు శూల ముద్భటనట
జ్జ్వాలసకీలముల వసంత మాడ
జూటకూటమునందు సొబగులేఁజందురుఁ
డకఠోరసారచంద్రికలు గాయఁ

తే. కుటిలఘుర్ఘురనిర్ఘోషఘోరఘోష
సరణి డమరుకనాదంబు పరిఢవిల్లఁ
బురనిశాటవిపాటనస్ఫుటవిహార
దుర్ధరుం డగుహరుఁడు ప్రాదుర్భవించె. 101

వ. ఇట్లావిర్భవించిన యవ్విరూపాక్షు నిరీక్షించియవ్విరించి దుర
హంకారంబు విడువనేరక పంచమవదనంబున నిట్లనియె. 102

తే. డమరుధర! నీవు నాలలాటస్థలమునఁ
దొల్లి జనియించితివి తేటతెల్లముగను
రోదనము హేతువుగ నీకు రుద్రనామ
మపుడు ఘటియించినాఁడ నే నలఘుమహిమ. 103

వ. అట్లు గావున నీవు నాకుఁ బుత్త్రుండవు, నన్ను శరణంబుచొచ్చి
నావలనం బరిరక్షఁగాంచి బ్రదుకు మనుచు దురాలాపంబులు
పలికె. భర్గుండును నఖర్వం బగుతదీయగర్వంబు సహింపక
నితాంతరోషసంరంభంబున విజృంభించిన. 104

సీ. ఢమఢమార్భటిడమడ్డమరుఢక్కాధ్వని
పదిదిక్కులందును భ్రమసి పార

గళమూలనిర్గళత్కాలకూటచ్ఛవి
యర్కబింబంబు మాయంబు సేయ
ఫాలదృగ్భవసముద్భటశిఖిజాలంబు
లుడుధుల నన్నింటి నుడుకఁ బెట్టఁ
గుటిలపాటలజటాంకురకుట్టనంబులు
జగదండసీమ బెజ్జములు పుచ్చ
తే. సంభవము నొందె హరునవష్టంభరభస
శుంభదవగాఢరోషవిస్ఫురణవలన
విశ్వసంహారసన్నాహవిషమసుషమ
పరుషదుర్భైరవుం డగు భైరవుండు. 105

వ. ఇట్లుద్భవించి యుద్భటప్రతాపదుర్నిరీక్ష్యుం డగుచు నాక్ష
ణంబ విరూపాక్షునాజ్ఞావచనంబునం బద్మగర్భునిం గదిసి.

ఆ. గంధకరటి నూత్నకమలంబుఁ బోలె న
[1]ప్పూరుషుఁ డలఘులీలఁ బొటకరింపఁ
ద్రుంచె నవ్విరించి పంచమవదనంబుఁ
బ్రఖరదీర్ఘహస్తసఖరధార. 107

తే. ద్రోహి యేయంగ మట్టిద రూపడంపఁ
దగవు గావుప దూషకత్వంబుఁ దెలిసి
తునిమెఁ బరమేష్ఠిపంచమాననము యేర్చి
భైరవుం డింత యొప్పైనపాడి గలదె? 108

వ. అట్టియెడ నారాయణాంశజుం డైనక్రతుమూర్తి శైవంబు
లైనస్తోత్రంబులు పఠియించె. హిరణ్యగర్భుండును నహం
కారముడిగిభీతిపరవశంబున శతరుద్రీయంబు జపియించె. అంత

---

1 పురుషుఁ డలసలీల

శరణాగతవత్సలుం డగునయ్యీశ్వరుండు వారి నిర్గతిం
గరుణావిలోకనంబుల మన్నించి నిజరూపాంతరం బైన భైరవ
దేవుం జూచి యీయధ్వర(పురుష)విఘాతలు నీకు మాననీ
యులు. వీరలయెడ నింకఁ గోపాటోపంబులు చాలు. నీవు
వైధసం బైనకపాలంబు దాల్చి లోకాచారప్రకటనార్థంబు
భిక్షాశనంబు గొనుచుఁ గాపాలికవ్రతంబుతోడ లోకంబులం
జరియింపు మని చెప్పి యనంతరంబ. 109

సీ. మోకాళ్లు దిగకుండ ముడిచి కట్టినధాతు
శాటంబు గలకటిస్థలముతోడ
దట్టంబు గాఁగఁ జందనపంక మలఁదిన
యరుణంపువికటదేహంబుతోడఁ
బిల్లికన్నులఁ బోలు పింగళాక్షములందుఁ
గ్రూరంబు లగుమిడిగ్రుడ్లతోడఁ
బొడకట్టువడుజపాపుష్పంబు చెరివిన
చికిచికిపల్లవెండ్రుకలతోడఁ

తే. గఠినదంష్ట్రికాభీలవక్త్రంబుతోడ
జిహ్వానటనత్వరోల్లలజ్జిహ్వతోడఁ
గత్తితోఁ *బద్దెతో మహోగ్రత్వ మొంద
ఫాలనేత్రుఁడు సృజియించె బ్రహ్మహత్య. 110

వ. ఇట్లు సృజియించి దానిం జూచి కాశికానగరంబుదక్క నితర
స్థలంబు లెవ్వియు నీకు దుష్ప్రవేశంబులుగావున నీ వితనిపజ్జ
వర్తిల్లు మని పలుకు బుండరీకభవశిరఃఖండనుం డైనభైరవుం

* అన్నిమాతృకలందు 'పట్టి' యనియే యున్నది. 'కర్త్రీకర్పరహస్తా
గ్రాం' అని సంస్కృతమూలము, పట్టిశబ్దము కర్పరవాచక మగుట విచార్యము.

జూపి యక్కాలాంతకుం డంతర్ధానంబు సేసె. అతండును
నీశ్వరోక్తప్రకారంబున సకలజగమ్ములు గ్రుమ్మరుచు నొక్క
నాఁడు వైకుంఠపురంబు చొచ్చి వైకుంఠనికేతనంబున కేగిన.

సీ. పదపల్లవంబునఁ బ్రకటిల్లుచదలేఱు
కడలెత్తి ధాత్రి వెల్వొడిచి పాఱఁ
గటియందు రంజిల్లు కనకశాటి మెఱుంగు
గొళవుల రేయెండతళుకు లీనఁ
బొక్కటి తమ్మిపూవున జాలముసరెడు
నలులు ఝుమ్మనుచుఁ సంకులతఁ దిరుగఁ
దులసీపలాశమంజులదామకంబులు
కౌస్తుభపదకంబుఁ గ్రిందుపఱుప

తే. సంభ్రమము విస్మయంబులు సమ్మదంబు
భక్తియును భావవీథిలోఁ బరిఢవిల్ల
నిందిరయుఁ దానుఁ బద్మాక్షుఁ డెదురు వచ్చె
భర్గమూర్తికి నయ్యాదిభైరవునకు. 112

వ. ఇట్లు వచ్చి యాలక్ష్మీశ్వరుం డగ్రభాగంబున. 113

మ. కనియెం గుండలిరాజకుండలు మహాకాళుఁ లలాటస్థలీ
జనితానల్పకృపీటసంభవపటుజ్వాలాకరాళాత్ముఁ బా
వనునిఁ బ్రహ్మకపాలహస్తుని జటావ్యాధౌకనప్రౌఢది
వ్యనదీవార్ణహారీపరస్పరహతివ్యగ్రారవుఁ భైరవున్. 114

వ. కని జయజయశబ్దముఖరుం డగుచుం గదిసి ప్రణమిల్లి యంజ
లిపుటంబు నిటలతటంబునం గదియించి తత్ప్రభావవర్ణనా
కుతూహలంబున నిందిరాదేవి కి ట్లనియె. 115

సీ. జలజాక్షి! యితఁడు వో సకలయోగీంద్రులు
భావవీథులఁ గాంచుపరమతత్త్వ

మలివేణి! యితఁడు వో యఖిలభూతములకు
నాధార మగుచు నింపారు వేల్పు
కలకంఠి! యితఁడు వో కలకాలములయందు
నుడివోని శుభమూర్తి నుండు పెద్ద
లలితాంగి! యితఁడు వో యలఘు తేజంబున
విశ్వంబు వెలిఁగించు విశ్వనాథుఁ

తే. దబ్ధిసంభవ! యితఁడు వో హాలహాలపు
విషము పుక్కిటఁ దాల్చినవెగ్గలీఁడు
పాటలీగంధి! యితఁడు వో భక్తతతికి
శాశ్వతానందకరుఁ డగునీశ్వరుండు. 116

క. మన మెట్టిభాగ్య మొనరిం
చినవార మొ నేఁడు పూర్ణశీతాంశునిభా
నన! యట్లు గాక శంభుఁడు
విన నచ్చెరు విచటి కిట్లు విజయము సేసెన్. 117

వ. అని పలికి యప్పరమేశ్వరుండు వెండియు ననేకప్రకారం బులం బ్రస్తుతించి యతనివలనఁ దద్భిక్షాటనవృత్తాంతం బంతయు నెఱింగి నాశ్చర్యహృదయుం డగుచుఁ బద్మమంది రకు సంజ్ఞసేసిన నాజగన్మాతయు నంతగపురంబునకుం జని యనంతరంబ. 118

సీ. అడుగుఁదమ్ములయంచు నడరునున్న నిడాలు
కపటసంధ్యార్భటిఁ గ్రమ్మఱింపఁ
గాంచీమతల్లి కాకలకలారవములు
ఝషకేతునట్టహాసముల నవ్వఁ

కుచకుంభయుగళిమ్రోఁగునఁ దొట్రుపడి పేద
కౌఁదీగ జవజవఁ గంప మొందఁ
గ్రుయి వెక్కి జాఱిన క్రొమ్ముడిలోపలి
విరులు తుమ్మెదలకు విందు వెట్ట
తే. సహజసంభ్రమతాత్పర్యసమ్మదములఁ
దళుకు చూపంగ నవరత్నదర్విఁ గొనుచు
నిందిరాదేవి యేతెంచి యిందుధరుని
హస్తపాత్రిక నమృతదివ్యాన్న మిడియె. 119

వ. ఇట్లు మహాలక్ష్మీదేవిచేత మనోరథవతి యనుపేరం బ్రసిద్ధి యగుభిక్షఁ గొని పద్మాక్షునందలి భయభక్తివిశ్వాసంబులకు మెచ్చి యతనికోరినవరంబు లొసంగి యెప్పటియట్ల బ్రహ్మహత్యతోడన యరుగుదేర జగంబులఁ జరియించుచు నొక్కనాఁడు. 120

సీ. జనని యేతీర్థంబు సకలదుఃఖావళి
హరణప్రభావవిస్ఫురణమునకు
గృహిణి యేతీర్థంబు మహితహాలాహల
గరళచ్ఛవిచ్ఛన్నకంధరునకు
నావాల మేతీర్థ మభిమతప్రదకళా
కరవిశాలాక్ష్యాఖ్యకల్పలతకు
నావాస మేతీర్థ మఖిలతీర్థాలభ్య
ముఖ్యసౌఖ్యావహమోక్షమునకు
తే. నట్టితీర్థంబునకు నెమ్మి నరుగుదెంచెఁ
గాశినగరికి సకలభాగప్రకీర్ణ

గగనగంగాతరంగిణీకనకకమల
పరిమళోద్గారిణికి మహాభైరవుండు. 121

వ. ఇట్లు దేవుండు విశ్వేశ్వరనివాసంబు సొచ్చినంతన బహిర్భాగంబుననుండి హాహాకారంబున మొఱవెట్టుచు నా బ్రహ్మహత్య పాతాళంబునఁ బడియె. అతనిహస్తంబున నున్న ధాతృకపాలంబును నూడి ధాత్రీతలంబునం బడియె. అది మొదలుగా నవ్వటుకనాథుం డానందంబున నయ్యానందవనంబునం దధివసియించె. కపాలమోచనతీర్థంబు తన్ను భజియించువారికిఁ బాపభంజనంబు సేయుచుఁ బుణ్యప్రదాయకం బయ్యె. ఇయ్యాఖ్యానంబుఁ బఠించినను విన్నను వారలకు మహాపాతకంబు దొలంగు నని చెప్పి కుమారస్వామి వెండియు నగస్త్యున కిట్లనియె. 122

సీ. అజుఁడు దా నధికుండ ననుచు గర్వించినఁ
గరనఖాగ్రమునఁ దచ్ఛిరముఁ ద్రుంచె
సాకార యగుబ్రహ్మహత్యతోఁ జను దేర
సకలలోకంబులు సంచరించె
వైకుంఠమున రమావైకుంఠు లర్పింప
నమృతభిక్షాశనం బారగించెఁ
గాశికానగరోపకంఠదేశంబునఁ
బగుల వైచెఁ గరంబు బ్రహ్మపునుక
తే. యాధిపత్యంబు వడసెఁ గామారిచేతఁ
బరియ వైచినచోన కాఁపురము సేసెఁ
గాశికాస్థానమున కేడుగడయుఁ జూవె!
క్రోధభైరవదేవుండు కుంభజన్మ! 123

వ. దురితభక్షణంబునం బాపభక్షకుండును, గలుషమర్దనంబున నామర్దకుండును, గాలకలనంబువలనఁ గాలనాభుండును, వృజినభైరవుం డగుభైరవుండును నై యద్దేవుండు భజించువారికి షణ్మాససిద్ధికరుండు. 124

తే. కలశయోని! యప్పీటికి బలుతులారి
పాపహృద్భైరవుం డగు భైరవుండు
కాశికాపట్టణం బైదు క్రోశములును
సవహితుం డై యత(ం)డు చే టచ్చి కాదు. 125

వ. అనిన విని గుంభసంభవుండు హరికేశుం డనుయక్షుండు దేవదేవునకుం బ్రేమపాత్రం బైన వారాణసీపట్టణంబునం బ్రమథపరివారంబునకు దండనాయకుం డై యుండు నని విందు. అతని చరిత్రంబు వినవలతు నానతి మ్మనినం గుమారస్వామి యతని కి ట్లనియె. 126

### హరికేశచరిత్రము

సీ. యక్షుండు రత్నభద్రాభిధానుఁడు గంధ
మాదనంబునయందు మహితకీర్తి
పూర్ణభద్రుండు తత్పుత్త్రుఁ డాతనిభార్య
కనకమండన గంధకరటియాన
యాలేమతనయుండు హరికేశుఁ డతఁడు శ్రీ
యానందకాననాభ్యంతరమునఁ
దప మాచరింప నాతనిశరీరము మించి
పుట్టె వల్మీకంబు పొదలు వొదలె

తే. నభవుఁ డుమతోడఁ గూడి లీలార్థ మచటి
కరుగుదెంచి ప్రసన్నుఁ డై వరము నొసఁగె

దండనాయకపదవి యాతండు కాశి
చక్రరక్షకుఁ డై యుండుఁ జనువు గలిగి. 127

సీ. ధరియించు నాతండు పాణిపల్లవమున
వెండికట్టులతోడిదండయష్టి
వసియించు నాతండు వారాణసీపుర
ప్రాకారగోపుర ప్రాంతభూమి
ధరియించు నాతండు దస్తారకూటరు
క్పరిపాటలచ్ఛాయఁ బల్లజడలు
సవరించు నాతండు సతతంబు రుద్రాక్ష
భూషావిభూతి త్రిపుండ్రకములు

తే. సౌమ్యరూపంబు వహియించు సజ్జనులకుఁ
బాపమతులకు వికృతరూపంబుఁ దాల్చుఁ
బింగళాక్షుండు దీర్ఘగంభీరమూర్తి
చండికాపతి ప్రియభృండు దండపాణి. 128

వ. అనిన విని యగస్త్యుండు మహాత్మా! జ్ఞానవాపికాతీర్థమాహా
త్మ్యంబు వినవలతుం జెప్పవే యనిన గార్తికేయుండు. 129

## జ్ఞానవాపికాతీర్థమాహాత్మ్యము

సీ. పాదాభిహతి సప్తపాతాళములతోడ
నుర్వీకటాహ ముబ్బూఁతలూఁగ
నిర్భరతరజటానికురుంబకంబులు
చెదరి బ్రహ్మాండంబు చెంపబెట్ట
బాహార్గళాస్తంభపరివర్తనంబుల
దిక్చక్రవాళంబు లెవ్వి పడఁగ

వితతనిశ్శ్వాసమారుతవర్తనంబునఁ
బృథ్వీధరంబులు పెల్లగిల్ల

తే. డమరుధ్వానాదముల సముద్రములు గలఁగ
నారభటివృత్తిఁ దాండవం బవధరించెఁ
బ్రళయవేళ మహాకాలభైరవుండు
కాళరాత్రికుచంబులు గగురుపొడువ. 130

తే. అభవుఁ డిబ్భంగిఁ దాండవం బాడి డస్సి
డప్పి గొని యారగింపఁ గాండంబు వెరికి
కానఁ డయ్యెను సప్తలోకంబులందుఁ
దియ్యనివి జివ్వ కింపైన తేటనీరు. 131

తే. ప్రళయకాలంబునను నెందు బసిమి చెడక
నిలిచినది కాశిపురము కా నిశ్చయించి
యరిగె నీశానుఁ డనుసమాహ్వయముఁ దాల్చి
ఘనపిపాసార్తి నంధకదనుజవైరి. 132

తే. కన్నవా రెవ్వరును లేరు కన్న మెఱుఁగు
గర్జితం బనువచనంబు కడల నిలిచె
శశవిషాణప్రరోహంబు జలదవార్త
యంబు వెబ్భంగిఁ గలుగు నయ్యవసరమున. 133

వ. అప్పు డీశానుండు. 134

సీ. సంసారసస్యబీజముల కూషరభూమి
నిర్వాణలక్ష్మికి నిలువడ నీడ
యల్ల నేరెడుదీవి కవతంసకుసుమంబు
కామధేనువు ముక్తికాములకును

విహారణస్థానంబు విశ్వనాయకునకుఁ
గల్యాణముల కాదికారణంబు
కట్టుఁగంబము డుంఠిగంధద్విపమునకుఁ
బ్రణవాక్షరము పరబ్రహ్మమునకు

తే. నెద్ది యక్కాశికాపురి కేగుదెంచెఁ
బసిఁడిల్లాతాప్రుఁగోలయుఁ బల్లజడలు
నసితగళమాలమును ద్రిశూలాయుధంబుఁ
జాల నొప్పఁగ దపసివేషమున హరుఁడు. 135

వ. ఇట్లు కాశికానగరంబుఁ బ్రవేశించి యీశానుండు విశ్వేశ్వర శ్రీమన్మహాదేవు నిర్మలజ్యోతిర్మయలింగాకారు సహస్రకలశాభిషేకంబుసేయను, దత్పాదతీర్థప్రసాదోదకంబు లాస్వాదింపను దలంచి. 136

శా. చేతో జాతవిరోధి కాశినగరీక్షేత్రోపకంఠంబునన్
శాతాగ్రం బగుశూల మూఁది ధరణీచక్రంబు భేదించుచున్
బాతాళంబులు గ్రుచ్చుచున్నిగిడెనాభవ్యాయుధంబావృతి
స్రోతోభారము సోఁకునట్లుగ దృఢస్ఫూర్తిప్రభావంబునన్.

తే. దృఢముగా నూఁది శూలంబు దివిచె హరుఁడు
దివిచినప్పుడ తన్మహావివరసరణి
నేడుపాతాళములు దాఁటి యిలయుఁ దూరి
యంబరము దాఁకె నావరణాంబుధార. 138

వ. భూప్రమాణంబునకు శతగుణప్రమాణం బై శుద్ధస్ఫటిక నిర్మలంబును. శరజ్జ్యోత్స్నాస్వచ్ఛంబును, శశిఖండసంకాశంబును, సుధాధారామధురంబును, పాటలీకుసుమ సౌరభంబు నైనయవ్వారిపూరంబు వెండితీఁగెయుంబో లెనెగ

సిన నీశానుండు హస్రధారాకలశంబున సహస్రవారం
బులు పంచాక్షరీ పంచబ్రహ్మశతరుద్రీయప్రణవాఘోరపాశు
పతాదిమంత్రంబు లుచ్చరించుచు విశ్వేశ్వరశ్రీమన్మహాదేవు
దివ్యలింగంబు నభిషేకించి. 139

క. భువనావరణోదకమున
భవు నభిషేకంబు సేయఁ బాసెను లయతాం
డవకేలీసమయసము
ద్భవ మగునీరవ్వట్టు కపట పాశుపతునకున్. 140

వ. అప్పుడు విశ్వేశ్వరదేవుఁడు ప్రసన్నుం డై యీశానుండు
కోరిన ప్రకారంబున. 141

సీ. జ్ఞానోద మన శివజ్ఞానంబు నా శివ
తీర్థంబు నా జ్ఞానతీర్థ మనఁగ
జ్ఞానవాపిక నాఁగ సంజ్ఞాంతరంబులు
గలిగి పానాభిషేకక్రియలను
సంస్పర్శనామాభిసంకీర్తనధ్యాన
సందర్శనంబుల సప్తతంతు
ఫలము నీఁజాలు ప్రభావంబు కైవల్య
సంపత్ప్రదానైక సరసతయును
తే. సన్నిహత్యాదిఫల్గ్వాదిసకలతీర్థ
సమధికత్వంబు బ్రహ్మరాక్షసపిశాచ
శాకినీగ్రహకూశ్మాండశాంతివిధియు
నిచ్చె నీశానకుండిక కీశ్వరుండు. 142

## ——కళావత్యుపాఖ్యానము——

వ. అని యానతిచ్చి శంభుం డంతర్హితుండయ్యె. ఈశానవాపి

కాసమీపంబున నీశానుండు కృతావాసుం డయ్యె. కలశో
ద్భవా! విచిత్రార్థం బగునితిహాసంబు శివతీర్థమాహాత్మ్యప్రకా
రంబు సెప్పెద ఆకర్ణింపుము. హరిస్వామి యనఁగ నొక
విప్రుండు కాశీనగరంబున నుండు. అతనికూఁతురు సుశీల
యనునది రూపరేఖావిలాసంబులం ద్రిభువనంబులయందునుం
బొగడఁదగియుండు; నబ్బాలారత్నంబు. 143

చ. బలబల వేగ తేపకడఁ బంకజదీర్ఘికఁ దాన మాడి నె
చ్చెలులును దాను నిందుముఖి శేషవిభూషణుఁ బూజసేయుని
చ్చలుఁ దెలికన్నులు న్మొలకచన్నులు బొమ్మలమీఁద వ్రాలుఁ గుం
తలములుఁ జూచి పౌరులు మనంబున నువ్విళులూరుచుండఁ

తే. లలన సాక్షాత్కరించినలక్ష్మివోలెఁ [గాన్.
గంకణమ్ములతో సూడిగములు రాయ
విశ్వనాథుని కళ్యాణవేదియందు
మ్రుగ్గుపెట్టంగ మోహించు ముజ్జగంబు. 145

తే. బహుళసౌభాగ్యలక్ష్మికిఁ బద్మముఖికి
ముజ్జగంబుల సరి లేరు ముదిత లనుచు
బ్రహ్మ సంకేతరేఖలు వ్రాసె ననఁగఁ
గాంతగళమున నొప్పె రేఖాత్రయంబు. 146

తే. కడుపులో మూఁడు శంభులింగంబు లుండుఁ
దొయ్యలికి జ్ఞానవాపికాతోయసేవఁ
గలశసంభవ! కేదారసలిలములును
గాశి శివతీర్థజలము లింగత్వ మొందు. 147

వ. ఒక్కనాఁ డొక్కవిద్యాధరుండు రూపలావణ్యమోహితుం
డై యర్ధరాత్రం బమ్మచ్చెకంటిముంగిటం బండిచల్లినవిధంబున

నిండువెన్నెలలుగాయఁ జంద్రకాపాండుతల్పంబున నిద్రించి యుండ నిద్రాభంగంబు గాకుండ మెత్తమెత్తన నెత్తమ్మి రేకులకంటెను సుకుమారంబులైనతనహస్తపల్లవంబుల నెత్తి గగనమార్గంబున మలయాద్రికిం గొనిపోయె నయ్యవసరంబున. 148

†మ. "రక్కసుఁ డొక్కఁడప్పరిసరస్థలిఁ గ్రుమ్మరి కేళి సల్పువాఁ
డక్కమలాక్షిచక్కఁదన మద్భుత మందుచుఁ జూచి రాగము
న్నెక్కొనఁ దత్తరం బుడుపనేరక మారవికారచేష్టలం [డై.
గ్రక్కున దానిఁబట్టుకొనఁగాఁ గవిసెన్ వడి దుర్మదాంధుఁ

వ. ఇట్లు కవిసిన విద్యాధరుండును వాని నదల్చుచు రోషవేష భీషణాకారుఁడై సమరావష్టంభవిజృంభణంబున నిల్చె నయ్యిరువురు నయ్యవసరంబున."

‡శా. విద్యున్మాలి యనంగ నొక్కదివిషద్విద్వేషి యక్కన్యకన్
విద్యుత్సన్నిభగాత్రిఁ జూచి మదనావేశంబునం బట్టఁగో
నుద్యోగించిన నాలతాంగినొకచో యోజించివిద్యాధరుం
డుదద్యద్బాహుపరాక్రమస్ఫురణ దైత్యుం దాఁకెనయ్యిద్ద [అన్.

క. ఆహవము చేసి రంగజ
మోహాంధులు గడిమి మెఱసి *ముష్టాముష్టిన్
బాహాబాహిఁ గచాకచి
సాహసము జలంబు దివిజసంఘము పొగడన్. 150

వ. అప్పుడు. 151

---

† ఈరెండును మద్రాస్ ఓరియంటలు లైబ్రరీ ప్రతిలోఁ గనుపట్టుచున్నవి.

‡ అన్నిమాతృకలలో 'ముష్టాముష్టిన్' యని యున్నను 'ముష్టీముష్టి' సరిరూపము.

తే. అప్సరస్స్త్రీ తిలోత్తమ యసురవరులు
తనకు నై పోరఁ జూచుచందంబు దోఁపఁ
జూచె విద్యాధరుఁడు రాక్షసుండు గడిమిఁ
దనకు నై పోరుచుండఁగఁ దలిరుఁబోఁడి. 152

వ. అవ్విధంబున యుద్ధంబు సేసి యన్యోన్యముష్టి ప్రహారంబుల నిద్దఱు సమరస్థలంబున నిధనం బొంది రందు. 153

తే. ప్రాణనిర్యాణవేళ విద్యాధరుండు
గ్రుడ్డు దిరుగంగఁ బడి విప్రకులజఁ జూచి
గటకటా! నిన్ను ననుచు గద్గదిక దనర
మాట నాల్కన యుండంగ మరణ మయ్యె. 154

వ. అంత నక్కాంత నిజాంతర్గతంబున. 155

క. ఆలింగనమ్ము సేసెం
బాలిండ్లను ముట్టె వదనపద్మము తావుల్
గ్రోలె మగఁ డనఁగ నెవ్వం
డా లనఁగా నెద్ది? భర్త యతఁ డే నాలిన్. 156

వ. అని విద్యాధరుతోడ ననుగమనంబు సేయం దలంచి (యరమి) యమ్మెఱుంగుఁబోఁడి మలయాచలోపాంతంబున. 157

ఉ. వెగ్గల మైనకూర్మి నరవిందదళాయతనేత్ర కొండకా
రగ్గి పటీర కాష్ఠములయందు రవుల్కొనఁ జేసి కమ్మపూ
మొగ్గలదండఁ దాల్చి మది మున్కడఁ గాశిని విశ్వనాయకు
న్నిగ్గన సంస్మరించి జననిన్ జనకుం దలచెం గ్రమంబునన్.

వ. మఱియు నాత్మగతంబున. 159

క. ఏమిటఁ దప్పితి నొకో? నా
స్వామికి విశ్వేశ్వరునకు వారాణసిలో

సేమమున నెల్లరును దమ
ధామంబుల నుండ నిట్టిదశ నాకొదవెన్. 160

సీ. జ్ఞానవాపీపయస్స్నానక్రియావేళఁ
జెలికత్తియలు నన్నుఁ దలఁతు రొక్కొ!
మదిలోన నేభంగి మఱుఁగుచుండుదు రొక్కొ
తల్లిదండ్రులు సంతతంబు నాకు!
హరితాంకురంబు లే నందీక మేయని
హరిణశాబము నెవ్వ రరయువారు
సేవ సేయించుకోఁ జిత్తగింపఁడు సుమీ
నాచేత శ్రీవిశ్వనాయకుండు!

తే. కాశి(!)లోలార్క కేశవ! కాళనాథ!
దండనాయక! డుంఠి వేదండవదన!
సంభ్రమోద్భ్రిములార! యోజపన్ను కన్య!
కానవచ్చెద మిమ్ము నెక్కట భవమున. 161

తే. విధవనై జన్మ మెల్లను వేగఁ జాల
నొకనిచేపడి యోప నింకొకని వెదుక
నితనితోడిద లోకమై యేగుదాన
ననలముఖమున నిమిషవేదనకు నోర్చి. 162

ఉ. ఇంకొకఁడెవ్వఁడేని నను నెక్కటి యుండఁగఁ జూచి పట్టునో?
కింక మహాటవిం గరటికేసరిదంష్ట్రితరక్షుయూథముల్
సంకటపెట్టునో! యతినృశంసత నింతలు సేసినట్టి యా
పంకజసూతిపై నెరయఁ బైరియిడి వేగమ యగ్గి సొచ్చెదన్.

క. పాపపుదైవ మొనర్చిన
యీపరిభవవహ్నికంటె నెక్కటపదుసం

తాపమునం జితికాష్ఠో
ద్దీపిత మగువహ్ని? యేల ధృతిఁ దొఱఁగంగన్. 164

ఉ. భూధరరాజసన్నిభుఁడు పుష్పశరాసనుతోడిజోడు వి
ద్యాధరచక్రవర్తి నను నర్మిలిఁ దెచ్చినవాఁడు నాకుఁ గా
శీధర నాదుకట్టెదుర నీదశ నుండఁగ విశ్వనాథ! కా
శీధవ! యంబికారమణ! జీవిత మేను ధరించుదాననే? 165

వ. అని దుగఖావేశంబున. 166

చ. కొసరి వసంతకాలమునఁ గోయిల క్రోల్చినభంగి నేడ్చిన
బ్బిసరుహనేత్ర కొండచఱిఁ బెద్దయెలుంగున వెక్కివెక్కి వె
క్కస మగుమన్యువేగమునఁ గాటుకకన్నులనీరు సోన లై
యుసిరికకాయలంతలు పయోధరముల్ దిగజాఱునట్లుగన్.

మ. మలయంబెక్కడఁ గాశియెక్కడ? యసన్మార్గంబువాటించి తె
క్కలిదైనం బిటునాకునీయహితముంగావించు నే? యంచు వే
తలయూఁచెం గలకంఠి యుచ్చైరువునం దాటంకరత్నప్రభల్
పలకంబాఱిన చెక్కుటద్దములపైఁ బైపై విలంఘింపఁగాన్.

వ. వెండియు నక్కన్యకకర్పూరకదళికాద్రుమనిర్యన్నిర్యాసధా
రాద్రవవాసనానుగంధంబులగుగంధసారగిరినితరంబనిర్ఝరాం
భగప్రవాహంబున ముఖప్రక్షాళనం బాచరించి విద్యాధ
రోపరివిరచిత(చితా)గంధసా[1]రకాష్ఠంబులరవుల్లొనిగంధకరటి
కర్ణతాళతాళవృత్తాంతతాండవ ప్రస్తానవిస్తారితంబు లగుమా
రుతంబులవలనం బెచ్చుపెరిఁగివిచ్చలవిడిఁ మండుచిచ్చునకుం
బ్రదక్షిణంబు వచ్చి నిసర్గకాతరంబు లగుకటాక్షవీక్షణంబులు
పుష్పాంజలివిక్షేపంబులభంగి నంగీకరింపఁ జంపుదుగట్ట యగు

1 శేంధనకాండప్రకాండఖండం.

శిలాఘట్టంబు మెట్టి నిలిచి సంతతస్వాధ్యాయాధ్యయనధ్వని ముఖరంబును, నగ్నిహోత్రధేనుఖరఖురవలయార్ధచంద్రచంద్రకితాజీవంబును, త్రికాలశంభుపూజాసమారంభ విజృంభమాణశంఖకాహళ బహుళకోలాహలాకులంబునునగునయ్యానందకాననంబునందు బ్రహ్మపురివాడకుం జూడారత్నం బైన నాపుట్టిని ల్లభివృద్ధిం బొంది యుండుంగావుత! కాశికాకటక విప్రకుటుంబినీశ్లాఘనీయచరిత్రయగు నాజనయిత్రి ప్రియంవదము త్తైదువ యగుంగాత! అష్టాదశమహావిద్యాస్థానసామ్రాజ్యభద్రాసనాసీనుం డగురుద్రావాసవిద్వత్సింహంబు నా తండ్రి హరిస్వామి సమానులయం దుత్తమశ్లోకుం డగుంగాక! మహాశ్మశానంబునం దనూచారం బగు నాబంధువర్గంబు బంధువర్గంపుఁదీఁగయుంబోలెఁ గొనసాఁగి బ్రతుకుంగాక యని యాశీర్వదించి. 169

సీ. ఏఁ బ్రభాతంబుల నీశానవాపిక
నని శంబుఁ దీర్థ మాడినఫలంబు
వివిధభంగుల నేను విశ్వేశ్వరస్వామి
ము క్తిమంటపి నిడ్డముగ్గుఫలము
ప్రతిచతుర్థిని డుంఠిభద్రేభవక్త్రునే
నారాధనము సేసినట్టిఫలము
నానందకాననాభ్యంతరక్షేత్రంబు
నందు జన్మించినయట్టిఫలము
తే. సర్వమునుగూడి మీఁదటిజన్మవేళ
నితనికే భార్యఁగా నన్ను నిచ్చుఁ గాతఁ

యనుచు హరిణాంకమూర్తి తీవ్రాంశుఁ బోలెఁ
గొసర నగ్నిఁ బ్రవేశించెఁ గువలయాక్షి. 170

క. లింగత్రయగర్భిణి యగు
నంగనసాన్నిధ్యమున నిశాటుండును ద
త్సంగతి విద్యాధరరా
జుం గాంచిరి త్రిదివపదము సుకృతస్ఫురణన్. 171

వ. అంతఁ గొంతకాలంబునం బ్రియాస్మరణంబు సేసెం గావున విద్యాధరకుమారుండు మలయకేతుం డనునామంబునను నగ్నిప్రవేశసమయంబున నవ్విద్యాధరకుమారుండు తనకుం బతి కావలయు నని కోరెం గావున సుశీల కళావతి యను పేర భూమండలంబున జన్మించి వధూవరులైరి. ఆదంపతుల యందుఁ గళావతీదేవి పూర్వజన్మవాసనావశంబున. 172

మ. అలినీలాలక దాల్చుఁ జన్నుఁగవ రుద్రాక్షావళీదామకం
బులు ముక్తామణిభూష లొల్ల దసితాంభోజాతపత్రాక్షియై
నలఁదుఁ భస్మ మలంద నొల్ల దొకనాఁ డైనం బటీరద్రవం
బులుపన్నీరుకురంగనాభియును గర్పూరంబు కాశ్మీరమున్.

తే. కడుపు నిండంగఁ గాంచె నక్కలువకంటి
మలయకేతుమహీపాలమన్మథునకు
భాగ్యసౌభాగ్యవైభవప్రాభవాది
శుభగుణశ్రీసమృద్ధుల సుతుల ముగుర. 174

వ. అంత నొక్కనాఁడు చిత్రకరుండొకరుండు వారణాసీస్థాన వృత్తాంతంబు చిత్రపటంబున లిఖియించి తెచ్చి కళావతీసహితుండైన మలయకేతుసన్నిధిం బెట్టిన నవ్విలాసవతి పటంబు చూచి ప్రాగ్జన్మవాసనావశంబునఁ దన్ను మఱచి సమాధి

స్థయుం బోలె లోచనంబులు మొగిచి ముహూర్తమాత్రం
బూరకుండి కన్ను(లు) దెఱచి యాంచిత్రపటంబునం గల య
శేషవిశేషంబులు క్రమంబునం బూసగూర్చిన తెఱంగునం గర
తర్జనిం జూపుచు ప్రియునికిం జెప్పం దొడంగె. ఆ ప్రకారంబు
కుంభసంభవా! నీకుం జెప్పెద నాకర్ణింపుము. 175

తే. కాశినగరి ధనుర్వల్లి గంగ నారి
కోటియుగ్మంబు లోలార్కకుధరధరులు
వృషము బాణంబు లక్ష్యంబు వృజినరాశి
విశ్వనాథుండు ధన్వి యుర్వీకళత్ర! 176

సీ. అదె వియద్వాహిని యదె మణికర్ణిక
యదె కాశి నిఖిలకల్యాణరాశి
యదె విధాతృకపాల మవని వ్రాలినచోటు
వాఁడె శ్రీమత్కాలవటుకరాజు
పంచతీర్థం బదె ప్రణవమంత్రాకృతి
మత్స్యోదరీనామమండల మదె
కామేశ్వరుఁడు వాఁడె స్కందేశ్వరుఁడు వాఁడె
వాఁడె వినాయకేశ్వరుఁడు హరుఁడు

తే. శశికిరీటుండు పార్వతీశ్వరుఁడు వాఁడె
వాఁడె భృంగీశుఁ డధ్వరేశ్వరుఁడు వాఁడె
వాఁడె యష్టాదశాంగు శేశ్వరుఁడు హరుండు
ధర్మశాస్త్రేశ్వరుఁడు వాఁడె ధరణినాథ! 177

తే. ఇతఁడు సారస్వతేశ్వరుం డిందుమౌళి
యితఁడు రత్నజాతీశ్వరుఁ డిభవిరోధి

యతఁడు శైలేశ్వరుఁడు భుజంగాభరణుఁడు
సప్తజలధీశ్వరుఁడు వాఁడె శంకరుండు. 178

సీ. సప్తకోటిమహామంత్రసన్మంత్రములకు న
ధీశ్వరుం డితఁడు మంత్రేశ్వరుండు
త్రిపురేశ్వరుఁడు వీఁడె త్రిపురదానవులకు
సాన్నిధ్య మై పూఁజఁగొన్న పెద్ద
బాణేశ్వరుఁడు వీఁడె బాణాసురునకు వే
భుజము లిచ్చినచంద్రభూషణుండు
వైరోచనేశుండు వాఁడె ప్రహ్లాదాది
నారదేశ్వరు లల్లవారు చూడు

తే. ధరణినాయక ! యాదిగదాధరేశ
భీష్మకేశభృంగీశగోపీముకుంద
నారసింహేశ్వరాత్రేయనాథశేష
విఘ్నరాజేశ్వరులఁ జూడు వేలువేలు. 179

తే. బింధు(దు)మాధవదేవుఁ డానందవిపిన
వీథికాకేళికలకంఠవిష్కిరంబు
పంచనదతీర్థరాజంబు పార్థివేంద్ర!
కాశికాఫాలకస్తూరికాతిలకము. 180

క. ఇదె మంగళకాత్యాయని
యిదె మార్కండేయనాయకేశ్వరలింగం
బిదె ధాతపాతకేశ్వర
పద మిది కిరణేశుమనికిపట్టు మహేశా! 181

తే. వేయు నేటికి! నానందవిపినభూమి
నడుమ శశిఖండకోటీరనాగకటక

నిటలలోచనగిరిశధూర్జటులు హరులు
నారుపోసినచందాన నాటియుంద్రు. 182

వ. అని చెప్పి కళావతి జ్ఞానవాపికాతీర్థంబుఁ జూపి. 183

సీ. స్తంభరోమాంచాదిసాత్త్వికభావంబు
లందందఁ దోఁపంగ నవ్వధూటి
మూర్ఛిల్లె నద్భుతంబును బొంది భూపతి
శిశిరోపచారంబు సేయుచుండె
బుద్ధిశరీరిణి పుష్పప్రగల్భ యా
ధవళాక్షిఁబొంది నివాస మెఱిఁగి
చిత్రపటంబు మైఁ జేర్చి కర్ణముఁ జేర్చి
జ్ఞానోద మనియును జ్ఞానవాపి

తే. యనియు శివతీర్థ మనియు దృఢాక్షరముగఁ
బలికె ముమ్మాఱు చేతనాప్రాప్తి నొందె
సరసిజాతాయతాక్షి తచ్ఛబ్దమాత్ర
వాడఁబారినసస్యంబు వానఁ బోలె. 184

వ. మలయకేతుండును గళావతీప్రేరణంబునం బుత్త్రసంక్రాంత రాజ్యభారుం డై వారాణసీపురంబున కరిగి జ్ఞానవాపికా తీరంబునం దపం బాచరించి ముక్తుం డయ్యె. ఇది శివతీర్థ మాహాత్మ్యంబు. కుంభసంభవా! ఇంక నేమి యడుగఁ దలఁ చెద వడుగు మనుటయు. 185

తే. అనఘ! నాకు సదాచారమానతిమ్ము
ధరణిసురుఁడు సదాచారపరతఁ గాని
యాత్మసంశుద్ధి వడయలేఁ డాత్మశుద్ధిఁ
గాని సిద్ధింపనేరదు కాశివసతి. 186

## సదాచారనిరూపణము

వ. అనినఁ గుమారస్వామి యతనిం జూచి మన్వత్రిభృగుభ
రద్వాజయాజ్ఞవల్క్యోశనోంగిరసోర్యమాపస్తంబసంవర్తకా
త్యాయనబృహస్పతిశాతాతపశంఖలిఖితపరాశరాదుల మార్గం
బుల సదాచారంబు ప్రసంగానుప్రసంగంబున వివరింప
వచ్చిన నపారం బైయుండుఁ గావునఁ గుంభసంభవ! నీకు
దిఙ్మాత్రంబు వివరించెద. సావధానమతివై యాకర్ణింపుము.

తే. చాతురాశ్రమ్యమును జతుష్కంధ మయ్యె
మొదటిస్కంధత్రయము ధర్మములు వహించు
నగ్రిమస్కంధ మెల్ల వింధ్యాద్రిదమన!
జ్ఞానసంపద్విభూతికిఁ దానకంబు. 188

శా. ఓరాత్రిం గనుఱెప్ప వెట్టక మహోద్యోగంబునన్ ధీరతా
ధౌరంధర్యము పూని మానవునకుం దాత్పర్యవృత్తిన్ సదా
చారం బెట్లొనరింపవచ్చుఁ గలశీసంజాత! కాశీశ్వరున్
గౌరీవల్లభు సంస్మరించి బ్రతుకుం గా కాతఁ డప్రచ్యుతిన్.

తే. ద్విజుఁడు వేఁబోక మేల్కాంచి దినదినము
ప్రత్యవాయపరీహారపరతఁ జేసి
సంస్మరింపంగఁ దగు భక్తిసౌష్ఠవమున
మంగళాస్పద మగువస్తుమండలంబు. 190

వ. బ్రాహ్మముహూర్తంబున మేల్కాంచి కృతాచమనుండయి
వివిక్తప్రదేశంబున భస్మోద్ధూళనంబును, భసితత్రిపుండ్రధా
రణంబునుం బొనర్చి రుద్రాక్షమాలికలు ధరియించి, పద్మా
సనాసీనుండయి, మనంబున హేరంబు, నంబికాసహాయుం
ద్ర్యంబకు, లక్ష్మీసమేతుఁ బుండరీకాక్షు, భారతీసహితుం

బరమేష్ఠిం, బాకశాసనపావకపరేత రాజపలలాశిపాశిపవనపౌ
లస్త్యపశుపతులను, వసిష్ఠాదిమునుల, గంగాదిపుణ్యవాహి
నులఁ బ్రయాగాదితీర్థంబుల, మేరుశ్రీశైలాదిపుణ్యపర్వతంబు
లను, దుగ్ధోదన్వదాదిసముద్రంబుల, మానసాదిసరోవరంబుల,
జ్ఞానవాప్యాదిదీర్ఘికల, నందనాదివనంబులఁ, బుష్కరాది
ద్వీపంబుల, నార్యావర్తాదిజనపదంబులఁ, గామధుగ్ధేన్వాది
ధేనువులం, గల్పవృక్షాదివృక్షంబులం, గాంచనాదిధాతు
వుల, లక్ష్మ్యాది పుణ్యాంగనల, గరుడాదిపతంగంబుల, శేషాది
మహానాగంబుల, నైరావణాదివారణంబుల, నుచ్చైశ్శ్రవా
(ది)తురంగంబులఁ, గౌస్తుభాదిమణుల, నరుంధత్యాదిపతి
వ్రతల, రంభాద్యప్సరసల, నైమిశారణ్యాది పుణ్యారణ్యం
బుల, వారణాస్యాదిపట్టణంబుల, విశ్వేశ్వరాదిలింగంబులఁ,
బాంచజన్యాదిశంఖంబుల, సుదర్శనాది దివ్యాయుధంబుల,
వేదాదివిద్యలఁ, బద్మాదిపురాణంబుల, మన్వాదిస్మృతుల,
గాయత్ర్యాదిమంత్రంబుల, సనకాదియోగీంద్రుల, నోంకా
రాదిబీజాక్షరంబుల, వ్రీహ్యాదిధాన్యంబుల, నారదాది
వైష్ణవుల, బాణాదిశివభక్తుల, బ్రహ్లాదిభాగవతుల, మహా
కాళాది ప్రమథులఁ, బద్మాదినిధుల, దధీచ్యాదివదాన్యుల,
హరిశ్చంద్రాది భూపతుల, జననీజనకులఁ, బితరుల, గురులను
సంస్మరించి యీయందఱు నాకు నాయురారోగ్యైశ్వర్యం
బులు ప్రసాదింతురుగాక యనుచుం బ్రార్థించి ప్రణమిల్లి
నిలిచి నిత్యనైమిత్తికాద్యనుష్ఠానంబుల నిష్ఠాపరుం డయి
ద్విజుం డొనర్చునది. 191

సీ. వెడలి యూరికి నూఱువిండ్లదవ్వున దైత్య
దెస బహిష్కార్యంబు దీర్పవలయు
నన్నూఱువిండ్లమాన మగుదూరమ్మున
బయలి కేగుట పాడి పట్టనమునఁ
దల ముసుం గిడి తృణంబులు గప్పినధరిత్రి
విణ్మూత్రజలముల విడువవలయుఁ
జెవి బ్రహ్మసూత్రంబుఁ దవిలింపవలయును
విణ్మూత్రవోత్సర్గవేళలందు
తే. దివసముఖసంధ్య లందుఁదగ్దిఙ్ముఖుండు
యామినులయందు శమనదిగాననుండు
నగుచు మౌనవ్రతంబున నవనిసురుఁడు
మలవిమోక్షంబుఁ గావించుఁ గలశజన్మ! 192

సీ. నిలుచుండి కాఁగాదు జలమధ్యమునఁ గాదు
కాదు దున్నిననేలఁ గాదు మందఁ
గాదు గోసన్నిధిఁ గా దగ్ని కెదురుగా
కా దగ్రజన్ములకట్టెదురను
గాదు సస్యంబులఁ గాదు రథ్యాభూమిఁ
గాదు కట్టెదురను గాదు గాలిఁ
గాదు తారాదినక్షత్రగ్రహంబులఁ
గనుఁగొంచు మలవిమోక్షం బొనర్ప
తే. శిశ్న మొకచేతఁ గబళించి చెదలు చీమ
లేక శర్కరి గాక వల్మీకజంబు
నెలుకకలుగును గాక మన్నె దుగఁబట్టి
యురుగునది శౌచ మొనరింప నవనిసురుఁడు. 193

తే. మునుకుఁ గడియఁగఁ దిగిచి నెమ్మొగము వాంచి
యంగుళీయుగకమున ముక్కుఁ దమిపట్టి
మలవిమోక్షణ మొనరించి తలఁగునపుడు
కనుఁగొనఁగఁ గా దమేధ్యంబు కలశజన్మ! 194

సీ. అయిదువారము లపానాభ్యంతరంబున
నొకమాఱు శిశ్నమస్తకమునందుఁ
బదిమాఱు లట సవ్యపాణిపల్లవమున
నిరుగేలులందును నేడుమాఱు
లంఘ్రిద్వయంబునయం దొక్కమాఱు త్రి
వారిఁ గ్రమ్మఱ హస్తసరుహముల
నంతరాంతరములయందు నిశ్శబ్దంబు
గాఁ బ్రసృత్యంబు సంక్షాళనంబు

తే. కలుగునట్లుగ నామలకప్రమాణ
మృదులమృత్పిండఖండంబు ప్రేవి ప్రేవి
గంధలేశక్షయావధి గా నొనర్ప
వలయు శౌచంబు మది కెక్కఁ గలశజన్మ! 195

వ. ఇది గృహస్థశౌచంబు. దీనికి ద్విగుణంబు త్రిగుణంబు చతుర్గుణంబును బ్రహ్మచారివానప్రస్థయతులకు నియతంబై యుండు.

తే. పగటిశౌచంబులోన సాఁబాలు రేయి
రాత్రిశౌచంబులోన నర్ధము రుగార్తిఁ
జోరబాధాదిదుష్టకాంతారమార్గ
మునఁ దదర్ధంబు శౌచంబు మునివరేణ్య! 197

క. పురుషులశౌచములోనం
దరుణుల కర్ధంబు శౌచతంత్రంబు మునీ

శ్వర! నిష్కారణ మింతికిఁ
బురుషునకుం దగదు శౌచముం దడవంగన్. 198

తే. ధరణిధరమంతపాడవుమృద్రాశి యైన
నంబునిధిసంతజల మైన ననఘచరిత
భావశౌచంబుఁ బోలదు బాహ్యశౌచ
మనిరి శౌచక్రియావేదు లయినమునులు. 199

తే. అగ్నిహోత్రాహుతులకుఁ జాంద్రాయణాన్న
పిండమునకును శౌచమృత్పిండములకుఁ
గలశసంభవ! యుసిరిక కాయలంత
మాన మని చెప్పుదురు కర్మమర్మవిదులు. 200

వ. అనుష్ణంబులు నఫేనంబులు నబుద్బుదంబులు నక్షారంబులు నలవణంబులు నకలుషంబులు నదుర్గంధరసంబులు నయిన యుదకంబులు, నగక, నిలుచుండక, మాటలాడక, వెలిఁజూడక, నంగక, (తెలుసుండక,) వేగిరపడక, యజ్ఞోపవీతంబు విడువక, ప్రసారితపాదుండుగాక, బహిర్జానుండుగాక, చప్పుడుగాకుండముమ్మాఱు బ్రహ్మతీర్థంబున హృదయపర్యంతంబు డిగ్గ శుద్ధిబుద్ధ్యర్థంబు ప్రాశించునది. అనంతరంబ యంగుష్ఠమూల దేశంబున నినుమాఱు*గండస్థలంబున నిరియించిన యోష్ఠాధరంబులు ముమ్మాఱు స్పృశించి యనంతరంబ కుడిచేతం బుడిసిలించిన యుదకంబు వామహస్తసంపుటంబున నినిచి దక్షిణవామపాదములయందు మూర్ధంబునందునుం బ్రోక్షించునది.*మఱియు ముమ్మాటికి వామహస్తోదకంబు స్పృశించుచు

* ఇది మూలాతిరిక్తవిరుద్ధముగా నున్నది. 'త్రిః పిబేత్త్వాంబువిశుద్ధ్యర్థం తతఃఖాని విశోధయేత్, అంగుష్ఠమూలదేశేన ద్విర్ద్విరోష్ఠాధరాస్పృశేత్.' అని మూలము.

నంగుళీత్రయంబున న్యాసంబును, దర్జన్యంగుష్ఠంబుల నాసికా రంధ్రంబులు, నంగుష్ఠానామికాగ్రంబులఁ జక్షుశ్శ్రోత్రంబులును, గనిష్ఠాంగుష్ఠయోగంబున నాభీరంధ్రంబును, హస్తతలంబున హృదయంబును, నంగుళ్యగ్రంబుల మస్తకోభయస్కంధంబుల ముట్టునది. కొంద అనుష్ఠానపరులీచతుర్వింశత్యాచమనక్రియలందుఁ గేశవాదిచతుర్వింశతినామంబు లుచ్చరింతురు. అవి క్రమంబున నంభఃప్రాశనత్రయంబునఁ గేశవ నారాయణ మాధవనామంబులుఁ, గపోలమార్జనద్వయంబున గోవిందవిష్ణునామంబులు, నంతరాధరోష్ఠమార్జనత్రయంబున మధుసూదనత్రివిక్రమవామననామంబులు, వామహస్తోదకధారణంబున శ్రీధరనామంబును, దక్షిణవామపాదోదకప్రోక్షణంబున హృషీకేశపద్మనాభనామంబులును, శిరఃప్రోక్షణంబున దామోదరనామంబును, నంగుళీత్రయాస్యస్పర్శనంబున సంకర్షణనామంబును, దర్జన్యంగుష్ఠనాసారంధ్రద్వయస్పర్శనంబున వాసుదేవప్రద్యుమ్ననామంబులు, ననామికాంగుష్ఠచక్షుశ్శ్రోత్రస్పర్శచతుష్టయంబున ననిరుద్ధపురుషోత్తమాధోక్షజనారసింహనామంబులుఁ, గనిష్ఠాంగుష్ఠనాభీరంధ్రస్పర్శనంబుల నచ్యుతనామంబును, హస్తతలహృదయస్పర్శనంబున జనార్దననామంబును, గరాగ్రశిరస్స్పర్శనంబున నుపేంద్రనామంబును, నంగుళ్యగ్రస్కంధస్పర్శద్వయంబున హరికృష్ణనామంబు లుచ్చరింతురు. ఇది యాచమనప్రకారంబు. 201

తే. శుద్ధుఁ డగుహృద్గతముల భూసురుఁడు నీళ్ల
గళగముల భూమిపతి తాలుగముల వైశ్యుఁ

డాస్యగంబుల శూద్రుఁడు నోఁ టదియును
నాచమనవేళయందు వింధ్యాద్రిదమన! 202

తే. ముక్తకేశుండు సంవృతమూర్ధగళుఁడు
గాక సంక్షాళితాంఘ్రి యై క్ష్మాసురుండు
విమలజలముల నాచాంతవిధి యొనర్ప
నర్హమగు వింధ్యశైలదర్పాపహారి! 203

ఉ. తుమ్మినయప్పుడుం బురము త్రోవఁ జరియించినయప్డు వారిపా
నమ్మొనరించినప్డు డశనంబు భుజియించినయప్డు నవ్యవ
స్త్రమ్ము ధరియించినప్డు దురితంబులు చూచినయప్డు పుణ్యకా
ర్యమ్ములయప్డు హేయములనంటినయప్పుడువార్వఁగాఁదగున్.

సీ. చిటికెనవ్రేలియంతటి పరిణాహంబు
పదివేళ్ల నిడుపును బదను కలిగి
తోల్లగ్గి తోఁట లేక తోమంగ నను వైన
తరుకాష్ఠమున దంతధావనంబు
వదనసంశుద్ధికై వలయుఁ గావింపంగఁ
బ్రతిపద్దినంబును బర్వతిథియు
షష్ఠియు నవమియు సవితృవాసరమును
బరిహార్యములు కాష్ఠభక్షణమున

తే. కర్హ దివసంబు లేక యనర్హవేళఁ
బండ్లు దోమంగ వలసెనేఁ బదియు రెండు
సలిలగండూషములు సేయ సంవిశుద్ధి
గలుగు వక్త్రంబునకు బ్రహ్మకర్మనిరత! 205

తే. దంతధావనపూర్వంబు తాన మాడి
ప్రాతరారంభవేళల బ్రాహ్మణుండు

సంధ్యవార్వంగ వలయు నిచ్చలును నిష్ఠ
నర్ఘ్య శ్రీ మీఁ దగు నర్కోదయంబునపుడ. 206

సీ. సౌభాగ్యమేధాప్రసాదసంపన్మహో
త్సాహోదయములకు జన్మభూమి
నవరంధ్రములయందు స్రవియించురోఁతచే
శుచి గాని మేనికి శుద్ధికరము
తేజంబు గల్పింప దీర్ఘాయు వొనరింపఁ
జాలు వాసరముఖస్నాన మనఘ!
యరుణోదయమున మూర్ధాభిషేక మొనర్చి
తగును జేయఁగ మంత్రతంత్రవిధులు

తే. స్నానమున కంగకములు మృత్సంచయంబు
నక్షతంబులు దిలలు దర్భాంకురములు
గోమయంబును బావమానీముఖంబు
లైనఋఙ్మంత్రములును వింధ్యాద్రిదమన! 207

వ. విశుద్ధం బైన మృత్పిండంబు శుచిప్రదేశంబునం బెట్టి యుదఙ్ము
ఖుండును బద్ధబ్రహ్మశిఖుండును నై యద్దేవతాకంబు లైన
మంత్రంబు లుచ్చరించుచు సలిలావగాహనంబు చేసి. 208

క. నేమం బొప్పఁగఁ బ్రాణా
యామం బొనరించునది జలాంతరమున లో
పాముద్రాధిప! ప్రాణా
యామంబు శ్రుతిప్రసూతయజనం బనఘా. 209

తే. మొదలి తుదియోంకృతులతోడ మూర్ధ మగుచు
వ్యాహృతులు మూఁటి నాల్గింటి నధిగమించి

మంత్రరాజంబు గాయత్రి మహిమ నొప్పఁ
గడుపు చల్లంగ శ్రుతివిద్యఁ గన్నతల్లి. 210

వ. గాయత్రి త్రివారజపంబు ప్రాణాయామంబు, గాయత్రి దశ వారజపంబు తపంబు. జలాంతరమున గాయత్రీ త్రివారజపం బొండె [1]విష్ణుసంస్మరణం బొండెఁ జేయునది. స్నానానంతరంబ కారుణ్యపితృప్రీతికరంబు వస్త్రనిష్పీడనం బొనర్చునది. ఇది స్నానవిధానంబు. 211

క. ధౌతపరిధానపరుఁడై
ప్రాతస్సంధ్యను భజించి బ్రాహ్మణుఁడు కుశా
న్వీతకరాంగుళియైయు
ద్యోతనునకు నర్ఘ్య మిచ్చు నుదయింపంగన్. 212

వ. అనంతరంబ గాయత్రీజపం బాచరించునది. 213

తే. పగలు నిలుచుండి జపియించు నిగమమాత
మాపు గూర్చుండి జపియించు మహితభక్తి
బ్రాహ్మణుఁడు సంధ్యవార్వనిబ్రాహ్మణుండు
గిసతక్కువశూద్రుండు కేవలంబు. 214

వ. ఈప్రకారంబునన మధ్యాహ్నకాలంబునను బ్రహ్మవిష్ణు మహేశ్వరుల నింద్రాది దిక్పాలకుల మరీచ్యాదిమహర్షుల మన్వాదిమనువుల సలిలతర్పణంబులం దృప్తిం బొందించునది. చందనాగరుకర్పూరగంధోన్మిశ్రితం బులగుజలంబులు తర్పణార్హంబులు. దైవం బార్షంబు బ్రాహ్మంబు పైతృకం బనుతీర్థకంబుల దేవాదితర్పణంబులు నాచరించునది. 215

---

1 ప్రణవత్రివారజపంబొండె.

సీ. ఛందంబు త్రిష్టుపు చంద్రికాచ్ఛచ్ఛాయ
యభిరామ మభినవయౌవనంబు
రుద్రుండు దేవత భద్ర మాకారంబు
కశ్యపుండు మహర్షి గన్న నొసలు
నాపాదమస్తకం బఖిలాంగకంబులు
నధ్వర్యుశాఖాక్షరాత్మకంబు
లాంబోతు వాహనం బవతంసకుసుమంబు
తరుణనిర్మలసుధాధామ రేఖ

తే. తరణిబింబంబు గగనసౌధంబుమీఁదఁ
బసిఁడికుంభంబుచందంబు పరిఢవింపఁ
గానవచ్చినమధ్యాహ్న కాలసంధ్య
యందు సావిత్రి సకలవిద్యాసనాథ. 216

తే. పచనపావకుఁ బ్రజ్వలింపంగఁ జేసి
వైశ్వదేవం బొనర్పంగ వలయు నిష్ఠ
జనక కోద్రవమాషనిష్పావకములు
తైలలవణంబులును గావు తద్విధులకు. 217

తే. అగ్నికార్యం బొనర్చి యనంతరంబ
హంతకారంబు నిష్ఠఁ జేయంగ వలయు
హంతకారం బొనర్ప బ్రహ్మాదు లైన
త్రిదశముఖ్యులు తృప్తి బొందుదురు సూవె! 218

తే. హంతకారం బనంగఁ బదాఱుగళ్లు
కలశభవ! నాల్గుగళ్లు పుష్కల మనంగ
గ్రాసమాత్రంబు భిక్ష యక్షయ్య మంద్రు
ధాత్రిబృందారక ! తదన్నదానఫలము. 219

క. బలిహరణము సేయఁగఁ దగుఁ
గలశీసుత! వైశ్వదేవకర్మాంతమునన్
నిలయబహిర్భాగంబున
జలధారాసంయుతముగ శ్రద్ధాపరతన్. 220

సీ. కైసేసి యంబువైక్లబ్యంబు నొందక
యుచితపీఠిక నంఘ్రులుర్వి మోపి
యుండేని ప్రాఙ్ముఖం బొండె నుదఙ్ముఖం
బగుచుఁ గూర్చుండి సాజ్యాభిఘార
మభ్యుక్షణమగు విశుద్ధాన్న మాపోశన
పూర్వంబుగాఁ బ్రాణమును నపాన
మును నాది యగుధాతువుల కైదిటికిఁ దృప్తి
యావహిల్లంగ స్వాహాంతములను

తే. బంచవాయునామంబులఁ బరమనిష్ఠ
వేల్పు విప్రుఁడు దర్భలు వ్రేలఁ బూని
యశనకబళాహుతులు జఠరాగ్నియందు
గుణము నగుణంబు నెన్నఁడు గుడుచునపుడు. 221

తే. కడుపులో గాలి కొకకొంత యెడము విడిచి
యన్నపానీయములఁ దృప్తి యావహిల్ల
నవని నిర్జరుఁ డనుపాన మాచరించుఁ
దక్రమైనను శీతలోదకము నైనఁ. 222

తే. ధరణి నిర్జరుఁ డమృతాభిధానశబ్ద
పూర్వమంత్రంబు సముచితంబుగఁ బఠించి
సగము ప్రాశించి యుదకంబు సగము భూమి
విడువవలయును హస్తంబు గడిగికొనక. 223

వ. అప్రక్షాళితదక్షిణహస్తాంగుష్ఠమూలంబున నిష్ఠ్యూతం బైన యాసలిలం బపుణ్యనిలయం బైనరౌరవంబునం బద్ధార్బుద నివాసు లైన పితరులకుం దృప్తినావహించు. చేతులకు వార్చి యాచమనంబు సేసి శుచియై కర్కరీసలిలంబు వలకాలి పెను వ్రేలి మోపి ధార లెత్తునది. అద్ధార యయ్యంగుష్ఠంబు నాశ్రయించిన యంగుష్ఠమాత్రుం డగు పురుషుం బరితోషింపంగఁ జేయు. అనంతరంబు బొడ్డు నివురుకొనుచుఁ బ్రాణాపానసమానోదానవ్యానంబులు సంతుష్టిం బొంది నాకు నానందం బొసంగుం గాత మని యాశీర్వదించుకొనునది. తాంబూలచర్వణంబులం బుణ్యకథాశ్రవణంబులం బ్రొద్దు పుచ్చునది. 224

తే. వర్ణములలోన బ్రాహ్మణవర్ణ మెక్కు
డాశ్రమంబులలోన గార్హస్థ్య మధిక
మనఘ! లక్షణవతి యైన యాలు సూవె!
తగినయవలంబనంబు తద్ధర్మమునకు. 225

## స్త్రీలక్షణనిరూపణము

వ. పాదతలంబులు రేఖ లంగుష్ఠాంగులినఖంబులు మీఁగాళ్ళు గుల్ఫంబులు పిక్కలు జంఘలు రోమంబులు జాను లూరులు కటి నితంబంబు జఘనంబు భగంబు వస్తి నాభి కుక్షి పార్శ్వంబు మధ్యంబు వళులు రోమావళి హృదయంబు వక్షోజద్వయంబు చూచుకంబులు జత్రుస్కంధకక్షమణిబంధద్వయంబు మీఁజేతు లరచేతులు కృకాటిక కంఠంబు చిబుకంబు హనువులు కపాలంబులు వక్త్రం బుత్తరోష్ఠాధరోష్ఠంబులు జిహ్వ తాలువులు హసితంబు నాసిక కన్నులు

పక్ష్మంబు భ్రూశ్రీకర్ణ లలాటశిరోరుహంబు లను నలువదియాఱవయ
వంబులు లక్షణాన్వితంబులు గావలయును. అట్టిలక్షణవతియైన
భార్య గృహలక్ష్మి అట్టి గృహిణీకతంబునం గదా గృహస్థుం
డిహాపరసౌఖ్యంబులకు భాజనం బగు నని చెప్పి కుమార
స్వామి కుంభసంభవున కి ట్లనియె. 226

తే. ఇన్ని పాటులఁ బడఁగ లే దిల్వలాసు
రారి! వర్ణాశ్రమస్థుల కలుషమతుల
కూర్ధ్వలోకంబు ముక్కున నూర్పుగాలి
యుడిగినప్పుడె కాశియం దొదవు ముక్తి. 227

వ. అని సదాచారవర్ణనం బొనర్చి కుమారుం డింక నేమి యడి
గెద (వ)డుగు మనినఁ గుంభసంభవుండు జ్ఞానకారణంబు
లెయ్యవి? యని యడిగినం గుమారుండు. 228

యోగనిరూపణము

తే. అఖిలవేదానువచనంబు యజ్ఞపరత
బ్రహ్మచర్యైకనిష్ఠ తపంబు దమము
శ్రద్ధ యుపవాస మపరతంత్రత శమంబు
కలశసంభవ! విజ్ఞానకారణములు. 229

తే. ధర్మనిర్మలహృదయ! శ్రోతవ్య మాత్మ
తారక బ్రహ్మనిష్ఠ! మంతవ్య మాత్మ
సర్వశాస్త్రప్రవీణ! ద్రష్టవ్య మాత్మ
దంభరహిత! నిదిధ్యాసితవ్య మాత్మ. 230

వ. ఆత్మావలోకంబునకు యోగాభ్యాసంబు పరమసాధనంబు.

సీ. కుంభినీధరగుహాక్రోడాటవినికుంజ
గర్భవాసము గాదు కారణంబు

గ్రంథతాత్పర్యపర్యాలోచనక్రియా
    కర్మతంత్రము గాదు కారణంబు
దానంబు వ్రతము నధ్వరము లోనుగఁ గల్గు
    కర్మకాండముగాదు కారణంబు
నాసాగ్రసంవీక్షణంబు నాసాబంధ
    కల్పనంబును గాదు కారణంబు

తే. మౌనమును శౌచమును యంత్రమంత్రములును
గావు కారణములు యోగకలనమునకు
నిశ్చయంబును నభియోగనిశ్చలతయుఁ
గడఁకయును నప్పనము గాని కలశజన్మ! 232

తే. ఆత్మఁ దప్పించి యెఱుఁగఁ డన్యంబు నెవ్వఁ
డాత్మసంతుష్టుఁ డెవ్వఁ డహర్నిశంబు
నాత్మ నాత్మనె కను నెవ్వఁ డాత్మమిథునుఁ
డెవ్వఁ డాతండు యోగలక్ష్మీశ్వరుండు. 233

వ. కొంద ఱాత్మమనస్సమాయోగంబ యోగం బండ్రు. కొంద
ఱు ప్రాణాపానసమాయోగంబ యోగంబండ్రు. కొందఱు
విషయేంద్రియసమాయోగంబ యోగం బండ్రు. కొందఱు
పరమాత్మక్షేత్రజ్ఞసమాయోగంబ యోగం బండ్రు. యమ
నియ మాసనప్రాణాయామప్రత్యాహారధ్యానధారణసమా
ధులుం గొంద ఱెనిమిదియోగాంగంబు లండ్రు. నామతం
బాసనప్రాణాయామప్రత్యాహారధ్యాన ధారణాసమాధులా
ఱంగంబులు. అందుఁ బ్రథమాంగం బైనయాసనంబు స్వస్తి
కాసనంబు, గోముఖాసనంబు, పద్మాసనంబు, వీరాసనంబు,
సింహాసనంబు, భద్రాసనంబు, ముక్తాసనంబు, మయూరాస

నంబు, సుఖాసనం బన బహు భేదంబులం గలిగియుండు. ఇం దొక్కయాసనంబున నాసీనుండై యోగి యోగం బభ్యసిం చునది. దంశమశకాకీర్ణంబు గాక, కేశభస్మాంగారకీకసాది ప్రదూషితంబు గాక, జనసంకులంబు గాక, సర్వబాధావిర హితంబై సర్వేంద్రియ సుఖావహంబై మనఃప్రసాదజననంబై కుసుమస్రగ్వాసనాధూపధూమమేదురంబైన ప్రదేశంబున నతితృప్తుండును, నతిక్షుధార్తుండును, విణ్మూత్రబాధితుం డును, జింతాకులుండును గాక, నిమీలితాక్షుండై దంతం బులు దంతంబులం గూర్పక యింద్రియగ్రామంబు నియమించి ప్రాణాయామంబున కుపక్రమించునది. 234

తే. యోగి యియ్యెయ్యి యమరగించి యనుపవలయుఁ
గుక్షిగోళంబులో గాలి కుంభకమున
బలిమి నిలిపిన రోమకూపముల వెడలి
యది ప్రకల్పించుఁ గుష్ఠాదులైన రుజల. 235

ఉ. ఎంతయు ఘోరమైన విషినేభము మెల్లన మస్తరించి మా
వంతుఁడు కంఠపీఠి గుటి వైచి సుఖంబున నెక్కినట్లు ల
శ్రాంతము యోగసాధకుఁడు ప్రాణసమీరణముల్ నిసర్గదు
ర్దాంతముమ(కు)స్తరించి యవధానముమైధరియింపఁగాఁదగున్.

తే. కడఁగి సవ్యాపసవ్యమార్గముల వెలికి
యాన మొనరించుఁ గావునఁ బ్రాణ మొయ్యఁ
జంద్రనాడికఁ బూరించి సాధకుండు
భానునాడిక విడుచుఁ బ్రాణానిలంబు. 237

సీ. నలినాదినానాసనంబులయందును
గ్రమముమై దేహదార్ఢ్యము వహించుఁ

ప్రాణానిలాయామపరిపాటివిదళించు
నందంద కలుషసంహతుల నెల్లఁ
బ్రత్యాహృతిక్రియాపాటవంబునఁ జేసి
పావనత్వంబు చేపట్టు మేన
ధారణావిధిధురంధరతాబలంబునఁ
జర మైనచిత్తంబు దిరము సేయు
తే. ధ్యానమున నీశుఁ జూచి సమాధియుక్తి
గర్వనిర్మూలనక్రియాకర్మ శూర
మైన మోక్షంబుఁ గాంచు వింధ్యాద్రిదమన!
[1]సాధకుని కిది యోగాంగషట్క ఫలము. 238
తే. దహని యన భ్రామణి యనంగ స్తంభని యన
శమని యనఁ బ్లావని యనంగ సంయమీంద్ర!
ప్రాణపవమానధారణ లైదుగలుగఁ
జెప్పుదురు యోగసిద్ధాంతసిద్ధమతులు. 239
ఆ. ఉడ్డియానముద్రయును మహాముద్రయు
మూలబంధగగనముద్రికలును
సారతరవివేక! జాలంధరంబును
ననఁగ యోగముద్ర లైదు సుమ్ము. 240
వ. నాడీశోధనంబునకుం జంద్రసూర్యసంఘటనంబునకు రసపోష
ణంబునకు మహాముద్ర కపాలకుహరంబున జిహ్వాప్రవే
శంబు సేసి బ్రహ్మారంధ్రధుర్యేందుమండలసుధాధారానిష్యంద
(న)ంబాస్వాదించుటకు నభోముద్ర; అదియ ఖేచరీముద్రయు.
ఉడ్డీనం బగుమహాఖగంబు నహోరాత్రంబు నిలుపుటకు నుడ్డీ

1 కాదు సాధకుఁ దష్టాంగ కర్మ ఫలము.

యానముద్ర నాడీజాలంబుధరించుటకు జాలంధరంబు. అపా
నమూలంబు బంధించుటకు మూలబంధంబు. ఈమైదుము
ద్రాబంధంబులు సమాధినిష్ఠాకారణంబులు; [1]బిందుస్థిరీకరణ
కారణంబులు, గంధవహాధారణాధురంధరంబులు. 241

తే. ఊర్ధ్వమున నున్న ప్రాణంబు నొడిచి తివుచుఁ
గ్రింద నున్నయపానంబు గిట్టి పట్టి
యూర్ధ్వమున నున్న ప్రాణంబు నొడిచి తివుచుఁ
గ్రింద నున్నయపానంబు గిట్టి పట్టి. 242

క. మానక జీవుఁడు ప్రాణా
పానంబులచేతఁ దివియఁబడు వెలుపలికి
లోనికి నెక్కుచు డిగ్గుచుఁ
బౌనఃపున్యమునఁ బడనిపాటులఁ బడుచున్. 243

వ. హాంకారంబున బహిర్గమనంబును సకారంబున నంతర్గమనం
బును జేయుచు హాంసహాంస యను ప్రణవాత్మకమూలభూతం
బగునజపామంత్రంబున దివారాత్రంబు లిరువదియొక్క
వేయునార్నూఱువారంబు లుచ్ఛ్వాసనిశ్శ్వాసరూపంబున
జీవుండు జపించు. అమ్మహామంత్రంబు సంకల్పమాత్రంబున.

సీ. విను దూరవార్తలు వీక్షించు దవ్వుగా
నడుచును శతయోజనములు గదియ
సచ్ఛ్రుతం బగుశాస్త్రమైన వక్కాణించు
గౌరవం బొందు లాఘువముఁ జెందుఁ
బరకాయములఁ జొచ్చుఁ బతికీటమృగాది
బహుజీవజాతులభాష లెఱుఁగు

1. పక్షక్షయాపస్మారాదిరోగోపద్రవవిద్రావణంబులు.

దివ్యగంధంబును దివ్యతేజము దివ్య
కర్మంబులును దివ్యకళియుఁ దాల్చు

తే. మోక్షనగరీమహాద్వారముఖకవాట
విఘటనాలోహకుంచికావిభ్రమమున
నుల్లసిలుచుండును షడంగయోగవిద్య
నభ్యసించినసాధకుం డద్రిదమన! 245

వ. ఇది యాభ్యంతరం బైనముద్రాసహితషడంగయోగంబు.
ఇంక బాహ్యం బైనషడంగయోగంబు వివరించెద. 246

తే. విశ్వభర్త విశాలాక్షి విబుధగంగ
దండపాణి చమూనాయకుండు డుంఠి
కాలభైరవదేవుండు కలశజన్మ!
కాశినగరి షడంగయోగమున నెఱుఁగు. 247

తే. విశ్వనాయక దేవ త్రివిష్టపేశ
వీరకేదారనాయకోంకారకృత్తి
వాసు లిల్వలదైత్యవిధ్వంస! మఱియుఁ
గాశినగరి షడంగయోగముగ నెఱుఁగు. 248

సీ. వారాణసీపురవాటిసంచారంబు
ఖేచరీముద్ర యక్లిష్టచరిత!
వేగ మై యానందవిపినంబునకు రాక
భద్ర! యుడ్డీయానబంధముద్ర
కాశికానికటగంగావాహినీవారిఁ
దల ధరించుట జలంధరము ఘటజ!
శివరాజధానిఁ జేసినసద్వ్రతంబులు
మూలబంధంబు సన్మునివరేణ్య!

తే. సహజపదమన! మహాశ్మశానంబుమీఁద
భక్తిముద్ర మహాముద్ర పరమయోగ
విద్యను షడంగముద్రికాన్వితము గాఁగ
నీకుఁ జెప్పితి దృఢముగా నిలుపు మాత్మ. 249

వ. అనిన నగస్త్యుండు. 250

క. ఆయురవసానకాలం
బేయనువునఁ దెలియవచ్చు నెఱిఁగింపుము గాం
గేయ! యరిష్టాగమనము
లేయవి శకునములు చూచి యెఱుఁగంగఁ దగున్. 251

వ. అనిన గుమారుం డతని కి ట్లనియె. 252

## కాలజ్ఞానకథనము

తే. వామనాసాపుటమున నెవ్వానికి నొగి
గాలి యుచ్ఛ్వాసనిశ్శ్వాసగతిఁ జరించుఁ
బింగళానాడి నడువదు పెద్దయేని
వాఁడు మూఁడబ్దములకు నిర్వాణ మొందు. 253

తే. ఒండె మూఁడహోరాత్రంబు లొండె నేని
రెం డహోరాత్రములు సంచరించు నేని
నరుని కెవ్వని కొక్కవత్సరముగాని
బ్రతుకఁ డంద్రు సుధర్మిణీప్రాణనాథ! 254

క. నాసాపుటయుగమున ని
శ్శ్వాసోచ్ఛ్వాసానిలములు సరినై నడుచుఁ
వాసరము లెవ్వనికిఁ బది
మాసత్రితయమున వాఁడు మరణముఁ బొందున్. 255

క. ప్రాణానిల మెవ్వనికిని
ఘ్రాణపుటీయుగ్మకమునఁ బ్రవహింపక సం
క్షీణంబై నోరవెడలుఁ
బ్రాణ మతఁడు దొఱఁగు వాసర త్రితయమునన్. 256

తే. అదరిపాటెవ్వఁ డీక్షించు నాకసమున
హారికపుఁ గృష్ణపింగళుం డైనపురుషు
నాతనికి వత్సరద్వయం బవధి సూవె!
ప్రాణధారణమున కిల్వలాసురారి! [మూ

ఉ. తుమ్మును సింద్రియంబు నిజతోయమలంబులునొండొండె
త్రమ్ము మలమ్ముఁ దుమ్ము బలదార్ఢ్యము చాలక యెవ్వఁడేనినొ
క్కుమ్మడినుత్సృజించునతఁడుండఁడుప్రాణముతోడఁగూడియే
కమ్మగువత్సర¹మ్ము గడ గాంచిన పిమ్మట వాసరార్ధమున్. 258

ఉ. కానఁ డరుంధతిం ధ్రువునిఁ గానఁడు విష్ణుపదత్రయంబునుం
గానఁడు మాతృమండలముఁ గానఁడు కన్నులుగల్గియుండనే
మానవుఁ డమ్మనుష్యునకునాయువులంటుపిరామమొందఁగాఁ
గానఁగ వచ్చుఁ గుంభభవ! కాలునిబంధురసౌధవీథికల్. 259

తే. దృఢవివేక! యరుంధతీదేవి జిహ్వ
నాసికాగ్రంబు ధ్రువుఁ డిల్వలాసురారి!
విష్ణుపద మది భ్రూమధ్యవీథి యనఘ!
మాతృమండల మక్షిపక్ష్మము మునీంద్ర! 260

సీ. అసితాదివర్ణంబు నామ్లాదిరసమును
నన్యథాభావంబు నందెనేని

---

1 ంబునధికమ్మట మీఁదట.

దంతోష్ఠకంధరాతాలుజిహ్వాగ్రంబు
లారోక్య[1] వర్ణంబు నందెనేనిఁ
గరజేంద్రియంబులు కనుదోయికొలుకులు
ధూమధూమ్రత్వంబు దొరసె నేని
నాఖండలీయకం బగుధనుఃఖండంబు
సభమున న్నెరయఁ గన్పట్టె నేని

తే. నాలుమాసములకు మర్త్యుఁ డస్తమించు
వేగ యేతెంచి యూసరవెల్లి తొండ
పాదములనుండి తలదాఁకఁ బ్రాఁకె నేని
యతఁడు షణ్మాసములఁ జూచు యమునిపురము. 261

తే. జలక మాడినపిమ్మటఁ జరణములను
హృదయమున నీళ్లు వేగంబ యివురు వారు
దర్పణమునీడ తోఁచు నాత్మ కాంతి
నెవ్వనికి వాఁడు నాల్నెల్ల కేగు దివికి. 262

వ. మఱి ఛాయాప్రకంపంబు, మతిభ్రంశంబు, చంద్రద్వయ సూర్యద్వయదర్శనంబు, పగలు తారకావీక్షణంబు, రాత్రి తారకానభివీక్షణంబు, గంధర్వనగరావలోకనంబు, పిశాచ నృత్తవీక్షణంబును, శ్రవణధ్వనిహాని, స్వప్నంబునందుఁ బిశాచఖరవాయసభూతప్రేతశునక గృధ్రగోమాయుబాధ, పాంసురాశియూపదండవల్మీకాధిరోహంబుఁ, దైలాభ్యంజన ముండనంబులు మరణసూచకంబులు. 263

క. ఈదుర్నిమిత్తములతో
నేదైనను నొకటి గాంచి యెదలోనఁ గడుఁ

1. ఘ్రాణ, లాలోక్య.

ఖేదము నొందక నరుఁడు ప్ర
మోదమ్మునఁ గాశినగరమున కేగఁ దగున్. 264

అని చెప్పిన మహాత్మా! యీ ప్రపంచంబు నిర్వికల్పంబు నిరాకారంబు నిరస్తసమస్తోపాధికంబు. నిత్యంబు నగుపరబ్రహ్మం బేక్షేత్రంబును నాశ్రయించియుండు, నేక్షేత్రంబునంద లలాటనేత్రుండు తారకబ్రహ్మవిద్యావర్ణకర్ణేజపుండై కీటపతంగక్రిమిసరీసృపాదు లగునానావిధజంతువులకుం బ్రాణాంతకాలంబున నభయం బొసంగు, నేక్షేత్రంబునకు నుత్తరవాహిని యనవియత్తటిని యుపకంఠంబునం గంఠముక్తాకలాపంబునుం బోలెఁ బ్రవహించు, నేక్షేత్రంబున కభ్యర్ణంబున మణికర్ణికాతీర్థంబు తీర్థరాజంబు రజనీకరకిరణసందోహదానదీక్షాధురంధరవినిర్మలకబంధకల్లోలమాలికాక్షాలితమహాదేవదివ్యలింగశతసహస్రలక్షకోట్యర్బుదన్యర్బుదంబై మహోత్కర్షంబుఁ గాంచె, నట్టియవిముక్తక్షేత్రంబు మహిమ యింకను వినవలతు నానతిమ్మని ప్రార్థించినం గరుణావశంవదుండై శిఖివాహనుం డతనికిట్లనియె. 265

## దివోదాసవర్ణనము

బ్రాహ్మణోత్తమ! బ్రహ్మకల్పంబునందు
మనువు స్వాయంభువుని కాలమున ధరిత్రి
యఱువదేఁడు లనావృష్టి యైనకతనఁ
దారి వందురి కడునుపద్రవమునొందె. 266

అంభోధితీరంబు లద్రికాననములు
నాశ్రయించిరి పేద లగుచు మనుజు

లంగళ్లయందు మిట్టాడ మానిసి లేక
గుడియుఁ బాడును జిక్కఁ జెడియె నూళ్లు
లుద్యానములు వాపికోదకంబులు లేక
వృక్షవాటంబులు వెరలు వోయె
వ్యాఘ్రాదు లైనక్రవ్యాదహింస్రమృగంబు
లెచ్చోటఁ జూచిన నేఁపు మిగిలె

తే. సంతతము దాను సృజియించు జంతుకోటి
కఱవుపా ల్పడి మోముఁను కాళ్లు వాఁచి
వండఁగాఁ దిన్న బూరెలవరుస నడఁగ
భ్రమసి దిట దప్పి నివ్వెఱపడియె ధాత. 267

తే. రాజు లేనికతంబున రాష్ట్రములకు
నన్నిటికి బాధగా ధరిత్ర్యంతరమున
వ్రాలె నఱువదియేఁడు లవగ్రహంబు
కాచె వెలిపుచ్చ నొకభంగి గాక యుండ. 268

వ. అప్పుడు చింతాక్రాంతుం డై జగద్యోని ప్రజాక్షయంబున యజ్ఞాదిక్రియ లుచ్చాటనం బయ్యె, సవనాదిక్రియానాశనంబును నధ్వరభుజులు భూప్రజలఁ బోలె హవిర్భాగాద్యభావంబున బుభుక్షాక్షోభంబు వహించిరి. ఇంక నేమి సేయుదు? ఒక్కనిం బట్టంబుగట్టనినాఁడు సర్వసర్వంసహామండలంబును నాఖండలుండు వర్షింపకుండుటం జేసి యెండి బెండువడిపోవుచున్నయది. నిఖిలక్షోణీచక్రరక్షైకదీక్షాధురంధరుం డైన యంతటివాఁ డెక్కడఁ గల్గునొకో? యని యన్వేషించి మనుజవంశంబున రిపుంజయుం డనువాని

నౌదార్యశౌర్యధైర్యాదిగుణగరిష్ఠుం గాంచి సబహుమానం
బుగా నతని కిట్లనియె. 269

సీ. మనువంశమకుటమండన! వైరిపుంజయ!
ధర యేలు లవణాబ్ధి గరుసు గాఁగ
మత్ప్రసాదమున సామర్థ్యం బతీంద్రంబు
కలకాలమును నీకుఁ గలుగఁ గలదు
బర్హిర్ముఖస్నేహపరివృత్తితో దివో
దాసాఖ్యవిఖ్యాతిఁ దాల్తు వీవు
వాసుకితనయ విలాసినీరత్న మ
నంగ మోహిని భార్య యగును నీకు

తే. ననిన నంజలి చేసి మహాప్రసాద
మనుచుఁ బరమేష్ఠియానతి నాదరించి
యిట్టు లని విన్నవించె ధాత్రీశ్వరుండు
పద్మభవునకు గంభీరభాషణముల. 270

ఉ. నెట్టన నన్ను సత్కరుణ నీరధివేష్టిత యైనధాత్రి కిం
బట్టము గట్టెదేని నొకబాస పితామహ! యాత్మ నెగ్గుగాఁ
బట్టక విన్ను భోగులు సుపర్వులు క్రిందట మీఁద నుండఁగాఁ
దొట్టవుసత్యమౌ ధరణినొక్కరుఁడున్ననుఁ జేయరాజ్యమున్.

వ. అనిన నట్ల యగుంగాక యని బ్రహ్మ కాశీనగరంబునకేగి విశ్వ
నాథునకత్తెఱం గెఱింగించి తదనుమతివడసి దివోదాసునకుం
బట్టాభిషేకంబు సేసి సత్యలోకంబునకుం జనియె నయ్యవసరం
బున. 272

శా. చాటించెన్ మనువంశవర్ధనుఁడు విశ్వక్షోణి నందంద ఘం
టాటంకారము దుందుభిధ్వనియుఁ గూడ న్వేగమై దేవతా

కోటు ల్మేదిని నున్నఁ దప్పుగుఁజుఁడో కోపంబుపాపం బుపా
త్తాటోపంబు మెయింగుటుంబసహితంబై చేరుఁడో నాకమున్.

క. పాతాళమునకుఁ జనరో
వాతాశను లెచటికేని వలసినయెడకుఁ
భూతము లేగరో! యని య
త్యాతతగతి జాటి రవని నధిపతిదూతల్. 274

ఈశ్వరుండు నిఖిలదేవతలం గూడి మందరాద్రి కేగుట

వ. ఇవ్విధంబున దివోదాసదాసులు కాశీశ్రీశైలకుంభకోణ
శోణార్కపుండరీకపురపాండురంగమహాకాళకాళహస్తి కాంచీ
వేంకట శ్రీరంగవల్మీకరామేశ్వరాదిదివ్యస్థానంబుల ఘంటా
పథంబుల ఘంటాడిండిమధ్వానులతోడం గూడంజాటిన బ్రహ్మ
దత్తవరానుభావంబునం గుటుంబసహితంబు త్ర్యంబకపీఠాం
బరహేరంబభైరవదుర్గావీరభద్రప్రధానులగు నిర్జరులు దమ
తమచిందంబులతో దుందుభి వేణువీణామృదంగకాంస్య
కాహళఢక్కాహుడుక్కానకంబుల మ్రోత దిక్తటంబుల
దీటుకొనం గిరీటకోటీరరమణీయఘటితమణిమయూఖరేఖా
పుంజంబు గలసి యరసంజపొడవు వేడబంబు విడంబింప వెల్ల
జగజంపుగొడుగుల పెల్లును, డెక్కెయంబుల పెక్కువయు,
నాలవట్టంబుల డాలును, సీవిరుల రేవయుఁ, దాలవృంతంబుల
డంబును, దాంబూలకరండంబుల పొంకంబును, గర్కరీ
కళాచికాపీఠగండోపధానమణి ముకురళి యాన్య కటా
హంబులకల్మియు, మహైశ్వర్యంబుం బ్రకటింప నిలింప
మార్గంబున సవాహనులు, సాయుధులు, సపరివారులు,
సశక్తులు, సాలంకారులునై కాశీపట్టణంబున కేతెంచి

విశ్వేశ్వరాదేశంబున నెచ్చోటికైనను జనువాఁడై గంగా
తీరంబున విడిసిరి కాశీశ్వరుండును నేకక్రియా ఫలద్వ
యంబు నీఁజాలునట్టి ప్రకారంబు విచారించి యటకుమున్న
పెద్దకాలంబునం బట్టి యవిముక్తక్షేత్రంబునందునుం
బోలె నిజశిఖరదేశంబునం దా నధివసించుట ఫలంబుగాఁ
గోరి తన్ను నుద్దేశించి ఘోరవీరతపంబు చేసినమందరా
చలంబు కృతార్థం బగునట్లు నగ్గిరీంద్రంబునం దుండి దివో
దాసు ప్రతిజ్ఞ చెల్లించువాఁడై తత్కాలసన్నిహితం బైన
నానాదిగ్దేశదేవతాసమూహంబుఁ గనుంగొని యి ట్లనియె.

ఉ. ఓసురముఖ్యులార! కమలోద్భవుఁ డాదర మొప్పఁగా దివో
దాసున కిచ్చినాఁడు వసుధాతలమెల్ల జగద్ధితార్థమై
రాసుతుఁ డాతఁ డీభువనరాజ్యభరంబు వహించునప్డు దే
వాసురసిద్ధసాధ్యగరుడాదుల వెల్వులఁ బన్నగేంద్రులన్.

తే. ఆజ్ఞ వెట్టెనఁ గాని రాజ్యంబు సేయ
బహుముఖం బైన రాజ్యంబు పదిలపడదు
ఫణులు పాతాళమున నుండఁ బాడివారు
నిర్జరులు నాకమందున నిల్చువారు. 277

వ. అని వరంబు వేఁడినఁ బితామహుండును నాయనుమతి నతని
కభీప్సితార్థంబు నొసంగె నని యానతిచ్చి. 278

సీ. మహనీయరుద్రాక్షమాలికాభరణులు
భస్మత్రిపుండ్రకోద్భాసితులును
వికటపాటలజటామకుటవర్ధనులును
సముదీర్ణశార్దూలచర్మధరులు

దంతనిర్మితయోగదండమండితులును
నలిలభుగ్భ్రిష్టాసూత్రాన్వితులును
నాసాశిఖాగ్రవిన్యస్తలోచనులును
బంచాక్షరీమంత్రపఠనపరులు

తే. నైనప్రమథులు గొలిచి రా నగజతోడ
నందికేశ్వరు నెక్కి యానందలీల
సకలజగదీశ్వరుండు పన్నగభూషణుండు...
సుందరాద్రికిఁ గదలె సమగ్రమహిమ. 279

వ. మఱియు సారస్వతేశ్వరుండు, రత్నజాతీశ్వరుండు, సప్తనాగ రేశ్వరుండు, శైలేశ్వరుండు, త్రిపురేశ్వరుండు, బాణేశ్వ రుండు, ప్రహ్లాదేశ్వరుండు, భృంగీశ్వరుండు మొదలైన పర మేశ్వరులు, దివ్యజ్యోతిర్లింగమూర్తులు, శతసహస్రలక్ష కోట్యర్బుదన్యర్బుదసంఖ్యాకులు విశ్వేశ్వర శ్రీమన్మహా దేవు ననుగమించిరి. లోలార్కకేశవులును, విశాలాక్షియు, డుంఠివిఘ్నేశ్వరుండును, దండపాణియుం గదలిరి. అందఱు వేల్పు లిరుపక్కియలనుం బిఱుందనుం గూడి రాఁ గాశీ శ్వరుండు. 280

సీ. లవణపాథోధివేలావేష్టితంబైన
యల్లానేరెడుదీవి యధికరించి
యిక్షురసాబ్ధిపరీతాంచలంబైన
ప్లక్షాంఘ్రిపద్వీపపరిధి గడచి
హాలాకసోదన్వదభిమంత్రితంబైన
శాల్మలద్వీపభూస్థలము దాఁటి

ఘృతపయోరాశిసంక్లప్తావధిక మైన
చంచత్కుశద్వీపజగతిఁ జేరి
తే. యమ్మహాద్వీపమునకు రత్నాఢ్యమైన
మకుటమును బోలె నొప్పారుమందరమునఁ
గనకకలధౌతమాణిక్యకందరమున
గాఁపురముసేసె శివుఁ డంబికయును దాను. 281

వ. ఇట్లు కృతనివాసుండై యిందుధరుం డమ్మందరాచలంబునందు మణికందరమందిరంబున విహరించుచుం బర్వత(రాజ)నందనం జూచి యి ట్లనియె. 232

సీ. నలినాక్షి! యైరావణంబుకుంభములతోఁ
సరివచ్చు నీగుబ్బచన్నుదోయి
తన్వంగి! పారిజాతప్రవాళములతోఁ
బ్రతివచ్చు నీహస్తపల్లవములు
కాంత! కౌస్తుభమణిగ్రావకందళముతోఁ
నెనవచ్చు నీలేఁతయిగురుమోవి
యలినీలకుంతల! యమృతపూరంబుతోఁ
దొరవచ్చు నీముగ్ధసరసఫణితి
తే. యువిద! యీయుపమానవస్తువులు గలిగె
నంబునిధియందు నీమనోజ్ఞాంగములకు
నిమ్మహామందరాద్రి కవ్వంబు గాఁగ
సురలు నసురులు సంప్రీతిఁ దరువఁ బట్టి. 283

చ. చటులబడి తీవ్రఘూర్ణనవశంబున నొక్కట లీఁగసుట్టు నె
త్తలులయియున్న పాఁపతరిత్రాటిమలంకల నిర్ఘరాంబువుల్
గిటికొని మీఁదనుండి దిగఁ గిన్నరకంఠి పయోధిఁ ద్రచ్చిన

త్తతతి ఫణిరాజు చుట్టినవిధంబున నున్నది చూడు మిగ్గిరిన్.
వ. అనియె నంత. 285

సీ. సోమార్కమయమహాసోపానముల డిగ్గి
పుష్కరాంబువు లోఁగి బుక్కిలించి
గ్రహతారనక్షత్రగణము నాస్వాదించి
విధుకిరీటునిమౌళి వెళ్లిగొల్పి
వడఁకుగుబ్బలిరాచవారిమూర్ధంబెక్కి
కనఖలక్షేత్రంబుఁ గౌఁగిలించి
కాశికానగరోపకంఠదేశము డాసి
యేడ్వాలుముఖముల నేగి జలధి
తే. కిమ్మహానది యిర్యేటి యిరుగేలఁకుల
విడిసియున్న నల్దిక్కుల వేల్పుగములు
నంబుధరమార్గమున నేగి రభవుఁ గూడ
మందరమునకు సంభృతానందలీల. 286

తే. అపుడు జంబూతరుద్వీపవిపులయందు
వాసి కెక్కినయద్దివోదాసునాజ్ఞ
గొంది సంకిని నొకకుంటి కుదిపి పేద
యనదబూతంబు నుండనీరైరి భటులు. 287

క. కోయిలఁ దిరుమలఁ బెరుమా
కోయిలఁ దిరుపతులఁ గుంభకోణాదికపు
ణ్యాయతనంబుల మాయం
బై యెక్కడఁ బోయెనొకో మురాంతకుప్రతిమల్ ? 288

తే. మోసపోక మునానమ్మ ముద్దరాలు
తారెసరిసప్పులేక పాతాళమునకుఁ

దాను గొడుకుల్లు నొకకొంత తడసె నేని
గుతిలపఱుపరె నృపుబంట్లు గుదెలవాదు. 289

వ. అప్పుడు చతురంతమహీమండలంబు సర్వదేవతాశూన్యం బగుటం జేసి విఘ్నేశ్వరావాసంబుల స్తవరాజస్తోత్రపాఠంబును, గాళికాకటంబుల హృల్లేఖాదిమంత్రజపంబును, శివస్థానంబులం బంచాక్షరీ పంచబ్రహ్మపాశుపతా(ద్య)ఘోర [1]శారభాది విద్యానుసంధానంబును, విష్వక్సేనావాసంబులం బురుషసూక్త ద్వాదశాక్షరాష్టాక్షర ప్రధాననామానుస్మరణంబును లేక తక్కెం దక్కినవేలుపుల గుళ్లయందును సంధ్యాకాల బహుళ పటహశంఖకాహళకోలాహలంబుడిగె. నేనునుం గర్ణాటదేశహాటక మణికిరీటంబును, గిష్కింధాచల హేమకూటమతంగగిరిప్రాంతంబును, దుంగభద్రాతటినీసైకటికంబును, భాస్కరక్షేత్రప్రాతివేశికంబును, బంపావిరూపాక్షదేవ దివ్యవికటపాటలజటాజూటకోటీపినద్ధముగ్ధేందు లేఖామయూఖకందళగళదమృతధారానిష్యందానేక సంవర్ధితసుకుమారసరళసహకార జంబుజంబీర నారికేళకేసరకురవకాశోకశాకోటకుటజ పారిభద్రద్రాక్షారుద్రాక్షసర్జ ఖర్జూరభూర్జ బిల్వ చిరిబిల్వాదితరులతాకుంజఖంజన్మిహిరకిరణ పుంజంబు నగుసామిమల విడిచి, మందరాచలంబున కరిగితి. ఇవ్విధంబున దేవసంఘంబులు దివికిం గాద్రవేయకులంబు బలిసద్మంబునకుం బోక విని నిర్ద్వంద్వంబు, నిరవగ్రహంబు, నిస్సపత్నంబునుం గాఁ గాశీనగరంబు తనకు మొదలిరాజధానిం గావించికొని దివోదాసుం డేకవాసర

1. శాతరుద్రా.

ప్రాయంబుగా వత్సరాయుతాష్టకంబు. రాజ్యంబు సేసిన నక్కాలంబు నందు. 290

ఉ. దేవత లెల్లఁ దక్కఁ గలదీవులకుం దివి కేఁగునట్టిచోఁ
బోవఁగ లేక కుంటికుడుపుల్ జిఱువేల్పులు దేవదానవుల్
సేవకులై మహీవిభునిచే నధికారనియోగవృత్తికై
జీవిత మంది నిల్చిరి త్యజింపఁగ వచ్చునె జన్మదేశముల్. 291

తే. తత్పరతమీఱఁ గొలిచి రాధరణివిభుని
దైత్యదానవు లవధూతదానవారి
పతితపాత మాబాలగోపాల మైన
సుద్ది పగవారిపగవారు చుట్ట లగుట. 292

తే. విశ్వదేవగణంబుతో వేఱువేఱ
వచ్చి పితృదేవతలు మహీశ్వరుఁ గొలిచిరి
చులుకఁ గా ల్వట్టి యీడ్చినఁ జూరు వట్టి
వేలుమరు గాక తమవారి విడుతు రెట్లు. 293

సీ. సిద్ధు లారాజుఁ గొల్చి ప్రసిద్ధిఁ గాంచిరి
గ్రహముల కతఁ డనుగ్రహముఁ జూపె
విద్యాగురుం డయ్యె విద్యాధరుల కతఁ
డతఁడు రుద్రులకు సౌహార్దుఁ డయ్యె
రక్షించె నాతఁడు రక్షస్సమూహంబు
నతఁడు తార్క్ష్యులకు నాధ్యక్ష మిచ్చె
మన్నించె నాతఁడు కిన్నరవ్రాతంబుఁ
దుషితుల నతఁడు సంతోషపఱిచె

తే. నతని భూతపిశాచకూశ్మాండగణము
ఢాకినీప్రేతరంకులు శాకినులును
గర్కరీపాదుకావీటికాకరండ
పేటికలు దాల్చి కొల్చిరి భృత్యు లగుచు. 294

వ. అవ్విధంబున రిపుంజయుండు ప్రజాపాలనంబు పరమధర్మం బుగా శక్తిత్రయచతురుపాయషాడ్గుణ్యంబులు కాలంబెఱిఁగి నడుపుచుఁ బెద్దకాలంబు రాజ్యంబు సేసె. చాతుర్వర్ణ్యం బును జతురాశ్రమంబులుఁ దమతమధర్మంబులు దప్పక వర్తించె. అపుడు వేల్పులు ధరావియోగవేదనాదూయ మానమానసులై మరుద్గురుం బురస్కరించుకొని మంత నం బుండి దివోదాసునకు రాజ్యపదభ్రంశనం బెవ్విధం బునం గావింతు మొకో యని విచారంబునకుం దొడంగిరి. అప్పుడు కార్యంబు నిర్వర్తించి బృహస్పతి యింద్రాదిదేవతల కి ట్లనియె. 295

క. ప్రాణాపానవ్యానో
దానసమానములు తృప్తి దలకొనఁ జేయం
గా నోపెడు నది యన్నము
ప్రాణం బన నన్న మనఁగఁ బర్యాయంబుల్. 296

తే. అగ్ని మనలోన నొక్కరుఁ డౌనొ కాఁడొ ?
చేయఁడే మారుతము మనచెప్పినట్లు ?
వరుణుఁ డెవ్వరివాఁడు ? ముువ్వురును లేక
యోజితం బగునెబ్భంగి నోగిరంబు ? 297

వ. వరుణానిలాగ్నులు తమతమశక్తు లుపసంహరించిరేనిఁ బిఠర పాకంబు సాగదు. పిఠరపాకంబు సాగక యోదనంబు పరి

పక్వంబు గానేరదు. పరిపక్వాన్నంబు లేక వైశ్వదేవబలిహర
ణాదిక్రియాకలాపంబులు కుంఠితంబు లగు. హవ్యకవ్యక్రి
యాశూన్యులైన బ్రాహ్మణులు రాజులయందు విరక్తు లగు
దురు. బ్రాహ్మణులు విరక్తులైనప్పుడ తక్కినవర్ణంబుల ప్రజలు
వైరాగ్యంబు వహింతురు. ప్రజా(ను)రంజనంబునం గదా రాజు
రాజౌట. ప్రజావిరక్తిఁ గోశదుర్గబలాదిసప్తాంగంబులు పరిక్షీ
ణంబు లగు. సప్తాంగపరిక్షయంబునఁ ద్రివర్గనాశనం బగు.
త్రివర్గనాశనంబున నుభయలోకమార్గంబును ఖిలీభవించుం
గావున. 298

తే. మొదల వైశ్వానరుని నిజమూర్తిశక్తి
సంహరింపంగఁ దగుఁ గాశి జనపదమున
నగ్ని లేకున్న నోగిరం బనువుపడక
రాజు ప్రజలును నెబ్భంగి బ్రదుకువారు. 299

ఉ. చండకరాన్వయాంబునిధిచంద్రుఁడు భూరమణుం డతండు తా
గుండియవాఁడు వేలుపులకోటు లసంఖ్యలు భూతధాత్రిపై
నుండఁగ నీక కాశిపురి నొక్కఁడు రాజ్యము సేయు టెట్టు ? లీ
దండికి మెచ్చి నారట ప్రతాపవిహీనుఁడు భూమిపాలుఁడే ?

తే. అనిన నాచార్యుపలుకుల నాదరించి
యింద్రుఁ డనుపఁగ ధాత్రికి నేగె నగ్ని
మొదలఁ గాశీపురమునకు ముట్టముణఁగ
సకలగృహములఁ దనమూర్తి సంగ్రహించె. 301

మ. కర మాశ్చర్యముగాఁ బ్రతిక్షయమునం గాష్ఠంబులం దగ్ని దే
వర నిప్పచ్చరమై యడంగుటయు సర్వస్త్రీలు పాకక్రియా

పరతల్ దక్కిరి యాయజూకభవనప్రాగ్వంశమధ్యంబులన్
*వరుసంజేయరయారెవీడునస్వధాస్వాహావషట్కారముల్.

ఉ. ఆయంత్రితభక్తిభావమున నగ్నిసమింధని సామిధేని ఋ
క్సంత్రము లుచ్చరించుచు సమగ్రతరారణిమంథనక్రియా
తంత్రము నాచరించి వసుధామరముఖ్యులు వీతిహోత్రునా
మంత్రణ సేయ లేరయిరి మచ్చరికించియుఁ గాశికాపురిన్.

వ. ఆసమయంబున. 304

ఉ. భూపతిసమ్ముఖంబునకుఁ బోయి కరాంబుజము ల్మొగిడ్చి వి
జ్ఞాపన సేసె నారసికసంఘము మెల్లన గొంకి గొంకి యి
ట్లాపకరోక్తిఁ జెప్పెదు నెడం †గడునల్లుట నీతి యూ ననం
బాపలు మేదినీశ్వరులమానసముల్ దిరిసెంపుఁబూవులున్.

తే. అవధరింపుము నీప్రతాపాతిశయము
గరిమమున నోహటించిరో కాని వహ్ని
కాశికాపట్టణము నైదుఃక్రోశములును
బదిల మై యుండ నోపక పాఱిపోయె. 306

ఉ. అంబుజబాంధవాన్వయనృపాగ్రణి! బోనము నేఁడుసూర్యపా
కంబున నాయితం బయినఖజ్యము భోజనశాలలోనఁ బ
ళ్యం బిడినారు పంకజదళాక్షులు రెండవజాముగంట వే(మ్రో)
యంబడె నారగింప సమయం బని యిమ్మెయి విన్నవించినన్.

---

* 'పరిబిత్యం బెడ యొల్క వీడును; వరు జయ్యాం బెద యొల్క' అనియుఁ గొన్నిప్రతులలోఁ గనఁబడుచున్నవి. ఈపాఠములు చింత్యములు.

† 'గడునజ్జలనీతి మోవనం, బ్రాపలు' అని ముద్రితపుస్తకపాఠము. ఈ రెండుపాఠములుం జింత్యములు.

తే. వేల్పు లొనరించినట్టి దుర్వృత్తి యగుట
నెఱిఁగి యింతియ కాకయొం దేమి? యనుచు
నారగించె దివోదాసుఁ డర్కకిరణ
తాపపక్వంబు లగుపదార్థంబు లెలమి. 308

వ. భోజనానంతరంబున నాస్థానమధ్యంబునం గొలువుండి దివోదాసుండు వాసవాదులు సేసిన యపకారంబునకుఁ బ్రతికారంబుసింతించునవసరంబునఁ బౌరజానపదులగు జను లయ్యగ్ని తిరోధానంబునకు భయంపడి యమ్మహోత్పాతంబు విన్నవింప నేతెంచిన. 309

ఉ. అందఱ నాదరించి మిహిరాన్వయముఖ్యుఁడు వారియాత్మలా
నందముఁ బొంద ని ట్లనియె నాకనివాసులు సేసినట్టికీ
డొందునె నన్ను? మీరు వెఱకుండుఁడు భూప్రజలార! నేడ
యానందవనంబునందు దహనంబు ఘటించెద యోగసంపదన్.

మ. అనుమానింపక యాసురాధములు మాయాకల్పనావంచనం
బున వైశ్వానరునిన్ హరించిరి యవుంబో! యింతమాత్రంబు
లో, నన నాయోగమహానుభావమునకున్ భంగంబు వాటి
ల్లునే? సనెక ల్గాఁచినఁ బెండ్లిమానునొకో! దుశ్చారిత్రము
ల్గంటిరే! 311

సీ. దహన స్వరూపంబుఁ దాల్చియేఁ గైకొందు
హవ్యకవ్యాహుతు లధ్వరములఁ
బర్జన్యమూర్తిఁ జేపట్టియే వర్షింతు
సలిలధారలు సస్యములు ఫలింప
శశిదివాకరులవేషంబులుఁ దాల్చియే
ఖండింతు గాఢాంధకారపటలిఁ

బవనునాకారంబు భరియించి యేను బ్రా
ణ్యంతర్బహిర్వ్యాప్తి నాచరింతు
తే. వేల్పులందఱు నేన నై వివిధగతుల
విశ్వలోకంబు రక్షింతు వేయు నేల?
యింక నొందాని నిట నేన యేలువాఁడ
నాగలోకంబు నాకంబు యోగశక్తి. 312

వ. అని యోగవిద్యాబలంబున సర్వదేవతామయుండై దివో
దాసుండు రాజ్యంబు సేయుచుండె. అంత నటఁ బరమేశ్వ
రుండు మందరాచలంబునం దధివసించి కాశీనగరవియోగ
వేదనాదూయమానమానసుండై తత్సమాగమోపాయంబుఁ
జింతించుచుండె నప్పుడు. 313

తే. అభవుఁ డిందుకళాధరుఁ డయ్యు నమర
వాహినీధరుఁ డయ్యు దుర్వార మైన
కాశికావిప్రయోగాభిఘాతజనిత
తాప భారంబు సైరింప నోపఁ డయ్యె. 314

ఈశ్వరుండు యోగినులం గాశి కంపుట

వ. అంత నొక్కనాఁ డద్దేవుండు గజానన, సింహముఖి, గృధ్రా
స్య, కాకతుండిక, ఉష్ట్రగ్రీవ, హయగ్రీవ, వారాహి, శరభా
నన, యవికేశి, శివారావ, మయూరి, వికటానన, అష్టవక్ర,
కోటరాక్షి, కుబ్జ, వికటలోచన, శుష్కోదరి, లలజ్జిహ్వా,
దంష్ట్రోగ్ర, వానరానన, ముక్తాక్షి, కేకరాక్షి, బృహత్తుండ,
సురాప్రియ, కపాలహస్త, రక్తాక్షి, శుకి, శ్యేని, కపోతిక,
పాశహస్త, దండహస్త, ప్రచండ, చండవిక్రమ, శిశుఘ్ని,
పాకహంత్రి, కాలి, రుధిరపాయిని, వసాధయ, గర్భభక్ష,

శవహస్త, అంత్రమాలిని, స్థూలకేశి, బృహత్కుక్షి, సర్పాస్య, ప్రేతవాహన, దందశూకకర, క్రౌంచి, మృగశీర్ష, వృషానన, యాంత్రశ్యామ, ధూమనిశ్శ్వాస, వ్యోమైకచరణ, ఊర్ధ్వదృశ, తాపని, శోషణి, వృకోదరి, స్థూలనాసిక, విద్యుత్ప్రభ, బలాకాస్య, మార్జారి, కటపూతన, అరిష్టాహాస, కామాక్షి యను నీచతుష్షష్టి యోగినుల రావించి మీరు నానాప్రకారమాయావేషచేష్టావిధానంబులం గాశికానగరంబునం బుణ్యస్త్రీలపాతివ్రత్యంబులు, పురుషుల యాచారంబులు చెఱుచునది. వర్ణాశ్రమంబులు నిజధర్మంబున వర్తింపకున్న దివోదాసుండు రాజ్యపదభ్రంశంబు నొందెడు. అప్పుడు గాని మాకుఁ గాశీసమాగమంబు సిద్ధింపదు. అనిన వారును మహాప్రసాదం బని. 315

సీ. పుష్పలావిక యొక్క బూమెకత్తియ యొక్క
గంధవాహిని యొక్కర్తుకర్త లంజె
హస్తాంఘ్రిరేఖాసమాలోకనక్రియా
సాముద్రికజ్ఞానచతుర యొక్క
సలిలాగ్నివాగ్వాయుస్తంభవిద్యాకళా
ప్రావీణ్య యొక్క సైరంధ్రి యొక్క
మాచకమ్మ యొకర్తు మంత్రవాదిని యొక్క
రంగవల్లికచిత్రరచననిపుణ

తే. చదువఁ బాడంగ నాడంగ సరస మాడఁ
గథలు సెప్పంగ (నటియింప) నర్తింపఁ గన్ను లార్ప
వీణ వాయింపఁ బొగడంగ విరులు గట్ట
నేర్పునట్టిది యొకర్తు సన్న్యసిత యొకర్తు. 316

వ. ఇవ్విధంబుల నానారూపవిధంబులు గైకొని వారణాసికిం
జని రనంతరంబ. 317

— ఈశ్వరుండు సూర్యునిం గాశి కంపుట —

తే. మనసిజారాతి సిద్ధయోగినులఁ బంపి
యూరడిలి యుండఁ జాలక యుష్ణకరుని
నంచెఁ గాశికానగరివృత్తాంత మరయఁ
గౌతుకము కాలయాపనాక్షమము గాదు. 318

సీ. పురివైరి రవిఁ గాశిపురి కన్పునప్పు డే
కాంతంబు సేసి య ట్లనుచుఁ బలికె
వాసరాధిప! దివోదాసు ధర్మాత్ముని
నేయుపాయంబుననేని ధర్మ
విముఖుఁ గావింపుము విడియంగ నాడకు
ధర్మమార్గైకతత్పరత నతని
మన మాదరింపకుండిన ధర్మ మెబ్భంగి
నభివృద్ధిఁ బొందుఁ? గా నగునయంబు

తే. *దప్పకుండంగ నేదేని తప్పుటొఱపు
మత్సరాహంకృతులను గామమునఁ గ్రోధ
మోహములఁ బ్రత్యవాయంబు మోవఁదలఁచి
తప్పు లేకయ శిక్షింపఁ దగవు గాదు. 319

*ఇచట 'తప్పకుండదు నిదనొక్క 'ప్పువెఱపు' అని యచ్చుప్రతిలోను, 'తప్పకుండ నింకే నొక తప్పువెఱపు' అని యొకవ్రాతప్రతిలోను, 'తప్పకుం డంగ నేదేని తప్పుటొఱపు' అని కొన్నివ్రాతప్రతులలోను పాఠభేదములు గనఁబడుచున్నవి. ప్రథమపాఠము కేవల మపభ్రంశముగ నున్నది. తక్కిన పాఠములఁ గ్లిష్టార్థకల్పన చేయఁదగియున్నది. దోషజ్ఞులు ప్రమాణము.

తే. కదలకుండును మది నెంతకాలమేని
ధర్మమతిసుకరం బయి కర్మసాక్షి!
యంతగాలము నరునకు నావహిల్ల
దేయపాయంబు నీసూక్ష్మ మెఱిఁగికొనుము. 320

వ. అని చెప్పినం బ్రసాదం బని శివాజ్ఞ శిరంబున వహించి రవి కాశీపురంబున కరిగి యొక్కొక్కమాటుయాచకుం,డొక్కొక్కమాటు దాత, యొక్కొక్కమాటువదాన్యుం, డొక్కొక్కమాటు దీనుం, డొక్కొక్కమాటుగార్తాంతికుం, డొక్కొక్కమాటు దృష్టప్రత్యయవాది, యొక్కొక్కమాటుజటిలుం, డొక్కొక్కమాటుదిగంబరుం, డొక్కొక్కమాటు జాంగలికుం, డొక్కొక్కమాటు పాషండుం, డొక్కొక్కమాటు బ్రహ్మచారి,యొక్కొక్కమాటుగృహి, యొక్కొక్కమాటు వానప్రస్థుం, డొక్కొక్కమాటు యతి యై నానాప్రకార వేషభాషాచేష్టా యంత్ర మంత్ర తంత్ర మాయాప్రయోగ బలంబున. 321

తే. ఇన్నివిధముల జనియించిన యినుఁడు గాశి
ప్రణము గానంగ లేఁ డయ్యె రాజునందు
నపకరంబు మహీపాలునంద యేల?
కనఁగ లేఁ డయ్యె నొకపృథగ్జనునియందు. 322

వ. ఇట్లు విఫలప్రయత్నుం డయి యినుండు నిజాంతర్గతంబున.

సీ. కార్యంబు నిష్పత్తిగతికి రాకుండంగ
మందరంబున కెట్లు మఱలి పోదు?
అదె వచ్చె యిదె వచ్చె నని నా కెదురుచూచు
నీశు నీక్షింతు నే నేమొగమునఁ?

బతియాజ్ఞ నిర్వహింపక కాని దేవతా
ప్రమథులం దే నెట్లు ప్రభుతఁ గాంతు?
నొచ్చెంబు ధరియించి యొదిగి యుండక యెట్లు
నిటలలోచనుమోళిల నిలుచువాఁడఁ
తే. గనలియున్నాఁడు నేఁ డెల్లి కాశివిరహ
వేదనాభారమున వేఁగి వేఁగి భర్గుఁ
డడ్డపడువారె యెవ్వరు లతఁ డలిగినపుడు?
గాన నిచటన కాలంబు గడపువాఁడు. 324

వ. హరిశ్చంద్ర శిబిదధీచి ప్రముఖు లగు పెద్దలుం గాశీసంసేవనం బున సంసారదుఃఖంబులు దప్పించి రని ప్రభావజ్ఞుం డగు భాస్కరుండు లోలార్కుం డన, నుత్తరార్కుం డన, సాంబాదిత్యుం డన, గరుడాదిత్యుం డన, మయూరాదిత్యుం డన, [1]ఖఖోల్కాదిత్యుం డన, వరుణాదిత్యుం డన, వృద్ధాదిత్యుం డన, కేశవాదిత్యుం డన, విమలాదిత్యుం డన, గంగాదిత్యుం డన, యామాదిత్యుం డనఁ బండ్రెండు మూర్తులు వహించి కాశీపురంబునం దధివసించె. కాశీవాసనిమిత్తంబుగా మనంబు లోలంబగుట లోలార్కుం డయ్యె. క్రమంబున నీ యాదిత్యుల ప్రభావం బభివర్ణించెద నాకర్ణింపుము.

## ఉత్తరార్క ప్రభావవర్ణన

సీ. కాశీపురికి నుత్తరాశాప్రదేశంబు
నందు నుండుట నుత్తరార్కుఁ డయ్యె
నితిహాస మొకటి యయ్యినునిమాహాత్మ్యంబు
సంప్రకాశ మొనర్పఁజాలెడునది

1. ఖషోల్క, ఖట్వా.

వినిపింతు విను కాశి విప్రుఁడొక్కఁడు సదా
చారసంపన్నుఁడు శాంతిశాలి
యతిథిప్రియుఁడు ప్రియవ్రతుఁ డనుపేరివాఁ
డతనిభార్య శుభవ్రతాభిధాన

తే. దంపతులు వారి కుదయించెఁ దనయ యొార్త
మూలనక్షత్రమునయందు మొదటికాలఁ
గేంద్రమున నాంగిరసుఁ డుండఁ జంద్రవదన
బాల వర్ధిల్లె రూపసంపదయుఁ దాను. 326

తే. దానిపేరు సులక్షణ మానివర్య!
సర్వలక్షణసౌభాగ్య జన్మభూమి
బాల యంతంత వర్ధిల్లెఁ బ్రతిదినంబుఁ
జింత తండ్రికి వర్ధిల్లె నంత కంత. 327

తే. తగినవరుఁ డెవ్వఁ డొక్కొ యీతలిరుఁబోఁడి
కనుగుణుం డెవ్వఁ డొకొ విశుద్ధాభిజాత్య
పరమసౌభాగ్యభాగ్యసంపదల కనుచు
నిత్యమును దండ్రి యాత్మఁ జింతించుచుండు. 328

తే. మూలనక్షత్రమునయందు మొదలికాలఁ
గన్య గండానఁ బుట్టినకారణమునఁ
గర్మవశంబున విప్రుఁ డానందకాననమునఁ
జచ్చెఁ జింతాజ్వరముపైన జ్వరము దాఁకి. 329

వ. శుభవ్రతయునుం బతి ననుగమించె నంత సులక్షణదుఃఖావేశ యయ్యును ధీరోదాత్త గావునఁ దాత్పర్యంబునం దలిదం డ్రుల కౌర్ధ్వదైహికవిధులు నిర్వర్తించి నిజాంతర్గతంబున.

సీ. ప్రాణంబుప్రాణంబు లగుతల్లిదండ్రుల
హృదయంబులోన నే నెట్టు మఱతుఁ?
బితృమాతృహీన నై యతిశోచ్యవృత్తి మై
నెబ్భంగి నీఁదుదు నీభవాబ్ధి?
నేల కల్పించె నాకీరూపలావణ్య
సౌభాగ్యసంపద జలజభవుఁడు?
కులశీలరూపాదిగుణములు వీక్షించి
యెవ్వారి కీ నేర్తు నేన నన్ను?

తే. ననుచు నిర్వేదమునఁ బొందె నలరుఁబోఁడి
పురుషు నెవ్వనిఁ జిత్తంబు చొరఁగ నీక
బ్రహ్మచర్యవ్రతస్థితి బదిలపఱిచి
యుత్తరార్కునికడఁ జేసె నుగ్రతపము. 331

ఉ. నిత్యము నిష్ఠతోడ ధరణీసురకన్యక కాశి నుత్తరా
దిత్యునిపార్శ్వభాగమునఁ దీవ్రతపం బొనరింప వచ్చి సాం
గత్యము చేసెఁ గూర్మి చెలికత్తియకైవడి నొక్కమేఁక సం
ప్రీత్యనులబ్ధినంగనయుఁ బ్రేమ మొనర్చుచు నుండె దానిపైన్.

తే. రాత్రి దూర్వాప్రవాళచర్వణ మొనర్చి
యుత్తరాదిత్యకుండిక నుదక మాని
పగలు నాల్జాలు సేవించుఁ బద్మనయన
వత్సలత మీఱ *నలవోక వయసుమేఁక. 333

---

331-వ పద్యమునకుఁ దరువాతఁ గొన్నిప్రతులలో 'వ. ఇవ్విధంబున దపంబు సేయుచు నక్కన్యకారత్నంబు' అని యొకవచనము గనఁబడు చున్నది. *'నెలమ్రోఁక' అని ముద్రితప్రతి.

వ. [1]అంతఁ బెద్దకాలంబున నీలలోహితుం[2]డు ప్రత్యక్షం బై వరంబు వేఁడు మనిన సులక్షణ యవ్విరూపాక్షునకుఁ బ్రణమిల్లి వినయంబున ని ట్లనియె. 334

తే. మీనకేతనదమన! యీ మేఁకపిల్ల
ప్రాణసఖివోలె నాయొద్దఁ బాయకుండు
శర్వ! యీనోరుమాలినజంతువునకు
మొదలు వర మిమ్ము వర మిమ్ము పిదప నాకు. 335

వ. అనిన విని శంకరుండు కరుణాతరంగితాంగీకారం బైన కటాక్షవీక్షణాంకురంబునం గురంగాక్షిం గనుంగొని గౌరి హృదయానురోధంబున బర్కరి యన్యజన్మంబునం గాశిరాజుపట్టపుదేవికిం గూఁతురై పుట్టునట్లుగా వరం బొసంగె. బర్కరిపేర నయ్యుత్తరాదిత్యకుండంబు బర్కరీకుండం బనం బరఁగె. గుణానురాగిణియైనగౌరి సులక్షణఁ దనకుం జెలికత్తియంగాఁ గైకొని జయ, విజయ, జయంతిక, శుభానంద, సునంద, కౌముది, యూర్మిళ, చంపకమాల, మలయవాసిని, కర్పూరతిలక, గంధధార, శుభ, అశోక, విశోక, కమలగంధి, చందననిశ్శ్వాస, మృగమదోత్తమ, కోకిలాలాప, మధురభాషిణి, గద్యపద్యనిధి, యనుక్రజ్ఞ మొదలయిన చెలికత్తియలనుం బోలె నబ్బాల బ్రహ్మచారిణి యైన యయ్యలివేణి నాదరించె. ఇది యుత్తరార్కమాహాత్మ్యం బనుటయు నైమిశారణ్యనివాసులు మహాత్మా! యింకనుం గాశికానగరపంచక్రోశపుణ్యక్షేత్రంబునం గలదేవతాస్థానం

---

1 ఇవ్విధంబున నుండ నంతఁగొంతకాలంబునకు. 2 దక్షకన్యకామణి సన్నిధికిం.

బులు, పుణ్యతీర్థంబులు వివరించి మమ్ముం గృతార్థులం
జేయు మనుటయు.

ఆశ్వాసాంతము.

శా. ధారాపట్టణసార్వభౌమ [1]సురథాణ్ణర్వాపహారక్రియా
ధౌరంధర్యపటిష్ఠనిష్ఠురభుజాదంభోళిసంరంభ! దా
క్షారామప్రమదాకటాక్షలహరీవ్యాపారనీరాజితా
కార శ్రీజితమత్స్యకేతన! సమిద్గాండీవబాణాసనా! 337

క. వేంగివిషయాధీశ్వర!
సంగరగంగాతనూజ! సాహిత్యకళా
సంగీతలక్ష్యలక్షణ
భంగిసర్వజ్ఞ! విమలపాండిత్యనిధీ! 338

మాలిని. చతురుదధిచతుర్దిక్సౌధవీథీవిటంకా
ప్రతినవబహుముక్తారంగవల్లీమతల్లీ
ప్రతిమవిమలకీర్తీ! పంచనారాచమూర్తీ!
వితరణసురభూజా! వేమమాంబాతనూజా! 339

గద్య. ఇది శ్రీమత్కమలనాభపౌత్ర మారయామాత్యపుత్ర
సుకవిజనవిధేయ కవిసార్వభౌమ శ్రీనాథనామధేయ
ప్రణీతం బైన కాశీఖండం బనుమహాకావ్యంబునందుఁ
బంచమాశ్వాసము.

1 సురరాట్దర్పా.

# షష్ఠాశ్వాసము



శ్రీకటాక్షవీక్షణ
విశ్రాణన! విభవవిజితవిద్యాధర! వ
ర్ణాశ్రమరక్షాతత్పర!
యాశ్రితమందార! రెడ్డియల్లయవీరా! 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె. 2

## సాంబాదిత్యమాహాత్మ్యము

సీ. యదువంశమునయందు నవనిభారాపనో
దార్థంబు దుష్టదైత్యావశేష
హారణార్థముగఁ బుట్టె నంభోజనాభుండు
దేవకికిని వసుదేవునకును
ద్వారవతీపురాధ్యక్షుండు దైత్యారి
యవరోధకాంతాసహస్రములకుఁ
గాంచె నందనుల లక్షయునెనుబది వేల
మాన్యలైనప్రధానమహిషులందు
తే. జాంబవతి యనుదేవియు సాంబుఁ గనియె
నక్కుమారుండు లేఁతప్రాయంబునందు
వీథి నొకనాఁడు సఖులతో విహృతి సలుప
నచట నుండియు నారదుం డేగుదెంచె. 3

క. ఆటతమకమున నమ్మధు
కైటభరిపుసుతుఁడు మిగుల గౌరవబుద్ధిం
బాటింప నెఱుఁగ డయ్యెను
హాటకగర్భునితనూజు నభ్యాగతునిన్. 4

ఉ. తోడికుమారులుం సఖులు దూరమునందకరారవిందముల్
మోడిచి ఫాలభాగముల మోపినమస్కృతు లాచరింపఁగా
నాడుచు నుండెఁగాని ముని కంజలిసేయఁగ నేరఁడయ్యె న
వ్వేడుక కాఁడు పుట్టు దొకవేళ వివేకము నెట్టివారికిన్. 5

చ. త్రిదశమునీశ్వరుండునుమదింగలుషంబొకమూలనుండఁగా
యదుకులసార్వభౌముఁగని యర్చనగైకొని యిష్టగోష్ఠితో
ముదితల నమ్మియేమఱుట మోసమునూ! యనిబుద్ధిచెప్ప చ
చ్చదుసుఁడుసన్న సేయఁదగ జాంబవతీసుతునెన్నె ధూర్తుఁగాన్.

తే. ఎన్ని యాతోయమున మిన్న కేగి దివికి
నారదుఁడు శౌరిచేత సత్కార మంది
నెరసు పొడఁగానలేఁ డయ్యె నెమకి నెమకి
సాంబుపైఁ బాంచజన్యరథాంగపాణి. 7

వ. అంతం గొన్నిదినంబులకు. 8

తే. సాంబు నడచినదాఁక వ్రతంబు పట్టి
జలజసంభవతనయుండు చలపకారి
ద్వారవతి కేగుదెంచి యంతగపురమున
బుండరీకవిలోచనుం డుండు టెఱిఁగి. 9

తే. వెదకి సాంబునిఁ బొడగాంచి విబుధమౌని
హరికిఁ దనరాక నెఱిఁగింపు మనుచుఁ బలికెఁ

బోవు టనుచిత మొప్పదు పోవ కునికి
యేమి సేయుదు పని యాతఁ డిచ్చఁ దలఁకెఁ. 10

వ. ఎట్టకేలకు శుద్ధాంతగతుం డై యున్నతండ్రిసమీపంబున కరిగి యవ్వేళాగమనాపరాధంబు గారణంబుగా శౌరిచేతం గుష్ఠవ్యాధిబాధితుండు గా శపింపంబడి సాంబుండు. 11

తే. తండ్రికిని నారదునికి వందనము సేసి
జాంబవతిపట్టి శాపావసాన మెఱిఁగి
కాశికకు నేగి యత్యంతగాఢభక్తి
భాను సేవింప నీవ్యాధి మాను ననిన. 12

వ. ఇట్లు నారదానుమతిం గృష్ణుచేత శాపమోక్షప్రకారం బెఱింగి సాంబుండు కాశి కరిగి తదుపదిష్టమార్గంబున భాను సేవించి కుష్ఠవ్యాధిబాధావిముక్తుం డయ్యె. ఇది సాంబాదిత్యమాహాత్మ్యంబు. 13

గరుడాదిత్య మయూఖాదిత్య ఖఖోల్కాదిత్యారుణాదిత్యమాహాత్మ్యము.

సీ. పరమసంయమి కశ్యపప్రజాపతికిని
వినత కాత్మజుఁ డై నవిహగభర్త
విషధికుక్షినిషాదవితతి భక్షించుచో
ద్విజుఁ గ్రాసి యుమిసినవిమలబుద్ధి
యిభకచ్ఛపముల రోహిణిశాఖతోఁ దాల్చి
దివిమీఁదఁ బాఱినపవనవేగి
యహికోటి గెల్చి చిచ్చార్చి చక్రము దూరి
యమృతంబుఁ గొన్నట్టియమితబలుఁడు

తే. జిష్ణుపవి కొక్కయీఁక యిచ్చినప్రదాత
యచ్యుతునివాహనము తార్క్ష్యుఁ డగ్రజులును

దానుఁ దల్లియుఁ గాశికాస్థలమునందుఁ
గొలిచి రక్కాల నలువురఁ గుంభజన్మ! 14

వ. అని చెప్పిన విని యగస్త్యుండు హస్తంబులు మొగిడ్చి పార్వతీ
హృదయానందవర్ధన! కుమార! యొక్కసందేహంబు నడి
గెదం దెలియ నానతిమ్ము. దక్షప్రజాపతిపుత్త్రిక కశ్యపప్రజా
పతిపరిగ్రహంబు గరుత్మంతునిజనయిత్రి వినత యేమికారణ
మున దాస్యంబు వహించె నని యడుగుటయు బాహులే
యుండు కుంభసంభవున కిట్లనియె. 15

తే. సవతి కద్రువ శేషతక్షకులు మొదలు
గాఁగ వేవురు భుజగపుంగవులఁ గాంచె
నండముల మూఁటఁ గలధౌతగండశైల
సన్నిభంబులఁ గనెఁ బుణ్యసాధ్వి వినత. 16

ఉ. ఆదిమమైనయండమునయం దుదయించెను గూబపుల్గు సూ
ర్యోదయవేళ ముజ్జగము నుబ్బరపోవఁగ నయ్యులూక మ
ష్టాదశసంఖ్యదీవులను సర్వవిహంగమకోటికిన్ మహా
హ్లాదము గా వహించెను లలాటమునం దధిరాజపట్టమున్.

తే. ఖగములకు నాదిజం బైనకారణమున
సమ్మతించె విహంగమజాతి మొదలఁ
గౌశికము రాజ్యయోగ్యంబు గా దటంచు
నగియెఁ బిమ్మట దుర్లక్షణములు సూచి. 18

సీ. భంగించినట్లుండుఁ బడఁత మాటికి మాటి
కూర్ధ్వకంపంబు సేయుటకతాన
జంకించినట్లుండు శ్రవణనిష్ఠురముగాఁ
వెలఁగి ఘూత్కారంబు సేసె నేని

బెదరించిన ట్లుండుఁ బృథువర్తులములైన
దృగ్గోళకంబులు దిరుగఁబడిన
గర్వించిన ట్లుండు ఘస్రంబు నాల్గాలు
నెదిరిఁ దన్నునుఁ గాంచు నెఱుక లేమిఁ

తే. బుట్టుపుణ్యాంబుమాలిన జట్టిపులుగు
గూబ యెక్కడఁ కలహంసకోకకీర
నీలకంఠాదిబహుపక్షినివహరాజ్య
భార మెక్కడ? యిది యసంబద్ధ మనుచు. 19

వ. కులము పెద్దలు పరాభవించిన. 20

ఉ. గద్దియ డిగ్గి †కాశ్యపుని గాదిలిసూనుఁడు కొండ వట్టినన్
ముద్దియ దక్షుకూఁతురు విముగ్ధత రెండవపుత్త్రునైన నుం
దద్దయు వేడ్కఁ జూతు నని తాలిమి లేక నఖాంకురంబునం
బిద్దముచేసె మై సగము నిండనిగర్భముతోడియండమున్.21

వ. దానసపరార్ధకాయహీనుండును బూర్వార్ధమానతనూసహి
తుండును నైనపుత్త్రుం డనూరుం డన నుద్భవించి యప
కారంబు సేసినతల్లిం గినిసి సవతికి దాసివి కమ్మని శపి
యించిన. 22

సీ. ఏలరాయన్న! నాయేకాపరాధంబు
సైరింప వైతి యీ శాపమునకు
మోక్ష మెన్నఁడు గల్గు నక్షీణకారుణ్య!
గరిమఁ జెప్పర యాత్మ గలఁగె నాకు

---

† 'కశ్యపుని గాదిలిసూనుఁడు' అని ప్రాతప్రతిపాఠము. 'కాశికేర
శథావృత్తే' అని సంస్కృతమూలము.

ననవు డాపిచ్చుకుం టమ్మతో ని ట్లను
నేనూఱువర్షంబు లేగునంత
మూఁడవయిగాయండమున నుద్భవించిన
తనయుండు తల్లి! నీదాస్య ముడుపు
తే. నేమరక దీని రక్షింపు మీవు నియతి
ననుచు బుద్ధులు చెప్పి యయ్యరుణుఁ డరిగె
జననియనుమతిఁ గాశికాస్థానమునకుఁ
దారక బ్రహ్మవిద్యానిధానమునకు. 23

వ. ఆశాపంబు కారణంబుగా నొక్కనాఁడు కద్రూవినతలు సముద్రతీరంబున వినోదార్థంబు విహరించువారు వేలానువన(ధి)వనప్రాంతంబున మరుత్వంతునితురంగం బుచ్చైశ్శ్రవంబు మేయుచున్నం గనుంగొని వినత 'యోహో! యీహయో త్తమం బింత యొప్పునే? మహాపురుషునికీర్తిపూరంబునుం బోలెఁ గార్తికచంద్రచంద్రికాధవళం బయియున్నయది' యనినఁ గద్రువ యేకన్నులఁ గనుఁగొంటివి? ఈ తురంగంబు నందు నిందుబింబంబునందుఁ గందునుం బోలె వాలవీథి యందు వాలంబు లొకకొన్ని నీలంబు లయియున్నయవి యని పలికె. ఉన్నయవియనియును లేవనియునుం గొంతతడ విద్దఱు వాదంబు నేసి దాస్యంబు పణంబుగాఁ బన్నిదంబు చఱచిరి. అప్పౌద్దునకుం బ్రొద్దు చాలమి నిజనివాసంబుల కరిగిరి. మఱునాఁడు ప్రాతఃకాలంబునఁ గద్రువ కొడుకులం బిలిచి పనిచినం గొంద ఱక్కార్యంబునకు సమ్మతింపక కినుకం బడిరి. కొందఱు వాలమాత్రసూక్ష్మాకారులై వహించి వాలం బునందు వ్రేలిరి. అంతఁ దత్పరీక్షణంబునం వినత యోటువడి

కద్రువకు దాస్యంబు సేయుచుండె. మఱి యేనూఱువత్సరం
బులకుఁ దృతీయాండంబునం దుదయించినగరుత్మంతువలన
నమృతహరణంబు నిష్క్రియంబుగా దాస్యంబువలన
విముక్తిం బొందె. కుంభసంభవ! నీయడిగిన ప్రశ్నంబునకు
నిది ప్రత్యుత్తరంబు. 24

సీ. పక్షిసామ్రాజ్యసంపత్పదభ్రంశంబుఁ
బొందిన పెనుగూబపులుఁగు తేఁడు
కటిభాగమున కథగకాయంబు శేషంబు
పేలవం బగుపుట్టు పిచ్చుకుంటు
సవతి కేనూఱువత్సరములదాఁక దా
స్యంబు సేసి కృశాంగి యైనవినత
యనిలాశనులను వీఁపునఁ బెద్దకాలంబు
భరియించి తిరిగినపక్షిరాజు

తే. తల్లి నలువురుఁ గాశికాస్థానసీమ
హరుని ప్రతినిధు లైనభాస్కరులఁ గొలిచి
యచిరకాలంబునన యభీష్టార్థసిద్ధిఁ
గనిరి ప్రతిబంధములు వాసి కలశజన్మ! 25

వ. గరుడునిపేర గరుడాదిత్యుండును, నులూకంబుపేర మయూ
ఖాదిత్యుండును, వినతపేర వర్షాదిత్యుండును, నరుణునిపేర
నరుణాదిత్యుండును ననం బరఁగిరి. ఇంక వృద్ధాదిత్య కేశ
వాదిత్య విమలాదిత్య గంగాదిత్య యమాదిత్యుల మాహా
త్మ్యంబులు సెప్పెద నాకర్ణింపుము. 26

సీ. వృద్ధహారీతుండు వృద్ధత్వమునఁ బాసి
తరుణుఁ డై రవిఁ గొల్చి వరము వడసె

[1]ఆదికేశవదేవుఁ డభ్యాసమున నుంచి
రవి శంభుఁ గనిపించె రత్నమూర్తి
విమలాహ్వయుఁడు రాజు కమలబంధు భజించి
ప్రబలకుష్ఠవ్యాధిబాధఁ బాసెఁ
దొల్లి గంగ భగీరథుఁడు తెచ్చునప్పు డ
న్నదిఁ జూచి వినుతించినాఁడు తరణి

తే. యముఁడు యమతీర్థమునఁ దండ్రి నర్కుఁ గొలిచి
తపము గావించి వడసెఁ దత్కరుణ గాన
*నిన్నిచిహ్నలఁ గాశిలో నినులపేళ్లు
వాట మైయుండు ధర వాని వానివలన. 27

శివుండు బ్రహ్మం గాశి కనుపుట.

వ. వెండియుం గాశీవియోగవేదనాక్రాంతస్వాంతుం డై యంధకారాతి తద్వృత్తాంతశ్రవణకౌతూహలంబున విధాతమహాపరేతనిలయంబునకుం బంచువాఁ డై యవ్విరించి రావించి యి ట్లనియె. 28

ఉ. పోయెను యోగినీబలము పోయినపోక నెపోయెఁ బిమ్మటం
దోయజబాంధవుం డతఁడునుం దడసెంగడుఁ [2]జెర్వఁ జూడఁ
గాఁ, బోయినతూఁడుతీఁగె క్రియఁ బోయినయట్లనె కాశిఁ జిక్కరి

---

1. ఇది వ్రాఁతవ్రాఁతప్రతులపాఠము. సంస్కృతమూలమునకుఁ గొంత వఱకు సరిపడుచున్నది. పూర్వముద్రితగ్రంథమున 'ఆదికేశవదేవుఁ డభ్యాస మున నుబ్బి, యనిశంబు గొల్చిన యర్కమూర్తి' యనియున్నది. ఈపాఠము చింత్యము. *'నిన్నిచిన్నెలఁ గాశిలో నినులపేళ్లు' అని వ్రాఁతప్రతులపాఠము.

2. 'నీరుచూడఁగాఁ, బోయినయట్టి తామరలపోలికి నందఱు కాశిఁ' అని పాఠాంతరము.

తోయము నీవుపో ద్రుహిణ! తొల్లిటివారలయట్ల కాకుమీ!

వ. అనినం బ్రసాదం బని పనిపూని బ్రహ్మ వృద్ధబ్రాహ్మణవేషం బునం గాశిం బ్రవేశించి పేరోలగం బున్న దివోదాసు నాశీర్వదించి యి ట్లనియె. 30

తే. అధిప! యానందకాననాభ్యంతరమున
యజ్ఞములు సేయువాఁడ నీయభ్యనుజ్ఞ
ననుమతింపుము సాహాయ్య మాచరింపు
రాజు నడపింప కెట్లు ధర్మంబు నడచు? 31

తే. అకట! విశ్వేశ్వరుఁడు లేమి ననదవోలె
నున్నయది కాశికాపురి యోనృపాల!
యున్న వేల్పులు రాకుండ నున్నఁగాని
వామదేవుని రప్పింపవలెఁ జు మయ్య! 32

వ. అని [1]మైవాకగా నాడి యర్ధాంగికారంబు వడసి ధాత దశాశ్వమేధయాగంబులు సుప్రయోగంబులుగా నాహరించి బ్రహ్మేశ్వరదేవుఁ బ్రతిష్ఠించె. భాగీరథీపశ్చిమతీరంబున నంతర్గేహంబు దక్షిణద్వారంబున దశాశ్వమేధంబు సర్వతీర్థోత్తమంబు. 33

తే. ధాత గాశీపురంబునఁ దడయుటయును
నుల్లమునయందుఁ గోపింపకుండె శివుఁడు
రాజమౌళికి మూర్త్యంతరంబు గాదె
గణనసేయంగ నానందకాననంబు?

## ఈశ్వరుండు ప్రమథులం గాశి కంపుట

వ. అపుడు గౌరీకాంతుండు నిజాంతర్గతంబున 'యోగినీబృం

1. 'మైపోక గా నాడి' అని పా.

నంబు మసలె, వివస్వంతుండు వెనుక మఱచె, నంభోజసం
భవుండును గదలనికంబం బయ్యె, నీకం బరమవిశ్వాసనిధు
లగు ప్రమథులం బంచెదంగాక!' యని బహుమానపురస్సరం
బుగా నొక్కతోయంబున శంకుకర్ణమహాకర్ణులను, నొక్కవగ
ఘంటాకర్ణమహాకాళులను, నొక్కకెడ సోమనందినందిషేణ
కాళపింగళకుక్కుటులను, నొక్కవర్గంబునఁ గుండోదర
మయూరబాణగోకర్ణులను, నొక్క మొత్తంబునం దిల
కర్ణసూలకర్ణద్రుమ చండప్రభామయసుకేశచ్ఛాగ కపర్దిపింగ
లాక్ష వీరభద్రకిరాత చతుర్ముఖ నికుంభ పంచాక్షభారభూ
తత్ర్యక్షక్షేమకవిరాధసుముఖాదిపాషండులనుం బంచిన. 35

తే. భర్తపని పూని నిజముగాఁ బ్రతిన వట్టి
పోదు రానందకాననంబునకుఁ బోయి
[1]మోహమాహాత్మ్య మెట్టిదో మునివరేణ్య?
ప్రమథు లప్పుడ మఱతురు భవునియాజ్ఞ. 36

శా. సేమం బొప్పఁగఁ గాశికానగరికి న్విశ్వేశ్వరాజ్ఞామహా
సామర్థ్యంబు జటాకిరీటములపై సంధించి ము న్పోయి త
త్సీమాంతంబున నంతయున్మఱచి యాసిద్ధుల్ శివార్చారతిఁ
స్వామిద్రోహమువాపికొంద్రచట మెచ్చన్విచ్ఛిదజ్ఞానమున్.

వ. అందుఁ గపర్ది యను ప్రమథుఁడు ప్రతిష్ఠించినపర్దీశ్వరలిం
గంబుప్రభావం బుపన్యసించెద నాకర్ణింపుము. 38

కపర్దీశ్వరప్రభావకథనము

సీ. కాశి కుత్తరదిక్ప్రదేశంబునం దుండు
విమలోదకం బనుకమలసరసి

1 'నరవరేణ్యని మోహమాహాత్మ్యఘనను' అని వ్రాఁతప్రతి.

యాబావి తేటనీ రాస్వదించిన నందుఁ
దీర్థమాడినఁ బిత్ృదేవతాళి
కతిభక్తిఁ దర్పణం బాచరించిన మర్త్యుఁ
డఘకోటిఁ దున్మి తూటాడుఁ జాలు
నీయర్థమున కొక్కయితిహాస మే నీకుఁ
జెప్పెద దృఢభక్తిఁ జిత్తగింపు

తే. మాదిఁ ద్రేతాయుగంబునయం దొకండు
హరునిభక్తుఁడు వాల్మీకి యనఁగఁ గలఁడు
వాఁడు హేమంతఋతుకాలవాసరములఁ
దివిరి యక్కుండమునయందుఁ దీర్థ మాడు. 39

వ. ఒక్కనాఁడు మధ్యాహ్నవేళ నవ్వాల్మీకి విమలోదకుండం బునం గ్రుంకువెట్టి యనంతరంబ యాపాదమస్తకంబుగా భస్మోద్ధూళనంబు సేసి రుద్రాక్షమాలికలు ధరించి కపర్దీశ్వరమహాదేవుసమ్ముఖంబునం బంచాక్షరీ పంచబ్రహ్మాశత రుద్రాద్యాదిమంత్రంబుల ధుళిపమత ప్రతిమతలంబకరాసకాదుల నేలాకర రేంకి(తేంక)వర్తన్యాదులును సూతశుద్ధసూళ భేదం బులు నెడనెడఝంఝుం టంటం ప్రధాననానాస్తోభాక్షరంబులు సరిగమాదిస్వరంబులు దివ్యస్తుతిపదంబులు త్రిపురవిజయ దక్షాధ్వరధ్వంసాదిబిరుదంబులు శంఖమురజాది వాద్యంబులు ధేవంబులు సంఘటించి విస్ఫురితాందోళితంబులు ద్రిభిన్నాది గమనభేదంబులతోడ నయ్యయిప్రయోగంబుల నాహత ప్రత్యాహతంబులు పుట్టించుచుఁ, జంచత్పుటచాచపుట షట్పితాపుట(త్ర)సరద్వేష్ట కోద్ఘట్టితాదితాళంబుల ఘంటీ రవశంకరాభరణాది (గ్రామంబులను) రాగరాగాంగభాషాంగ

క్రియాంగోపాంగాది దేశిరాగంబులను సంఘటించి దత్తిలకో హాళభరతమతంగ నందికేశ్వరాదిమతానుసారంబున వివిధ ప్రబంధముల నిర్మించి వానికి బహువిధస్థానకమండలచారి (కా)చరణాంగహార రేచకధవళకనతనాదిశిరో భావచతుర్భావ చాలనంబులు మెఱయ దేశీమార్గలాస్యతాండవంబులుపరిఢ వించుచు, నిట్లు తాన తూర్యత్రయంబు ననుసంధించుచుఁ గొంత దవ్వవ్విరూపాక్షునిఁ జాక్షుషం బైన యోగంబున యజించుచుండె. అయ్యవసరంబున. 40

సీ. ఘ్రాణంబు నీచమై కన్నులు పల్లనై
యుదరంబు వీఁపుతో నొత్తగిల్లఁ
జేదోయి గుఱుచ యై చెవులు విల్వంక లై
పూసబొమ్ముకములు బోటుకట్ట
వక్షంబు గుంత యై వర్త(ర్ణ)ంబు పరుస నై
తెఱనోరఁ ద్రేవ్రుఁడు తీఁగె సాఁగ
శీర్షంబు వలుద యై చెక్కిళ్లు లోఁతు లై
ముష్కద్వయీశిశ్నములు గృశించి

తే. యస్థిచర్మావశేషావయమ్ములమర
జుజురుకొన్న తనూరుహస్తోమములను
బొలసుకంపున భీభత్స వోఁడమఁ జేయఁ
గట్టెదుర వచ్చి నిలిచె రాక్షసుఁ డొకండు. 41

వ. ఇట్లు బహిరంగంబున రాక్షసుం జూచి వాల్మీకి పంచాక్షరా ఘోరపాశుపత మంత్రాభ్యాసనావశంబునం బుట్టినదిట్ట తనంబునం దెరలకనిలిచి, యోరీయెవ్వఁడ? వెటనుండి వచ్చితి? వెచ్చోటికి కేఁగెదవు? దృష్టిపథంబున నిలిచిన పిశాచభూత

బేతాళకూశ్మాండప్రేతనికరం(రంకం)బులలో నొక్కరుండవు
గావలయు, నేము తపస్వులము, శివనామజాపకులము,
మంత్రస్థులము, భస్మోద్ధూళనవర్మధారులము, దుద్రాక్ష
మాలికాకవచవజ్రపంజరమధ్యస్థితులము, మముఁబోంట్ల నీకు
వెఱపింపంబనిలేదు; చేర రాకు మల్లంతనయుండు మనినం
గృతాంజలి యై యాభూతం బమ్మహీసురున కి ట్లనియె. 42

తే. ధాత్రి గోదావరీసింధుతటమునందుఁ
ప్రథిత మైనప్రతిష్ఠానపట్టణమున
నగ్రజన్ముండ దుష్టప్రతిగ్రహముల
కారణంబుగ బ్రహ్మరాక్షసుఁడ నైతి. 43

తే. ఎండ నెండితి మంచున నివము కొంటి
వానఁ దడిసితి మంచున వడఁకు చుంటి
గాలిఁ దూలితి నశనంబు కాన నైతి
డప్పిఁ గుందితి డస్సి దట్టంబ నైతి. 44

వ. ఇవ్విధంబునఁ బెద్దకాలంబు కుతిలపడి యాచారవిరహితుం
డైన యొక్కపురుషునాశ్రయించువాఁడనై నిరాధారంబునఁ
జరించుచు నొక్కనాఁడు. 45

సీ. మాటలాడుచు మూత్రమలము లుత్సారించు
మిహిరోదయమ్మున మేలుకొనఁడు
సంధ్య వార్వఁడు మంత్రజపసంయుతంబుగ
విడికచ్చతో నుండు విడువ కెపుడు
బ్రహ్మసూత్రము ధరింపఁగ సిగ్గు వహియించుఁ
జల్దియోగిరము నిచ్చలు భుజించు

ఋతువేళలఁ బరిగ్రహింపఁడు నిజభార్య
నన్యకళత్రంబు నభిలషించు
తే. నెవ్వఁ డవ్విప్రదాయాదుఁ డేగుదెంచె
మార్గవశమున భాగ్యసామగ్రికలిమి
నాశ్రయించితి నతని మధ్యాహ్నవేళఁ
బ్రాంతదేశంబునం దొక్కరావి నుండి. 46

వ. అతం డిప్పు డర్థార్జనంబునకు నిక్కాశికాపురికిం జనుదెంచె. పుణ్యక్షేత్రప్రభావంబునం బరాభూతుండనై బహిర్భాగం బునన యున్నవాఁడ. ఇంక నేమిసేయుదు? ఆధార భూతం బైన యతనిం గోలుపోయితి. ఎచ్చోటనుండియేనియు నేతెంచి కాశికాపురిరక్షకులు నన్ను బాధపెట్టుదురోయని భీతి యయ్యెడు. నిన్ను శరణంబు వేఁడెద. మహాత్మా! రక్షిం పవే! యనినం గృపావశంవదుండై యవ్వాల్మీకి కక్షపాలం బులోని విభూతి హస్తంబున ధరియించి డగ్గరం జని పంచా క్షరీ మంత్రంబున నభిమంత్రించి లలాటంబున రక్షాతిలకంబు లిఖించి 'కాశికానగరంబు ప్రవేశింపుము, మద్విభూతిధారణ మహిమంబున నిన్ను భైరవాదులు భర్జింపనోడుదురు. కప ర్దీశ్వరదేవు దర్శింపుము. అద్దేవుండు నీకు నరిష్టనిరసనంబును, నిష్టావాప్తియుం జేయు' ననిన మహాప్రసాదం బని యతం డట్ల చేసి ముక్తుం డయ్యె. ఇది కపర్దీశ్వరమాహాత్మ్యంబు.

క. అందఱు పారిషదులు నీ
చందంబున శంభులింగసంస్థాపన మా
నందవనీనగరంబున
యం దొనరించిరి యతిప్రయత్నంబులతోన్. 48

తే. కలశసంభవ! విశ్వేశకులగృహంబు
కటకసాధారణంబె? శ్రీకాశినగర
మిందురేఖావతంసు మోహింపఁ జేయఁ
జాలు నఁట! దానిమహిమ గోచరమె పొగడ? 49

ఉ. కీటపతంగసర్ప పశుకీటమృగాది సమస్తజంతుసం
ఘాట మఖండనిద్రకయి కాశికఁ గన్నులు మోడ్చ నంతలో
నైటభజిద్విరించిబలఘస్మరముఖ్యసమస్తదేవతా
కోటికిరీటకూటములఁగూర్చు నమస్కరణాప్తహ్లాంజలుల్. 50

క. ఏనాఁటనుండి వచ్చియు
మానవు లెఱ్ఱోఁ యింద్రు ముక్తి మైత్రావరుణీ!
యానందకాననంబున
నానాకైవల్యశోభనము లనుఫలముల్. 51

తే. మరణ మానందవనములో మంగళంబు
భూతి కాశీపురంబులో భూషణంబు
గోఁచి యవిముక్తమునయందుఁ గుంభజన్మ!
పరమనిర్వాణజనులకుఁ బట్టుచేల. 52

వ. కుంభసంభవా! దశాశ్వమేధతీర్థంబున దశహరాఖ్యతటినీ దశాశ్వమేధేశ్వరుల దర్శించి మానవుండు దశజన్మార్జితంబులైనపాపంబుల దహించు శంకుకర్ణేశ్వరు శశాంకకళాలంకారు, మహాకర్ణేశ్వరు దృక్కర్ణకుండలు, ఘంటాకర్ణేశ్వరు ముక్కంటి, మహాకాళేశ్వరుఁ గాలగళు, హిమనందీశ్వరు నందివాహను, నందిషేణేశ్వరుం గందర్పదమనుఁ, గాలపింగళేశ్వరు గంగామౌళిఁ, గుక్కుటేశ్వరు లలాటాక్షుఁ, గుండోదరేశ్వరుఁ బాండురాంగు, మయూరేశ్వరు నారాయణ

ప్రియుఁ, బాణేశ్వరుఁ బినాకపాణిఁ, జలకర్ణేశ్వరుఁ జతుర్ని గమమౌళిరత్నంబు, స్థూలకర్ణేశ్వరుఁ గరుణాపూర్ణహృద యు, ద్రుమిచండేశ్వరు సంధ్యాతాండవప్రియుఁ, బ్రభామ యేశ్వరుఁ ద్రిభువనాధిపతి, సుకేశేశ్వరు నాకాశకేశుం గొలిచి మర్త్యుండు కార్తార్థ్యంబు నొందు. కపర్దికిం దద్దిగ్భాగంబునఁ బింగళాక్షీశ్వరు, నవిముక్తేశ్వరునకుఁ బశ్చాద్భాగంబున వీర భద్రేశ్వరుఁ, గేదారేశ్వరు దక్షిణభాగంబునం గిరాతేశ్వరు, వృద్ధకాలేశ్వరుసన్నిధిం జతుర్ముఖేశ్వరు, విశ్వేశ్వర శ్రీమన్మ హాదేవుదక్షిణంబునం బంచాక్షేశ్వరు, నంతర్గృహోత్తర భాగంబున భారభూతేశ్వరుం, ద్రిలోచనేశ్వరుపురోభాగం బునఁ ద్ర్యక్షేశ్వరు, విశ్వేశ్వరోత్తరభాగంబున లాంగలే శ్వరు, భజింపఁబంచజనుండు పంచమహాపాతకంబుల భం జించు. ఇవ్విధంబునం బ్రమథులు లింగప్రతిష్ఠ లాచరించి, లిం గార్చనాపరులయి వారాణసీపురంబునం బ్రతివసించుటయు.

క. చింతించె విశ్వనాథుం
డంతరగకరణమున నేయుపాయంబున నేఁ
గాంతునొకో కాశీపు
ర్యాంతం బని మందరాచలాగ్రస్థితుఁ డై. 54

సీ. ఏమి సేయుదునో యోగినీమండలం బిప్డు
కాశికాకటకశృంగాటకముల?
నానందకాననాభ్యంతరంబునయందు
బిసరుహాప్తుండేల మసలె నొకో?
వారాణసీపురావాససౌఖ్యంబుల
మరగి వాక్పతి మమ్ము మఱచె నొకో?

గణనాయకులు శంకుకర్ణాదు లవిముక్త
మండలిఁ గాఁపురం బుండి రొక్కొ ?

తే. యొక్క మతమున వీరందు నునికి మేలు
భేదమున నన్యరాజ్యలక్ష్మికిఁ బెనంగు
నాకు నాయంతవారి నన్పంగఁ గలిగెఁ
దడసి కార్యంబుఁ గొనుట హితంబు కాదె ?. 55

తే. ఊరకుండంగ నేటికి ? వారణాస్యఁ
గాశి కనిచెద వృత్తాంతగతులు దెలియ
బుద్ధిమంతుండు పోకలఁ బోవనేర్చు
కూర్చ విప్పంగ నోపు నాకొడుకుఁగుఱ్ఱ. 56

వినాయకుండు గాశి కేగుట

వ. అని వినాయకు రావించి బుద్ధు లానతిచ్చి పంచినం బని
పూని కాశికానగరంబున కరిగి. 57

సీ. గంధర్వనగరరేఖలు మేఘపథమునఁ
జేకొండుందులు వేశ్మసీమలందు
నమరకోదండఖండము నట్టనడు రేయి
ధూమకేతువు జలస్వామికాష్ఠఁ
గర మరిష్టము లైన కలలు నిద్రలయందుఁ
గాఁపున్న యిండ్ల శృంగములపులుఁగు
గంధర్వసమితితోఁ గల నగ్నికణములు
పురవీథికామధ్యమున వఱల్లు

తే. బాష్పసలిలంబు దేవతాప్రతిమలందుఁ
గలుగఁజేయుచుఁ బ్రజల కాకస్మికంబు

వెఱపు పుట్టించు నందంద విఘ్నరాజు
ప్రతిదినంబును గాశికాపట్టణమున. 58

తే. తాన యుత్పాతములు మూడుఁ దరతరంబ
తాన విధియించుచుండు నుత్పాతశాంతి
తాన హితమాచరించు మిత్రంబ పోలెఁ
దాన వెఱపించుచుండు దుర్దశలు చెప్పి. 59

సీ. కలలోనఁ బుట్టినకథ లెన్ని యన్నియుఁ
బూసగ్రుచ్చినయట్టు పోసఁగఁ జెప్పు
హస్తరేఖలు చూచి యాయుష్యమును భవి
ష్యము తేట తెలివిగా నానతిచ్చుఁ
గూతుఁ బిడ్డలు నీకుఁ గొడుకు బిడ్డలు నీకు
నని మోము సూచి సత్యంబు నుడువుఁ
దాతగా రనువావిఁ దనవారితన మొప్పు
గురుసు మోపక నొండు సరసమాడు

తే. వ్రతము నోమించు దివసవారములు నొడువు
ననుగలంబైన భామినీజనులయెడను
గుండబొజ్జయు శిఖయును గుఱుచ పొడవు
వ్రేలిదర్భాంకురము లొప్పు విఘ్నరాజు. 60

ఉ. ఏనిక మోముబూమియవహించి చరించుచునుండు కామధు
గ్ధేనువు డుంఠి కాశి నిది తెల్లము వేలుపుగిడ్డి గానినాఁ
డీనునె మోక్షతర్ణకము? నిచ్చునె కాంక్షిత దుగ్ధధార దూ
ర్వానవపల్లవావలులు వైచినమాత్రన భక్తకోటికిన్? 61

వ. ఇవ్విధంబున దివ్యాంతరిక్షభౌమోత్పాతంబులు పుట్టించి
నానాప్రకారంబులఁ జరించుచుం గాశీపట్టణంబున కచిర

కాలంబునం దరిష్టంబు ప్రాపింపంగల దనువార్త మ్రోయించి
హితుండునుం బోలె లోలోన బోధించి పౌరజనంబులం
గొందఱం గుటుంబసహితంబుగా వెలార్చి, యంతం బోవక
యంతఃపురంబులు మాయాబలంబునం బ్రవేశించి, రాజ
శుద్ధాంత కాంతలకు విస్రంభభాజనంబై జితేంద్రియుం డను
ష్ఠానపరుండు శమదమాదిగుణగరిష్ఠుండు సత్యసంధుండు
నిస్స్పృహుండని తన్ను సర్వజనులు సంస్తుతించునట్లుగా ఢుంఠి
భట్టారకుం డను నామంబున మెలంగి, లీలావతి యను పట్టపు
దేవిముఖంబున దివోదాసుం గాంచి యతం డడిగిన ప్రశ్నంబు
లకు సదుత్తరంబు లిచ్చి మెచ్చువడసి, యతని పురోహితు
లలో నొక్కరుండయి వర్తించుచుండె నంత నొక్కనాఁడు.

ఉ. వారక కాశియందు నలువంకలఁ బుట్టెడు దుర్నిమిత్తముల్
పౌరులు విన్నవింప నరపాలుఁడు విస్మయమంది తత్ప్రతీ
కారము నాచరించుటకుఁ గా హితచింతకు నాప్తు ఢుంఠిభ
ట్టారకుఁ బిల్వఁబంచి నికటంబుననుండి ప్రియంబెలర్పఁగాన్. 63

తే. చెప్పుమా ఢుంఠిభట్ట! కాశీపురమునఁ
బుట్టుచున్నవి యుత్పాతములు దలఁచఁగఁ
గారణం బెద్ది దీనికిఁ? గలుష మెట్లు
వాటిలెనొ? ధర్మ మేవంకఁ బల్లటిలెనొ? 64

వ. అని యడిగిన నతం డిట్లనియె. 65

తే పార్థివోత్తమ! యుష్మహోత్పాతములకు
శాంతిఁ గావింతు మంత్రరక్షాబలమున
నాకుఁ జూడంగఁ గాశికానగరి విడిచి
యుండఁ దగుఁ గొన్నినాళ్లు నీ వొక్కవంక. 66

శా. ఆత్మార్థంబు ధనంబు ధాన్యమును నాత్మార్థంబు పశ్వాదికం
బాత్మార్థంబుహితాప్తబంధుజనమాత్మార్థంబు గేహోచ్ఛ్రియం
బాత్మార్థంబు పరిత్యజింపఁ దగు రాజ్యంబైన నప్పంద మై
'యాత్మార్థంపృథివీంత్యజే' త్తనెడువాక్యం బశ్రుతంబే నృపా!

వ. అని చెప్పి యింకనుం బెద్దలతోడ విచారించునది. ఏను ద్రికాలజ్ఞుండ. నేఁటికిఁ బదునెనిమిదియగుదినంబునకు నుత్తర దేశంబుననుండి యొక్క బ్రాహ్మణుండు రాగలం డతండు నీకు హితోపదేశంబు సేయంగలండు. తద్వాక్యంబులు ప్రమాణీకరించునది యని డుంఠిభట్టారకుండు నిజనివాసంబున కరిగె నంత నక్కడ. 68

—◉ శివుండు విష్ణునిఁ గాశి కనుచుట ◉—

క. అరవిందాక్షునిఁ గనుఁగొని
హరుఁడును గాశీప్రవృత్తి యారయఁ బంచెన్
గరివదనుండును నీవును
బరికింపఁగ నేకకార్యపరు లై యనుచున్. 69

క. పనివూని కాశికిం జని
వనరుహలోచనుఁడు వెడఁదవాలికకన్నుల్
తనకుఁ గలఫలముఁ గాంచెన్
బనివడి తద్విభవలక్ష్మిఁ బరికించునెడన్. 70

వ. గంగావరణాసంగమంబునం బాణిచరణతలంబులు ప్రక్షాళించి యవగాహనంబు చేసె. అదికారణంబుగా నత్తీర్థంబు పాదోదకతీర్థంబు నాఁ బరఁగె. కృతకాలోచితక్రియాకలాపుం డై పుండరీకాక్షుండు. 71

తే. త్రిపురకాంతలశీలంబు లపహరింప
బుద్ధవేషంబు గైకొన్న పోకులాఁడు
జలజనాభుండు సుగతవేషము ధరించెఁ
గాశికాప్రజలకుధర్మగతి హరింప. 72

వ. పుణ్యకీర్తినామంబు వహించి తనమూలభృత్యుం డైనగరు
త్మంతునకు వినయకీర్తి యనుపేరు వెట్టి యతని శిష్యుంగాఁబరి
గ్రహించి, లక్ష్మిం బరివ్రాజికం గావించి యమ్మహాదేవికి విజ్ఞాన
కౌముది యనునామధేయంబు గల్పించి, తానుశిష్యుండును
నొక్కముఖంబున బురుషులం బ్రమోహింపను గమలయొక్క
తియు నొక్కముఖంబున బురంధ్రీజనంబులం బ్రలోభింపను
సంకేతంబుగా నేసి వేలువేలుమార్గంబులం గాశికాపురంబుఁ
బ్రవేశించి. 73

విష్ణువు మాయావేషంబున గాశియందు బౌద్ధధర్మంబు స్థాపించుట

తే. పటమునందు నాగరలిపి ప్రస్ఫుటముగ
వరమషీతూలికాలేఖ వ్రాసినట్టి
యర్హతాగమగ్రంథ మత్యాదరమున
*జట్టు పఠియింప బోధించు సద్గురుండు. 74

* ఇటుచ 'సరసఁ బఠియింప' అని పూర్వపూర్వతర ముద్రితపుస్తకముల పాఠము. ఆంధ్రసాహిత్యపరిషత్తులో లభించిన తాళపత్రపుస్తకమునందును మఱికొన్ని వ్రాతపుస్తకములందును 'జట్టు' అనియే కనఁబడుచున్నది. ఈపద మె యిచటఁ బొంకముగఁ గుదిరి యున్నది. ఈపదము తప్పను నభిప్రాయ మునం గాబోలు 'సరస' అని దిద్దిరి. శబ్దరత్నాకరములో 'జట్టు=జనసమూ హము. (ఇది విచార్యము)' అని వ్రాసియున్నారు. ముద్రితపుస్తకమున నీ పదము మార్పఁబడినందునఁ బ్రయోగము లభింపక యట్లు వ్రాసియుండురని తోఁచుచున్నది.

తే. తత్త్వదృష్టి ననాదిసిద్ధంబు భవము
భవముఁ బుట్టింప నడఁగింపఁ బ్రభుఁడు లేఁడు
దనకుఁ దా నుద్భవం బొందుఁ దనకుఁ దాన
విలయముల బొందు భవ మిది వినయకీర్తి ! 75

తే. బ్రహ్మవిష్ణురుద్రాదుల బ్రదుకు లెల్లఁ
బట్టిచూడంగ మనబోంట్ల బ్రతుకులట్ల
యనఘ! వారి దేహంబులు నస్మదాది
దేహములఁ బోలెఁ గాలంబు తినును గాన. 76

క. భద్రగుణా! యాహారము
నిద్రాభయమైథునములు నిఖల మగుతనూ
భృద్రాజికి సాధారణ
ముద్రలు మఱి తారతమ్యములపను లేలా! 77

సీ. హంసతూలికపాన్పునందు రానేలను
శయనించువారికి సరియె నిద్ర
మెఱుఁగుదీఁగలఁ బోలుమెలఁత లెందఱు గల్గి
నప్పుడు నొక్కతొయ్యలియ రతికి
డప్పికి నీరు వంటక మాఁకలికి నశేష
జంతుసంతతి కాత్మశక్తికొలఁది
యాకీట మాకైటభాసురాంతక మెల్ల
ప్రాణకోటికిఁ బ్రాణభయము సమము

తే. గానఁ దమయట్ల యెదిరినికాన్పు గాన్పు
జీవులకుఁ దారతమ్యంబు సెప్ప వలదు
సర్వభూతములందును సమత మేలు
కరుణ చేపట్టవలయుఁ గాఁ గాదు హింస. 78

తే. చెదలు నీర్పేను మశకంబు చీమ నల్లి
యల్ప మనుబుద్ధి హింస సేయంగ వలదు
వానిహృదయంబులం దున్న వాఁడు జీవుఁ
డాతఁ డల్పుండె యితరజీవాత్మకం బె? 79

వ. సుఖంబ స్వర్గంబు. దుఃఖంబ నరకంబు. శరీరత్యాగంబు
మోక్షంబు. [యం

మ. అహహా! వేదము దాన చెప్పును 'నహింస్యాత్సర్వభూతాని'
చహహా! తానక దా క్రతుక్రియలఁ బశ్వాలంభముల్ మేదినీ
రుహవిచ్ఛేదముఁ జేయఁ జెప్పు! నదియుం ద్రోహంబు కాదో కదా!
బహుభాషల్దిరుగంగ నాడుటలునుం బ్రామాణికత్వంబు లే?

వ. అహింస పరమధర్మంబు. హింస నరకభీరువులైన నరులు
పరిత్యజించునది. హింసకుండు నరకంబునకు నహింసకుండు
స్వర్గంబునకుం జను. దానంబు లనేకంబులు గలుగ నవియు
నభిమతదానంబును బోల నేరవు. పరమపురుషులును నానా
శాస్త్రసిద్ధాంతంబు లాలోకించి భీతున కభయదానంబును,
వ్యాధితునకౌషధదానంబును, శుశ్రూషకునకు విద్యాదానం
బును, నాఁకొన్నవారి కన్నదానంబును దానంబులలో నెల్లం
బ్రశస్తదానంబు లని చెప్పుదురు. మణిమంత్రౌషధప్రభావంబు
లచింత్యంబులు. ప్రయత్నంబునం దద్విద్యాభ్యాసం బాచరిం
చునది. పరిపూజ్యంబులు ద్వాదశాయతనంబులు. అవి
యెయ్యవియం టేని, కర్మేంద్రియజ్ఞానేంద్రియపంచకంబులును
మనోబుద్ధులును. అవి హేతుదృష్టాంతంబులం బ్రమాణ
ప్రమేయాదిషోడశపదార్థవాదు లగు నైయాయికులను,
ద్రవ్యగుణాదిషట్పదార్థవాదు లగు వైశేషికులను, నవ్యక్త

మహదహంకృతి చతుర్వింశతి తత్త్వవాదు లగుసాంఖ్యులను, శివశక్తిసదాశివేశ్వర విద్యాతత్త్వప్రభృతి షట్త్రింశత్తత్త్వవాదు లగుశైవుల నవలంబించుచుఁ బ్రత్యక్షానుమానోపమానార్థాపత్తి జ్ఞానంబులయందు నింద్రియార్థసన్నికర్షోత్పన్నంబై యవ్యభిచారియు వ్యవసాయాత్మకంబు నగుజ్ఞానంబు ప్రత్యక్షంబని ప్రత్యక్షజ్ఞానంబు సర్వజనులకుం దేటతెల్లంబు గావునఁ బ్రత్యక్షం బవలంబించి యుండునది యని యెల్లవారికిఁ దమతమధర్మంబులు విడిచి సుగతధర్మంబు చేపట్టునట్లుగాఁ బుణ్యకీర్తినామధేయుం డగుమధుసూదనుండు వినయకీర్తినామధేయుం డగుశిష్యు గరుత్మంతు బోధించుచుండె; నంత వేఱొక్కయెడ విజ్ఞానకౌముది యనుపేరు వహించి పరివ్రాజికావేషధారిణి యగు విషధికన్య యుపన్యాసచాతుర్యం బొప్ప మాధుర్య గుణధుర్యం బుల మధుసమయ మంథర గంధసార గిరిగంధవాహ ప్రవాహలహరికాస్ఫాలనానందకందళితమాకందఘుసృణకిసలయరసాస్వాద (న) కషాయకంఠకలకంఠకామినీకోమలకుహూయమాన కోలాహలపంచమంబు ననుకరించు తిన్ననియెలుంగున. 82

సీ. బ్రహ్మ మానందరూపం బంట తథ్యంబు
నానాత్మపరికల్పనంబు మిథ్య
ముదిమి నింద్రియశక్తి మొఱవపో కుండంగ
మైథునక్రీడ యేమఱమి యుఱవు
సౌఖ్యార్థి యైన యాచకుని కిచ్చుట పాడి
పంచభూతాత్మక ప్రకృతి తనువు

యౌవనంబులు పోయెనా రావు క్రమ్మఱ
సపరిక్షయమ్ములు సంచయములు

తే. గడచినప్పుడు క్రియము లొండెఁ గాకు లొండెఁ
గుక్క లొండేనియును భుక్తిఁ గొనెడు దేహ
మొకఁడు ప్రార్థించి నప్పుడ యొసఁగవలదె!
తన్ను నిచ్చుటయది గదా దానగుణము. 83

వ. వావి వర్ణంబు విచారింప వలదు. వృద్ధాచారంబు విచారించి చూచిన బ్రహ్మపుత్రులు గదా దక్షుండును మరీచియు. మరీచినందనుం డైనకశ్యపుండు ధర్మమార్గంబునం దక్షుని కన్యకలఁ బదుమువ్వుర నెట్టు వివాహంబయ్యె? ఇదానీం తనులు మర్త్యు లల్పబుద్ధు లల్పపరాక్రములు గావున నిది గమ్య యిది యగమ్య యని విచారంబు సేయుచున్నవారు. పరమపురుషునిముఖబాహూరుపాదంబులం జాతుర్వర్ణ్యంబు జన్మించె. ఒక్కతనువునందుఁ బుట్టిన నలువు రేకోదరు లౌదురో కారో? అట్టివారికి భిన్నవర్ణత్వం బెట్టు సిద్ధించుచున్నయది? కావున వర్ణావర్ణవివేకంబు విడిచి వలసినట్టు పురంధ్రీపురుషులు విహరించునది యని పెక్కు ప్రకారంబులవిజ్ఞానకౌముదిసౌగతశాస్త్రంబు వక్కాణింప విని పురాంగనలు భర్తృశుశ్రూషావిధర్మంబు లుజ్జగించి రయ్యవసరంబున. 84

చ. వననిధికన్యయున్ హరియు వాడలవాడలబౌద్ధధర్మముల్
జినమతముల్ నిరంతరముఁ జెప్పఁగఁ జెప్పఁగఁ గాశికాపురిన్
వనితలధర్మముల్ విడిచి తామరసాయతలోచనాజనం
బును పురుషవ్రతానమును బూనెను బుద్ధజినవ్రతంబులన్.

తే. వర్ణములు నాశ్రమంబులు వరుసఁ దప్పె
వేదవేదాంగశాస్త్రముల్ విన్నఁబోయె
*నా(సారజ)ంబులు కృష్ణపద్మములుఁ జెడియె
వృద్ధిఁ బొందె నధర్మంబు విశ్వమునను. 86

దివోదాసనిర్యాణము

వ. అప్పుడు దివోదాసుండు ఢుంఠిభట్టారకుండు సెప్పిన విప్రుం డెప్పుడు వచ్చునోయని దివసంబులు లెక్కవెట్టుకొనుచుండం బదునెనిమిదవదివసంబున మధ్యాహ్నకాలంబునందు సుగత వేషధారి యగుమధుసూదనుండు బ్రాహ్మణవేషంబు దాల్చి యేతెంచి సముచితప్రకారంబున దివోదాసుం గాంచి యాశీర్వదించి యతం డనుప సమున్నతకనకాసనంబునఁ గూర్చుండె. ఆవేళ విఘ్నేశ్వరుండు రాజహృదయంబునందు నావేశరూపంబున నధివసించె. వినాయకాధిష్ఠితుండై భూపతి వైరాగ్యంబు వహించి కపటబ్రాహ్మణున కిట్లనియె. 87

ఆ. బడలుపడితి రాజ్యభారంబు భరియించి
పొడమె మది విరక్తి భూసురవ్ర!
ఏమి సేయువాఁడ! నెక్కడ కేగుదు?
నేమి దిక్కు? నాకు నెఱుఁగఁ జెప్పు. 88

వ. తపస్సామర్థ్యంబునం బద్మనాభాగ్న్యనిలాత్మకుండ నైతి. ప్రజ లౌరసు లైనపుత్రులుం బోలెఁ బరిపాలింపంబడిరి. దేవతలం దృణీకరించిన యొక్కయపరాధంబునుం దక్క నాయందు గానవచ్చినయపకారం బొండు లేదు. నాభాగ్యంబున నీవు హితోపదేశంబు సేయ నాచార్యుండునుం బోలె నేగు దెంచితి. ఇంతకాలంబు నారాజ్యంబున సకాలమరణంబును

* శైవపక్షంబు కృష్ణపక్షంబు చెడియె.

జరావ్యాధిదారిద్ర్యంబులు లేవు. ఇప్పు డేమికారణంబుననో యవియును దివ్యాంతరిక్షభౌమోత్పాతంబులు పుట్టుచున్న యవి. నాకుం జూడ వేల్పులవేడబంబ కావలయు. మృత్యుంజయుండు త్రిపురవిజయంబును, నారాయణుండు బలిధ్వంసనంబును బురందరుండు వృత్రాసురవధంబును మాయాబలంబున నొనర్చిరి. బలవద్విరోధంబు దుస్తరంబగుట యిప్పు డెఱుంగంబడియె. ఇన్నియు నట్లుండనిమ్ము. ఏనును బదివేలేండ్లు రాజ్యంబు సేసితి. జరాభరాక్రాంతుండనైతి. ఇంద్రియంబు లుపరతింబొందుచున్నయవి. ఇంక సకలకర్మనిర్మూలనక్షమం బైనమోక్షం బపేక్షింపవలసియుండు. అమ్మహాపదార్థంబు నా కేయుపాయంబున సిద్ధించు నాయుపాయంబానతీ మ్మనిన విని బ్రాహ్మణవేషధారి యగుహృషీకేశుం డమ్మహీవరున కి ట్లనియె. 89

తే. కాశికాపట్టణమున లింగప్రతిష్ఠ
యాచరింపుము కల్పింపు హర్మ్యరేఖ
బొందితోడన కైలాసమున కరిగెద
వనఘ! నామాట వేదతుల్యంబు సూవె! 90

తే. పుత్రుఁ బట్టంబు గట్టుము బుద్ధి చెప్పు
మాతనికి దేవతాభక్తి యతిశయముగఁ
దనయసంక్రాంతసామ్రాజ్యతంత్రుఁ డగుచు
వనమునకు నేగఁ దగు రాజు వార్ధకమున. 91

వ. అని బుద్ధిసెప్పి బ్రాహ్మణుం డెక్కడి కేనియుం బోయె. దివోదాసుండును నమాత్యుల, మండలేశ్వరుల, నధ్యక్షులం, బురోహితులం, బ్రతిహారుల, ఋత్విజుల, గణకుల, నంతగపుర

జనంబుల రావించి కుమారు సమరంజయు నందఱికి నప్ప
గించి యతనికిం బట్టాభిషేకంబు నేసి కాశికానగరంబునందు
ధనసర్వశ్రీసమృద్ధియు వెచ్చించి మహాప్రాసాదంబు నిర్మించి
యందు శివలింగంబుఁ బ్రతిష్ఠించి కింకిణీజాలమండితం బైన
దివ్యవిమానం బెక్కి శరీరంబుతోడన శివలోకంబునకుం
జనియె. ఆప్రాసాదంబు సర్వశ్రీసమృద్ధివినియోగనిర్మితంబు
గావున భూపాలశ్రీ యనం బ్రసిద్ధిఁగాంచె. దివోదాసేశ్వర
లింగంబు భాగీరథీతీరంబున భజించువారికి భుక్తిముక్తి
ప్రదాయకం బయి ప్రకాశించె. ఇది దివోదాసవృత్తాం
తంబు. ఈయుపాఖ్యానంబు విన్నను బఠించిన లిఖించిన
జనుల కాయురారోగ్యైశ్వర్యాభివృద్ధి యగు నని చెప్పి
కుమారుండు వెండియు కుంభసంభవున కిట్లనియె. 92

చ. కరివదనుండు నిందిరయుఁ గైటభవైరియుఁ బెక్కుమాయల
న్ధరణిపుఁ గాశికాపురమునం బెడఁబాపి పినాకపాణికిం
బరమసముద్యమస్ఫురణఁ బంపిరి లేఖలు సర్వకార్యముల్
గరగరనయ్యె రమ్ము శశిఖండశిఖామణి! యంచు భక్తితోన్.

సీ. సంతోషమునఁ జతుష్షష్టిశక్తిగణంబు
నామోదనృత్తంబు నభినయించె
నరవి లోలార్కకేశవ ఘటోల్కాదులు
పన్నిద్దఱు ప్రమోదభాజు లైరి
వనజాసనుఁడు నాల్గువదనంబుల నుతించె
వేదార్థముల భక్తి విశ్వనాథు
గణనాయకులు శంకుకర్ణఘంటాకర్ణ
నందిషేణాదు లానంద మొంది

తే. రఖిలమాయా ప్రయోగవై యాత్యగరిమ
డుంఠివిఘ్నేశ్వరుండు వైకుంఠపతియుఁ
గమలవాసినియును నేకకార్యపరత
నాదివోదాసు వెడలింప నడచుటయును. 94

శివుండు సపరివారుండై కాశికేతెంచుట

వ. అనంతరంబు విదితదివోదాసవృత్తాంతుండై యంతకదమనుం డంబికయును మహాకాళవిశాఖనైగమేశులు రుద్రులు ప్రమథులు దేవర్షులును దిక్పాలురుం గొలిచి చనుదేరఁ గిన్నర కింపురుషగరుడగంధర్వసిద్ధవిద్యాధరులు జయజయధ్వనుల తోడం గైవారంబులుసేయ నందివాహనారూఢుండై మంద రనగంబుననుండి యానందకాననంబునకు విజయంబుచేసి యవి ముక్తమంటపంబునం బేరోలగంబుండి తత్కాలసన్నిహితు లైనయోగినీభానుపద్మభవప్రమథలక్ష్మీనారాయణుల యథా ప్రధానంబుగా సంభావించి డుంఠివిఘ్నేశ్వరు గంతా (గాఢా) లింగనంబుచేసి గండస్థలంబున నఖాంకుర వ్యాపారం బునం బుజ్జగించుచు ని ట్లనియె. 95

సీ. నీకతంబునఁ గాదె లోకభీకరు లైన
త్రిపురదానవుల మర్దింపఁ గలిగె!
నీకతంబునఁ గాదె కాకోలవిషవహ్ని
యలవోకయును బోలె నార్పఁ గలిగె!
నీకతంబునఁ గాదె నిరవగ్రహస్ఫూర్తి
నంధకాదులగర్వ మడఁపఁ గలిగె!
నీకతంబునఁ గాదె నేఁడు వారాణసీ
సంగమోత్సవకేళిసలుపఁ గలిగె!

తే. నాత్మజుఁడ వన్న మిత్రుండ వన్న భటుఁడ
వన్న సచివుండ వన్న నా కన్న నీవు
నిన్ను నెబ్భంగి వర్ణింప నేర వచ్చుఁ?
గంఠపీఠాగ్ర కరిరాజ! డుంఠిరాజ! 96

ఈశ్వరకృతడుంఠి స్తవము

వ. జయజయ విఘ్నేశ్వర! భక్తనిర్విఘ్న కారక! అవిఘ్న కర! సర్వగణాధీశ! సర్వగణాగ్రగణ్య! గణప్రణతపాదాబ్జ! గణనాతీత! సగుణ! నిర్గుణ! సర్వజ్ఞ! సర్వేశ! సర్వభూత విధాన! సర్వమాయాప్రపంచజ్ఞ! సర్వకర్మాగ్రపూజిత! సర్వ మంగళ! యమంగళోపశమన! సిద్ధవంద్యపద! సిద్ధనాయక! సర్వసిద్ధినిలయ! సర్వబలాధార! సర్వబలాశ్రయ! సర్వఫల ప్రద! బలాకోజ్జ్వలదంతాగ్ర! యనంతమహిమాధార! ధరాధరవిదారణ! దంతాగ్రప్రోత్థదిఙ్నాగ! నాగవిభూషణ! భువనంబుల కభ్యుదయంబు గావింపుము. 97

గీ. ఆవరణరూపమునఁ గాశి యహరహంబు
గావఁ దగు నీకు బహువిధాకారకలన
నను చు నానతి యిచ్చెఁ జంద్రార్ధమౌళి
భవుఁడు భువనాద్భుతక్రియాప్రౌఢి మెఱయ. 98

వ. అట్లద్దేవుం డవధరించుటయు గంగాసంభేదనంబున గర్కరీ వినాయకుండు, కాశీక్షేత్రదక్షిణంబున దుర్గావినాయ కుండు, భీమచండిసమీపంబున నిరృతిభాగంబున భీమచండి వినాయకుండు, పశ్చిమదిగ్భాగంబున దేహాళీవినాయకుండు, వాయవ్యదిగ్భాగంబున నుద్దండవినాయకుం,డుత్తరదిగ్భాగం బునం బాశపాణివినాయకుండు, గంగావరణాసంగమంబున

ఖర్వవినాయకుండు యమతీర్థంబునకుఁ బశ్చిమదిగ్భాగంబున సిద్ధవినాయకుండు; వీరు బాహ్యావరణ దేవతలు. గంగాపశ్చిమ తీరంబున నుత్తరార్కసమీపంబున లంబోదరవినాయకుం, డాపశ్చిమంబునఁ గూటదండవినాయకుండు, భీమచండు నకుం గించిదీశానదిగ్భాగంబునఁ గాలకంఠవినాయకుండు, [1] బ్రాగ్దిగ్భాగంబునఁ గూశ్మాండవినాయకుండు, నుద్దండవిఘ్నే శ్వరునకు నాగ్నేయదిగ్భాగంబున ఢుంఠివినాయకుండు, పాశపాణివిఘ్నేశ్వరునకు దక్షిణంబున వికటదంతవినాయ కుండు, సర్వవిఘ్నేశ్వరునకు నిరృతిభాగంబున రాజపుత్ర వినాయకుండు, గంగాపశ్చిమతీరంబున రాజపుత్రవినాయ కునకు వాయవ్యభాగంబునఁ బ్రణవవినాయకుండు వీరు ద్వితీయావరణదేవతలు. ఉత్తరవాహిని యగువియద్గం గాతీరంబున లంబోదరున కుదగ్భాగంబున వక్రతుండవినా యకుండు, కూటదంతున కుదగ్భాగంబున నేకదంతవినాయ కుండు, కాలకంఠున కీశానదిగ్భాగంబునఁ గపిసింహద్విపత్రి ముఖవినాయకుండు, కూశ్మాండునకుం బూర్వదిగ్భాగంబునం బంచాస్యవినాయకుండు, ముండవిఘ్నేశ్వరున కాగ్నేయ దిగ్భాగంబున హేరంబవినాయకుండు, వికటదంతునకు యామ్యంబున నాశావినాయకుండు, రాజపుత్త్రవిఘ్నేశ్వరు నకు నిరృతిభాగంబున వరదవినాయకుండు, ప్రణవవిఘ్నే శ్వరునకు పశ్చిమభాగంబునఁ బిశంగిలాతీర్థంబున దేవనదీతటం బున మోదకప్రియవినాయకుండు, వీరు తృతీయావరణ దేవతలు. వక్రతుండునకు వాయవ్యభాగంబున గంగాతీరం

1 దేహలీవిఘ్నేశ్వరునకు.

బున నభయవినాయకుం, డేకదంతునకుం గౌబేరదిగ్భాగంబున సింహతుండవినాయకుండు, త్రితుండున కీశానదిగ్భాగంబునఁ గూణితాక్షవినాయకుండు, పంచాస్యునకుం బ్రాగ్దిశాభాగంబున క్షిప్రప్రసాదవినాయకుండు, హేరంబునకు వహ్నిదిగ్భాగంబునఁ జింతామణివినాయకుండు, విఘ్నరాజున కవాగ్భాగంబున దంతహస్తవినాయకుండు, వరదునకు యాతుధానదిగ్భాగంబునం బిచండిలవినాయకుండు, మోదకప్రియునకు దక్షిణంబున దండముండివినాయకుండు; వీరు చతుర్థావరణదేవతలు. అభయప్రదున కుత్తరంబున గంగాతీరంబున స్థూలదంతవినాయకుండు, సింహతుండవినాయకున కుదగ్దిగ్భాగంబునఁ గరిప్రియవినాయకుండు, కూణితాక్షున కీశానదిగ్భాగంబునం జతుర్దంతవినాయకుండు, క్షిప్రప్రసాదునకుం బూర్వదిగ్భాగంబున ద్వితుండవినాయకుండు, చింతామణికి వహ్నిదిగ్భాగంబున జ్యేష్ఠవినాయకుండు, దంతహస్తునకు దక్షిణదిగ్భాగంబున దక్షవినాయకుండు, పిచండిలునకు నాసురదిగ్భాగంబునఁ గాలవినాయకుండు, నుద్దండముండునకు దక్షిణదిగ్భాగంబున నాగవినాయకుండు; వీరు పంచమావరణదేవతలు. వారాణసి కింద్రాగ్నియమనిర్ఋతివరుణవాయుకుబేరేశానదిగ్భాగంబుల మణికర్ణిప్రత్యేకవినాయక సృష్టివినాయక యక్షవినాయక గజకర్ణవినాయక చిత్రఘంటవినాయక స్థూలజంఘవినాయక మంగళవినాయకులు. యమతీర్థంబున కుత్తరంబున మిత్రవినాయకుండు; వీరు షష్ఠావరణదేవతలు. మోదాదిపంచవినాయకులును, జ్ఞానవినాయకుండును, ద్వారశవినాయ

కుండును, అవిముక్తవినాయకుండును వీర లవిముక్తక్షేత్ర సప్తమావరణదేవతలు. ఈ యేఁబదియార్గురువినాయకులుఁ గాశీక్షేత్రంబుం రక్షింతురు. 99

తే. ఏఁబదియు నాలుమూర్తులనెసక మెసఁగి
యావరణసప్తకంబున నధివసించి
కాశికాపురి రక్షించుఁ గదల కెపుడుఁ
గుధరకన్యక తోలుచూలుకొడుకు దుంఠి. 100

వ. ఇట్లు గణేశ్వరపరిపాలితం బైన కాశీపురంబునం బుష్కరంబునందు. 101

చ. శుభదివసంబునన్ విమలశోభనలగ్నమునందు మేరుసన్నిభమగు హేమపీఠమున నిల్పి రమాదులు సేస చల్లఁగాఁ
ద్రిభువనరాజ్యలక్ష్మికి నతిస్థిరభక్తిరతిన్ సరోరుహ
ప్రభువుఁడు గైటభాంతకుఁడుఁ బట్టముగట్టిరి ఫాలలోచనున్.

తే. హరియు వినతాసుతుండు దుగ్ధాబ్ధిసుతయు
సౌగతాదివికారవేషంబు లుడిగి
యాత్మవేషంబులు వహించి రనఘ! విశ్రుత
వేషములఁ గాశియందు వేర్వేఱ నిలిచె. 103

వ. తత్ప్రసంగంబునం దీర్థంబులు గలిగె నవి యెయ్యవి యనినఁ బాదోదకతీర్థంబు, క్షీరాబ్ధితీర్థంబు, గదాతీర్థంబు, లక్ష్మీతీర్థంబు, తార్క్ష్యతీర్థంబు, నారదతీర్థంబు, ప్రహ్లాదతీర్థంబు, అంబరీషతీర్థంబు, దత్తాత్రేయతీర్థంబు, భృగుతీర్థంబు, వామనతీర్థంబు, నరనారాయణతీర్థంబు, విదారణనారసింహతీర్థంబు, గోపీగోవిందతీర్థంబు, శేషతీర్థంబు, శంఖమాధవతీర్థంబు, హయగ్రీవతీర్థంబు. ఇవి వైష్ణవతీర్థంబులు. 104

మ. అలఘుశ్రీనిధిఁ గాశికాపురిఁ బ్రసంగానుప్రసంగంబులం
దెలియం జెప్పితిఁ గొన్నిలింగములనుం దీర్థంబుల న్నిక్కమే
తిలమాత్రంబును నందుఁ దద్విరహితోద్దేశంబు లేకున్కికిం
గలశీసంభవ! వన్నిదంబుగెలువంగా వచ్చుఁ బద్మోద్భవున్.

**పంచనదతీర్థమాహాత్మ్యము**

వ. అనిన విని యగస్త్యుండు మహాత్మా! పంచనదతీర్థమాహా
త్మ్యం బెఱింగింపవే యనినం గుమారుం డి ట్లనియె. 106

సీ. వేదశిరుండు నా విప్రర్షి భృగువంశ
సంభవుండు దపంబు సలుపుచుండఁ
జైత్రోవ శుచి యనుపాకశాసనుకొల్వు
మానిని యెక్కడికేని పోవ
నయ్యచ్చరను జూచి యమ్మునీంద్రుండు ప్ర
స్ఖలితేంద్రియుం డయ్యెఁ గదల వెఱచి
కమలలోచన నమస్కారంబు సేయుచుఁ
బ్రత్యవాయమునకు భయముఁ బొంద

తే. వెఱకు మని పల్కి తపసి యవ్వీర్యరసము
మెలఁతకుడిచేతిలోఁ బోసి మ్రింగు మనియెఁ
ద్రావి యది గర్భమై యప్డు తనయఁ గాంచి
సంయమీంద్రున కిచ్చియుఁ జనియె దివికి. 107

తే. బాల యెనిమిదియేండ్లప్రాయంబ గుడు
నెవ్వనికి నిత్తు ని న్నంచు ఋషి యడిగిన
నయ్య! విశ్వాధికుం డైనయతని కిమ్ము
నన్ను నని పల్కె మునితోడ నలినవదన. 108

వ. అనుటయు నమ్మునీంద్రుండు తపోబలంబునం గాని యట్టి పతి సిద్ధింపఁడు. కాశీక్షేత్రంబునఁ దపంబు సేయుము. బాల్యం బునం దపంబుఁజేయు నీకు ధర్మము సిద్ధించెఁ గావున ధూత పాప యనునామంబు వహింపు మనిన, మహాప్రసాదం బని యానందకాననంబునందు ఘోరం బైనతపం బాచరించిన.

తే. బ్రహ్మప్రత్యక్ష మై వచ్చి పద్మనయన!
యడుగు వర మన్నఁ బ్రాంజలి యగుచు నింతి
పరమపావనిఁగాఁ జేయు బ్రహ్మ నన్ను
ధరణిఁ బావనవస్తుసంతతులలోన. 110

వ. అనినం గమలాసనుండు. 111

తే. ధరణిలో మూఁడుకోట్లనర్థంబు లెక్క
గలుగుపుణ్యతీర్థంబులు కమలవదన!
ప్రతివసించును రోమకూపంబులందు
నెపుడు నీదేహమున నీకు నిది వరంబు. 112

వ. అని విధాత యంతర్హితుం డయ్యె నంత నొక్కనాఁడు ధర్ముండు త న్నభిలషించి పైఁ బడం దలంచిన నాధూత పాప చేయూఁక తలంగిన. 113

తే. జముఁడు శపియించె దానిఁ బ్రస్తరము గాఁగఁ
దరుణి శపియించి జము జడత్వంబుఁ బొందఁ
జంద్ర కాంతశిలాంబునిర్ఝరిణి సతియు
జడమహానిర్ఝరంబు తా జముఁడు నయ్యె. 114

వ. చంద్రకాంతశిలారూపంబుఁ గైకొని చంద్రోదయంబున స్రవియించుచు ధూతపాప పుణ్యనది యయ్యె. ధర్ముండును ధర్మనదం బనుపేరఁ బుణ్యనదం బయ్యె. వేదశిరుండును నదీ

స్వరూప యైనకూఁతురు ధూతపాప నదస్వరూపుఁ డైన ధర్మునకు వివాహంబు సేసె. గభస్తిమాలి గభస్తీశ్వరుసన్నిధి (శ్రీమంగళా) గౌరీదేవి నుద్దేశించి మయూఖాదిత్యతీర్థంబున నుగ్రతపం బాచరించిన నతనికిరణంబులవలనం బ్రస్వేదం బుద్భవించి కిరణావతి యనం బారెె. ధర్మనదంబును ధూత పాప నదియుం గిరణాతరంగిణియు గంగాయమునలుఁ గూడ నైదునదులు పంచనదం బనుపేర పుణ్యతీర్థంబై త్రై లోక్య ప్రసిద్ధిఁ గైకొనియె. ఇది పంచనదతీర్థంబు. ఈతీర్థం బున నాప్లుతుండైనమానవుండు పాంచభౌతికంబైనశరీరంబుఁ బావనంబు సేసి పంచమహాపాతకంబులం బాయు. దివో దాసు నుచ్చాటనంబు సేసి కైటభారాతిపంచనదంబునందు విశ్రమించి యగ్నిబిందుం డనుమహామునీంద్రుం డొనర్చు నానావిధస్తోత్రంబులకుఁ బరితుష్టిఁబొంది యిష్టవరంబు గృప సేసి వెండియు. 115

## బిందుమాధవసంభవము

తే. అగ్నిబిందునిపేరు నిజాహ్వయంబుఁ
గూర్చి మధుకైటభారాతి కూర్మి మిగుల
బిందుమాధవుఁ డనుపేరఁ బేర్మి వడసె
నచ్యుతుఁడు భక్తపరతంత్రుఁ డౌనొ కాఁడొ? 116

వ. బిందుతీర్థంబునం దుండి యగ్నిబిందునకు గోవిందుం డానంద కాననంబునందుఁ దీర్థమాహాత్మ్యకథనప్రసంగంబున దానధర్మ వ్రతంబు లనేకంబు లుపదేశించి కరుణావశంవదుం డై యతనిం గనుంగొని యింక నేమి యడిగెద వడుగు మనుటయు. 117

తే. అధికసద్భక్తిసంపద నగ్గి బిందుఁ
డచ్యుతునకు నమస్కార మాచరించి
పద్మలోచన కాశికాపట్టణమునఁ
బ్రతివసించిన నీదురూపంబు లెన్ని? 118

వ. మఱియు భవిష్యద్రూపంబు లెన్ని? యానతిమ్మనిన మధు
సూదనుం డతని కిట్లనియె. 119

వైష్ణవతీర్థమాహాత్మ్యము

సీ. పాదోదకం బను ప్రథమతీర్థంబున
నాదికేశవుఁ డన నధివసింతుఁ
దద్దక్షిణమున శ్వేతద్వీప మందేను
జ్ఞానకేశవసంజ్ఞ సంశ్రయింతుఁ
దార్క్ష్యతీర్థమునందు దార్క్ష్యకేశవుఁడ నై
యాజనంబులచేతఁ బూజఁ గొందు
నందు నారదతీర్థ మాతీర్థమునఁ గేశ
వాభిధానుండ నై యతిశయింతుఁ

తే. గ్రమముతోడ నేనాల్గుతీర్థములయందు
నమృతతాజ్ఞానతార్క్ష్యమహత్త్వములను
బ్రహ్మవిద్యోపనిషదర్థపరిచయంబు
పంచజనులకుఁ గలుగు నాప్లవనపరత. 120

క. ప్రహ్లాదకేశవుని నను
నాహ్లాదముతోడ నెవ్వఁ డభ్యర్థించుం
బ్రహ్లాదతీర్థమున నేఁ
బ్రహ్లాదత నతని కిత్తు భవ్యశుభంబుల్. 121

తే. అంబరీషతీర్థంబున నధివసింతుఁ
గేవలం బన నాదిత్యకేశవుఁ డనఁ
బాతకధ్వాంతవిధ్వంసపాటవమునఁ
జేయుదు శుభంబు తత్తీర్థసేవకులకు. 122

వ. దత్తాత్రేయ భృగు వామన నరనారాయణ విదారణ నరసింహ గోపీగోవింద లక్ష్మీనృసింహ శేషమాధవ శంఖమాధవ హయగ్రీవకేశవ భీష్మకేశవ నిర్వాణకేశవ త్రిభువనకేశవ జ్ఞానమాధవ శ్వేతమాధవ ప్రయాగమాధవు లను దివ్యమూర్తులు ధరియించి బహుప్రదేశంబుల నుండుదు. ఈతీర్థంబులు మఱియనామవ్యప్రదేశంబులం బ్రసిద్ధంబు లై యుండు. ఇవి మదీయతీర్థంబులు. 123

చ. అనఘ! రహస్య మొక్కటి ప్రయత్నమున న్వినుపింతు నీకుస
జ్జనునకుఁ గాని చెప్పకు మసాధుచరిత్రున కీవు నెన్నఁడుం
బెనుమసనంబునం గలవు పెక్కులు తీర్థము లన్నితీర్థముల్
ఘనమహిమం బ్రసిద్ధ మణికర్ణికఁ బోలవు నిక్కమెంతయున్.

మణికర్ణికాప్రభావవర్ణనము

రగడ. శ్రీమత్కాశీపుటభేదన ల
క్ష్మీశ్రుతిమణికర్ణిక మణికర్ణిక;
యామవతీవరచూడామణికిని
హారకమలదీర్ఘిక మణికర్ణిక;
పాదోదకపంచనదాదిమహా
పావనతీర్థోత్తమ మణికర్ణిక;
వేదపురాణాగమవిద్యాపణ
వీథీమాణిక్యము మణికర్ణిక!

పంచమహాపాతకతిమిరౌఘవి
పాటన రవిమండలి మణికర్ణిక;
కాంచనగర్భహిరణ్యకమండలు
గండూషితజలధర మణికర్ణిక;
పంచారించినకైవల్యశుభ
ప్రచయంబులకును ఖని మణికర్ణిక;
పంచక్రోశ్యవిముక్తిక్షేత్రా
బ్జమధూళీపూరము మణికర్ణిక;
బిందుమాధవుం డను నా కెంతయుఁ
బ్రేమకళాపాత్రము మణికర్ణిక;
మందాకిన్యంభోవేణీభర
మధ్యనాభిచక్రము మణికర్ణిక;
నరనారాయణమూర్తిధారి యగు
నాకు విహృతిదేశము మణికర్ణిక;
గరుడఖచరవిద్యాధరకిన్నర
గంధర్వనిషేవిత మణికర్ణిక;
డుంఠివినాయకమదజలమిళనకి
టుప్రవాహపుష్కర మణికర్ణిక;
కంఠేకాలకిరీటవిటంక
గ్లౌరుచి చుళుకితజల మణికర్ణిక;
మాణికర్ణికం బగుతీర్థంబున
మజ్జనమాడిన మానవోత్తముఁడు;
భ్రూణహత్య మొదలైనయఘౌఘము
పోడ వడఁగించును నిమిషమాత్రమునఁ.

గాశితీర్థము లెన్ని యన్ని యును
గదలి వచ్చి మధ్యాహ్న కాలమున;
రాశి గూడి శ్రీమణికర్ణికతీ
ర్థంబు నాశ్రయించుం బ్రతిదినమును;
మధ్యాహ్నసమాగమమున నేనును
మదనధ్వంసియునుం బరమేష్ఠియు;
సాధ్యసిద్ధగంధర్వాదులతో
సంసేవింతుము శ్రీమణికర్ణిక;
వత్తురు మధ్యాహ్నస్నానమునకు
వాసుకిశేషాదులు భుజగేశ్వరు;
లుత్తరవాహిని యగుగంగానది
కుత్తమభూషణ మగుమణికర్ణిక;
నిచ్చలుఁ బ్రాతగకాలము మణిక
ర్ణిక మణికర్ణిక మణికర్ణిక యని
యుచ్చరించుమానవులహస్తముల
కుసిరికకాయలు మోక్షవైభవము;
లొక్కదానమును గోటిదాన మై
యొసఁగు ఫలము నరునకు మణికర్ణిక;
యొక్కయాగమును కోటియాగ మై
యొసఁగు ఫలము నరునకు మణికర్ణిక;
యొక్కపూర్తమును కోటిపూర్త మై
యొసఁగు ఫలము నరునకు మణికర్ణిక;
యొక్కధర్మమును కోటిధర్మ మై;
యొసఁగు ఫలము నరునకు మణికర్ణిక;

యుదయవేళ నెవ్వఁడు మణికర్ణిక
యుదకంబునఁ గ్రుంకును మాఘంబునఁ;
త్రిదశులు నమ్మానవునకు సంవే
దింతురు సేవాంజలులు మకుటముల;
మణికర్ణిక హరిచంద్ర తీర్థమున
మానవుఁ డెవ్వఁడు పితృతర్పణములు;
ప్రణిధానంబునఁ జేయునాతనికి
భద్రపరంపర లిత్తురు పితరులు;
మణికర్ణికప్రాదతీర్థరాజతట
మధ్యమున హరిశ్చంద్రేశ్వరుఁ డను;
గణనాథుని భజియించువారలకుఁ
గామధేను వై యభిమత మొసఁగును;
మణికర్ణ్యంతరమున గాయత్రీ
మంత్రం బొకమా టుచ్చరించినను;
గణన నదిపదివేల్మారును శ్రీ
గాయత్రి జపించినఫల మొసఁగును;
నొకవంకను గంగాకేశవులను
నొకవంక హరిశ్చంద్రమంటపిని;
నకలుషమానస; మణికర్ణికతీ
ర్థావధిసీమంబులు గా నెఱుఁగుము;
యావజ్జీవం బగ్నిహోత్రవిధి
యాచరించినట్టిఫలంబు గలుగుఁ;
బావకునందు మహామణికర్ణిక
భవ్యాహుతి వోసినమాత్రంబున;

నుపమకర్ణిక నాజ్యతిలాహుతి
హోమవిధానము మానవోత్తమున;
కపరిమితంబై నిరతిశయంబై
యక్షయ్యంబగు ఫలము ఘటించును;
చక్రపుష్కరిణి యనునామమునఁ బ్ర
శస్తి వహించినయది మణికర్ణిక!
చక్రనేమిచంక్రమమునఁ దిరిగెడు
సంసృతికిని విరుగడ మణికర్ణిక;
శివుఁ గాశీపతి విశ్వనాయకుని
సేవింపఁగఁ దలఁపెత్తినయప్పుడు;
ద్రవరూపంబు పరిత్యజించి వని
తారూపముఁ దాల్చును మణికర్ణిక;
ప్రత్యక్షంబై పుణ్యపురంధ్రీ
భావంబు భజించినసమయంబున;
నత్యంతమనోహరిహావభా
వాభిరామ యగు శ్రీమణికర్ణిక;
నాలుగుభుజములు వాలికకన్నులు
నయనాన్విత మగుఫాలభాగమును;
బాలేందుకళామధ్యంబున సిత
భసితంబు ధరించును మణికర్ణిక;
కటకహారకేయూరమేఖలా
కంకణాదిభూషణభూషిత యై;
కుటిలాలకములమీఁదఁ జిన్నిపువుఁ
గుస్తరించు నచ్చుగ మణికర్ణిక;

బహుకల్పాంతంబులు సరిగడచిన
పండ్రెండేఁడులచిన్ని ప్రాయమున;
జహాజహాద్విరిడం బగుచేత
స్సంపుటము వహించును మణికర్ణిక;
యొకచే సిందీవరమాలికయును
నొకచే మాదీఫలముఫలంబును;
బ్రకటితమగు దోర్ద్వయమున నంజలి
బంధంబు వహించును మణికర్ణిక;
పద్మసమానం బగునాననబిం
బముచే నొప్పెడునది మణికర్ణిక;
పద్మరాగమాణిక్యంబుల నగు
పలువరుసలు గలయది మణికర్ణిక;
పడమరముఖ మైె నాసాశిఖరము
పై నిష్కంపం బగుచూపునిలుప,
నుడురాజకళాభరుణునుల్లమున
నుద్వీక్షించును శ్రీమణికర్ణిక;
కన్నియ గేదఁగిపూరేకుఁ గబరి
కాభరమునఁ దురుమును మణికర్ణిక;
చిన్నిపూఁపచన్నుల వలిపెపుకం
చెల ధరియించును శ్రీమణికర్ణిక;
మణికర్ణిక చింతామాణిక్యము
మణికర్ణిక బృందారకధేనువు;
మణికర్ణిక కల్పద్రుమవాటిక
మణికర్ణిక సిద్ధరసస్యందము;

శ్రీమణికర్ణిక యణిమాది మహా
సిద్ధికారణము సేవకకోటికి;
శ్రీమణికర్ణిక నగ్నిబిందుముని!
సేవింపుము పుణ్యాత్ముఁడ వయ్యెదు. 125

వ. మణికర్ణికాతీర్థంబునక వాగ్భాగంబునం బాశుపతతీర్థం; బందు బశుపతీశ్వరుండు లింగరూపధరుండై భవపాశమోక్షంబు సేయు. పాశుపతతీర్థంబునకుఁ బురోభాగంబున రుద్రావాస తీర్థం బాతీర్థంబునకు రుద్రేశ్వరుం డధిదేవత. రుద్రావాస తీర్థంబునకు యామ్యదిగ్భాగంబున విశ్వతీర్థం, బందు తారకే శ్వరుండు విశ్వాభిధాన యగుగౌరితోఁగూడి విశ్వపూజ్యుం డై యుండు. విశ్వతీర్థంబునకు సంగడి మోక్షతీర్థంబు. మో క్షేశ్వరునకు సమీపంబున నవిముక్తేశ్వరంబు. అందులకు సమీపంబునఁ దారకతీర్థంబు గలదు. అందుఁ దారకేశ్వరుండు సంసారతారకుం డధివసించు. తారకతీర్థంబునకు సమీ పంబున స్కందతీర్థంబు. స్కందతీర్థంబునకు నవ్వల డుంఠి తీర్థంబు. డుంఠితీర్థంబునకు సమీపంబున భవానీశంకర తీర్థంబు. 126

సీ. మణికర్ణికాతీర్థమధ్యంబునకు సాగి
శ్రీపాశుపతతీర్థసీమ నడచి
శ్రీరుద్రతీర్థపశ్చిమభాగమున నేగి
విశ్వతీర్థంబు వెన్వెంటఁ దగిలి
మోక్షేశ్వరస్థానమూర్ధవవర్త్మము దాటి
తారకబ్రహ్మతీర్థంబు గడచి

బాహులేయక్షేత్రపదము నుల్లంఘించి
డుంఠిరాట్తీర్థోపకంఠ మొరసి
గీ. భవతి భిక్షాం ప్రదేహి! యన్పలుకు వలికి
పటువనాంచిత కాశికాపథమునందు
నాఁకొనినవారి కిడు సుధాహారభిక్ష
గౌరికరకంకణంబు గల్గల్లు మనఁగ. 127

మ. నియమం బొప్పఁగఁ గాశికాపురి భవానీశంకరుల్ విష్టప
త్రయముం గాతురుతల్లిదండ్రులగుచున్దాక్షిణ్య మొప్పంగఁ బ్ర
త్యయ మేతద్విషయంబునం *దెలుఁగదాయెల్లప్పుడు మధ్యాహ్న
మక్షయభిక్షాన్నము వెట్టుచుందురుబుభుక్షాక్షీణమర్త్యాళికిన్.

గీ. గృహము వారాణసీసీమ గృహిణి గౌరి
విశ్వనాథుండు గృహమేధి శాశ్వతుండు
పరమకారుణ్యనిధులు దంపతులు దాము
మునికి నప్పుడు సిద్ధించు మోక్షభిక్ష. 129

వ. భవానీతీర్థంబునకు సమీపంబున జ్ఞానతీర్థంబు. జ్ఞానవాపీ సమీపంబున జ్ఞానేశ్వరు సేవించినరుండు జ్ఞానవంతుండగు. జ్ఞానతీర్థసమీపంబున శైలతీర్థంబు. శైలతీర్థసమీపంబున నందితీర్థంబు. నందితీర్థంబున కవాగ్భాగంబున విష్ణుతీర్థంబు. అందేను సన్నిహితుండ నై యుండుదు. ఆ తీర్థంబున కవాగ్భాగంబునఁ బితామహతీర్థంబు. పితామహతీర్థసమీపంబుననాభితీర్థంబు. నాభితీర్థసమీపంబున బ్రహ్మ(నాల)తీర్థంబు. స్వర్గద్వారసన్నిధి భాగీరథీతీర్థంబు. తద్దక్షిణంబున ఖురకర్తరితీర్థంబు. ఆతీర్థదక్షిణంబున మార్కండేయతీర్థంబు.

*'దెలుఁగరాదా' యని పా.

మార్కండేయతీర్థసమీపంబున వసిష్ఠతీర్థంబు. తత్తీర్థ సమీపంబున నరుంధతీతీర్థంబు. వసిష్ఠతీర్థంబునకు యామ్య దిగ్భాగంబున నర్మదాతీర్థంబు. తత్సమీపంబునఁ ద్రిసంధ్య తీర్థంబు. తత్సమీపంబున యోగినీతీర్థంబు. తత్సమీపంబున నగస్త్యతీర్థంబు. తత్సమీపంబున గంగాకేశవతీర్థంబు. తత్సమీపంబున వైకుంఠమాధవతీర్థంబు. తత్సమీపంబున వీరమాధవతీర్థంబు. తత్సమీపంబునఁ గోలాహలనరసింహ తీర్థంబు. తత్సమీపంబునఁ గాలమాధవతీర్థంబు. తత్సమీపంబున నిర్వాణమాధవతీర్థంబు. తత్సమీపంబున మహాబల నరసింహతీర్థంబు. తత్సమీపంబున జ్వాలామాలి నరసింహ తీర్థంబు. తత్సమీపంబున మహాభయనరసింహతీర్థంబు. తత్సమీపంబున నత్యుగ్రనరసింహతీర్థంబు. తత్సమీపంబున వికటనరసింహతీర్థంబు. తత్సమీపంబున ననంతవామన తీర్థంబు. తత్సమీపంబున దధివామనతీర్థంబు. తత్సమీపంబునఁ దామ్రవారాహతీర్థంబు. 130

సీ. వారాకరంబులో వటపత్త్రశయను లా
యబ్జనాభులు నూఱు నైదుపదులు
తఱితోడ నమృతాబ్ధిఁ ద్రచ్చుచోఁ గుదురైన
ముదురుకచ్ఛపములు మూఁడుపదులు
సోమకాసురుఁ జంపి శ్రుతులు విధాతృన
కర్పించునట్టి మత్స్యము లిఱువది
ఛద్మగోపాలవేషమున వ్రేపల్లెలో
విహరించుకృష్ణులు వేలసంఖ్య

గీ. పరశురాములు ముప్పండ్రు భానుకులులు
రాఘవేశ్వరు లేకోత్తర మగుశతము
విష్ణురూపుఁడ నొకఁడ నే విను మునీంద్ర!
కాశికాపట్టణము నైదుక్రోశములను. 131

గీ. శంఖచక్రగదాఖడ్గసంయుతుండు
ననఘ! మధుసూదనాహ్వయుం డగుదు నేను
గమలమును శంఖమును జక్రగదలు దాల్చి
నట్టినన్ను సంకర్షణుం డండ్రు బుధులు. 132

గీ. శంఖకౌమోదకీచక్రజలజపాణి
నైననన్ను దామోదరుం డండ్రు బుధులు
శంకచక్రాంబురుహగదాసహితు నన్ను
వామనుం డందు రాగమవ్యాప్తమతులు. 133

గీ. పాంచజన్యంబు గదయును బంకజంబు
చక్రమును దాల్చి ప్రద్యుమ్నసంజ్ఞఁ దాల్తు
శంఖచక్రగదాంభోజసహితు నన్ను
విష్ణుఁ డందురు విజ్ఞానవిమలహృదయ! 134

గీ. శంఖచక్రగదాపద్మసహితు నన్ను
మాధవుం డండ్రు మేధాసమగ్రమతులు
శంఖగదలును జక్రాంబుజములు దాల్చు
నన్నుఁ బురుషోత్తముం డండ్రు సన్నుచరిత. 135

గీ. శంఖకౌమోదకీపద్మచక్రధరుని
నను జనార్దనుఁ డనుచుఁ జెప్పును బుధాళి
శంఖచక్రగదాంభోజసహితు నన్ను
విశ్వసన్నుతచరిత! గోవిందుఁ డండ్రు. 136

గీ. శంఖపద్మగదాచక్రసహితుఁడైన
యట్టినన్నుఁ ద్రివిక్రముఁ డండ్రు బుధులు
శంఖమును నంబుజంబును జక్రగదలు
దాల్చుననుఁ జెప్పు జగము శ్రీధరునిఁ గాఁగ. 137

వ. శంఖచక్రగదాపద్మంబుల హృషీకేశుండును, శంఖచక్రపద్మ గదల నృసింహుండును, శంఖగదాపద్మరథాంగంబుల నచ్యుతుండును, శంఖారిగదాపద్మంబుల వాసుదేవుండును, శంఖపద్మగదాచక్రంబులనారాయణుండును, శంఖపద్మచక్ర గదలం బద్మనాభుండును, శంఖగదారికమలంబుల నుపేంద్రుండును, శంఖచక్రపద్మగదల హరియును, శంఖపద్మగదాచక్రంబులఁ గృష్ణుండును బ్రకాశింతురు. ఇవి మదీయదివ్యమూర్తి భేదంబు లని యానతిచ్చి కార్యాంతరవ్యాసంగంబున మాధవదేవుం డంతర్ధానంబు సేసె. అగ్నిబిందుండును జరితార్థుండై [1]బిందుమాధవదేవునియందు నేకీభవించె. ఇది బిందుమాధవాగ్నిబిందుసంవాదం బనునితిహాసంబు. దీని విని నను బఠించినను వ్రాసినను మానవులకు భోగ మోక్షములు సిద్ధించు ననినం గుమారున కభివాదనంబు సేసి కుంభసంభవుం డెండియు ని ట్లనియె. 138

వృషభధ్వజావిర్భావము

సీ. పార్వతీనందన! పాంచజన్యధరుండు
విఘ్నరాజును శ్రీయు వేఱు వేఱ
వివిధమాయోపాయ వేషభాషాదుల
భ్రమియించి కాశికాపట్టణమున

1 బిందుమాధవ సేవాతాత్పర్యంబున.

నుఱక దివోదాసు నుచ్చాటనము చేసి
యామేలివార్త మంథాద్రి నున్న
హరునకుఁ జెప్పి పంపిరి హరుఁడును వచ్చెఁ
గాశికానగరికిఁ గరము వేడ్క

తే. వచ్చి పేరోలగం బుండి వరుసతోడ
యోగినుల భాను విధిఁ బ్రమథోత్కరంబు
హరిని లక్ష్మి వినాయకు నాదరించి
భువనసామ్రాజ్యపట్టంబు పూనె నంట. 139

వ. సామాన్యంబున సంక్షేపరూపంబుగా వినుటం జేసి దద్వృత్తాంతశ్రవణంబునందు నాకుం దృప్తి చాలకున్నయది. సవిశేషంబుగా విస్తరించి యానతిమ్ము. కాశీమాహాత్మ్యంబునకుం దక్కినవృత్తాంతంబు లానుషంగికంబులు. ఈవృత్తాంతం బాధికారికంబు గదా యనుటయు, నత్యంతసంతుష్టాంతరంగుఁడై గాంగేయుండు కుంభసంభవున కిట్లనియె. 140

ఉ. కైటభదైత్యవైరి యధికం బగునేర్పున మన్ను తేని కుచ్చాటనమాచరించి తనచట్టుఖగేంద్రునిఁ బంచెఁ గ్రమ్మఱన్
హాటకరేఖ దానును గజాస్యుఁడు లక్ష్మియుఁ జేసినట్టి కైలాటమునం ఘటిల్లె సకలార్థము దేవరయాజ్ఞ పెంపునన్. 141

వ. అనుచు సంతోషసందేశపద్ధతి లిఖించి గరుత్మంతునిచేతి కిచ్చి పంచిన నతిత్వరితగతి లవణేక్షుసురాసముద్రంబులు దాఁటి కుశద్వీపంబు డాసి. 142

శా. తద్ధ్యానాస్పదమానమానసుని మంథక్ష్మాధరాధిత్యకా
మధ్యాధ్యాసితు శంభు డగ్గఱి గరుత్మంతుండు కార్యార్థసం

సిద్ధిత్వంబును దీర్ఘపక్షయుగవిక్షేపప్రభేదంబుచే
నథ్యాహార్యముగా నిరంకుశమహాహంకారధీరోద్ధతిన్. 143

వ. డాసి యంతంత సాష్టాంగదండప్రణామంబు లాచరించుచుఁ
చేరవచ్చి నందికేశ్వరునిచేతికి సందేశపత్రికయిచ్చి తత్సమీ
పంబున బద్ధాంజలియై యుండె. విదితవివాహోదాసవృత్తాంతుం
డై మృత్యుంజయుండు కాశీపట్టణంబునకుం బయనం బగు
టయు. 144

ఉ. ఎత్తిరి టెక్కియంబులును నెల్లులు నంబరవీథి దీటుకో
నొత్తిరి శంఖకాహళము లూఁదిరి శృంగకవంశకాండముల్
మొత్తిరి దుందుభుల్ ప్రమథముఖ్యులు హర్షితచిత్తవృత్తులై
యత్తఱిఁ గాశికానగరయానమహోత్సవజృంభణంబునన్.

వ. అప్పుడు నందికేశ్వరుండు. 146

సీ. ఏనుఁగు లెనిమిది వృషభంబు లెనిమిది
తురంగంబు లెనిమిది హరు లెనిమిది
గంగాతరంగిణీకాళిందు లీపలు
సాయంబు రేపును జక్రయుగము
ధవళాతపత్రంబు తారకావర్గంబు
రజితంపుమోలలు తారాగణంబు
ప్రణవంబు మునుకోల పాదపీఠంబు గా
యత్రి వేదంబు సర్వాంగరక్ష

తే. ద్వారసంరక్షకులు దీవ్రధామవిధులు
మార్గదర్శక మామ్నాయమండలంబు
గా సమున్నత మగుళితాంగంబు పన్ని
ప్రాంగణంబున నిల్పె శిలాదసుతుఁడు. 147

వ. విశ్వేశ్వరుండును గైసేసి భవానీసహితుండై యద్దివ్యస్యందనం బెక్కి ముప్పదిమూఁడుకోట్లదేవతలును, కోట్యయుతద్వయప్రమథగణంబులును, నవకోటిదుర్గలును, కోటిభైరవులును, కోటికుమారు, లేఁడుకోట్లవినాయకులును, షడశీతిసహస్రమునులు, నంచఱిగృహమేధులును, మూఁడుకోట్లు పాతాళతలభుజంగంబులును, రెండుకోట్లు దైత్యదానవులు, నష్టాయుతగంధర్వులును, కోట్యర్ధలక్షరాక్షసులును, బదివేవురు విద్యాధరులును, నఱువది వేలప్సరసలు, నెనిమిదిలక్షలు గోమాతలును, షణ్ణవత్యయుతసుపర్వులును, సప్తసాగరంబులును, నెనిమిదివేలు గిన్నరులును, మున్నాఱు వైవస్వతులును గొలిచి వాయువేగంబున ముహూర్తమాత్రంబున నభోమార్గంబున జని కాశిం బ్రవేశించె. అప్పుడు గోమాతలు దుగ్ధవర్షంబులు కురిసిరి. జైగిషవ్యుం డను మహామునీశ్వరుండు వేదార్థసారంబు లగు కైవారంబులఁ బరమేశ్వరుం బ్రస్తుతించె. అప్పరమేశ్వరుండు జ్యేష్ఠమాసంబున శుక్లపక్షంబునఁ జతుర్దశినాఁడు ప్రవేశించె. అదికారణంబుగా జ్యేష్ఠస్థానంబనుతీర్థంబును, జైగిషవ్యస్తోత్రంబు కారణంబుగా జైగిషవ్యతీర్థంబును, గోమాతృదుగ్ధవర్షంబు కారణంబుగా క్షీరోదతీర్థంబునుం గలిగె. ఇట్లు కాశీపట్టణంబు ప్రవేశించి.

తే. బ్రహ్మవిష్ణువిహితపట్టాభిషిక్తుఁ డై
జగము లెల్లఁ గొల్వఁ జంద్రమౌళి
గౌరితోడఁ గూడఁ బేరోలగం బున్న
వేళ వచ్చెఁ గాశివిప్రగణము. 149

వ. అందు. 150

సీ. సంస్తుతించిరి బహ్వృచప్రపంచంబుల
నొకకొంద ఱసితకంఠోపకంఠు
నుచ్చైస్స్వనంబున నొకకొందఱు నుతించి
రార్యాకళత్రు నథర్వశాఖ
శివునిఁ బ్రశంస సేసిరి యొకకొందఱు
సద్భక్తిమై సప్తసామములను
సర్వజ్ఞుఁ బొగడి రథర్వవేదంబున
నొకకొంద ఱొగి ప్రసంగోచితముగఁ

తే. గాశికాతీర్థవాసులఁ గర్మవరుల
భూతిరుద్రాక్షధారులఁ బుణ్యనిధులఁ
నందఱినిఁ జూచి కరుణాసమగ్రబుద్ధి
నిట్టు లని యానతిచ్చె విశ్వేశ్వరుండు. 151

తే. సేమమే విప్రులార! యనామయంబె?
పరమమాహేశ్వరాచారనిరతులార!
కుశలమే? కాశికాతీర్థకోటిదివ్య
లింగపూజైకతానాంతరంగులారా! 152

వ. అనిన విని మందాకినీతీర్థంబు హయతీర్థంబు మత్స్యోదరీ తీర్థంబు కపాలమోక్షతీర్థంబు నాదిగాఁ గల తీర్థంబులనుండి యేతెంచినబ్రాహ్మణోత్తములు మృత్యుంజయునకు నమస్కరించి యిట్లని విన్నవించిరి. 153

తే. అసియు వరణయుఁ గూడినయంతనుండి
సంగమేశ్వరతీర్థంబు సందుదాఁక
గగనగంగాతటంబునఁ గదలకుండు
తీర్థవాసుల మమృతదీధితికిరీటి! 154

తే. పదియు నెనుబదివేలును బంచశతియు
నేఁబదియు నైదుసంఖ్యలయిండ్లవార
మాశ్రితులు కాశికాపురి కస్మదీయు
లీశ! పల్లేరు దుడిచి పా లెక్కినారు.

వ. అని యనంతరంబ యాశీర్వదించి యార్ద్రాక్షత(ంబు)లు సల్లి మంగళసూక్తంబుల సంస్తుతించి బ్రాహ్మణులు ప్రబద్ధకరసంపుటులై దేవా! భవదీయకటాక్షవీక్షానిక్షేపసంభూతప్రభూతానుకంపాసంపత్తి గలుగ మాకు సేమం బనామయంబు కుశలం బేమి బ్రాఁతి? అదియునుంగాక. 156

క. వృషగమన! భవాశీవిష
విషపృషతనిషేకజనితవిషమదశాదు
ర్విషహోష్మదోషసర్వం
కషములు కాశీసమీపగంగామృతముల్. 157

వ. అనిన విని పినాకి దానునుం గాశీనామాక్షరద్వయంబు కర్ణామృతంబనియును గాశీక్షేత్రధూళిత్రసరేణువులు సర్వాంగరక్ష లనియు గమనాసనస్వప్నజాగరణంబులం గాశీనామస్మరణంబు పాపంబులఁ బాపఁ జాలు ననియును బ్రహ్మాండగోళంబున గలతీర్థజాలంబు లెల్లనుగాశీక్షేత్రంబునఁ బంచక్రోశంబున వసియించి యుండు ననియును గాశి నిర్వాణమాణిక్యఖని యనియును గాశిమోక్షలక్ష్మీనివాసకుశేశయంబనియును గాశి సంసారబీజాంకురమరుభూమి యనియునుం గొనియాడి తాను నమ్మహీసురులుఁ గొంతతడ వభీష్టగోష్ఠీవినోదంబులం బ్రొద్దుపుచ్చి వారుచూడంజూడ నంతర్హితుం

డై దివ్యవభనాభ్యంతరస్థం బైనజోత్యతిర్లింగంబునం దంతర
వించె. నంత బ్రాహ్మణులు నిజనివాసంబులకుం జనిరి. ఇది
వృషధ్వజావిర్భావం బను నుపాఖ్యానంబు భోగమోక్ష
ప్రదాయకంబు. 158

ఉ. పంచసహస్రలింగములు భాసురమూర్తులు జ్యేష్ఠనాథతీ
ర్థాంచలభూమియందుఁ బ్రణతాఖిలనిర్జరముఖ్యమండలీ
కాంచనమౌళిరత్నకలికారుచిజాలపిశంగితాంఘ్రిల
భ్యంచితభోగమోక్షవిభవాకరముల్ కలశీతనూభవా!

వ. అవి యెయ్యవి యనిన నాదిత్యలింగంబు పరాశరేశ్వరలిం
గంబు మాండవ్యేశ్వరలింగంబు మంకణేశ్వరలింగంబు జాను
కేశ్వరలింగంబు సుమంతేశ్వరలింగంబు భారద్వాజేశ్వరలిం
గంబు వాజపేయేశ్వరలింగం బగ్నివర్ణేశ్వరలింగంబు ధుఁవే
శ్వరలింగంబు వత్సేశ్వరలింగంబుకుక్కుటేశ్వరలింగంబు పర్ణా
దేశ్వరలింగంబు సత్తుపర్థేశ్వరలింగంబు మాండూకేశ్వరలిం
గంబు బాభ్రవేయేశ్వరలింగంబు చ్యవనేశ్వరలింగంబు కలిం
దమేశ్వరలింగం బక్రోధనేశ్వరలింగంబు కంకేశ్వరలింగంబు
కుంతలేశ్వరలింగంబు కతేశ్వరలింగంబు తుంబురునారదేశ్వర
లింగంబు మతంగేశ్వరలింగంబు మాగధేశ్వరలింగంబు జతు
కర్ణేశ్వరలింగంబు జంబుకేశ్వరలింగంబు జారుధీశ్వర జలేశ్వర
కాళేశ్వర గాలవేశ్వర మహాలింగంబు లాదిగాఁ గల మహా
లింగంబులు వెండియు. 160

## కందుకేశ్వర వ్యాఘ్రేశ్వరసంభవము

సీ. ఒక్కనాఁడు భవాని యుబుసుపోవక పైఁడి

---

1 దంతరించె.

జలపోసనముకసీసంపుఁబట్టు
బంతిఁ గుట్టిమభూమిఁ బాణిపల్లవమున
నాస్ఫాలనము సేసి యాడుచుండ
నప్పు డంబరవీథి నసుర లిద్దఱు గూడి
కందుకం బెగవైచు గౌరి బుచ్చి
ప్రమథవేషముఁ దాల్చి పట్టంగ వచ్చిరి
గనుసన్న చేసి శంకరుఁడు వనుపఁ

తే. బర్వతాత్మజ యక్కూటపారిషదులఁ
జంపె నచ్చెండునన యురస్థ్సలుల వైచి
కపటదైత్యులఁ బరిమార్చెఁ గందుకంబు
కందుకేశ్వరుఁ డనఁ గాశిఁ గాంచె మహిమ. 161

వ. ఇది కందుకేశ్వర మాహాత్మ్యంబును తత్సంభవంబును. 162

సీ. దండఖాతాఖ్యతీర్థమునందు దుందుభి
నిర్హ్రాదుఁ డనుయామినీచరుండు
ప్రహ్లాదుమామ యప్పాపి దేవతలకు
నహితంబుగా నధ్వరాంశదాత
లైనవిప్రులఁ జంపఁ బూని కాశికి వచ్చి
శివరాత్రియందుఁ దత్క్షేత్రవాసి
యొక్కవిప్రుఁడు శశాంకోత్తంసుఁ బూజింపఁ
బులివేషము ధరించి పొంచి కఱవ

తే. నతఁడు పూజించువృషభాంకుఁ డది యెఱింగి
చంపె నాదైత్యు నొఱలంగఁ జంక నిఱికి
పుండరీకంబు జంపి యాఖండపరశుఁ
డుండెఁ గాశిని వ్యాఘ్రేశ్వరుం డనంగ. 163

వ. ఇది వ్యాఘ్రేశ్వరు సంభవప్రకారంబు. వెండియు జ్యేష్ఠే
శ్వరు సమీపంబునఁ గుక్కుటేశ్వర పితామహేశ్వర గదా
ధరేశ్వర వాసుకీశ్వర కపాలభైరవ మహాతుండ సాగరేశ్వర
వృషభేశ్వర గంధరేశ్వర దుందుమారేశ్వర కర్కోటకేశ్వర
సుప్రతీకేశ్వర తుండకేశ్వర ముండకేశ్వర దివ్యలింగంబులు
భజించువారికి భోగమోక్షప్రదాయకంబులు. 164

శైలేశ్వర రత్నేశ్వర ప్రాదుర్భావము

సీ. ఒకనాఁడు మేనక యుర్వీధరేంద్రుని
యొద్దఁ గూర్చి తనూజ నుమఁ దలంచి
వేదజీవన మయ్యె బిడ్డకు బాగుండె
యతఁడవు గావున నరయ వెపుడు
కాశి నెట్లున్నదో కమలాయతేక్షణ
దర్శించి వచ్చుట తగవు గాదె?
యెలనాఁగ పుట్టినయింటివారలు తన్ను
నరయకు పేక్షించి నపుడు బెగడు

తే. ననిన బహుసంపదలతోడ నరిగి యతఁడు
హరిపురందర పురలక్ష్మి నతిశయించు
తత్పురముఁ జూచి శివుఁ జూచి తనయఁ జూచి
తెలిసి యచ్చోట లింగప్రతిష్ఠ చేసె. 165

వ. శైలాధిప ప్రతిష్ఠితం బైనయాలింగంబు శైలేశ్వరలింగంబు.

ఉ. అంబికకంచుఁ దెచ్చినమహామణిసంఘము ప్రోఁగు పోసి య
య్యంబురుహాక్షియానతిన యద్రికులాగ్రణి నిల్పె రత్నలిం
గంబు మహాప్రమాణముగఁ గాశికయం దది నేఁడునింద్రచా
పంబుల నీనుచు న్వెలుగుఁ బ్రాహ్ణములందపరాహ్ణవేళలన్.

తే. చిత్తగింపు మనాది సంసిద్ధమైన
యొక్కపుణ్యేతిహాస మనూనచరిత!
శిశిరగిరిరాజసంప్రతిష్ఠితవిశుద్ధ
రత్నలింగేశుమహిమ విభ్రాజితముగ. 168

సీ. కాశికానగరంబు వేశవాటికలోనఁ
గర్పూరతిలక నా గణిక యొకతె
యసమసాయకునియాఽవపుష్పబాణంబు
రత్నేశు నాస్థానరంగభూమిఁ
గుండలీనృత్తంబు గోహలాద్యాచార్య
మతభేదముల దేశిమార్గసరణిఁ
జారికాకరణాంగహారరేచకముల
భ్రమరికావలన వర్తనగతులను

తే. నాడి మెప్పించు నెట్టిచోద్యంబొ, తరుణి
మీనకేతనహరుఁ డెట్లు మెచ్చు నెట్లు?
తాను దాండవవిద్యాప్రధానగురుఁడు
లలన పార్వతి సుకుమారలాస్యజనని. 169

వ. ఇట్లు పరమేశ్వరు నారాధించి యనంతరంబ యక్కాంత యొక్కనాఁడు కార్యాంతరవ్యాసంగంబున నన్యదేశంబునకుం బోయి విధివశంబునఁ గాలధర్మంబు నొందె. ప్రాగ్భవీయంబైన యీశ్వరారాధనసుకృతంబునం జేసి గంధమాదనంబున వసుభూతి యనుగంధర్వరాజునకుం బ్రభవించి రత్నావతి యనుపేర రూపలావణ్యవిభ్రమవిలాసంబులకు నావాసం బై పూర్వజన్మవాసనావశంబునఁ గాశికానగరం

బున రత్నేశ్వరుం బ్రతిదినంబునుం గొలిచి నిజావాసంబునకుం బోవుచుండు. 170

తే. ఇద్ధకరుణాన్వితుండు రత్నేశ్వరుండు
తన్ను ననిశంబుఁ గొలుచుగంధర్వసుతకుఁ
దనకు సేవకుఁ డైనపాతాళరాజు
శేషకుల రత్నభూషణుఁ జేసెఁ బెండ్లి. 171

తే. దందశూకంబుకలలోనఁ దరుణిఁ గూర్చుఁ
గాంత కలలోన దందశూకంబు నిలుపు
నెట్టి వేడుకకాఁడొ రత్నేశ్వరుండు?
జంపతులఁ జేయునందాఁకఁ జలముకొనియె. 172

క. లీలాకైవల్యవినో
దాలంబం బగుచు లోకయాత్రావిధులం
బాలించు నుబుసుపోకకు
హాలాహలగళుఁడు కాలయాపనబుద్ధిన్. 173

తే. రత్నలింగేశుమందిరప్రాంతభూమి
రత్నచూడాఖ్యుఁ డను భోగిరాజు పేర
రత్నచూడాహ్వయంబు తీర్థంబు గలిగెఁ
గాశికాస్థానమునయందుఁ గలశజన్మ! 174

## కృత్తివాసస్తీర్థమాహాత్మ్యము

వ. ఇంకం గృత్తివాసస్తీర్థమాహాత్మ్యంబు వినుము. ఒక్కనాఁడు కాశీప్రవేశవిష్కంభంబున గంభీరకంఠగర్జిత ఘోషంబునఁ జడలం జాతకవ్రాతంబులను భువి శిఖండిమండలంబును నొండొండ యుల్లసిల్లం జేయుచు సముల్లసత్కదంబకుసుమకేసరవాసనాసంపాది మధుసుధాసారసౌరభ(స్య)ంబున దశ

దిశాభోగంబులు బుగులుకొన మూర్ధోద్ధూననంబున బ్రహ్మాండభాండంబు దళనకులిశకోటినుత్పాటించుభంగి నంగీకరించుచు, సముద్దండశుండాకాండగండూషితోజ్ఝితం బగు విబుధనిర్ఝరిణీపాథఃపూరంబునఁ బయోధరవిధిచక్రంబు నీరొక్కలుపుచుఁ, జరణఘట్టనంబునం బుడమింగదిసిల్లినం గపటకిటిజరఠకమఠభుజగపరివృఢులు కూనిగిలం బడఁ గఠోరఫూ(ధూ)త్కారపవనధారాభిఘాతంబున జీమూతవ్రాతంబు చెదరి పఱవఁ గర్ణతాళదుందుభిధ్వానంబున ధరణికుధరగుహాక్రోడంబులం బ్రతిధ్వనులు పుట్టింప నుచ్చకుంభకూ్రరాట్టాలకం బగుట గర్వంబునకు నివాసదుర్గంబును, శీకరాసారశిశిరం బగుటఁ గ్రోధంబునకు విహారధారాగృహంబును దానప్రవాహంబులకుఁ బ్రావృట్కాలంబును, దర్పాంధకారంబునకుఁ గాళరాత్రిసమయంబును నై[1]యానందకాననంబున నవష్టంభసంరభంవిజృంభణంబున. 175

స్రగ్ధర. చిందెం జెండాడె మట్టెం జిరిమె విఱిచెఁ గ్రొ
చ్చెన్ విఘట్టించె దంచెన్
ద్రుంచెం జక్కాడె మోదెం దోడసెఁ గెడపె న
త్యుద్ధతిం గాశిసీమన్
బంచక్రోశీధరిత్రీపరిధిఁ గరిసుర
ప్రత్యనీకుండు హేలా
సంచారోదగ్రభంగిన్ బలముకొని వనీ
సౌధవప్రాట్టవీథుల్. 176

వ. మఱియు. 177

---

1. నయూకారంబున గజాసురుండ.

సీ. ఘోరభూతేశ్వర ప్రాకారగోపుర
ప్రఘణభూములు మదద్రవము గురియు
ఘూర్ణించు గండభాగము ఘటోల్కాదిత్య
భవనోపకంఠాంఘ్రిపంబు శాఖ
ఘూత్కార మొనరించు ద్రుమిచండపతిమేను
తుండంబుతుంపరఁ దొప్పదోఁగ
సలుపు వప్రక్రీడ శంకుకర్ణేశ్వర
స్థానమాణిక్యపాషాణవేదిఁ
తే. బాఱఁబాఱఁగ వేటాడుఁ బ్రమథకోటి
జిబిజిగఁగ జేయు భూతముల్ కళవళింప
మలయుఁ గాశీపురంబులో మాఱు లేక
యహితజయభాసురుఁడు సింధురాసురుండు. 178

క. గజదైత్యుఁ డివ్విధంబున
గజిబిజి సేయంగఁ గాశికానగరమునం
బ్రజనితభయకంపమునం
బ్రజ తామరపాకునీటిపగిదిఁ దలంకెన్. 179

ఉ. క్రొవ్వునఁగన్నుఁగానకిటు కుంజరదైత్యుఁడు విక్రమోద్ధతిం
జివ్వకుఁ జేయి సాచి తనుఁ జేరఁగ వచ్చిన లోచనంబులన్
నవ్వుచుఁ గాశికానగరనాథుఁడు విశ్వవిభుండు వైచెఁ దా
నెవ్వడి యాతుధానరధినీలయకాలమునుం ద్రిశూలమున్.
తే. ఆ త్రిశూలాయుధంబు తీవ్రాంశుకోటి
భాశ్ఛటాభాసురము కుంభపదము నాటి
రక్తధారలతోన యారాక్షసేంద్రు
కలుషములు గూల్చి యేతెంచెఁ గ్రమ్మఱంగ. 181

వ. అప్పుడు నిర్మలాంతరంగుండై యారాక్షసేంద్రుండు విరూపాక్షు ననేకప్రకారంబులం బ్రస్తుతించినం బ్రసన్నుండై యావిశ్వేశ్వరుండు గజాసురా! వరంబు వేఁడు మనిన నా దైత్యుండు మృత్యుంజయున కిట్లనియె. 182

ఉ. పుట్టినవారికి న్నియతము ల్మరణంబులు విశ్వనాథ! నా యట్టికృతార్థుఁ డెవ్వఁడు? చరాచరవిశ్వవిధాతృసృష్టికిం బట్టనురాజు నానతసుపర్వకిరీటతటీవిటంకసం ఘట్టితపాదపీఠు నినుఁగంటిఁ దుదిం గరుణాపయోనిధిన్.

తే. అమరవంద్య! త్రిశూలాయుధమునఁ జీరి యొడలు లిత్రొల్చి తోలు పచ్చడము చేసి యుత్తరాసంగముగఁ దాల్చి యుండవలయు నోడిగిలి రక్తబిందువు లుట్టిపడఁగ. 184

ఉ. అంధకవైరి! నాపయి దయాగుణసంపద గల్గె నేని నీ స్కంధమునందు నాయొడలిచర్మము పాయకయుండుఁగాతదు ర్గంధము లేక కర్కశము గాక చినుంగక వెండికొండపైఁ గంధరకాళ మున్నయెసకంబున నీవర మే వరించెదన్. 185

వ. అనిన సింధురాసురు కోరినవరం బిచ్చి యంధకవైరి కృత్తివాసుం డయ్యె. అది కారణంబుగా నత్తీర్థంబు గృత్తివాసతీర్థం బన విషమభవభయకలుషవిష (నిషేక) భంగజాంగలికం బైన గగనగంగాతీరంబునం బరమఖ్యాతి వహించె ననంతర తీర్థంబు లాకర్ణింపుము. 186

## కలహంసతీర్థాదిమాహాత్మ్యము

మ. కలశీసంభవ! యద్భుతంబొకటి యాకాశంబునఁ రెండు కాకులు కాకా కృతిఁ గాకలీ కళ కళక్రూరప్రకారోద్ధతిన్

గలహంఁ బాడి కొలంకులోనఁ బడి లోకంబెల్ల వీక్షింపఁగాఁ
గలహంసత్వమునొందె నిట్టివిసుమీ కాశీప్రభావోన్నతుల్.

వ. అది కలహంసతీర్థంబు. 188

తే. హంసతీర్థంబు డగ్గరి యన్నిదిశలఁ
బదియు వేలును మున్నూఱు భవ్యచరిత!
శంభుభవ్యలింగంబులు సన్మునీంద్ర
సంప్రతిష్ఠాపితము లభీష్టప్రదములు. 189

వ. లోమశేశ్వరలింగంబు మాలతీశ్వరలింగంబు నుత్తరలింగం బు జనకేశ్వరలింగం బసితాంగభైరవతీర్థంబు శుష్కోదరీ తీర్థం బగ్నిజిహ్వామణికుండ మహాబలలింగ శశిభూషణలింగ మహాకాళ యోగదేవేశ్వర మహానాదతీర్థంబులును విమలే శ్వరలింగంబు మహాదేవలింగంబు పితామహేశ్వరలింగంబు రుద్రస్థలీతీర్థంబు చండీశ్వర నీలకంఠేశ్వర విజయేశ్వర శ్రీకం ఠేశ్వర కపర్దీశ్వర యక్షేశ్వర జయంతేశ్వర త్రిపురాంతక కుక్కుటేశ్వర త్ర్యంబక హరిశ్చంద్రేశ్వర చతుర్వేదేశ్వర సహస్రాక్షేశ్వ రేశానేశ్వర సంహారభైరవస్థానోగ్రభవేశ్వర ఢుంఠీశ్వర భద్రకర్ణేశ్వర కాలకలశేశ్వర కామేశ్వరలింగంబు లును గపాలలోచనతీర్థంబును దీప్తేశ్వరామరేశ్వరస్వయం భూమహాలక్ష్మీశ్వరధరణీవరాహేశ్వరలింగంబులును గణపతి క్షేత్రంబును మత్స్యోదరీతీర్థంబును భూర్భువస్స్వర్లింగం బును హాటకేశ్వర కిరాతేశ్వర భారభూతేశ్వర నాకులేశ్వర నైరృతేశ్వర జలప్రియ జ్యేష్ఠేశ్వర దేవేశ్వరోంకారేశ్వర ప్రాసాదపర్వతలింగంబు లివి యష్టషష్ఠ్యాయతనంబులు. 190

సీ. శ్రీవిశాలాక్షిచే శిశిరభానుకిరీటు
నర్ధాంగలక్ష్మిచే నగజచేత
లలితచేఁ దరుణపల్లవపాటలాంగిచే
జవరాలిచే లోకజననిచేతఁ
బూఁబోఁడిచే విశ్వభుజచేత హ్రీంకార
వనజవాటివిహారవరటచేత
శివదూతచేతఁ బశ్చిమనాడికావీథిఁ
బరమయోగులు గాంచుఫలముచేతఁ
తే. చిత్రకంఠికచే నీలచికురచేత
భద్రకాళికచే దైత్యభయదచేత
నిగళభంజనచేఁ గృపానిఘ్నచేతఁ
గరిమ గైకొనె శ్రీకాశికాపురంబు. 191

తే. గుజ్జుమోకమావి కుబ్జామహాదేవి
భక్తలోకకీరపతగములకుఁ
గమల కమలనాభు గారాబుదేవేరి
గ్రామదైవతములు కాశినగర. 192

సీ. ఐరావణము నెక్కి యశని చే ధరియించి
యైంద్రి ఘంటావీథియందు మెలఁగు
విహరించు శృంగారవిపినవీథులయందుఁ
గౌమారి శిఖిశాబకంబు నెక్కి
చంద్రశేఖరునాదిశక్తి మాహేశ్వరి
యాఁబోతు నెక్కి వాహ్యాళి వెడలుఁ
జదలేటి సైకతస్థలుల వినోదించు
నలవాక బ్రాహ్మి రాయంచ నెక్కి

తే. విహగపతి నెక్కి వైష్ణవి ప్రహరి దిరుగుఁ
బంచమియును జాముండియు సంచరింతు
రాత్మవాహనముల నెక్కి యహరహంబు
ననఘ ! శ్రీకాశికాపురాభ్యంతరమున. 193

తే. చిత్రఘంటామహాదేవి శివపురంధ్రి
గౌరి నెవ్వాఁడు సేవించుఁ గాశినగరి
నతఁడును వినండు ప్రాణప్రయాణవేళ
యమలులాయకఘోరఘంటారవంబు. 194

శా. ఝుంకించుం గరతర్జనీముఖమునన్ జాలేశ్వరీదేవి కా
శ్యంకస్థాయిని భక్తకోటిబహువిఘ్నౌఘంబులన్నిచ్చలున్
హ్రీంకారాక్షర మంత్రసౌధశిఖర క్రీడాకళాలోల సా
హంకారామరవైరిమర్దనవిధివ్యాపారపారీణ యై. 195

గీ. భద్రనాగమహాతీర్థపరిసరమున
భద్రవాపికయందు నాప్లవ మొనర్చి
భద్రకాళిక వీక్షించు పంచజనుఁడు
భద్రసంస్థితిఁ గాంచు వింధ్యాద్రిదమన ! 196

క. సిద్ధివినాయకుఁగూడ వర
సిద్ధిఁ ద్రిసంధ్యంబు సేవసేసిన నెరయన్
సిద్ధించును మానవునకు
శ్రద్ధావంతునకు విభవసంపత్సిద్ధుల్. 197

క. విధిశక్తిఁ గాశికాపుర
నిధి నిరవధినిరవసంధినిరవధికకృపా
భ్యధిక విధీశ్వరశివుస
న్నిధిఁ గొలిచిననరుఁడు గాంచు నిరుపమసిద్ధుల్. 198

గీ. అధికభక్తితోడ నమరేశ్వరీదేవి
సిద్ధలక్ష్మి సంభజించి నరుఁడు
నిడివిగాఁగ బ్రదుకు విషువంగ ముషువంగ
ప్రేఁక నైనకలిమి వృద్ధిఁ బొందు. 199

వ. వెండియుఁ ద్రిలోకసుందరి యనుకందర్పదమనుశక్తి యవిముక్తక్షేత్రంబునకుఁ గస్తూరికాతమాలపత్రంబు. శ్రీకంఠసన్నిధియందు మహాలక్ష్మి భజించువారలకు భోగమోక్షలక్ష్ముల నొసంగు. లక్ష్మీపీఠం బనుమహాస్థానంబు సాధకాభీష్టదంబు. కమలాపీఠంబున కుత్తరంబున హయకంఠి యనుదేవి కఠినతరకుఠారధారాఘట్టనంబున విఘ్నద్రుమషండంబు ఖండించు. పాశపాణిదక్షిణంబునఁ గౌర్మికర్మంబులు ఖండించు. వాయవ్యభాగంబున శిఖిచండి శిఖండినీరూపధారిణి యై జాము జామునఁ గేకాధ్వనులు సేయు. భీమచండి యుత్తరద్వారంబు రక్షించుచుండు. 200

గీ. కాశిభీమేశ్వరునిచక్కఁ గట్టెదురనఁ
బాశపుష్కరపాణి యై భద్రకాళి
భీమచండి మహాదేవి భీమకుండ
పార్శ్వభూమండలంబునఁ బాయకుండు. 201

గీ. ఛాగవక్త్రేశ్వరీదేవి శంభుశక్తి
వృషభకేతనుయామ్యదిగ్వీథియందుఁ
గదిసి సేవించువారివిఘ్నముల నెల్ల
మేయుఁ జిగురాకు భక్షించుమేఁకవోలె. 202

గీ. తాటిపాడవున నవిముక్తధామసీమఁ
దాళజంఘేశ్వరీదేవి తలిరుఁబోఁడి

విఘ్నముల నెల్ల జురుకొట్టు వెదకి వెదకి
తాటికంబంబు సవ్యహస్తమునఁ దాల్చి. 203

క. వికటానన యను దేవత
మకుటాంగదకటకహారమండన కాళీ
నికటమున నుండుఁ బాయక
యకలంకశశాంకశకల మాదల వెలుఁగన్. 204

క. ఉద్దాలకతీర్థంబున
నుద్దాలకనామధేయుఁ డుడుపతిమకుటుం
డుద్దండదండధరమద
భిద్ఘోరఖట్వాంగుఁ డుండుఁ బ్రియ మెసలారన్. 205

గీ. అందు వసియించు యమదంష్ట్రి యనెడు దేవి
పూర్వదిగ్భాగమునకు విభూష యగుచు
నమ్మహాశక్తి నవమందహాస మైన
మెల్లచూపున వలపించు మృడునిమనము. 206

గీ. తారకేశ్వర మనెడుతీర్థంబునందుఁ
దారకేశ్వరదేవు నిద్ధప్రకాశుఁ
దారకేశ్వరరేఖావతంసు శివునిఁ
దారకబ్రహ్మనిధిఁ గొల్చు ధన్యతముఁడు. 207

సీ. ఆతారకేశ్వరం బనుతీర్థ మేలెడు
డారకేశ్వరుని ప్రత్యంతభూమి
సప్తపాతాళవిష్కంభతాలుద్వయీ
భీకరంబును దందశూకరాజ
జిహ్వాలతంబును జీమూతవిద్యుక్త
రోష్ఠంబును ధరాధరోష్ఠదళము

తారకానక్షత్రదళనమండలము వి
దుద్ధండదంష్ట్రాచతుష్టయంబు
గీ. నైనవదనంబుఁ దెఱచి బ్రహ్మాండపిండ
కబళనమునకుఁ జేసాచి కాళరాత్రి
కాశి శుష్కోదరీదేవి గదల కుండుఁ
జర్మముండకుఁ జేటికత్తె శైలదమన! 208
సీ. జంగాళముగ వ్యాఘ్రచర్మాంబరముఁ గట్టి
శూలంబు వలచేతఁ గీలుకొలిపి
భసితత్రిపుండ్రంబు ఫాలపట్టికఁ దీర్చి
నిద్దంపుఁజిలువజన్నిదముఁ దాల్చి
చనుదోయిఁ గీకసస్రక్కలాపముఁ బూని
తనువల్లి రక్తచందన మలంది
కరటాంజనము కల్కి క్రాలుకన్నులఁదీర్చి
మధుపానమున నుబ్బు మదికి నోసఁగి
గీ. వాసి గల్గి మహాప్రేతవనమునందు
సంతతంబును విహరించుఁ జర్మముండ
రుండమండన గానిచో రూఢిఁ జర్మ
ముండయ ట్లమ్మహారుండ మునివరేణ్య! 209
శా. హాలాపాన మొనర్చి యిద్దఱును నన్యోన్యంబు మత్తిల్లి కం
కేలీనృత్తవినోదకందుకమణిక్రీడావిహారక్రియా
లీలాహాస్యకళాప్రసంగముల నుల్లేఖించ వర్తింతు రె [తల్.
క్కాలంబుఁ ఘటజన్మ! కాశినడుమన్ గర్వించి యద్దేవ
భుజంగప్రయాతము.—
హాయగ్రీవతీర్థంబునం దభ్రగంగా

పయోవేణి నిర్ధూతపాదారవింద
ద్వయీారత్నపీఠాంకఁ దాళప్రమాణఁ
భయఘ్ను న్మహారుండ భావింతు రార్యుల్. 211

వ. మహారుండకుం బశ్చిమభాగంబున స్వప్నేశ్వరి. అస్వప్నేశ్వరి భజించువారలకు భూతభవిష్య[1]చ్ఛుభాశుభార్థంబులు గల లోనం దెలుపుచు నవమ్యష్టమీచతుర్దశీదివసంబులం బూజఁ గొను. ఆస్వప్నేశ్వరికి వరుణదిగ్భాగంబున దుర్గాదేవి. ఆ దుర్గకాశీక్షేత్రంబున దక్షిణద్వారదేశంబు రక్షించుచుండు ననినం గుంభసంభవుండు శంభుసంభవున కిట్లనియె. 212

గీ. తుహినగిరిరాజకన్యక దుర్గ యయిన
కారణం బేమి? కందర్పవైరితనయ!
అనతిమ్మన్న గుహుఁడు వింధ్యాద్రిదమన!
విను మునుచుఁ జెప్పఁ దొడఁగె సవిస్తరముగ. 213

## దుర్గామాహాత్మ్యము

వ. దుర్గుం డనుపేర నొక్కరాక్షసుండు రురునికొడుకు తపోబలంబున నవధ్యుఁడై భూర్భువస్స్వర్భువనంబులు బాధింపం దొడంగిన దేవతలు మహేశ్వరు నభయంబు వేఁడిన నట్లగా నొసంగి శివుండును రాక్షసునిం భంజింప దాక్షాయణి నియోగించిన. 214

గీ. గౌరి వింధ్యాద్రి కేతెంచి కాళరాత్రిఁ
బంచె రాత్రించరేంద్రునిఁ బట్టి తేరఁ
జంపఁ బాతాళమున కంపఁ జాలునట్టి
శక్తియును నేర్పు నిచ్చి యైశ్వర్య మెసఁగ. 215

1 ద్వర్తమాన శుభా శుభంబులు.

వ. కాళరాత్రియు రుద్రాణియాజ్ఞ శిరంబునం దాల్చి యద్దైత్యు
సన్నిధి కరిగి యతని కిట్లనియె. 216

గీ. రాయబారంబు వచ్చితి రాక్షసేంద్ర!
యచలకన్యక యనుప వింధ్యమున నుండి
బుద్ధిమంతుఁడ వై తేని భువనములకు
బాధ సేయక యుండు సత్పాపబుద్ధి. 217

వ. వేదోక్తంబు లైనసర్వక్రియాకలాపంబులుం బ్రతిష్ఠింపం
బాలుపడునది యమ్మహాదేవియాజ్ఞం జేసి పెద్దకాలంబు
బ్రతుకుము. అట్లు కాదేని బంట వై యకుంఠితోత్సాహం
బున నక్కంఠీరవగమన (మధ్య)తోడ యుద్ధము గావింపుము.

తే. హితము చెప్పితి విన నిచ్చయేని లెస్స
జగము బాధింప కుండుట చాలు మాకుఁ
దుహినగిరికన్యయానతిం ద్రోచి తేని
యీడ్చికొని పోదు వెండ్రుక లిరియఁబట్టి. 219

వ. అని గర్వించి పలికినకాళరాత్రిం జూచి కనలి యారాత్రించ
రేశ్వరుండు. 220

సీ. అట్టహాసము చేసి యౌరా! ప్రతాపోక్తు
లాఁటదానికి నింత యదటు వలదు
నే వన్న ననియెఁ గా కేమి మీయేలిక
సాని వచ్చితి వీవ చాలు మాకు
జగదేకసామ్రాజ్యసంపత్తియును బోని
యీ వుండవలదె మాయింట నెపుడు?
నేతదర్థము కదా ఋషి దేవతాకోటి
దట్టిఁ బెట్టినవాఁడఁ బట్టి తెచ్చి

తే. వంటయిలు సొచ్చెఁ గుందేలు వనజనయన!
మెచ్చినాఁడము విధి నిన్నుఁ దెచ్చినపుడ
యడవిలోపల నున్న గేహమున నున్నఁ
బొందఁగలభాగ్యవిభవంబు పొందుఁ బురుషుఁ. 221

వ. అని యంతఃపురచరుల 'దీని నభ్యంతరంబునకుం గొనిపొం' డని పలికినం గళవళింపక కాళరాత్రి రాత్రించరేశ్వరున కి ట్లనియె. 222

ఉ. నీతివిదుండ వీవు రజనీచరవంశవరేణ్య! యర్థమే
దూతలమాటకుం గినియ! దూతలు నేరక యాడినప్పుడుం
గాతురు తప్పు విశ్వనయకార్యధురంధరు లైనభూపతుల్
దూతకు నిష్టసిద్ధికయి తూరఁగ నాడఁగఁ జెల్లు భూపతిన్.

సీ. నయపరాక్రమము లెన్నఁడు ప్రయోగింపరే
దేశకాలములు శోధించి చూచి?
నన్నుఁ బట్టఁగ నైన యదియేమి? పట్టంగ
రాదె న న్నేలినరాజవదన?
నెంద ఱబ్బరు నీకు నేను సైతంబుగాఁ
బర్వతాత్మజ పట్టువడినయపుడు
నే నాఁక నుండనీ కెవ్వారు చూపెద
రింక నెఱింగి యీయిందువదన?

తే. వేఁటకానికి మృగము లేవెంట వచ్చుఁ
దెలియుమా దీముఁ గాలిచి తినిన పిదప?
నన్నుఁ బట్టిన దొరకునే నగతనూజ
ప్రథననిర్జితదిగధీశ! రాక్షసేశ! 224

తే. కాంతఁ గందువఁ బెట్టి నీకడకు మేలు
చెప్ప వచ్చిననన్ను శిక్షింపఁ దగునె?
మొనసి హిత వాచరించిన 'ముండముక్కు
కోఁతపడె' ననుమాటయె గోచరించె. 225

శా. నీయాజ్ఞన్ గడుఁగాసి వెట్టిదరు నన్ బెక్కండ్రు రంతఃపుర
స్థాయుల్ శౌర్యపరుల్ పయోధరతటీసంవ్యానముల్ గొప్పునుం
జేయుం జెట్టయుఁ బట్టి రాజులు పరస్త్రీనింత సేయింతురే?, న్యా
యం బాయిది? మాన్యునిగ్రహము మేలందింతు నీకెమ్మెయిన్.

వ. అని కాళరాత్రి సకరుణంబుగాఁ బలుకం గ్రోధాంధుం డై యవ్విబుధవిరోధి వినియు విననియట్ల యూరకుండె. పొద పొద మని సౌవిదల్లులు హస్తపంకజంబులు పట్టి తివిచిన నప్పంకజాక్షి కరకంకణఝణఝణత్కారంబుగాఁ గెంగేలు గుదిలిచి తివిచికొని వికటకుటిలభ్రుకుటినటనభీషణ ఫాలఫలకయై కలకలం గటికినగవు నగి కన్నుల నిప్పులురుల హుంకారంబు సేసినం గల్పాంతకాలవికరాళకాలవ్యాళఘనాఘనఘటాకఠోరదీర్ఘనిర్ఘాతచ్ఛటాపాతంబునకుఁ దాత యగు నా నిర్ఘోషంబు విని గుండియ లవిసి బెండువడి యంగజాలలు గాలుగాలం బెనచుకొని చాఁపచుట్టువడం గూలి రచ్చెరువును మచ్చరంబును గోపంబును నాటోపంబు నెఱియ మెఱయ దుర్గాసురుండు ఖడ్గఖేటకంబులు ధరియించి డిగ్గన గద్దియదిగ నుఱికిన నప్పు డడ్డంబు సొచ్చి దుర్ముఖుండును సీరపాణియుఁ బాశపాణియు సురేంద్రదమనుండు ఖడ్గరోముండు నుగ్రాక్షుండు దేవకంపనుండు నహంపూర్వికాసంఫుల్లపటలంబులగు చేతస్సంపుటంబులం బుటపుటనియవష్టంభంబుం బూని

కుంభినీధ్రసన్నిభాకారులు కుఠారభిండివాల మండలాగ్ర త్రిశూలపట్టిసప్రాసతోమరంబులు ధరియించి యమ్మహాదేవిం జుట్టుముట్టి పట్ట నురవడించిన. 227

మ. ఘనరౌద్రోద్ధతిభద్రకాళికకటాక్షజ్యోత్స్న కెంపార నుష్ణా
ని వక్త్రంబుబిగించి యాదుటయునుల్కాగ్నిచ్ఛటల్ గ్రమ్మవె
చ్చనిజంఝాపవమాన ముప్పతిలి రక్షఃకోటినొక్కమ్మడిఁ
గొనిపోయెన్వియనుపీథిఁ జొప్పనొరువాకుంబోలెనెందేనియున్.

తే. పగర నిబ్భంగి శతకోటిఁ బాఱ నూఁది
కఠినహాసం బొనర్చి యాకాళరాత్రి
యరిగె నాకాశవీథి వింధ్యాద్రిసీమ
కసురయును శక్తి వెంటాడి యరుగుటయును. 229

తే. అంబరక్షోణిచక్రమధ్యమున నుండి
కోటి కోటి నిశాటులు గొల్చి నడువఁ
గాళరాత్రి మహాశక్తిఁ గదిసి వెంట
నేగుదెంచె దుర్గాసురుం డేకథాటి. 230

అప్పుడు శతకోటిరథంబులు నర్బుదశతద్వయగజంబులు గోట్యర్బుదహయంబులు నసంఖ్యాతయోధులుం గొలువ నేతెంచుదుర్గాసురుఁ ముందట బృందారకమార్గంబున నిరర్గళాటోపంబున నేతెంచుకాళరాత్రిని దవ్వుదవ్వులం గనుంగొని మహాభుజసహస్రదివ్యాయుధయు మహాతేజోపబృంహితయు మహాఘోరప్రహరణ పరంపరాధగద్ధగితధామచ్ఛటాచ్ఛాదితాంబరయుఁ బ్రోద్యచ్చండమార్తాండమండలసహస్ర కాంతిజ్యోతిశ్చక్రమధ్యవర్తినియు లావణ్యవార్ధి సమృద్ధి

చంద్రికయు నై త్రైలోక్యకల్యాణమంటపప్రదీపికయు నై యాసర్వమంగళకట్టాయితం బై నిలిచె నప్పుడు. 231

తే. ధరణిధరరాజకన్యపాదముల కెఱఁగి
కరసరోజద్వయము మోడ్చి కాళరాత్రి
యాదినుండియుఁ దనదువృత్తాంత మెల్లఁ
బూస గ్రుచ్చినచందానఁ బొసఁగఁ జెప్పె. 232

వ. అనంతరంబ దుర్గాసురుండు వింధ్యాటవీమధ్యంబున వేలంబు విడిసి జంభ మహాజంభ శుంభ వికటానన లంబోష్ఠ పింగాక్ష హయగ్రీవ మహోగ్రాత్యుగ్రవిగ్రహ క్రూరాస్య క్రోధన సంక్రందన మహాలయ జితాంతక దుందుభ వృకానన సింహాస్య క్రూరాస్య ఖర శివారావ మధుపోత్కట శూకతుండ ప్రచండ ముండ మహాభీషణాదు లగు దొరల రావించి యందఱం గలయం గనుంగొని యుచ్చైస్స్వనంబున నిట్లనియె. 233

ఉ. తెం పెసలారఁ గా మనల దీకొనియున్నది యొక్కలేమ దో
స్సంపద వింధ్యభూధరవిశాలశిలాస్థలి నీతలోదరిం
జంపక పట్టి తేవలయుఁ జయ్యన నేగి సరోరుహాక్షులం
జంపకపుష్పకోమలులఁ జంపుట శౌర్యమె! వీరధర్మమే? 234

క. చలమున నొండెను నొండెను
బలమున బంధించి యొండెఁ బ్రార్థనలీలా
కలనమున వేగ కొని రా
వలయుఁ దరుణిఁ గంద కుంద వాడక యుండన్. 235

ఉ. క్రచ్చఱ నెవ్వఁ డేనిఁ గసుగందక యుండఁ సరోజలోచనం
దెచ్చు నుపాయమార్గమునఁ దెచ్చినయప్పుడ యేనువానికిఁ

మెచ్చుడివోకయుండ మఱిమీఁదటియాగులు వేయునుండనీ
యిచ్చితి మింద్రలోకపదమిందఱుసాక్షిగఁ బొందు గ్రమ్మఱన్.

వ. అనుటయు సన్నద్ధులై రాక్షసులు సంవర్తకాలంబున జల
ధులు మేర దప్పినచందంబున భువనంబులు ముంచి మించు
కొండకూఁతుపై విజృంభించి శంఖభేరీపటహకాహళారా
వంబు రోదసీకుహరంబు పూరటిల్లంజేయ ధాత్రీమండలంబు
వడవడ వడంక నడచి రాసమయంబున. 237

తే. శక్తి రాక్షసుతోడ రాక్షసుఁడు శక్తి
తోడఁ దలపడ సమధికాద్భుతము గాఁగ
ద్వంద్వయుద్ధంబుసాగె వింధ్యంబుమీఁదఁ
బ్రకరనిష్ఠురబహువిధ ప్రహారణములు. 238

వ. త్రైలోక్యవిజయతోడ దుర్ధరుండును, దారతోడ దుర్ముఖుం
డును, జయతోడ ఖరుండును, త్రైలోక్యసుందరితోడ సిరపా
ణియుఁ, ద్రిపురహరతోడఁ బాశపాణియుఁ, జగన్మాతతోడ సు
రేంద్రదమనుండును, ద్రిపురభైరవితోడ దేవకంపనుండును,
గామాక్షితోడ ఖడ్గరోముండును, గమలాక్షితోడ వజ్రపా
ణియుఁ, ద్రిపురతాపనితోడఁ బింగళాక్షుండును, జయంతి
తోడఁ గుక్కుటాస్యుండును, విజయతోడఁ గపింజలుం
డును, నపరాజితతోడఁ గాకవక్త్రుండును, శంఖినితోడ
ఘూకరవుండును, గజవక్త్రతోడ శంఖకర్ణుండును, మహి
షాక్షితోడ జలంధరుండును, రణప్రియతోడ బకుండును,
శుభానందతోడఁ గిమ్మీరుండును, గోటరాక్షితోడ ధూమ్ర
వర్ణుండును, శివారావతోడ ధూమ్రాక్షుండును, ద్రినేత్ర

తోడఁ బింగళాక్షుండును దలపడినం బోరుమహాఘోరం
బయ్యె నయ్యవసరంబున. 239

శా. ద్యావాపృథ్వ్యవకాశముల్ బుగులుకో నందంద వింధ్యాద్రి
ఘుంటావీథిఁ జెలఁగెఁ గఠోరతరకంఠక్ష్వేళనాదంబుతో
దేవీదానవకోటినిష్ఠురభుజాతిప్రౌఢనానాధను
ర్జ్యావల్లీభవభూరిటాంకృతు లురుద్రాఘిష్ఠవీరధ్వనుల్. 240

క. శక్తులతో సరి పోరెను
నక్తంచరకోటి ప్రహరణవ్రాతములఁ
ముక్తాముక్తంబులఁ గర
ముక్తంబుల యంత్రముక్తముల ముక్తములన్. 241

మ. తిమిరంబుఁ ఘటియించెఁ బట్టపగటఁ దేవీమరుద్విద్విష
త్సమరారంభములఁ సముద్భటభుజాచక్రీభవద్దీర్ఘదు
ర్దమకోదండవినిర్గతంబు లయి హేరాళంబు పాదక్షుర
ప్రమహాభల్లశిలీముఖాంజలికనారాచార్ధచంద్రాస్త్రముల్. 242

వ. ఇవ్విధంబున నుభయ సైన్యంబులు సరి పోరుచుండనయ్యెడ
వింధ్యవాసిని మహామాయ వాయవ్యాస్త్రంబు ప్రయోగించి
రాక్షసులయస్త్రశస్త్రంబులు తూల నడఁచిన నిరాయుధు లై
యద్దైతేయులు విఱిగి పఱచి రంత దుర్గాసురుండు డగ్గరి
మహాశక్తిం గొని వైచిన. 243

తే. రాక్షసుఁడు వైచినట్టియా ప్రబలశక్తి
శక్తి వైచి విఖండించె శంభుశక్తి
చక్రమున వైచె వింధ్యాద్రిసదన నసుర
శైలకన్యక యది త్రుంచెఁ జక్రమునను. 244

తే. అనిమిషారాతి విల్లెత్త నగజ ద్రుంచె
శూల మెత్తిన ఖండించె నీలవేణి
పటికయలుగఁ జేసె గద యెత్త భద్రకాళి
ఖడ్గమెత్తిన జక్కాడెఁ గంబుకంఠి. 245

మ. వడి వింధ్యాచలగండశైలములఁ దన్నైవంగ నేతెంచుచో
నుడురాజార్థశిఖావతంసుసతి యత్యుగ్రంబువహ్న్యస్త్రముల్
దొడి దుర్గాసురునేయ వాఁడు వడియె౯ దుర్వారవజ్రాహతి౯
బడుశైలంబును బోలి మెచ్చిరి హరి బ్రహ్మాదిబృందారకుల్.

వ. అప్పుడు "దేవీ! జగద్ధాత్రీ! జగత్త్రయీజననీ! మహేశ్వర మహాశక్తీ! దైత్యద్రుమకుఠారికా! త్రైలోక్యవ్యాపినీ! శివా! శంఖచక్రగదాశార్ఙ్గధారిణీ! విష్ణుస్వరూపిణీ! హంసయాన! సర్వసృష్టివిధాయినీ! అనాదినిధనవాగ్జన్మభూమి! చతురానన! ఐంద్రీ! కౌబేరీ! వాయవీ! వారుణీ! యామినీ! నైరృతీ! ఐశీ! పావకీ! శశాంకకౌముదీ! సౌరీ! సర్వదేవమయీ! పరమేశ్వరీ! గౌరీ! సావిత్రీ! గాయత్రీ! సరస్వతీ! ప్రకృతీ! మతీ! అహంకృతీ! బ్రహ్మాండాంతస్థమహాదేవీ! పర! పరాపరపరమ! పరమాత్మస్వరూపిణీ! సర్వస్వరూప! సర్వగ! చిచ్ఛక్తిమహామాయ! స్వాహా! స్వధా! శ్రౌషడ్వౌషట్స్వరూపిణీ! ప్రణవాత్మిక! సర్వమంత్రమయీ! చతుర్వర్గాత్మిక! చతుర్వర్గఫలోదయ! యని యిట్లనేకప్రకారంబుల దేవతలందఱు ప్రస్తుతించిరి. భద్రకాళియు నిర్జరుల కభీష్టవరంబులు ప్రసాదించె. దుర్గాసురుని మర్దించి జగంబులదుర్గంతి మాన్పుటం జేసి భర్గగృహిణికి దుర్గాభిధానంబు గలిగె. దుర్గాదేవి గాశీక్షేత్రంబునందు నుపసర్గాదిదోషంబులు మాన్పు. దుర్గా

కుండంబునం గృతస్నానుం డైన నరుండు దౌర్గత్యంబులం వాయు. దుర్గాశరీరంబునం బుట్టిన శక్తులు దుర్గాసమీపం బున వసించి పంచక్రోశంబున నిరాక్రోశంబుగా శాసింతురు. మఱియు శతనేత్రసహస్రాస్యయయుతభుజ యశ్వారూఢ గజాస్య త్వరిత శతవాహిని విశ్వసౌభాగ్య గౌరి యనువారు తొమ్మండ్రను శక్తులు. రురుండు చండుం డసితాం గుండు కపాలి క్రోధనుం డున్మత్తభైరవుండు సంహారుండు భీషణుం డీ యెనమండ్రుభైరవులు విద్యుజ్జిహ్వుండు లలజ్జి హ్వుండు క్రూరాస్యుండు క్రూరలోచనుండు గ్రలోచనుండు వికటదంష్ట్రుండు వక్రాస్యుండు వక్రనాసికుండు జంభకుండు జృంభణాముఖుండు జ్వాలానేత్రుండు వృకోదరుండు గర్తరి నేత్రుండు మహానేత్రుండు తుంగనేత్రుండు అంత్రమండ నుండు జ్వలత్కేశుండు కంబుశిరుండు పృథుగ్రీవుండు మహాహానుండు మహానాసుండు లంబకర్ణుండు కర్ణప్రావ రణుం డనాదిగాఁ గలబేతాళు లసంఖ్యాతులు. భూతంబు లసంఖ్యంబులు గల రిందఱు కాశీక్షేత్రంబు సంరక్షింతు రనినఁ గుంభసంభవుండు గాశీస్థానంబున దివ్యలింగంబు లెన్ని? తత్ప్రభావంబు లెట్టివి యానతి మ్మనినఁ బార్వతీ దేవికి భవుం డానతిచ్చినప్రకారంబున నయ్యగస్త్యునకుఁ గుమారుం డిట్లని చెప్పె. 247

## ఓంకారేశ్వరమాహాత్మ్యము

సీ. ఆనందవిపినంబునం దాదిమబ్రహ్మ
దప మాచరించె నత్యంతనిష్ఠఁ

బర్యాయమున నేఁగెఁ బదినూఱులుయుగంబు
లంతఁ బాతాళలోకాంతరమున
నుండి యుత్థిత మయ్యె నొకదివ్యలింగంబు
బహుకోటిసూర్యవద్భాసితంబు
విధి మనోవీథి భావించు నేతేజ మా
తేజంబు లింగమూర్తిత్వ మొందె
తే. భూరిభువనాగ్ర భాగవిస్ఫుటనవేళ
సంభవించినచటచటచ్ఛబ్దధారఁ
గ్రమముతోడ సమాధియోగంబు విడిచి
కన్ను లెనిమిదియును విచ్చెఁ గమలభవుఁడు. 243

సీ. ఆదిమ తేజంబునం దకారము దోఁచెఁ
గైటభారాతియాకారరేఖ
నటఁ జూడఁ జూడఁ బ్రత్యక్షమయ్యె నుకార
మంబుజాసనుని రూపంబుఁ దాల్చి
తదనంతరంబ చంద్రశిఖావతంసు చం
దంబుఁ గైకొని మకారంబు మెఱసె
నంత శబ్దబ్రహ్మ మైన నాదంబున
భువనహేతువును బిందువును దోఁచె
తే. నఖిలములు గూడి యోంకార మయ్యెఁ బిదపఁ
గ్రమముతోఁ గుంభభవ! యకారము నుకార
మును మకారంబు నగు వర్ణములును నాద
బిందువులు ధాతయగ్రమునందు నిలిచె. 249

వ. ఎయ్యది సంసారతారకం బగుటఁ దారకం బయ్యె. ఎయ్యది
ప్రకర్షంబునం జేసి యశేషవిక్రియావిరహంబునం గూటస్థ

నిత్యం బయ్యెను బరమానంద ప్రకాశంబున సర్వదా యభి
నవం బగు పరబ్రహ్మంబునకు వాచకం బగుటఁ బ్రణవాభిధా
నంబు వహించె. ఎయ్యది యకారోకారమకారబిందునా
దంబులై దవయవంబులవలనను బంచాశత్కళారూపయగు
మాతృకకుం గారణభూతం బయ్యె. ఎయ్యది త్రయీమ
యంబు తురీయంబు తురీయాతీతంబు నిఖిలాత్మకం బనం
బరఁగు; ఎయ్యది చతుశ్శృంగంబు సప్తహస్తంబు ద్విశీర్షంబు
త్రిపాదంబు త్రిధాబద్ధం బై వృషభాకారం బై మ్రోయు;
ఎద్దానియందు బ్రహ్మస్థం బగుజగం బభిలీనం బైయుండు?
ఎయ్యది యకారోకారమకారంబు లను వర్ణత్రితయం
బుచే వేదచతుష్టయాత్మకంబును గార్హపత్యదక్షిణాహవనీయ
సంవర్తకాగ్నిరూపంబును బృథివ్యంతరిక్షద్యుసోమలోకాత్మ
కంబు నుదాత్తానుదాత్తస్వరితప్రచయాత్మకంబును భూతభవి
ష్యద్వర్తమానసాధారణకాలాత్మకంబును నాఁ జను? ఎద్దా
నియం దాదర్శంబునందు ముఖంబునుం బోలె స్వప్రకాశక
చిద్రూపుండు నీశ్వరుండు ప్రతిబింబించు? ఎయ్యది యకా
రాదివర్ణంబు లేకత్వంబు నొందునట్లుగా సంయోజింప
'నాద్గుణ' యనుసంధిఁ గూడి మంత్రత్వంబు నొందు? అట్టి
యోంకారమంత్రత్వంబు దివ్యలింగస్వరూపంబై యావిర్భ
వించినం గనుంగొని పంకజాసనుండు 'నమ ఓంకార స్వరూ
పాయ, నమస్సర్వరూపస్వరూపిణే, నమో రుద్రాయ, నమో
భవాయ, నమ శ్శర్వాయ, నమ ఉగ్రాయ, నమ స్సామర్గ్యజు
స్స్వరూపాయ, నమోనాదాత్మనే, నమో బిందుకళాత్మనే,
నమో లింగాయ, నమో లింగస్వరూపాయ, నమో భీమా

య, నమఃపశుపతయే, నమస్తారస్వరూపాయ, నమశ్శివాయ,
నమఃకపర్దినే, నమశ్శితికంఠాయ, నమో మీఢుష్టమాయ,
నమో గరిష్ఠాయ, నమ శ్శిపివిష్ఠాయ, నమో హ్రస్వాయ,
నమో బృహతే, నమోవృద్ధరూపిణే, నమః కుమారగురవే,
నమ శ్శ్వేతాయ, నమః కృష్ణాయ, నమః పీతాయ, నమోఽ
రుణమూర్తయే, నమో ధూమ్రపర్ణాయ, నమః పింగళాయ,
నమః కిర్మీరవర్చసే, నమః పాటలవర్ణాయ, నమో హారితతే
జసే, నమో నానావర్ణస్వరూపాయ, నమో వర్ణపతయే, నమ
స్స్వరరూపాయ, నమో వ్యంజనరూపిణే, నమ ఉదాత్తాను
దాత్తస్వరితరూపాయ, నమో హ్రస్వదీర్ఘప్లుతవిసర్గాత్మనే,
నమోఽనుస్వారస్వరూపాయ, నమ స్సానునాసికాయ, నమో
నిరనునాసికాయ, నమో దంత్యాయ, నమస్తాలవ్యాయ,
నమ ఓష్ఠ్యాయ, నమ ఉరస్యాయ, నమఊష్మస్వరూపాయ,
నమోఽంతస్థాయ, నమః పినాకినే, నమోనిషాదాయ, నమో
నిషాదపతయే, నమ స్తారాయ, నమో మంద్రాయ, నమో
మధ్యమాయ, నమోఘోరాయ, నమోఽఘోరమూర్తయే,
నమ స్తానస్వరూపాయ, నమో మూర్ఛనాస్వరూపాయ,
నమస్థాయిసంచారస్వరూపాయ, నమో లాస్యతాండవ
జన్మనే, నమ స్తౌర్యత్రికస్వరూపాయ, నమ స్థూలాయ,
నమ స్సూక్ష్మాయ, నమోఽదృశ్యాయ, నమోఽర్వాచీ
నాయ, నమ పరాచీనాయ, నమో వాక్ప్రపంచస్వరూ
పాయ, నమ ఏకాయ, నమోఽనేకభేదాయ, నమ స్సదస
స్పతయే, నమ శ్శబ్దబ్రహ్మణే, నమః పరబ్రహ్మణే, నమో
వేదాంతవేద్యాయ, నమో వేదపతయే, నమః పార్వతీశ్వ

రాయ, నమోజగదీశ్వరాయ, నమోదేవదేవాయ, నమశ్శం
కరాయ, నమస్తుభ్యం మహేశ్వర! నమస్తుభ్యం జగదా
నంద! నమస్తుభ్యం చంద్రశేఖర! నమస్తుభ్యం మృత్యుం
జయ! నమస్తుభ్యం త్ర్యంబక! నమస్తే పినాకహస్తాయ,
నమస్తే త్రిశూలధారిణే. నమస్తే త్రిపురఘ్నాయ, నమస్తే
ఽంధకనిషూదనాయ, నమః, కందర్పదర్పదళనాయ, నమో
జాలంధరారయే, నమఃకాలాయ, నమఃకాలకూటవిషాదినే,
నమో భక్తవిషాదహంత్రే, నమోనమ" యని యనేకప్రకా
రంబులం బ్రస్తుతించిన. 250

సీ. హరుఁ డకారేశ్వరుం డై కైటభారాతి
యాకారరేఖఁ బ్రత్యక్ష మయ్యె
శివుఁ డుకారేశ్వర శ్రీమహాదేవుఁ డై
ధాతృస్వరూపంబుఁ దాల్చి యలరె
గంగాధరుండు మకారేశ్వరుం డయి
విధుమౌళి శేవ నావిర్భవించె
నాగకేయూరుండు నాదేశ్వరుం డయి
భాసిల్లి శబ్దరూపత వహించె

తే. విశ్వలోకైకభర్త బిందీశ్వరుఁ డయి
భువనకారణభావంబుఁ బూని మెఱసె
నింగలును బ్రహ్మ కిచ్చి రభీప్సితంబు
లైదులింగంబులును బ్రణవాత్మకములు. 251

వ. ఈ యైదును దివ్యలింగంబులు. 252

తే. దమనుఁ డను బ్రాహ్మణుఁడు భరద్వాజగోత్రుఁ
డాదిమాశ్రమమునను వింధ్యాద్రిదమన!

పాశుపతదీక్షఁ గైకొని కాశియందు
సిద్ధి గైకొనె నవిముక్త సీమయందు. 253

తే. భారభూతేశ్వరుఁడు యక్షభర్తదిశకు
నింద్రు దెసకును మణికర్ణికేశ్వరుండు
బ్రహ్మగోకర్ణవరు లవాక్పశ్చిమముల
కవధు లవిముక్తమునకు వింధ్యాద్రిదమన! 254

వ. అట్టహాసుండు ప్రాగ్ద్వారంబును, భూతధాత్రీశ్వరుండుదక్షిణ ద్వారంబును, గోకర్ణుండు పశ్చిమద్వారంబును, ఘంటాకర్ణుం డుత్తరద్వారంబును, ఛాగవక్త్రుం డీశదిక్కోణంబును, భీష ణుండు వహ్నిదిక్కోణంబును, శంకకర్ణుండు రాక్షస దిక్కో ణంబును, ద్రుమిచండుండు వాయుదిక్కోణంబును, నానా ప్రమథగణ పరివృతులై రక్షింతురు. కాలారక్షణ భద్ర కౌలేయకాలకంపనులుగంగాతీరంబును, వీరభద్ర నభకర్దమా లిప్తవిగ్రహస్థూలకర్ణ మహాబాహు లసితీరంబును, విశాలాక్ష మహాభీమకుండోదరమహీధరులు దేహాలీదేశంబును నంది షేణ పాంచాల ఖరపాద కరండకానంద గోపకబభ్రులు వర ణాతీరంబును గాచియుండుదురు. 255

తే. కపిల సావర్ణులకును శ్రీకంఠ పింగ
ళాంశుమంతులకును నొక్కయవసరమున
నేగుపకుఁ గల్గె నాశ్చర్య మేమి చెప్పఁ
దనువుతోడన శివుఁ గూడికొనఁగఁ గాశి? 256

చ. కలశతనూజ! యచ్చెరువు కాశికయం దొక శంభులింగముం
దిలలను నక్షతంబులను ధీనిధి యొక్కఁడు పూజచేసి పో

నొలికినవాని మేయుటకు నోలిఁ బ్రదక్షిణ మాచరించి చి
ట్టెలుక శరీరముం †దొరుగ కెక్కెనుబోరజతాద్రికూటమున్.

క. ఘటసంభవ! శ్రీకాశీ
కటకమునకు నికట గగనగంగాతటినీ
చటులకృపీటోర్మిఘటా
స్ఫుటదఘమున కెనయె యితరపుట భేదనముల్? 258

శా. అంభోజాసను నంతవానికిని శక్యంబె నుతింపంగ నో
కుంభీసంభవ! దుంతిరాజకరటక్రోడక్షరద్దానవా
స్సంభేదప్రవిజృంభమాణ వరణాసంపర్కసంపన్న కౌ
క్షుంభరాఃమరసింధునైకటికముం శ్రీకాశికాక్షేత్రమున్?

క. అవిముక్తం బవిముక్తం
బవిముక్తం బనుచుఁ బ్రాతరారంభములం
దవధానపరత నెవ్వం
డు వచించును వాఁడు ధన్యుఁడు మునిప్రవరా! 260

తే. మొగుచు జంతువు కాశికానగరసీమ
నపునరున్మీలనమున కై యక్షియుగముఁ
గాంచు నిక్కలగా నొక్కకలయు నపుడు
త్రిణయనుఁడుగాఁగఁ దన్ను నాదీర్ఘనిద్ర. 261

ఉ. ఎట్టు నుతింతు నల్పమతి నిల్వలమర్దన! యేను గాశికా
పట్టణశంభుమూర్తులఁ గృపాగుణ! యోర్తు లతాంగి తేపెదు
ర్కట్టున ముంగిటంగసవుగాండ్రయుఁ బుచ్చుచుఁ జేతిచీపురుం
గట్టయుఁ దానుఁజొచ్చెఁ గఱకంఠుని నోంకృతినాథదేవునిన్.

---

† 'దొఱఁగ యెక్కె రహిన్' అని పాఠాంతరము మూలవిరుద్ధము.

తే. ఓంకృతి శ్రీమహాదేవునొద్దఁ గలదు
బిలము పాతాళమున కేగు పెద్దత్రోవ
దానివాఁకిట నుండ్రు వాతాపిదమన!
సావిదల్లులు కుఱుపల్ల జడలమునులు. 263

తే. వెంటఁ బడి వచ్చు కాకికి వెఱచి భేకి
తిరిగె నందంద నోంకారదేవుభవన
మటఁ బ్రదక్షిణ మొనరించి నట్టిమహిమ
నొడలితోడనె యాకప్ప మృడునిఁ గలసె. 264

తే. పాడి మెచ్చించె నొకయింతి పంజళమున
నాడి మెచ్చించె లేమ లాస్యమున నొర్తు
పొగడి మెచ్చించె నొక్క లేఁజిగురుఁబోఁడి
కరుణ గలవాఁడు కాశి నోంకారభర్త. 265

మ. మనుజుం డెవ్వఁడు కాశికిం జనఁడు శ్రీమత్స్వర్ణదరీతీర్థముం
గనఁ డోంకారశశాంకమూర్ధునకు మ్రొక్కం డద్దురాత్ముండపో
మునిశార్దూల! వినాశకారణము దోర్మూలాగ్రకూలంకష
స్తనభారాలససూక్ష్మమధ్యజననీతారుణ్యసంపత్తికిన్. 266

చ. పనివడి ఫాలలోచనుఁడు పర్వతరాజతనూజ కానతి
చ్చినపరిపాటి నీకు నఱ సేయక చెప్పెద సావధానతన్
విను కలశీతనూభవ! త్రివిష్టపదివ్యసమాహ్వాయ త్రిలో
చనచరితంబు సర్వకలుషఘ్నము పుణ్యసమృద్ధ్యపఘ్నమున్.

క. విరజాహ్వాయ మగువివరము
పరమఋషిప్రవర! కాశిపట్టణరత్నా
భరణము తద్దర్శనమున

†నరుఁడును విరజస్కుఁ డగు ననఘ! నిమిషమునన్. 268

తే. అనఘచారిత్ర! కాళిందియును సరస్వ
తియును నర్మదయును దదంతికమునందుఁ
గాలుదిక్కునఁ బ్రవహించుఁ గాలకూట
కంఠపాదాబ్జపీఠోపకంఠ మొరసి. 269

ఉ. సంభృతభక్తిభావనఁ ద్రిసంధ్యమునందును నాతరంగిణుల్
శంభుఁ ద్రివిష్టపేశ్వరు శశాంకకళాధరుఁ దీర్థమార్చు వి
స్రంభమునం గరాంబురుహసంగతమంగళశాతకుంభకుం
భోంభితగంధసారరసయోగసుగంధనవాంబుధారలన్. 270

క. స్థాపించె నాస్థలంబున
నాపుణ్యతరంగిణీత్రయము చంద్రకళా
నైపథ్యంబుల భుజగక
లాపంబుల వివిధమణిశిలాలింగములన్. 271

ఉ. నిండుమనంబుతోడ రజనీచరమాళిఁ ద్రివిష్టపేశ్వరున్
దండనమస్కృతిప్రవణతన్ భజియించిన మర్త్యకోటికిన్
వెండియుఁ గర్మబంధములె? వెండియు నాధివికారబాధలే?
వెండియుమాతృయోనిపదవీచ్యుతిసంకటమే? ఘటోద్భవా!

మ. గయ కేలా యరుగంగ మానవులకుం? గాశీపురీవాహినీ
త్రయవేణీపులినంబులందు నిడ రాదా తల్లినిం దండ్రినిం
బ్రియమాతామహులం బితామహులనుం బేర్కొంచుఁబిండా
న్నము?, ల్గయికోరా ప్రమదంబుతోడఁ బితరు ల్హస్తాబ్జ
ముల్ సాఁచుచున్? 273

---

† 'నరుఁడును విగతాఘుఁ డగును నరనిముసమునన్' అని పాఠాంతరము.

తే. దక్షిణమున త్రివిష్టపస్థానమునకుఁ
జెంగట సరస్వతీశ్వరక్షేత్ర మనఘ!
యిచ్చుఁ గొలిచినవారి కయ్యిందుధరుఁడు
గరుణ సారస్వతం బైనపరమపదము. 274

క. యమునేశ్వరుఁడు త్రివిష్టప
సమీపమున నంబుపతిదెస న్వసియించుఁ
యమపుటభేదననికట
ద్రుమవాటికఁ జూడ రవ్విధుధరునిభక్తుల్. 275

తే. ఆత్రిలోచనుప్రాగ్దిక్కునందు నుండు
నర్మదేశుండు నిజభక్తశర్మదాయి
శైవదీక్షావిధిజ్ఞ! తత్సేవకులకు
మాతృగర్భార్భకత్వంబు*మందు సుమ్ము. 276

తే. అఖిలనీవారముష్టింపచాగ్రగణ్య!
ప్రత్యహంబు త్రివిష్టపద్రష్ట యెవ్వఁ?
డవ్విశిష్టుఁడు విష్టపాభ్యంతరమున
వీసమంతటిమాత్రంబు వెలితిస్రష్ట. 277

ఉత్సాహ. లీల మనుజుఁ డెవ్వఁ డేఁ బిలిప్పిలాతరంగిణిం
దేలి శ్రీత్రివిష్టపేశుఁ ద్రిపురమథను శశికళా
మౌళిఁ బూజ సేయుఁ గుసుమమాల్యముల నతండు డా
కాలిమఁడమఁ జప్పళించుఁ గాలమృత్యువక్త్రమున్. 278

---

* అచ్చుపుస్తకమున 'మందు కొడుకు' అనియు, వ్రాతపుస్తకమున 'మందు కుడుక' యనియు, మఱియొక వ్రాతపుస్తకమున 'మందు సుమ్ము' అనియున్నది. దీనికి "దృష్టం త్రిలోచనా త్ప్రాచ్యాం నర్మదేశం సుశర్మదం, తల్లింగార్చనతో నృణాం గర్భవాసో నిషిధ్యతే" అని సంస్కృతమూలము.

మానిని. ఉత్తరవాహినియై ప్రవహించుచునున్న పిలిప్పిలఁ గ్రుంకి
మదిం, దత్తరపా టొకయించుక లేక యథావిధిఁ గోమల
తారకరా, డ్భృత్తకిరీటుఁ ద్రివిష్టపనాయకుఁ *బెన్నసనంబునఁ
గొల్చిన భా, గ్యోత్తరుఁ గాంచి నమస్కృతిసేయుదు రుప్పర
వీథిఁ జరించుసురల్. 279

తే. ఇతరదేశంబులం దుపార్జితము లైన
పాపములు వాయుఁ గాశికాపట్టణమునఁ
గాశిఁ జేసినపాప మెక్కడను బాయ
దదియుఁ బాయుఁ ద్రివిష్టపోపాంతభూమి. 280

తే. కాశి జంబూతరుద్వీపకనకభూష
కాశియం దుత్తమంబులు క్రమవిభూతి
సింధుసంభేద మోంకారశివపదంబు
శ్రీత్రివిష్టపనాయకక్షేత్రతలము. 281

క. విదితముగఁ గాశినడుమం
ద్రిదశమణికిరీటకోటిదీధితివిలస
త్పదునిఁ ద్రివిష్టపుఁ గొలిచిన
†నొదవునుసిరి మోక్షపదముసుదయవివేకా! 282

శా. కుంభీసంభవ! యాత్రివిష్టపుని గ్లౌకోటీరు సింధుత్రయీ
సంభేదస్థలవాసుఁ గొల్చునరునిఁ సాధింపఁగాఁ జాలునే
కుంభీపాకముఖప్రధాననరక క్రూరప్రకారవ్యథా
సంభారంబుల నీగఁ జాలు మదిరాస్వాదాదిపాపౌఘముల్.

* 'శ్రేమమనంబునఁ' అని వ్రాఁతపుస్తకము. 'బెన్నసమంబుగఁ' అని అచ్చుపుస్తకము. †'నొదవును శివమోక్షపదములు దితవివేకా!' అని పాఠాంతరము.

సీ. క్రూరుండు పిశునుండు కొండీఁ డభక్ష్యభ
క్షకుఁడు విస్రంభవిఘాతుకుండు
గురుతల్పగుఁడు నిందకుఁడు నాస్తికుఁడు కూట
సాక్షి పరద్రవ్యచౌర్యపరుఁడు
మాతాపితృత్యాగి యాతతాయి శఠుండు
పరదారలోలుండు గరళదుండు
కులధర్మవిముఖుండు గురుజనద్వేషుండు
బ్రహ్మహత్యాసురాపానరతుఁడు
తే. నాఁగఁ గల పాపుల కఘంబు నీఁగ దిక్క
శ్రీత్రివిష్టపదేవుండు శ్రీప్రదుండు
నీలలోహితు నభవు నిందించునట్టి
కర్మచండాలునికిఁ దక్కఁ గాశియందు. 284

క. ఇందుకళాశేఖరునిఁ
నిందించుట ముజ్జగంబు నిందించుట త
ల్లిందండ్రిని నిందించుట
నిందించుట హర్యజాదినిర్జరకోటిన్. 285

క. శివనింద సేయుపాతకు
దవుదవ్వులఁ జూచి తొలఁగఁ దగు శైవులకుఁ
శివనిందాపరుపలుకులు
చెవి యొడ్డి వినంగఁ దగదు శివభక్తులకున్. 286

ఉ. సత్యము పల్కెదఁ శ్రుతులు శాస్త్రము లాగమముల్
పురాణముల్, ప్రత్యయ మయ్యెనే నిజముఁ బల్కెద రింతియ
కాక యేమి? దు, ర్గత్యపహారదక్ష యగుకాశియ తీర్థము

తీర్థకోటిలో, నిత్యుఁడు విశ్వనాయకుఁడు నిక్కపుదైవము దేవకోటిలోన్. 287

తే. ఆదిఁ బంచనదంబునయందుఁ మునుఁగు
నాడు మణికర్ణికాతీర్థ మంతమీఁద
విశ్వనాథుని భక్తి సేవించి పిదప
నట విఖండించు మనుజుఁ డొక్కఁడ యఘంబు. 288

శా. వాతాపీల్వలదైత్యమర్దన! తగుఁ వర్ణింప దివ్యామృత
జ్యోతిర్లింగతనుం ద్రివిష్టపుని నస్తోకప్రభావాన్వితుఁ
బాఁణాళంబున నుండి వెల్వడి పురీత్రత్యంతభాగీరథీ
స్రోతస్విన్యుపకంఠ భూమిఁ గృతవాసుం డైన సర్వేశ్వరున్.

వ. త్రివిష్టపేశ్వరునకుఁ బశ్చిమభాగంబున ద్రోణేశ్వరలింగంబు, తదగ్రభాగంబున నశ్వత్థామేశ్వరలింగంబు, నటుపిఱుంద శాంతనవేశ్వరలింగంబు, నందులకు వాయవ్యదిగ్భాగంబున వాలఖిల్యేశ్వరలింగంబు, తత్సమీపంబున వాల్మీకేశ్వర లింగంబు గల దందు. మఱియుఁ ద్రివిష్టపేశ్వరు మాహాత్మ్యం బభివర్ణించెద. 290

త్రివిష్టపేశ్వరమాహాత్మ్యము

తే. అమ్మహాదేవుప్రాసాద మాశ్రయించి
యుండుపారావతంబులు రెండు నెలమి
నాలుమగఁడును నన గార్హస్థ్యగరిమ
సకలకాలంబుఁ గవఁగూడి సంచరించు. 291

సీ. పక్షాగ్రముల విచ్చి ప్రాసాదవలభికా
పర్యంతముల ధూళి పాఱఁ దుడుచుఁ

జలువు యాతాయాతములఁ బ్రదక్షిణములు
మాటిమాటికి గర్భమంటపికకు
సోమసూత్రప్రణాళీమార్గనిష్ఠ్యూత
తీర్థోదకంబులు దివుటఁ గ్రోలు
భక్షించు గేహాళీబలిగర్ధవితీర్ణ
పిండోదకములు సంప్రీతి యొసఁగ

తే. వినుఁ ద్రికాలంబు నర్చనావేళలందు
శంఖకాహాళపటహాజర్ఝరరవంబు
కాశినగరంబునఁ ద్రివిష్టపేశునగర
నవ్విహంగమరత్నంబు లనుదినంబు. 292

వ. ఇవ్విధంబునం బారావతస్త్రీపుంసంబులు సంసారసుఖంబు లనుభవించుచు నొక్కనాఁడు నద్దివ్యదేవుదివ్యభవనచంద్రశాలాగర్భవితర్దికానిర్వ్యూహవిటంకనీడంబునం గూడి మెలంగి యాడుచుండ నొక్కశ్యేనం బమ్మిథునంబు దవ్వుదవ్వులం గనుంగొని చేర వచ్చి జాలకంబులలో నుండి తన్నులవోకయుం బోలెఁ గనుంగొనుచు దుర్గసమాశ్రయబలంబున నయ్యుగ్మంబు లెక్కసేయకయున్న నప్పటికి నోడువుదప్పి తొలంగి యెక్కడికేనియుం బోయె. పరేంగితజ్ఞానచతుర యగు నప్పారావతి తనపతి కిట్లనియె. 293

సీ. మనపాలివేరువిత్తని యెఱుంగుదు గాదె
యెఱుఁగవో శ్యేనంబు హృదయనాథ!
ప్రబల మైనట్టి దుర్గంబులో నున్నార
మగుట నేటికిఁ దప్పెఁ బ్రాణభయము

వైపు దప్పిన మహాకోపంబుతోడన
  పోయె వైరం బాత్మఁ బూని డాయ
కొండుచోటికిఁ బోవు టుచితంబు మన మింక
  వానికిన్నకు నోర్చువార మెట్లు?
తే. చిచ్చువాతను బరువాతఁ జిక్కుపడక
తప్పిపోయిన వా రెపో తజ్జ్ఞు లెందుఁ
దాఁతకట్టినచెఱు వంచుఁ దగునె మునుఁగ?
*నిల్లు విడువంగ లేక చా నేల మనకు. 294
చ. అన విని పారువం బడరి యౌవనగర్వమునం బడంతికి
ట్లను నిది యేమి? నాబలపరాక్రమసంపద యింతమాత్రమే?
తనసరివారికి న్వెఱచి ధామముఁ బాడఱఁ జేసి దాఁగఁ బో
యిన సరియిండ్లవారునగరే? ఖగమో యదియేమిదయ్యమో?
తే. అది విహంగమ మేను విహంగమంబ
పెసరగింజకుఁ దక్కువే పెసరగింజ?
యబల! యిటు చూడు మప్పక్షి యదటు మాంతుఁ
గుటిలచంచూపుటీకోటికుట్టనముల. 295
వ. అనిన 'ధర్మో జయతి' యనుచుం బారావతి యూరకుండ నంత మఱునాఁడు తేపకడ నాశ్యేనంబు ద్రివిష్టపేశ్వరునగరీ ప్రాకారంబుమీఁద నిర్గమద్వారంబు నిరోధించి పొంచి యుండి సంచారార్థంబు దిక్కులకు వెడలుపక్కలరవంబుల నుక్కఁ దండసంబువోనిముక్కున నంకుశంబులం బోలు చరణనఖాంకురంబులం బెట్టనుం బోతునుం గఱచియు నూఁదియు నొక యేకాంతప్రదేశంబునం భక్షించునది యై

* 'ఇల్లు వెడలక చావంగ నేల మనకు!' అని పాఠాంతరము.

యంతరిక్షంబున దవ్వు(గాఁ) గొని చనియె నప్పుడు సేయు
నదిలేక కాంచిశీకత్వంబునఁ జీకాకువడియు వివేకనిధి యైన
పారావతి పారువంబుఁ దప్పక చూచి నయనసంజ్ఞం గాలుం
గఱువు మని కరపిన. 297

ఉ. శ్యేనముకాలివ్రేలు గఱచెఁగా నట దప్పక పారువంబు లో
నూనినతీవ్రవేదనకు నోరువఁ జాలక చీత్క్రియానుసం
ధానము పాదధూననముఁ దత్సమయంబునఁ జేసెఁబత్త్రియా
మానముదూరి పాఱెఁ రసమానరయంబునఁ బక్షిదంపతుల్.

వ. పాఱి యొక్కచోటంగూడి బలవద్విరోధంబునం జేసి గాశి
నుండ వెఱచి యయోధ్యానగరంబున సరయూతీరంబునం
బెద్దకాలంబు మనువు మని యపరజన్మంబున మందరధార
కుండను విద్యాధరుండును రత్నావళి యనునాగకన్యకయు
నై జన్మించి జాతిస్మృతివశంబున నప్పారువంబులు రెండును
దంపతు లై కాలక్రమంబునఁ గాశీత్రివిష్టపేశ్వరు సేవించి
ముక్తులైరి. ఇది త్రివిష్టపేశ్వరమాహాత్మ్యంబు. 299

## కేదారేశ్వరమాహాత్మ్యము

తే. ఆదిఁ బరమేశ్వరుఁడు గౌరి కానతిచ్చి
నట్టిపరిపాటిఁ జెప్పెద ననఘ! నీకుఁ
గాశికేదార శంభులింగంబుమహిమ
సావధానత వినుము వింధ్యాద్రిదమన! 300

వ. అనేకజన్మార్జితంబు లైనపాపంబులు గేదారేశ్వరస్మరణం
బునం బాయు. సాయంప్రాతఃకాలంబులఁ గేదారేశ్వరస్మర
ణంబు సర్వదురితహరంబు. 301

శా. ప్రాతఃకాలమునందు మర్త్యుఁడు*హరత్వాపాభిధానహ్రద
స్రోతఃపూరమునన్ మునింగి పరమజ్యోతిర్మయంబు న్మని
ధ్యాతవ్యంబును శాశ్వతంబు నగు కేదారేశలింగంబు సం
ప్రీతిం జేరి భజించి కాంచు వితతాభీష్టార్థసంసిద్ధులన్. 302

వ. తొల్లి రథంతరకల్పంబునందు వశిష్ఠుం డను విప్రుండు హిరణ్యగర్భాచార్యువలనం బాశుపతదీక్ష వడసి కేదారేశ్వరుని సేవించి ముక్తుం డయ్యె వెండియు. 303

సీ. శిశిరభూధరకన్య చిఱుబంతిపసు పాడు
నెందు సాయంకాల మిం పొనర్చు
నరుఁ డెందు జలము నుద్ధరణంబు సేవించి
శంభులింగముఁ దాల్చు జఠరపిఠరి
వినువీథిఁ బోరాడి వివశంబులై కూలి
హంసంబు లయ్యె వాయసము లెందుఁ
బ్రవహించు నెందు శ్రీభాగీరథికిఁ బోటి
యమృతప్రవాహాఖ్య యైనతటిని

తే. యది విముక్తివధూకంఠహారతిలక
దివ్యకేదారలింగేశతీర్థభూమి
సదనదీవాపిపల్వలహ్రదసమగ్ర
ద్రాక్షపందిరి కాశికోద్యానమునకు. 304

వ. అందు గౌరీకుండంబు గౌరతీర్థం బమృతప్రవాహతీర్థంబు మానసతీర్థంబు గలహంసతీర్థంబు మొదలుగా ననేకతీర్థం

* 'హరన్ బాపాభిధాన' యని యచ్చుపుస్తకము. 'హరం పాపాభిధాన' యని యొకవ్రాతపుస్తకము. 'హరపాపప్రదేస్నాత్వా' యని సంస్కృతమూలము. ఛందోభంగనివృత్తికై 'హరత్వాపు' యని సవరింపఁబడినది.

బులు గలవు. కేదారేశ్వరంబునకు నుత్తరంబునఁ జిత్రాంగ దేశ్వరలింగంబు, తత్సమీపంబునం గేదారేశ్వరస్థానంబు, దక్షిణంబున నీలకంఠేశ్వరలింగంబు, నీలకంఠక్షేత్రంబునకు వాయవ్యభాగంబున నంబరీషేశ్వరలింగంబు, తత్సమీపంబున నింద్రద్యుమ్నేశ్వరలింగంబు, నాదక్షిణంబునఁ గాలంజరేశ్వరలింగంబు, చిత్రాంగదేశ్వరు నుత్తరంబున క్షేమేశ్వరలింగం, బిది కేదారలింగమాహాత్మ్యంబు. ఇంక ధర్మరాజేశ్వరలింగ మాహాత్మ్యం బభివర్ణించెద. 305

తే. అనినఁ బ్రియ మంది నైమిశమునిగణంబు
సూతు నర్చించి భక్తిసమేతు లగుచు
ధర్మరాజేశ శివమహాస్థానమహిమ
గుహుఁడు సెప్పె నెవ్విధమునఁ గుంభజునకు? 306

వ. అవ్విధంబు మాకు నానతి మ్మనుటయు. 307

## ఆశ్వాసాంతము

శా. కల్పాంతానిలఘూర్ణమానజలముగ్గర్జానినాదోద్భటా
నల్పాటోపకఠోరఘాటిపటహోద్యద్ఘోషవిధ్వస్తసం
కల్పారాతినృపాలసంశ్రితకులక్ష్మాభృద్గుహాగేహా! యా
కల్పక్షౌమపటీపటీరవిశదా కాశ్మీరచంద్రప్రదా! 308

క. వీరావతార! వితరణ
పారాయణహృదయ! రాజపరమేశ్వర! ది
గ్వారణకరసన్నిభభుజ!
ధారాసురతాణదర్పధరణీధ్రపవీ! 309

మాలిని. ధరణిభరణహేలాధఃకృతక్రోడలీలా
జరఠకమఠభూభృచ్చక్రచక్రీశ్వరాశా!
ద్విరదనివహశుంభద్దీర్ఘదోస్తంభయుగ్మా
భరితగుణదిలీపా! పంటవంశప్రదీపా! 310

గద్యము. ఇది శ్రీమత్కమలనాభపౌత్త్ర మారయామాత్యపుత్త్ర సుకవిజనవిధేయ కవిసార్వభౌమ శ్రీనాథనామధేయ ప్రణీతంబైన కాశీఖండం బను మహాకావ్యంబునందు షష్ఠాశ్వాసము సమాప్తము.



# సప్తమాశ్వాసము




రాజరాజ ! సుగుణా
ధార ! ధరాభరణకరణధౌరంధర్య
స్ఫారభుజార్గళ ! భక్తిస
మారాధితభుజగహార ! యల్లయవీరా! 1

వ. అక్కథకుండు శౌనకాది మహామునుల కిట్లనియె. 2

### ధర్మరాజేశ్వరలింగమాహాత్మ్యము

తే. దృఢవివేక! ధర్మేశ్వరతీర్థమహిమ
యబ్జజునకైన వర్ణింప నలవి యగునె?
యమ్మహాక్షేత్రమున నున్న యండజములు
బ్రహ్మవిజ్ఞానవాసనాప్రవణమతులు 3

వ. కాశీమధ్యంబున ననర్ఘ్యమణినిర్మితంబై, మోక్షలక్ష్మీవిహార
స్థానంబై, సముత్తంభితశాతకుంభకుంభమండలీమండిత
సుధాధవళసౌధవీథీవిభ్రాజితంబై, యవతరణరభసశీర్ణ
స్వర్ణదీస్రోతశ్శలాకానుకారిపుంగవపతాకాలంకృతంబై
గవాక్షవివరోదీర్ణగుగ్గులుమసీసాక్షిధూపధూమరేఖా
స్మారితస్మరహరకంఠమూలకఠోరకాలకూటవిషచ్ఛాయా
ఛటాగుళుచ్ఛంబై యుండు ముక్తిమంటపంబునకు ముక్కంటి
మధ్యాహ్నకాలంబున బ్రాహ్మణవేషంబున వైశ్వదేవబలి

హారణంబులుసేయు మహాప్రాసాదంబునకు నింద్రదిగ్భాగం
బున జ్ఞానమంటపంబునందు బాలేందుధరుండు దక్షిణామూర్తి
స్వరూపంబు ధరియించి బ్రహ్మాదులకు జ్ఞానోపదేశంబు
సేయుఁ; దత్ప్రాంతంబున విశాలాక్షీహర్మ్యంబునందును
బ్రతివాసరంబును గుతపకాలంబునందు. 4

సీ. పసిఁడికమ్ములతోడి కుసుమపూవన్నియ
నిద్దంపుఁబుట్టంబు నెఱిక గట్టి
యింద్రనీలములతో నెడకట్టి గ్రుచ్చిన
రమణీయ తారహారము ధరించి
పారిజాతకతరుప్రసవగర్భితమైన
కబరిపైఁ జెంగల్వకచ్చు నిలిపి
ఫాలభాగంబునఁ బన్నీట మేదించి
కమ్మకస్తురితిలకమ్ము దీర్చి

తే. వలుఁదచన్నుల బిలుగుఁగంచెలనుఁ దొడిగి
కటిభరంబున వజ్రాలకాంచిఁ దాల్చి
యరసి యాఁకొన్నవారికి నమృతభిక్షఁ
గరుణ నిడు శ్రీవిశాలాక్షి కాశియందు. 5

వ. విశాలాక్షీపీఠస్థానంబునకు సమీపంబునఁ జంద్రపుష్కరిణీ
తీర్థంబు. 6

తే. భవ్యతరనిష్ఠ నుభయదర్భలను దాల్చి
సంధ్య వారుచుఁ జంద్రపుష్కరిణియందు
ఫాలనేత్రుంశు దారకబ్రహ్మమంత్ర
వర్ణకర్ణజాపుఁడు ప్రతివాసరమున. 7

వ. ఆతీర్థంబునకు ననంతరంబున రత్నేశ్వరలింగంబు, తత్సమీ

పంబున వృషభధ్వజలింగంబు, తత్సమీపంబున నర్ధనారీశ్వర పీఠంబు, తత్సమీపంబునఁ బంచనదతీర్థంబు, తత్సమీపంబునఁ బంచముద్రమహాపీఠంబు, తత్సమీపంబున వీరేశ్వర లింగంబు, తత్సమీపంబున సిద్ధేశ్వరలింగంబు, తత్సమీపంబున యోగినీపీఠంబు. 8

తే. కలవు పీఠంబు లానందకాననమునఁ
*జెట్టు వ్రేసిన చోట దాక్షిణ్యపుణ్య!
యర్థవాదంబు కాదు సత్యంబ కాని
పెద్దపీఠంబు ధర్మేశపీఠకంబు. 9

విశ్వభుజాఖ్యానము

క. విశ్వభుజాగౌరిపర
మేశ్వరి సేవించి యందు నింద్రాణి సమ
గ్రైశ్వర్యము సౌభాగ్యము
శాశ్వతముగ భర్తసంప్రసాదముఁ గాంచెన్. 10

వ. విశ్వభుజాదేవి మనోరథతృతీయావ్రతంబున నారాధించి శచీదేవి యింద్రుని, నరుంధతి వసిష్ఠు, ననసూయ యత్రిని, సునీతి యుత్తానపాదుని భర్తలంగా వరంబు వడసిరి. ఈ విశ్వభుజాదేవిసమీపంబున నాశావినాయకుండు ప్రణతా ఖిలభక్తజనమనోరథసిద్ధిదాయకుం డై యుండు. 11

తే. వృత్రవధయాదిగాఁ గలవృజినములకు
శాంతి గాఁ గాశికాపురి జంభభేది
ధర్మపీఠంబునకు నుపాంతంబునందు
నిష్ఠతో శంభులింగ ప్రతిష్ఠ చేసె. 12

*'జెట్టు వ్రేసినఁ జేటెఁ దక్షిణపుణ్య!' అని పూర్వముద్రితపుస్తకపాఠము.

### ధర్మేశమాహాత్మ్యము

వ. ధర్మతీర్థంబు బ్రహ్మహత్యాదిపాపంబుల నపనయింపంజాలుఁ,
దారకేశ్వరునకుఁ బశ్చిమభాగంబున నింద్రేశ్వరుండు, దక్షిణ
భాగంబున శచీశ్వరుండును, నింద్రేశ్వరుం బరివేష్టించి లోక
పాలేశ్వరులును, ధర్మేశ్వరునకుం బశ్చిమభాగంబున నూర్వ
శీశ్వరుండును, ధర్మేశ్వరునకుఁ నాలుగుదిక్కుల దత్త్వేశ్వర
వైరాగ్యేశ్వర జ్ఞానేశ్వ రైశ్వర్యేశ్వరులును నుండ్రు.
కదంబశిఖరంబున వింధ్యపాదంబున దమునికొడుకు దుర్ద
ముం డనువాఁడు జరాభారపీడితుం డై యొక్క పుణ్యపురు
షువలన జ్ఞానోపదేశంబు వడసి కాశికిం జని లింగప్రతిష్ఠ చేసె.
ఆదుర్దమేశ్వరుఁడు భజించువారలకు భోగమోక్షప్రదా
యకుండై యుండు. అమిత్రజిత్తనురాజు విష్ణుభక్తిపరాయ
ణుండు నారదునుపదేశంబువలనఁ గంకాలకేతుం డనురాక్ష
సుని చేత నపహరింపఁబడి పాతాళలోకంబునం జంపకావతి
యను పట్టణంబుననుండి కమలగంధి యనువిద్యాధరకన్యకం
బెండ్లియాడి యానందకాననంబున కరిగి వీరేశ్వరదివ్యలింగ
స్థానంబునం దనకాంత మనోరథతృతీయావ్రతంబు నోమించి
పుత్రవంతుఁ డయ్యె. 13

తే. మఱి హయగ్రీవతీర్థంబు మౌనివర్య!
కాశికాతీర్థములలోన ఘనము మహిమ
నంతకంటెను గజతీర్థ మభ్యధికము
ప్రథమఁ గోలావరాహతీర్థంబు నట్ల. 14

వ. దిలీపతీర్థంబు సప్తమునితీర్థంబు హంసగోవ్యాఘ్రేశ్వరముచు
కుంద పృథు పరశురామబలభద్రదివోదాసహరత్పాపదశా

శ్వమేధబదరీశుకశుక భవానీ ప్రభాసగరుడబ్రహ్మావృద్ధార్క నృసింహ చైత్రరథధర్మవిశాల లలితాగౌతమీ గంగా కేశవ నర్మదా వసిష్ఠ మార్కండేయభాగీరథీఖురకర్తరీదివిషత్ హయతీర్థంబు లనునివి మహాపుణ్యతీర్థంబులు.* 15

తే. ఇపుడు చెప్పినతీర్థంబు లెన్ని గలవు
వీని నన్నిటి రాశి గావించి యందు
మూఁడుకోటులు శివలింగములను నిలిపి
రెలమి నవియు వీరేశ్వరు నెనయ లేవు. 16

వీరేశ్వరాఖ్యానము

తే. అర్థినేతీర్థమునఁ దీర్థ మాడె నెవ్వఁ
డతని కాతీర్థమాడిన యంతఫలమె
అనఘ! వీరేశతీర్థ మాడిననరుండు
కాంచు నిశ్శేషతీర్థావగాహఫలము. 17

తే. కమలగంధితనూజుండు కలశజన్మ!
వీరుఁ డనువాఁడు హరుని (భక్తి) సేవింపఁబట్టి
యచ్చె శివునకు వీరేశుఁ డనెడునామ
మనఘ! యానందకాననాభ్యంతరమున. 18

వ. మఱియు సంగమేశ్వరతీర్థంబు పాదోదకతీర్థంబు క్షీరాబ్ధి తీర్థంబు శంఖతీర్థంబు మఱియుఁ జక్రపద్మగరుత్మద్వైకుంఠ నారద ప్రహ్లాదాంబరీషాదిత్యకేశవ దత్తాత్రేయ భార్గవ వామన నీలగ్రీవోద్దాలక నరనారాయణ యజ్ఞవరాహ విదారణ నరసింహలక్ష్మీనృసింహ గోపీ గోవిందశేషసాంఖ్య మహిషాసురబాణ వైతరణీప్రణవపిశంగిలాపిలిప్పిలానాగే

* అన్నింటికిని తీర్థంబు అని చేర్పఁబడినది.

శ్వర కర్ణాదిత్యభైరవ ఖర్వనృసింహ పంచనదతీర్థంబులు
భోగమోక్షప్రదంబులు. 19

స్రగ్ధర. ఆనందారణ్యభూమధ్యమునఁ గలవుఁ గో
ట్యర్బుదన్యర్బుదంబుల్
నానాముక్తిప్రదంబుల్ నలినజమురభి
న్నాకరాడ్వందితంబుల్
స్నానంబుల్ గల్గ నీపంచనదమును మహా
శంభుతీర్థంబుతోడన్
వానిన్ సామ్యంబు సేయన్ వలదు బహులని
ర్వాణలక్ష్మీసమృద్ధిన్. 20

వ. మఱియు జ్ఞానప్రపాతంబు మంగళతీర్థంబు, మయూఖాదిత్య
తీర్థంబు మఖతీర్థంబు, బిందుతీర్థంబు పిప్పలా(ద)తీర్థంబు,
మఱియు వరాహమరుత్తేశ్వరమిత్రావరుణాగస్త్యంగార కా
కోలచంద్ర విఘ్నేశ్వరహరిశ్చంద్ర పర్వతకంబలాశ్వతరసర
స్వత్యుమాభౌమమణికర్ణికాతీర్థంబు లివి తీర్థోత్తమంబులు
ముక్తిదాయికంబులు. 21

తే. వింటి వీవు తీర్థంబులు వేనవేలు
కలశ సంభవ! చెప్పితి గారవమున
హెచ్చు గుండాడఁగాఁ గూడదిల్వలారి!
యన్నిటికిఁ బెద్ద మణికర్ణి యని యెఱుంగు. 22

ఆ. అని దశాశ్వమేధ మర్ఘ్యంబు తీర్థంబు
పంచనదము కాశిఁ బస గలయది
వానికంటెఁ బెద్ద వాతాపితాపన!
చక్రపుష్కరిణి యసంశయంబు. 23

## దుర్వాసోలింగమాహాత్మ్యము

వ. ఇందు దుర్వాసేశ్వరలింగమాహాత్మ్యం బభివర్ణించెద నాకర్ణింపుము. 24

తే. సకలదేశంబులందును సంచరించి
ఋషివరేణ్యుఁడు దుర్వాసుఁ డేగుదెంచె
నఖిలముక్తివధూవిహారావరోధ
సౌధవీథికిఁ గాశికాస్థానమునకు. 25

వ. ఇట్లు వచ్చి యమ్మహాభాగుండు భాగీరథీనదీమాతృకంబులై ముక్కారును బండు పంటవలంతికేదారక్షేత్రంబులు, నిర్ధూతకలధౌతశలాకాశకలశంక సంకురింపఁ జేయఁ జాలు క్రొత్తమొలక లొత్తునవియును, సుకుమారశుకచ్ఛదచ్ఛటాచ్ఛాయాదంబులై యడ్డపచ్చఁ గొనునవియును, నార్యావర్తదేశమత్తకాశినీజంఘాకాండ పాండిత్యంబు గండూషించి చిగురుపొట్టలఁ గనుపట్టునవియును, బదియాఱువన్నియకడానికుందనంబు పెచ్చు కుందాడుపసిమిఁ బచేళిమంబు లగునవియు నైన ప్రాసంగుంజేలును, వికటఘటీయంత్రప్రాంతవాపికా సలిలధారాధోరణీ ప్రవాహసేకసంవర్ధితంబు లై జంబూజంబీరనారికేళ పనస సహకారకురవకవకుళాశోకశాకోటకుటజముఖనిఖిలవిటపివాటికాభిరామంబులైన యారామంబులును, సముద్దండపుండరీక కువలయ కుముదషండమండితంబు లగు తీర్థకుండంబులును, [1]నారపాతలగంభీరసలిలసంభారంబు లైన పరిఖాచక్రంబులును, గనకగిరిప్రదీప్తవప్రాకారంబు లగు ప్రాకారంబులునుం గనుంగొనుచు, భూర్భువస్స్వర్మహాలింగ

---

[1] సారసోత్పలేందీవరదంచితసలిలసంభారరసాతల.

మకుటగంగాతరంగకూటకోలాహలవ్యాజృంభి సముత్తం
భితశాతకుంభసౌధ వనచంద్ర శాలావలభిగర్భక్రోడంబు
లును, ఖఖోల్కాదిత్యప్రత్యగ్ర కిరణకందళీ సందోహస్పంద
కందళిత మందాకినీకనకారవింద కాననంబును, జైగిషవ్యే
శ్వరభూషాభుజంగ ఫూత్కారపవనధారాతరంగితోత్తుంగ
పుంగవపతాకాకౌశేయపట్టపటీవల్లీ వేల్లితన భోంగణంబును,
వికటాదేవీ కరకఠోరడమరుఢాంకార బృంహిత బ్రహ్మాండ
మండలంబును, ద్రుమిచండవతీ కరాళకంఠ మూలకాకోల
విషమషీవిస్తృత్వరాంధకారచ్ఛటాసంఘాతజ్యోతి ర్లింగాయ
మానశశిపతంగసమండలంబును, మహేశ్వరీ
వాహనవృషలంబకగళకంబళకషణమసృణత్వ క్శాఖాస్కంధ
పరిణాబంధురవరణాసింధురోధగ ప్రత్యాసన్నచైత్రద్రుమం
బును, ఢుంఠిరాజశుండాకాండ చులికితో న్ముక్తజ్ఞాన
వాపికా సలిలనిర్ఝర జలాంతరిక్షంబును, క్రోధభైరవ
ప్రబలహుంకార కఠినతరకహకహాట్టహాసముఖరిత ప్రాకార
గోపురాట్టాలకంబును, గర్భబీజంబులకుఁ నూషరంబును,
బుట్టువులకు వీడుకోలును, గలుషంబులకుఁ గర్తరియును,
మంగళంబులకు నాస్పదంబును, కైవల్యంబునకు ఘంటాప
థంబును, జ్ఞానంబులకుఁ దానకంబును, విరక్తికి నెలవును,
విభవంబులకుఁ బ్రభవంబును, విలాసంబులకు నివాసం
బును నయినకాశికాపట్టణంబుఁ బ్రవేశించి. 26

తే. తపసి పెద్దయుఁగాలంబు తపము సేసి
కాలగళుపీట నానందకాననమున

ఫలము గడుదూర మైనఁ గోపంబు పుట్టి
కాశినగరంబు శపియింపఁ గాఁ దలంచె. 27

వ. అప్పుడు ప్రత్యక్షంబై. 28

చ. కహకహ నవ్వి దంష్ట్రికలగల్ల మెఱుంగులు భానుదీప్తిసం
గ్రహముఁ దిరస్కరింప శితికంఠుఁ డకుంఠితరోషదీప్తుఁ డై
యహహ!దురాత్మ! కాశిపయిన గ్గెద వే? యనుపల్కుపల్కి యా
గ్రహమున నేను డుంఠిగణరాజు నెదిర్చితి మమ్మునీంద్రునిన్.

వ. అప్పుడు. 30

సీ. నందిషేణువిలోచనముల నిప్పులు రాలె
శూలంబు చేనందె సోమనంది
మృత్యుప్రకంపను మే నెల్లఁ జెమరించె
దండుఁ డాస్ఫోటించె ధరణి వగులఁ
గుంభోదరుండు భ్రూకుటి ఫాలమునఁ బూనెఁ
గోకిలాక్షుఁడు పండ్లు గొఱికికొనియె
నగ్నిజిహ్వుండు ఘోరాట్టహాసము సేసెఁ
గృత్తివాసుండు హుంకృతియొనర్చె

తే. భృంగితండులు తాండవప్రియుఁడు రేఁగి
డమరుగంబులు వాయించి రమితపటిమ
రాజరేఖాధరుండు దుర్వాసుమీఁద
నలుగు లెఱేఁగి తదీయరోషానువృత్తి. 31

శా. ఆభుగ్నభ్రుకుటీకరాళముఖులై యంగంబులుప్పొంగ ద్యా
వాభూమ్యంతర మట్టహాసడమరుధ్వానంబులన్ బిట్టు సం
క్షోభింపం బ్రమథధ్వజిన్యధిపతుల్కుంభోదరాదుల్మహా [న్.
భూభృత్సన్నిభులఘుభ్రులన్ ధరణి నాస్ఫోటించితాటించుచు

క. జడముడులు సడల భ్రుకుటులు
ముడివడఁ గనుఁగడలఁ గెంపు మొలతేరంగా
మృడు ప్రమథులు పులితోలుం
గడవసములు వి(న్న)డిచికొనుచుఁ గడురభసములన్. 33

ఉ. చంపుదుమే కృతాంతు? శిఖిచండమయూఖుల బారిగొం
దుమే?, డంపుదుమే కుభృత్పరివృఢంబుల? మొత్తుదుమే య
జాండముఁ గ్రొ?, జింపుదుమే చతుర్దిశలు జృంభితబాహుపరా
క్రమక్రియా, సంపద సొంపు మీఱఁ ? *బురసంహారునానతి
యింత గల్గినన్. 34

వ. అని వెండియు. 35

తే. మాటిమాటికిఁ గోపసంభ్రమము పేర్మిఁ
గక్షపాత్రంబులం దున్న కర్మభూతి
వదనములఁ బ్రామికొనుచు నిర్వక్రలీల
'హాహహా రా!' యని పల్కి రత్యాగ్రహమున. 36

వ. అప్పుడు దుర్వాసుండు శర్వాణీపతికి దండప్రణామంబు లాచరించి తలవకారముండక ఛాందోగ్య శ్వేతాశ్వతరాద్యు పనిషదర్థగర్భితంబు లైనబహువిధస్తోత్ర సందర్భంబులనమ్మ హాదేవుం బ్రస్తుతించె. శివుండునుం బ్రసన్నుండయి యమ్మునీంద్రునకుం గోరినవరంబు లొసంగి యంతర్హితుం డయ్యె ననంతరంబ. 37

తే. అమ్మునీంద్రుండు దనపేర నధికభక్తిఁ
గాశియందుఁ బ్రతిష్ఠించెఁ గాలకంఠు

---

* 'పురశాసన! మాకు ననుజ్ఞ గల్గినన్.' అని తాళపత్రపుస్తకపాఠము.

దివ్యలింగంబు భాగీరథీతటంబు
నందు మణికర్ణికాప్రాదోపాంతభూమి. 38

విశ్వకర్మేశ్వరలింగ ప్రాదుర్భావము

వ. దూర్వాసేశ్వరలింగంబు సర్వాభీష్టఫలప్రదాయకంబు. మఱి విశ్వకర్మేశ్వరలింగంబు ప్రాదుర్భావంబు వివరించెద సావధానమతివై యాకర్ణింపుము. త్వష్టృప్రజాపతికొడుకువిశ్వకర్మ బ్రహ్మచర్యంబున భిక్షాన్నభోజియై గురుగృహావాసియై విద్యాభ్యాసంబు చేయుచుండె నంత. 39

సీ. వానకాలము వచ్చె వర్షంబు లందందుఁ
జడివట్టి కురిసె నాసావియందు
గురుఁడు నాకొక్కమందిరము నిర్మింపుమీ
వర్షధారలచేత నుఱియకుండ
గురుపత్ని నా కొక్కకుపసంబుఁ గుట్టుము
చలిగాలి యొడలిపైఁ బొలయకుండ
గురునందనుండు నాకు రచింపు పావాల
నడుసు పాదంబులనంటకుండ

తే. గురుతనూభవ నాకు బంగరువుతొడవు
*వజ్రభూషలు సేయు తాల్పంగవలయు
ననుచుఁ బ్రార్థించి రందఱు కతఁడు మ్రొక్కి
యిన్నియును దాను గల్పింప నియ్యకొనియె. 40

వ. ఇవ్విధంబున గురునకు గురుపత్నికి గురుపుత్రులకు గురుతనూభవకు, వారలు కోరినయర్థంబులు సంఘటింప నను వెఱుంగక చింతాక్రాంతుండై యుండెనంత దైవయోగంబున

* 'వజ్రభూషణములు నాకు వలయుఁ దాల్ప' అని వ్రాతపుస్తకము.

నొక్కపుణ్యపురుషునుపదేశంబునం గాశి కరిగి శివలింగంబుఁ
బ్రతిష్ఠించి పరమనిష్ఠం బెద్దకాలంబు తపం బాచరింప బ్రత్య
క్షుం బై విరూపాక్షుం డనుగ్రహింప సర్వధాతువులకు,
సర్వదారువులకు, సర్వశిలలకు, సర్వమణులకు, సర్వరత్నంబు
లకు, సర్వపుష్పంబులకు, సర్వవస్త్రంబులకు, సర్వసుగంధం
బులకు, సర్వకందమూలఫలంబులకు, సర్వచక్రంబులకుఁ
దాన కర్త యగునట్లుగా వరంబు పడసి, గురుజనంబుల
యాజ్ఞ చెల్లించి సర్వోపకారపరుం డయ్యె. అతని పేరఁ గాశి
విశ్వకర్మేశ్వరుండు విశ్వాభీష్టఫలప్రదాయకుండయి యున్న
వాఁ డింక దక్షేశ్వరలింగప్రాదుర్భావంబు వివరించెద. 41

దక్షేశ్వరలింగప్రాదుర్భావము

ఉ. సామజదైత్యశాసనుఁడు సారసగర్భుఁడు నచ్యుతుండు సు
త్రాముఁడు నాది గా సురకదంబము గొల్వ నశేషలోకర
క్షామహనీయతన్ రజతశైలముపైఁ గొలు వుండె శుద్ధము
క్తామణిభూషితం బయిన కాంచనహర్మ్య శిలాతలంబునన్.

వ. తదనంతరంబ. 43

తే. వేలుపుల నెల్లఁ బరిపాటి వీడుకొలిపి
సముచితం బైనతారతమ్యమున శివుఁడు
మఱచె దక్షప్రజాపతి మామ ననుప
నెట్టివారికి మఱపు లేదే యొకపుడు? 44

వ. ఖిన్నుం డై యతం డుస్సురని నిజస్థానంబునకుం బోయి
నిజాంతర్గతంబున. 45

సీ. ఇతనివంశం బెద్ది యెఱుఁగంగ వచ్చునే?
యితనిగోత్రం బెవ్వఁ డెఱిఁగినాఁడు?

దేశంబు గుఱుతు సాధింపంగ వచ్చునే?
వర్తనం బెఱుఁగంగ వచ్చు నెట్లు?
వృషభవాహనుఁ డఁట విషముఁ దిన్నాఁడఁట!
యితనిసమాచార మేమి చెప్ప?
యస్త్రంబు ధరియించు నఁట తపస్వియు నట్టె!
యిట్టివేడబము లెయ్యెడలఁ గలవె?

తే. కాటిలో నుండు గార్హస్థ్యగణన యెట్లు?
బ్రహ్మచారియు గృహియు నెబ్బంగి నయ్యె?
శూద్రుఁడో! బ్రాహ్మణుండో! వైశ్యుండో! రాజో!
తెలియవచ్చునె యీతని కల తెఱంగు? 46

వ. అర్ధనారి గావునం బురుషుండు గాఁడు; గడ్డంబు గలదు గావున యోష గాదు; సమర్చనీయలింగమూర్తి గావున నపుంసకుండు కాఁడు; పెద్దకాలంబువాఁడు గావున బాలుండు గాఁడు; చిరంతనుండు గావునఁ దరుణుండు కాఁడు; జరామరణవర్జితుండు గావున వృద్ధుండు గాఁడు; మహాకల్పాంతంబునం బ్రహ్మాదుల వధియించియుఁ బాతకి కాఁడు; ఈతని చందం బెవ్వం డెఱుంగు? నని యట్లుండె. 47

క. మామ గురుస్థానంబు న
సామాన్యుఁడ నెట్లు? జలజసంభవసుతుఁడర్
సౌముఖ్యంబున యోగ
క్షేమం బారసి ప్రియంబు చెప్పఁగవలదే? 48

క. మాతాపితృవర్జితుఁ డగు
†నీతని కే నెట్లు బిడ్డ నిచ్చితి? నవియుర్

† 'నీతనికిని నెట్లు బిడ్డ నిచ్చితి (నదియుర్) నాదిర్' అచ్చుపుస్తకము.

నాతప్పు గాక యిది తా
నీతనితప్పెట్లు? నాకు నిది కావలయున్. 49

తే. పేద లయ్యును గడు బిఱ్ఱబిగిసి యుండ్రు
పట్టియభిమానములును గర్వములుఁ బట్టి
యల్లువారికి నెల్ల నీయవగుణంబు
వెన్నతోఁ బెట్టినది యింత విసువ నేల? 50

తే. అహహా! † యలచంద్రుఁ డనువాఁ డహంకరించి
రోహిణీదేవి నొల్లక రోసి యుండెఁ
బాపి నతని క్షయవ్యాధిబాధితుఁడుగఁ
గినిసి శపియింపనే? కల్ల వినఁగ నోర్వ. 51

క. ఇది ధర్మం బకులీనుల
కిది విధి మాతాపితృప్రహీనుల కహహా!
యిది కట్టడి తిరిపెములకు
నెదిరిం దను నెఱుఁగ కునికి యేలా మాటల్? 52

శా. తా నెట్లేనిఁ దిరస్కరించె నను నాస్థానంబునం దేవతా
మౌనివ్రాతములోన మామ యనుసన్మానంబు శూన్యంబుగా
నేనుం దన్నుఁ దిరస్కరించెద మఘుం బిప్పాటఁ గల్పించి సం
స్థానీయత్వముఁబూని యల్లుఁడను సన్మానంబుశూన్యంబుగన్.

వ. అని యజ్ఞసంభారంబులొడంగూర్చియజ్ఞపురుషుం డైనపురు
షోత్తముం డుపద్రష్టగా, బ్రహ్మవాదు లగుమరీచ్యత్రిభర
ద్వాజాదిసప్తర్షులు ఋత్విజులుగాఁ, ద్రైలోక్యంబును దక్షిణా
ద్రవ్యంబుగా, భృగుండు బ్రహ్మగా, నాంగిరసుండాచార్యుం

† 'మునుచంద్రుఁ; యిలచంద్రుఁ... రోహిణీదేవి నొకకొంత రోసి' అని వ్రాఁతపుస్తకము.

డుగా, భగపూషాదులుసదస్యులుగా, దిక్పాలకులు రక్షకు
లుగా, నల్లుకు ధర్ముండును జంద్రుండును గశ్యపుండు సహా
యులుగాఁ, గామధేనువు హవిస్సును గల్పవృక్షంబులు సమి
త్కుశంబులును విశ్వకర్మ దారుపాత్రశకటమంటపాలంకా
రంబులును గల్పించువారు గా, ధర్మపత్ని యగు శతరూపా
దేవితోఁ గూడి మహాధ్వరంబు సేయం దొడఁగె నంత. 54

తే. అరణిసంగ్రహ మొనరించి యజ్ఞనిపట్టి
పెద్దకోలు వుండె ముత్యాలగద్దె యెక్కి
చుట్టు బలిసి కూర్చుండిరి సురలు మునులు
వింజ మూఁ కిడిన ట్లుండె విశ్వసభయు. 55

వ. అప్పుడు పరమమాహేశ్వరుం డగు దధీచి యను బ్రహ్మర్షి
సభామధ్యంబున నిలిచి యెల్ల వారును విన నిట్లనియె. 56

సీ. భారతీదేవి †కైవారకావ్యంబులు
పఠియించుచున్నది ప్రస్ఫుటముగ
నాచార్యపదవికి నర్హమై నాయితం
బైయున్న వాఁ డుచథ్యానుజుండు

† ఇచటఁ గైవారశబ్దము సంస్కృతసమాసఘటితమైయున్నది. ఇది సంస్కృతశబ్దముగూడ నని శబ్దరత్నాకరమున నున్నదిగాని యచ్ఛకర్ణాటశబ్దముగఁ గర్ణాటనిఘంటువులో నున్నది. ప్రాచీనసంస్కృతనిఘంటు గ్రంథములలో నెక్కడ నీ శబ్దము గానఁబడదు. కావున నిది దేశ్యమొండెఁ గవివార(కవులపలుకులు) శబ్దతద్భవమొండెం గావలయు. ఈశబ్దము స్తుతిపరముగనే యఱవము నను గన్నడమునను వాడఁబడుచున్నది. ఇట్టే శృంగారనైషధమునను 'మీకై వారదుర్భాషణం, బులకుం గాని' (ఆ-7. ప-89)యని ప్రయోగించియున్నాఁడు. శ్రీనాథుఁడు సంస్కృతశబ్దముగ భ్రమించె నని తోఁచుచున్నది.

కర్మకాండవిదుండు గాఁడె యున్నాఁడు బ్ర
హ్మత్వమునకు క్షణం బంది భృగుఁడు
గట్టువాలై లక్ష్మికై సేయుచున్నది
చేరి యంతఃపురస్త్రీజనముల

తే. దేవి శతరూప జాలియఁ దీర్చె మౌళి
నీవు దీక్షిష్యమాణుండ విద్ధమహిమ
నధ్వరారంభ మిం కొప్పు నయ్య! దక్ష!
శివునిఁ దోడ్తేనియొక్కఁ యొచ్చెంబు తక్కఁ. 57

క. అపరాధ మింక నెట్టిది?
చెపుడా! మఖమునకుఁ దన్నుఁ జీరినమాత్రన్
త్రిపురాంతకుఁ రప్పింపక
యుపదర్శన మాచరింప నుచితమె హరికిన్. 58

క. వామాంగము వైకుంఠుఁ డ
వామాంగము వేధ మదనవైరికి నని యో
సోమప! యెఱుఁగుదొ? యెఱుఁగవొ?
యామృడు రప్పింపవలదె యధ్వరమునకున్? 59

సీ. శితికంధరునకు నెచ్చెలికాఁడు గాఁడొకో
యటమటీఁడైనయాయక్షభర్త?
యహికంకణునకు మూఁడవకన్ను గాఁడొకో
పాల్మాలినట్టియాపావకుండు?
పురవైరి కవతంసపుష్పంబు గాఁడొకో
నిర్భాగ్యుఁడైనయానీరజారి?
గంగాధరునకు లెంకలలెంక గాఁడొకో
పెనుగూళయైనయాయనిమిషేంద్రుఁ?

తే. దేమి గుడువంగ వచ్చినా రిండ్ల విడిచి
హరుని వెలివెట్టినట్టి యీయాగమునకుఁ?
బంచవదనునికను జేవుఱించె నేని
తత్క్షణంబున తమయాంధ్ర తాల్లు దెగవె? 60

తే. ఏల వచ్చినవాఁడు బాలేందుమౌళి
విరహితం బైనయీయాగవిధికి జముఁడు?
మఱచెనే శూలి డాకాలిమడమతాఁకు
దీర్ఘనిర్ఘాతసంపాతనిర్ఘృణంబు. 61

క. వినరే! 'శ్వేతాశ్వతరో
పనిషత్తు హరుండు భోక్త భర్గుఁడు భోగ్యం
బనిలాశిధరుఁడు ప్రేరిత'
యని చెప్పెనో లేదో యది ప్రయత్నముతోడన్? 62

వ. వియదాదిపరమాణ్వంతం బైనచరాచరాత్మకజగత్ప్రపంచం బునకు సృష్టిస్థితిలయకారణం బైనశంభుండు నీకు మానసీ యుండు గా కుండుట యెట్టు? విచారించి చెప్పుము. 63

తే. బ్రాహ్మణుఁడ నాశ్రితుఁడ నీకుఁ బరమహితుఁడ
దక్ష! యొకమాట వినవయ్య తగవు గల్గి
క్రతుఫలాధీశు భువనరక్షాధురీణు
భోగికంకణు రప్పింపు యాగమునకు. 64

వ. అర్థహీనం బైనవాక్యంబును, గర్మహీనం బైనశరీరంబును, బతిహీనం బైననారీరత్నంబును, గంగాహీనం బైనదేశం బును, బుత్రహీనం బైనదాంపత్యంబును, దానహీనం బైన వైభవంబును, మంత్రిహీనం బైనరాజ్యంబును, శ్రుతిహీనం బైనయాకారంబును, యోషాహీనం బైనసౌఖ్యంబును,

దర్భహీనం బైనసంధ్యాదికృత్యంబును, దిలహీనం బైన పైతృకంబును, హవిర్హీనం బైనహోమంబును, శివహీనం బైనక్రియాకలాపంబులు నిరర్థకంబులు. 65

తే. అనినఁ గోపించి దక్షుఁ డీయవనిసురుని
వెడలఁ ద్రోయుఁడు ప్రాగ్వంశవేశ్మ మనినఁ
దనకుఁ దాన దధీచి యాస్థాన మెల్లఁ
దల్లడిల్లంగ వెడలె నుద్దామభంగి. 66

వ. అతనితోడ దుర్వాసుండు, నుదంకుండు, నుపమన్యుండును, రుచికుండును, గాలవుండును, మాండవ్యుండును, వామదేవుండును, నుద్దాలకుండును వెడలిరి. అంతకమున్న మీఁదెఱింగి బ్రహ్మ సత్యలోకంబునకుం జనియె. మఖంబు ప్రారంభింపబడియె. తద్వృత్తాంతం బంతయు నారదువలన విని సతీదేవి మహేశ్వరానుమతి వడసి దివ్యరథారూఢ యై తండ్రికి బుద్ధిచెప్పుతలంపునఁ గైలాసంబున నుండి యేతెంచి. 67

తే. యజ్ఞవివాటంబు సొత్తెంచి యఖిలజనని
యర్థిఁ గూర్చుండె రత్నసింహాసనమున
భక్తితో దేవసభయును బ్రహ్మసభయు
నంజలులు ఫాలభాగంబునందుఁ గూర్చె. 68

వ. అప్పుడు దక్షప్రజాపతి కోపించి వచ్చినకూఁతుచిత్తం బెఱింగి యిట్లనియె. 69

సీ. హరుఁ డమంగళవేషుఁ డౌనొ కాఁడో చెప్పు
మెఱుఁగ కిచ్చితిమి నిన్నేమి చెప్ప?
నీటు చూడు † మిందఱు నిం తొప్పి యున్నవా

† వీరంద ఱిం తొప్పి' అని వ్రా. ప్ర.

రఖిలభూషణభూషితాంగు లగుచుఁ
దనరూపునకుఁ దోడు దలము దప్పినగర్వ
మరకంటఁ జూడఁ డే నరిగినపుడు
నా పెండ్లికొడుకులం దేపాటివాఁడు తా?
నేల రప్పింతు నే నీట్టివాని?

తే. నీవు వచ్చితి మే లయ్యె నింతెచాలు
నతఁడు రాకున్నఁ గొదువ లేదంశ మైనఁ
దాను భిక్షాకపాలంబు దాల్చి వచ్చి
బందు సేయుటకంటె రాకుండు టొప్పు. 70

వ. అనిన విని సతీదేవి తండ్రి కి ట్లనియె. 71

శా. ఆహా! లెస్స! వివేక మే! పురహరుం డాసించియున్నాఁడె నీ
స్వాహాకారము? శంభుఁ బాసి యిట నీసత్త్రంబునం దేనుమృ
ష్టాహారంబు భుజింపవచ్చితినె మోహాంధుండ వై యీశ్వర
ద్రోహం బేటికిఁ జేసెదంచు హితబుద్ధుల్ చెప్పఁగా వచ్చితిన్.

తే. శివుఁడు దాత భోక్త శ్రీమహాదేవుండు
సర్వమును హరుండు శాశ్వతుండు
శంభు వేలు సేసి సాగింప వచ్చునే
క్రియలు? వెఱ్ఱి వేల వయితి? చెపుమ. 73

దండకము. మఱి యతఁడు, సదానిధిధ్యాసితవ్యుండు మంతవ్యుఁ
డాతండు శ్రోతవ్యుఁ డాతండు ద్రష్టవ్యుఁ డాతండు జన్మస్థితి
ధ్వంసనమ్ముల్ తిరోభావమోక్షంబులుఁ గృత్యముల్గాఁగ నా
తండు లోకంబులం బట్టి పాలార్చు రుద్రుండు విశ్వాధికుం
డంచు నామ్నాయసంఘాత మామ్రేడనప్రక్రియం దోర
మై యాతనిం జెప్పు సత్యంబు నిత్యంబు శుద్ధంబు బుదం

బనంతంబు శాంతంబు కూటస్థమాత్మ ప్రతిష్ఠం బఖండంబు ద త్త
ద్వితీయంబచింత్యైక మానంద మాద్యం బవేద్యంబు
దిగ్దేశకాలవ్యవచ్ఛేదనీయంబు బ్రహ్మంబు ద త్తత్వమ్ముల్ వేదవే
దాంతవిద్యామహావాక్యమీమాంసహంసు ల్విచారింతు
ర థ్యాత్మ యోగంబునన్ షణ్ణవత్యంగులీమానయుగ్దేహమ
ధ్యాంతరాళానలావాస కోణత్రయీగేహరోహత్ప్రభా
కీలికాసూత్యతనిర్భిన్న షట్పుష్కరీగర్భ విష్కంభ నిష్కంపనీవా
రశూకోపమాధామధామచ్ఛటాకోటిశింపాలతాలంఘిత
ద్వాదశారేందునిష్యందమానామృతాసారధారాప్ల వాస్పంది
తానందులై యోగిబృందారకుల్ లీలతో లోనఁ గం ద్రా
తనిన్ నిక్కమై యాతఁ డొక్కండు భూతాత్మ భూతంబు
నం దుండి నానాత్వముం బొందిన ట్లుండు నట్లీఘటాంత
స్థితం బై ఘటాకాశమయ్యున్ పటాంతస్థితంబై పటా
కాశ మయ్యెన్ నిజంబొక్కయాకాశమాకాశముల్ పెక్కు
లైనట్టిచందంబులన్ భ్రాంతిదోఁచుం గదా! త్రిపురమథను
ఫాలనేత్రుం ద్రిలోకీగృహస్థుం ద్రయీమౌళిమాణిక్య
ఖండంబు బ్రహ్మాండకుక్షింభరున్ శంభుఁ గుంభీనసగ్రామణీ
కంఠహారున్ గటీభాగశాటీభవత్సింధురక్రవ్యభుక్కృత్తి
మృత్యుంజయుం గూఢపాత్కుండలుం బాండురాంగుం
గురంగాంకఖండావతంసుం గిరీశున్ లలాటేక్షణావిర్భవ
ద్భీషణోషర్బుధజ్వాలమాలాసమాలీఢ పుం డ్రే క్షు కో దం
డునిన్ భూర్భువస్స్వర్జగద్దాహలీలాకనద్దోహలవ్యాళహా
లాహలగ్రాసకల్మాషకంఠోపకంఠున్ నమద్బ్రహ్మవైకుంఠ
ముఖ్యామరవ్రాతకోటీరకోటీమణి శ్రే ణి శో ణ ప్ర భా జా ల

బాలాతపస్మేరపాదారవిందుఁ భజింపం దగుఁ సత్క్రియా
రంభకాలంబునఁ, జనక! కనకశైలకోదండుఁ డల్పుండు
గాఁ జూచితే? తండ్రి! కల్పాంతసంధ్యామహాతాండవాడం
బరారంభ సంరంభ సంక్షోభితాశేష లోకప్రపంచుండు
వంచింప నర్హుఁడో కో? యయ్యా! త్రయ్యంత విద్యావధూ
రత్న సీమంతసిందూరపాంసుచ్ఛటాపాటల శ్రీపదాంభోజ
యుగ్ముం డియస్మాత్ముఁడే? తాత! దైతేయ లీలావతీగండ
పాళీపరిన్యస్తకస్తూరికాపత్రవల్లీ మతల్లీ కళాద్రోహిబాహా
ర్గళస్తంభుపై నీ కవష్టంభసంరంభ మేలయ్యె యీలా
గునఁ? మధుమథన! మహాప్రబుద్ధుండ వీ విట్టిదుశ్చేష్టితం
బెట్లు వీక్షింపుచున్నాఁడ? వజ్జాప్త! నీయల్లువెల్వండ నీబండ
దుర్గోష్ఠితోఁగూడియున్నాఁడ విం కొక్కమాటైన నేమో
మునం జూచె దీశానుపాదాబ్జముల్? వహ్నీ! యీకూడు
దీఁ పయ్యెనే నీకు నిర్భాగ్య? ఏణాంక! యంతేగకళంకంబుఁ
దెల్లంబుగావించి తిన్నాళ్లకుఁ లెస్స గాకేమి? పౌలస్త్య!
నిన్నుం గనుంగొన్న సిగ్గయ్యెడుఁ? శక్ర! నీమొక్కలంబు
ల్వినంబడ్డవే కావె? వాచస్పతీ! నీచరిత్రంబు (చిత్రంబు)
నీచంబు చాలుఁ వృథాలాపముల్ (సేయ నీయున్న వారింద
ఉన్నారు) చూడంగ నేఁ డెల్లి యెల్లుండి యీలోన నేపా
కముం బొంద నున్నారొ? యేదుర్గతిం జెంద నున్నారొ?
యేయాపదం దూల నున్నారొ? యేపంచలం దూల
నున్నారొ? యామీఁద దైవం బొకం డెర్గఁడుఁ. 74

వ. అని పలికి భవాని కన్ను మొగిచి(న.) 75

సీ. పాదపద్మములందుఁ బ్రభవించునప్పుడు
    ప్రత్యగ్రయావకద్రవముచెలువు
కటిమండలంబుపైఁ గనుపట్టునప్పుడు
    కనకకాంచీదామకంబుడాలు
వలుఁదచన్నులమీఁద మొలతెంచునప్పుడు
    కాశ్మీరజాంగరాగంబుపొలుపు
సీమంతపదమునఁ జిగురొత్తునప్పుడు
    రమణీయసిందూరరజముసొబగు
తే. ప్రోడిసేయుచు భర్గున భుజగహారు
రాణివాసంబు దివ్యవిగ్రహమునందు
రవులుకొని మండె నాస్థానరంగభూమి
నధికరోషోత్థితంబు యోగానలంబు. 76
సీ. ఆక్రోశ మొనరించె నాహారవంబుతో
    బంధువర్గము శోకపరవశమున
మొగములు తెల్లనై మునులు దేవతలును
    భీతిల్లి చేతులు పిసికికొనిరి
చ్యుతవికంకతతరుస్రుక్స్రువప్రకరమై
    విభ్రాంతిఁ బొందె ఋత్విగ్గణంబు
† ప్రజ్వలింపఁగనాఱుభంగి యేమియు లేక
    యుడివోయి చల్లనై యుండె వహ్ని
తే. పుట్టె నుత్పాతములు పెక్కు భువిని దివిని
విడిచిపోయిరి యొకపాటి విబుధమునులు

† 'ప్రజ్వలింపఁగరాసిభంగి గా కొకభంగిఁ దఱచుగానుండె వైతాళి వహ్ని' అని అచ్చుపుస్తకము.

యజ్ఞవాటంబునందుఁ గామారిదేవి
యోగవహ్నికి దేహ మాహుతి యొనర్ప. 77

తే. భామతోఁ గూడి వచ్చినపారిషదులు
వేగమున నేగి సతిసుద్ది విన్నవింప
భవుఁడు కోపించి భ్రూకుటిభయదఫాల
భాగుఁ డౌనప్పుడొకమహాప్రభ జనించె. 78

వ. ఆప్రభామండలంబునడుమ నొక్కదివ్యపురుషుం డావిర్భ
వించి యమ్మహాదేవునకు నమస్కరించి. 79

సీ. వదనంబు దెఱచి మ్రింగుదునో బ్రహ్మాండంబు
పలుమోద కుండంగఁ బాండురాంగ?
పిండిపీచంబుగా బృథివీధరంబు ల
డంతునో కాలదండమున నభవ?
దండశూకాధీశుతలలు దండసిలంగఁ
దాటింతునో కాల ధర మహేశ?
వ్రచ్చి వైతునో కేలి వాలారునఖముల
నఖిలదిక్కులు శశాంకార్ధమకుట?

తే. యేమి సేయుదు? నానతి యిమ్ము నాకు
ననుచుఁ గ్రమ్మఱ మ్రొక్కి బాహాప్పళించెఁ
దన్మహాధ్వనిఁ గలఁగి యుత్కటము లగుచు
జడధు లేడును గలుషింప శంభుసుతుఁడు. 80

వ. అనిన రుద్రుం డతని రౌద్రోద్రేకంబునకువీరరసరేఖాముద్ర
కుం బ్రమోదం బంది భద్ర! నీకు వీరభద్రనామం బిచ్చితి;
నాయధిక్షేపంబున దక్షయజ్ఞంబుసంక్షయంబు నొందింపుము;
ప్రమథాక్షౌహిణీబలంబు నీకు సహాయం బయ్యెడు నని

యానతిచ్చిన మహాప్రసాదంబని విరూపాక్షుం బ్రదక్షిణంబు వచ్చి దక్షిణాభిముఖుండై ధాటీసంరంభంబున నరిగెనప్పుడు.

క. సంగడిఁ బిఱుంద ముందట
నింగియు నేలయును నిండె నిష్ఠురభంగిం
బుంగవకేతను సుభటుల
భంగురవీరప్రతాపభయదస్ఫురణన్. 82

క. కొండలు మహీరుహంబులు
గండోపలములు ధరించి కహకహ నగుచున్
మెండుకొని యజ్ఞవాటిక
† కొండొరు గడవంగ బారి రుద్భటభంగిన్. 83

వ. అందుఁ గొందఱు యూపస్తంభంబు లుద్ఘాటించిరి. కొందఱు కుండంబులను బూడిచిరి. కొందఱు మంటపంబులు పడఁద్రోచిరి. కొందఱు వేదికలు గ్రొచ్చిరి. కొందఱు హవిస్సులు భక్షించిరి. కొంద ఱన్నంబు లారగించిరి. కొందఱు పాయసంబులు మెసఁగిరి. కొందఱు పిండివంటకంబులు మ్రింగిరి. కొందఱు ఘృతదధిక్షీరక్షౌద్రపుండ్రేక్షుఫలాదు లాస్వాదించిరి. కొందఱు యజ్ఞపాత్రంబులు పగుల మొత్తిరి. కొందఱు స్రుక్స్రువంబులు విఱిచిరి. కొందఱు శకటంబులు విటతాటనంబులు సేసిరి. కొందఱు చషాలంబులు చెవులం దగిలించుకొనిరి. ఇవ్విధంబున నిర్మర్యాదంబై నిరవగ్రహంబై పారిషదుల యాగ్రహంబులు చెల్లుచుండం గోపాటోపసమున్నిద్రుండై.

---

† 'కొండొరుఁగడవంగఁ జొచ్చి రుగ్రత మెఱయన్' అని వ్రాఁతపుస్తకము.

సీ. తనమీఁద వైవంగ దంభోళి యెత్తినఁ
జేలఁగి సంస్తంభించె జిష్ణుభుజము
కైటభారాతి చక్రము ప్రయోగించిన
వెసఁ జక్కిలముఁ బోలె విఱిచి బొక్కెఁ
బటుచపేటంబునఁ బండ్లు డుల్లఁగ మొత్తి
పూషార్కువదనంబు బోసిపుచ్చెఁ
జిప్పముత్తెములు రాల్చినభంగి నలవోక
భగునిగ్రుడ్లదరంగ బలిమిఁదన్నె
తే. నర్ధచంద్రబాణంబున యజ్ఞమృగము
శిరముఁ దెగ నేసి కట్టె నంబరముమీఁద
ధాతసతిముక్కు సోణంబు దాఁకఁ గోసెఁ
బ్రకటవిస్ఫూర్తి శ్రీవీరభద్రమూర్తి. 85

తే. ద్రోహు లగు వేలుపులలోన దొరలి యున్న
పదియునొక్కండ్రు రుద్రులఁ బాఱ విడిచె
గాసి చేయక కాకోలకంఠుపట్టి
తండ్రిపేరివా రగుట చిత్తమునఁ దలఁచి. 86

వ. అంతట. 87

క. సిగ్గుచెడి భీతిఁ బాఱిరి
బగ్గనఁ బోధించి వీరభద్రునిధాటిన్
నుగ్గు లయి యపురుసవు రయి
గగ్గులకాండ్రై వికావిక లయి యమర్త్యుల్. 88

తే. దక్షునల్లుండ్ర మెడల సూత్రములఁ గట్టి
యూపములు సూత్రములతోడ నుద్దినేసి

దామెనలు గూర్చి నడిపించెఁ దరతరంబ
వీరభద్రుండు పశువుల వెల్చునట్లు. 89

మ. పనిలే దేటికి బాధ పెట్ట నను? నబ్రహ్మాణ్యమైతో? మొఱో
యని యుచ్చైర్ధ్వనిఁ గూఁతవెట్ట మఖశాలాంతంబునన్ శ్రా
ద్ధదేవునిఁ గట్టించెను వీరభద్రుఁడు భటవ్యూహంబుచే నా
గ్రహంబున ధూమోర్ణపయోధరద్వితయమున్ ముద్దాడు
హస్తాబ్జముల్. ౯0

క. *రాపించె భృగుని పండ్లను
గూపెట్టఁగఁ గాలకంఠుకోడు కుత్తరవే
దీపాషాణాంచలమునఁ
బాపపుయాగమునఁ దొట్రుపడి రంతమునుల్. 91

చ. మతకరిపాకశాసనుఁడు మత్తశిఖావళశాబకంబునా
కృతి ధరియించి ప్రాంతమునఁ గేలిమహీధరశృంగమెక్కని
ర్వృతమతి నుండె వేలుపుల వేదనఁ బెట్టెడువీరభద్రు ను
ద్ధతి పరికించుచున్ †నయపథంబు బృహస్పతిచే లెఱుంగఁడే?

తే. తఱిగె నర్యముదీర్ఘదోర్దండయుగము
క్రకచమున వీరభద్రుఁడు కరుణ దొఱఁగి
త్ర్యంబకునిపట్టి పవను వధ్యంబు సేసె
వానియంతగపురస్త్రీలు వనటఁ బొంద. 93

చ. వలపలికాల ముక్కునను వాత సుధారస ముప్పతిల్లఁ గా
వెలికిల వైచి మట్టె రణవీరశిఖామణి వీరభద్రుఁ డ

* క. 'రావించె భృగుని పాఠాంతరము.

† 'నయపంథంపు బృహస్పతి చొప్పెఱుంగఁడే.' ఒక వ్రా. ప్ర. చేఁద
ఱుంగఁడే' పూ. ము. ప్ర.

చ్ఛలమున రోహిణీరమణుచాయశరీరముఁ దత్పదాహతిం
గలిగిన కుందు గాదె పొడగానఁగ నయ్యెడు నేఁడు నిహ్నమై?

తే. ఈశ్వరద్రోహి! గర్వాంధ! ఋషిసురేంద్ర
బంధునాశైకకారణ! పాపకర్మ!
చావు మని యొక్క పెట్టునఁ జక్రధార
దక్షుతలఁ ద్రెవ్వగొట్టె ఫాలాక్షుసుతుఁడు. 95

వ. ఇవ్విధంబున మధుమథనుచక్రాయుధంబు విఱిచి, జంభాంతకు భుజాస్తంభంబు సంస్తంభించి, భగునికన్నులు కెలికి, పూషు పండ్లు వెఱికి, మఖమృగంబుశిరంబు ఖండించి, దక్షుతల ద్రెవ్వ వ్రేసి, దాక్షాయణిసుతుఁ బొట్టగు జ్జులుక ద్రొక్కి, భారతీదేవిముక్కు చిదిమి, గాలివధ్యంబుచేసి, జముని మెడ దండె దగిల్చి, యదితియధరపల్లవంబు చక్కడచి, యగ్ని నాలుకలు గోసి, నిరృతిఁ దలవట్టి వంచి, కింపురుషపతి మొగంబు పాషాణపట్టంబున బిట్టు రాచి, యనంతరంబ గరుడులం ద్రోచి, ఖచరులఁ బోరకొట్టి, యచ్చరల సిగ్గువుచ్చి, కిన్నరులఁ దునిమి, గుహ్యకుల గోడుకుడిపి, సాధ్యులం జెఱిచి, రుద్రులం బఱపి, మరుత్తులఁ ద్రోపించి, విశ్వుల వేఁచి, విద్యాధరుల వెలిచి, గంధర్వుల గారించి, యక్షుల నధిక్షేపించి, చక్షుశ్శ్రవుల శిక్షించి, చారణుల జంకించి, కింపురుషులఁ బరిభవించి, వీరభద్రుండు మాఱులేక మలయుచుండె నివ్విధంబున. 96

ఉ. తామరసాసనుం డగు పితామహు కూరిమిపట్టి యైనమా
తామహు యాగతంత్రమునఁ దంత్రముచేసి శివాజ్ఞవిక్రమో

ద్రాముఁడు వీరభద్రుఁడు పదంపడి యందఱఁ గాచె దేవతా
గ్రామణులందను వ్రణవికారములన్నియు మానునట్లుగన్.

తే. రణములో నైనతనువికారంబు లెల్ల
దేవతలకు శమించె నద్దేవుకరుణఁ
దాల్చె దక్షుఁడు వీతవ్యథాబలమునఁ
గంఠనాళాగ్రముననుండ మేండశిరము. 98

తే. శంకరద్రోహపాపప్రశాంతిఁ గోరి
దక్షుఁ డెంతయుఁ గాలంబు తపము సేసె
బహుళకైవల్యసామ్రాజ్యపట్టభద్ర
సింహపీఠికఁ గాశికాక్షేత్రసీమ. 99

వ. దక్షుండును దనపేర దక్షేశ్వరలింగంబుఁ బ్రతిష్ఠించె. 100

తే. అంబికకుఁ బుట్టినిల్లు నీహారశిఖరి
యత్తవారిల్లు కాశిమహాపురంబు
హిమకరోత్తంసునకుఁ బుట్టినిల్లు కాశి
యత్తవారిగృహంబు నీహారశిఖరి. 101

వ. నర్మదేశ్వరుండు సరస్వతీశ్వరుండు రత్నేశ్వరుపురోభాగంబున నధివసింతు రింక వ్యాసేశ్వరుమాహాత్మ్యం బభివర్ణించెద. 102

## వ్యాసేశ్వరుమాహాత్మ్యము

తే. బాదరాయణుఁ డఖిలభూపరిధియందు
సకలతీర్థంబులను నాడి శాంతబుద్ధి
నైమిశం బనుపుణ్యకాంతారమునకు
నరుగుదెంచెను శిష్యసంహతియుఁ దాను. 103

క. అతతమతి నతఁ డష్టా
శీతిసహస్రములు మునులు శివుఁ గొలువంగా

నేతెంచి శిష్యులును దాఁ
బ్రాతగకాలమునఁ బొగడఁ బద్మేక్షణునిన్. 104

వ. లక్ష్మీశ్వరుండె దైవంబు, జనార్దనుండె భుక్తిముక్తిప్రదుండు, విష్ణుధర్మంబె ధర్మంబు. 105

సీ. సత్యంబు భుజగేంద్రశయనుండె దైవంబు
సత్యంబ దైవంబు చక్రధరుఁడు
సత్యంబు వైకుంఠసదనుండె దైవంబు
సత్యంబు దైవంబు శాశ్వతుండు
సత్యంబు కైటభశత్రుండె దైవంబు
సత్యంబు దైవంబు శార్ఙ్గధరుఁడు
సత్యంబు వార్ధిజాసహితుండె దైవంబు
సత్యంబు దైవంబు శ్యామతనుఁడు

తే. మఱియు సత్యంబు దైవంబు మాధవుండు
మఱియు సత్యంబు దైవంబు మదనగురుఁడు
మాట లేటికి? దైవంబు మఱియుఁ గలఁడె
పుండరీకదళాయతాక్షుండు దక్క. 106

వ. అని యీప్రకారంబు వారణాశియందుఁ బంచనదంబునం బావనోదకంబులం దీర్థం బాడి యాదికేశవదేవుం బాంచరాత్రదివ్యాగమమార్గంబున నర్చించి విశ్వేశ్వరశ్రీమన్మహాదేవుభవనద్వారంబున నిల్చి దక్షిణభుజం బెత్తి సకలవేదపురాణేతిహాససిద్ధాంత నిశ్చితార్థంబు, సత్యంబు, పునస్సత్యంబు, వేదశాస్త్రంబులకంటెఁ బరం బైనజ్ఞానంబును, గేశవులకంటె బరంబైనదైవంబు లే దని పలికిన విని. 107

శా. 'ఎట్టెట్టూ! వినమైతిమింకనొకమాటేర్పాటుగాఁజెప్పుమా
భట్టారా!' యని నందికేశ్వరుఁడు విస్పష్టంబుగాఁ బల్కిన
న్బట్టెన్ గంఠబిలంబు చెయ్యి దివియన్వాదయ్యె వారాణసీ
హట్టప్రాంగణమందు వ్యాసునకు శిష్యశ్రేణి భీతిల్లఁగన్. 108

క. భుజవాక్స్తంభంబునఁ
బ్రజనితభయుఁ డగుచు ముట్టఁబడి మదిఁ దలఁచెన్
గజరాజవరదు గరుడ
ధ్వజుఁ డప్పుడ యరుగుదెంచె వ్యాసునికడకున్. 109

వ. వచ్చి 'యో బాదరాయణుండ! బుద్ధిమంతుండ విట్టియప రాధం బెట్లు సేసి?' తని కినిసి, 'నందికేశ్వర! నాకుం బ్రియం బుగా నీతని(యపరాధంబు క్షమించి) కరుణార్ద్రదృష్టింజూడు మని వేఁడుకొనియె. అప్పుడు సత్యవతీనందనునకు వాగ్భు జాస్తంభనంబులు నివర్తిల్లె. కృష్ణద్వైపాయనుండును బహు ప్రకారంబులంబరమేశ్వరుం బ్రస్తుతించి తన పేర వ్యాసేశ్వర లింగంబుఁ బ్రతిష్ఠించె. ఆలింగంబును దన్ను భజించువార లకు భోగమోక్షప్రదాయకుండై యుండు. అనిన విని కుంభ సంభవుండు శంభునందనున కభివాదనంబు సేసి సవినయంబుగా నిట్లనియె. 110

సీ. శైలారి వాగ్భుజాస్తంభం బొనర్చుట
నజ్ఞానవిరహితుం డయ్యె నేని
భాగీరథీతటోపాంతస్థలంబున
లింగప్రతిష్ఠఁ గల్పించె నేని
పుణ్యపంచక్రోశభూతీర్థమహిమంబు
నెరవుగా సర్వంబు నెఱిఁగె నేని

ముక్తిమంటపమధ్యమునఁ బురాణంబులు
శైవంబు లేర్పడఁ జదివె నేని
తే. తపమునకు బాధకములు క్రోధంబు లగుటఁ
దెలిసి యొక్కింత యేని తితిక్ష లేక
యేల శపియించెఁ గాశిఁ బుణ్యైకరాశి
గంధవతిపట్టి? యానతీ కార్తికేయ! 111

వ. అనిన గాంగేయుం డౌర్వశేయా? యడుగవలసినయర్థంబ యడిగితి. సాత్యవతేయుండు వాగ్భుజాస్తంభంబునాఁటం గోలె బుద్ధిమంతుండై యుండె. కాశికానగరంబుమీఁదం గోపించి బాదరాయణుండు శపించుటకుం గారణంబు మీఁద వివరించెద. కాశికామాహాత్మ్యవర్ణనావిశేషావశేషంబు వినుము. 112

## కాశీతీర్థమహిమావర్ణనము

తే. కలుగనీ కాశి శంభులింగములు కోట్లు
విశ్వనాథుండె లింగంబు శాశ్వతుండు
కలుగనీ తీర్థములు కోట్లు కాశియందు
ననఘ! మణికర్ణికయ తీర్థ మని యెఱుంగు. 113

క. సేవ్యుఁడు విశ్వేశుఁడు స్నా
తవ్యము మణికర్ణికాహ్రదజలౌఘము శ్రో
తవ్యంబులు శంభుకథా
దివ్యపురాణములు కాశితీర్థమునందున్. 114

సీ. వసియింప వలయు యావజ్జీవ మనురక్తి
పరత వారాణసీపట్టణమునఁ

చక్రపుష్కరిణి నిచ్చలుఁ దీర్థ మాడంగ
వలయు సంకల్పపూర్వకము గాఁగ
నర్చింప వలయు గంధాక్షతంబులఁ బుష్ప
ఫలపత్రముల విశ్వపతి మహేశు
నిలుపంగ వలయును నెఱసు వాటిలకుండ
నాత్మ ధర్మస్వవర్ణాశ్రమముల
తే. స్నానమహిమంబు భక్తితాత్పర్యగరిమ
వినఁగ వలయుఁ బురాణార్థవిదులవలనఁ
దనయథాశక్తివలయును దాన మిడఁగఁ
గాశిఁ గైవల్య మిన్నింటఁ గాని లేదు. 115
తే. యాత్ర విధ్యుక్తసరణిఁ జేయంగ వలయు
వలయుఁ బరివార క్షేత్ర దేవతలఁ గొలువ
వలదు బొంకంగ వలదు జీవముల కలుగ
వలదు నగియైనఁ బరమర్మములు వచింప. 116
తే. ప్రాణసందేహ మైనట్టిపట్టునందు
నన్యతములు వల్కవైనను నౌర్వశేయ!
యన్య రక్షింప వలఁచు టత్యంత మైన
పరమధర్మంబు కాశికాపట్టణమున. 117
క. కాలాంతకుకటకమునఁ బి
పీలికఁ గాచుట మహర్షిబృందారక! యీ
త్రైలోక్యంబును గాచుట
పోలఁగ శివధర్మసూక్ష్మములు దెలియు మదిన్. 118
తే. తీర్థసంవాసకారులై ధీరబుద్ధిఁ
గాశి వసియించుపెద్దల గారవించు

టధికధర్మంబు దాన నాశ్వాస మొందు
వివిధకైవల్యసంధాయి విశ్వభర్త. 119

సీ. కుదియించునది నెట్టుకొని యింద్రియవ్యాప్తి
మనసుచాంచల్యంబు మాన్చునది
మదిలోన మోక్షకామనము వీడ్కొనునది
పాయంగ నిడునది ప్రాణభయము
వ్రతదానధర్మసంరక్షణార్థంబుగాఁ
గావించునది యాత్మకాయరక్ష
తత్కాలదేహయాత్రామాత్రమునఁ గాక
సమకూర్చునది ధాన్యసంగ్రహంబు

గీ. నణఁచునది దంభ ముజ్జగించునది యీర్ష్య
యుడుగునది రాగలోభగర్వోదయములు
శాంతిదాంతితితిక్షానృశంససత్య
నిరతుఁ డగునది కాశిలో నిలుచు నరుఁడు. 120

క. ఒకవర్షశతంబున నొం
డొకతీర్థమునందుఁ గలప్రయోజనలాభం
బొకదివసంబున నానం
దకాననమునందు సర్వదా సిద్ధించున్. 121

క. నేమం బన నొకప్రాణా
యామంబునఁ నరుఁడు పడయునట్టిఫలశ్రీ
సామగ్రి యొండెడ ముని
గ్రామణి! సాష్టాంగయోగగతిఁ గనరు నరుల్. 122

సీ. *చక్రవాళపరీతసర్వసర్వంసహా
పరిధితీర్థములలో గరిమ కాశి
కాశికాపట్టణక్రోశపంచకతీర్థ
సమితిలో సారంబు జహ్నుకన్య
జహ్నుకన్యాతీర్థసముదాయకమునందుఁ
గడుఁ బెద్ద మణికర్ణికాహ్రదంబు
మణికర్ణికాతీర్థమజ్జనప్రతతికం
టెను విశ్వనాథుదర్శన మధికము

గీ. విశ్వపతికంటెఁ గైవల్యవిభునికంటెఁ
గాలకంఠునికంటె ముక్కంటికంటెఁ
దీర్థములు దైవములు లేవు త్రిభువనముల
సత్య మింకను సత్యంబు సంయమీంద్ర! 123

సీ. అఖిలకాలము శంభు నర్చించినఫలంబు
సకృదీక్షణంబున సంభవించు
భవసహస్రముల సంపాదితం బగుపుణ్య
మొకప్రదక్షిణమున కుపమ గాదు
పుష్పప్రదానంబుఁ బోలంగ లేవు షో
డశమహాదానకాండములు గూడి
తలకూడ దశ్వమేధఫలంబు పంచామృ
తాభిషేకవిధాన మాచరింప

* 'చక్రవాళపరీత సర్వసర్వంసహా ప్రథితతీర్థములలోఁ బెరుఁగుఁగాశి' యనుపూర్వముద్రితపుస్తకపాఠములో యతిభంగము. ఈపాఠమిష్టమేని 'చక్రవాళ......పృథులతీర్థములలోఁ బెరుఁగు కాశి' యని సవరించుకొనఁదగు.

గీ. వాజపేయసహస్రప్రవర్తనమునఁ
గలఫలం బబ్బునై వేద్యకల్పనమున
నిన్నియును జిత్తగించి విశ్వేశు నభవుఁ
గాశికాధీశు భజియింపు కలశజన్మ! 124

క. గొడుగులు వింజామరములుఁ
బడగలునుం దాలవృంతపటవాసకముల్
మృడుని కొసంగినధన్యుఁడు
పుడమి జితైకాతపత్రముగఁ బాలించున్. 125

వ. మఱి యాస్తిక్యబుద్ధి, వినయంబు, మానావమానంబుల వికృతిలేమి, యకామిత్వం, బనౌద్ధత్యం, బహింపరత్వంబప్రతిగ్రహావృత్తి, యదాంభికత్వం, బలుబ్ధత, యనాలస్యం, బపారుష్యం, బదీనత, యాదిగాఁ గలగుణంబులు కాశీతీర్థవాసికవశ్యంబును సంభావనీయంబులు. 126

తే. కలశసంభవ! 'వ్యాసుండు కాశిమీఁద
నేల కోపించెఁ జెప్పు' మం చీ వడిగితి
బాదరాయణకోపప్రపంచమునకుఁ
గారణము చెప్పెదను విను గౌరవమున. 127

వ్యాసుండు కాశిమీఁదఁ గోపించుట

సీ. త్రిషవణస్నానంబు దీర్చు భాగీరథి
శివధర్మములు చెప్పు శిష్యతతికి
నుదరపోషణము సేయును మాధుకరవృత్తి
లింగార్చనంబుఁ గల్పించు నియతి
ముక్తిమంటపమధ్యమునఁ బురాణము చెప్పుఁ
బంచాక్షరంబు జపంబు సేయు

భూతి సర్వాంగకంబుల సముద్ధూళించు
ధరియించు రుద్రాక్షదామకములు
తే. శ్రుతులు నాల్గేర్పఱచినట్టి సూక్ష్మబుద్ధి
బ్రహ్మసంవేది యాదిపురాణకర్త
భారతాఖ్యానసంహితా ప్రమథమసుకవి
గంధవతిపట్టి యానందకాననమున. 128

ఇవ్విధంబునం బెద్దకాలంబు కాశీనగరంబునఁ గృష్ణద్వైపాయనుండు శిష్యవర్గంబును దానును నపవర్గపదవీకల్యాణలాభార్థంబు వసియింప నమ్మునిమనస్థైర్యంబు పరీక్షింపం దలంచి విశ్వేశ్వరశ్రీమహాదేవుండు విశాలాక్షి కిట్లనియె.

బాదరాయణచిత్త మేపాటియదియొ
యరయుదము గాని యతఁడు భిక్షాటనమున
కేగుదెంచినయప్పు డింటింట భిక్ష
కలుగకుండంగఁ జేయంగ వలయు నీవు. 130

అనిన నద్దేవి మహాప్రసాదం బని యఖిలభూతాంతర్యామిని గావునఁ గాశికానగరంబున గృహిణీగృహస్థులయంతరంగంబుల నధివసించి భిక్షాప్రదానప్రతిష్టంభకారణం బై యుండె; నంత కృష్ణద్వైపాయనుండును. 131

*కాలోచితము లైనకరణీయములు దీర్చి

---

* 'గంగలోఁ జక్రపుష్కరిణీహ్రదంబున నఘమర్షణస్నాన మాచరించి నిలుచుండి కావించి నియతిమై గాయత్రి సంఖ్య యష్టోత్తరశతము గాఁగఁ బఠియించి యప్పుడు పత్రపుష్పములతో శివు నీలకంఠుని సేవ చేసి యంతరంగంబున నభవుని నిడుకొని శాంతచిత్తంబున సంధ్యవార్చి యగ్నికార్యముఁ దీర్చి కౌమారిఁ గొల్చి' అని యొకవ్రాతపుస్తకమునఁ బాఠాంతరము.

నరుణోదయంబు గానియటక మున్న
గంగలోఁ జక్రపుష్కరిణీహ్రదంబున
నఘమర్షణస్నాన మాచరించి
యరుణాంశుమండలం బర్ధోదయమునొందు
సమయంబు వీక్షించి సంధ్య వార్చి
నిలుచుండి జపియించి నియతితో గాయత్రి
సంఖ్య యష్టోత్తరశతము గాఁగ

తే. నగ్నికార్యముదీర్చిఁ గామారిఁ గొల్చి
ముక్తిమంటపికామధ్యమునఁ బఠించె
శివపురాణంబు మధ్యాహ్నసీమదాఁక
నపరనారాయణుఁడు బాదరాయణుండు. 132

మ. ఝటిటితిసూత్రాతపలాశపత్రపుటికాశాటీప్రసేవంబులున్
ఘటముల్ తామరపాకులున్ గుహాళులున్ గండోలముల్
వూని బా, సట వేదంబుఁ బఠించుచుం గదిసి వైశంపాయ
నాదుల్ సము, త్కటభంగిం గొలువంగ నేగె ముని భిక్షా
కృత్యయాజ్ఞార్థమై. 133

తే. నెట్టుకొని కాయు బిట్టెండఁ బట్టపగలు
తాను శిష్యులు నింటింట దప్పకుండఁ
గాశికావిప్రగృహవాటికలఁ బొనర్చె
నఖిలవిద్యాగురుండు భిక్షాటనమును. 134

శా. ఛాత్రుల్ పైలసుమంతజైమినులువైశంపాయనుండాదిగాఁ
బాత్రంబుల్ధరియించి యన్ని దెసలన్ భైక్షంబు వేఁడంగ న
క్షత్రాధీశ్వరమౌళిపట్టణమునం గాశిం దలంప న్మహా
చిత్రంబోగిరమబ్బదయ్యె ఋషికింజేకూరదయ్యెందుదిన్. 135

తే. తిరిగె నింటింట భిక్షాం ప్రదేహి యనుచు
బాదరాయణుఁ డీకాశికాపట్టణమున
నొట్టు వెట్టినయట్లు నేయుగ్గులియును
బిలిచి యొకపట్టెఁడన్నంబు వెట్టదయ్యె. 136

తే. వండుచున్నార మనె నొక్కవనజనేత్ర
తిరిగి రమ్మనె నొక్కలేఁదీఁగెఁబోఁడి
దేవకార్యంబు నేఁ డనెఁ దెలివ యొర్త
ద్వారకవాటంబుఁ దెఱవదు వనిత యొకతె. 137

వ. ఇవ్విధంబున భాగ్యహీనుండు ధనంబునుం బోలె భిక్షాన్నంబు వడయ నేరక మఠంబునకుం జని జఠర క్షుధావ్యథాదూయమానమానసుండై కృష్ణద్వైపాయనుండు శిష్యుల రావించి వారల కిట్లనియె. 138

తే. అబ్బనే నేఁడు మీకు మధ్యాహ్నభిక్ష
బ్రహ్మపురివాడఁ గాశికాపట్టణమున ?
నబ్బదో నాకపోలె మహర్షులార !
వాడవాడల నీపెద్దవల్లకాట? 139

సీ. దుర్భిక్షదోషంబు దొరకొన్నఁ గడపని
కడపనిగృహసూతకంబునందు
నింటఁ బీనుఁగు వోయెనేనియుఁ గడపని
కడపనిమ్రుక్కడి గవిసె నేని
కువలయేశుఁడు దండుగులు గొన్నఁ గడపని
కడపనిభవనంబు గాలె నేని
పితృకార్యవిధి సమాప్తింపక గడపని
కడపనిముట్టంటు గలసె నేని

తే. వేళఁ గాకున్నఁ గడపని వేలుపులకు
మీఁదు వోకున్నఁ గడపనిమిన్న కెట్లు
గడపిరింటింట నీకాశికాపురమునఁ
బుణ్యగేహిను లిది మహాద్భుతము గాదె ? 140

వ. పెద్దకాలమునంబట్టి మన మున్నవార, మిక్కాశీపట్టణంబున భిక్షాన్నంబుపుట్టనిదినంబునుం గలదె ? కుతపకాలంబునందు.

సీ. ముంగిట గోమయంబున గోముఖము దీర్చి
కడలు నాల్గుగ ముగ్గుకట్టువెట్టి
యతిథి నచ్చో నిల్పి యర్ఘ్యపాద్యము లిచ్చి
పుష్పగంధంబులఁ బూజ చేసి
ప్రక్షాళితం బైనపసిఁడిచట్టువముతో
నన్నంబు మీఁద నెయ్యభిఘరించి
ఫలపాయసాపూపబహుపదార్థములతో
భక్తివిశ్వాసతాత్పర్యగరిమఁ

తే. బెట్టుదురు మాధుకరభిక్ష భిక్షుకులకుఁ
గంకణంబులతో సూడిగములు రాయఁ
గమ్రకరముల బ్రాహ్మణాంగనలు కాశి
నన్నపూర్ణభవాని కట్టనుఁగుఁజెలులు. 142

క. ఆపరమపురంధ్రిలయం
దేపుణ్యాంగనయు భిక్ష యిడదయ్యెఁ గటా !
రేపాడి మేలుకొని మన
మేపాపాత్మునిముఖంబు నీక్షించితిమో? 143

తే. వాడఁబాఱినయవి వక్త్రవనరుహములు
భాజనంబులలోన నిప్పచ్చరంబు

మీకు భిక్షాన్నములు లేమి నాకుఁ దెలిసెఁ
జేలపంటలఁ గొయ్యలు చెప్పఁ గాన. 144

వ. చతుర్విధపురుషార్థములకు నకట! పుట్టినిల్లైన యిక్కాశీనగ
రంబున మనకు నేఁడు భిక్షాన్నంబు పుట్టమికిఁ గారణం
బేమియో మీర పరామర్శించి రం డనిన నట్లకాక యని
గురునియోగంబున నందఱు నన్నిముఖంబుల(కు)ం జని
యేయవకరంబునుం బొడఁగానక క్రమ్మఱవచ్చి శిష్యులు
బాద రాయణున కి ట్లనిరి. 145

తే. అవధరింపుము నారాయణావతార!
బాదరాయణ! కాశికాపట్టణమున
నవకరము లేదు మీయట్టియధికపుణ్యు
లుండ నివ్వీటి కెట్లు గీ డొంద నేర్చు? 146

సీ. విశ్వేశ్వరుం డెందు విచ్చేసియున్నాఁడు
కైలాసశైలశృంగంబు విడిచి
ప్రవహించు నెందేని భాగీరథీగంగ
యుపకంఠమున హారమో యనంగ
నాఁకొన్నవారికి నమృతభిక్షాన్నంబుఁ
గృప సేయు నెందేని గిరితనూజ
యుండు డుంఠివినాయకుం డెందు నొసలిపై
యువరాజపట్టంబు నవధరించి

తే. యెందునుందురు తమయంత లేసివారు
పరమపుణ్యులు సంయమీశ్వరు లనేకు
లట్టికాశిని భిక్షాన్న మబ్బ దనుట
వినఁగఁ బోసఁగునె యిది యేమి విధమొ కాక. 147

సీ. జిలుఁగుసంధ్యారాగచీనాంబరము గట్టి
కుసుమగర్భపుఁ గీలుకొప్పు తనర
కస్తూరితోఁ గూర్చి గంధసార మలంది
ముత్యాలతాటంకములు ధరించి
సీమంతపథమునఁ జేర్చుచుక్క సవరించి
కురులపైఁ జిన్నిపూ గుస్తరించి
శ్రీపాదముల హేమనూపురంబులు దాల్చి
కటిమీఁద వజ్రాలకమరు నిల్పి
తే. యన్నపూర్ణ విశాలాక్షి యనెడు పేళ్లఁ
గాశికామధ్యశృంగాటకములయందు
విశ్వపతిదేవి మధ్యాహ్నవేళఁ బెట్టు
నమృతపాయసదివ్యాన్న మనుదినంబు. 148

తే. మనము మనమనపూర్వజన్మములయందుఁ
గడపినారము మధ్యాహ్న కాలభిక్ష
యనుభవింపక పోవంగ నలవి యగునె
కమలజుని కైనఁ బ్రారబ్ధకర్మఫలము.? 149

క. అందఱు భుజంగభూషణు
* లందఱునుం గాలకంఠు లందఱు గిరిశుల్
అందఱు ధృతేందుకళ లా
నందవసీనగరనివసన స్థిరులు నరుల్ 150

తే. బ్రహ్మలోకంబు గాశికి బడిసివాటు
విష్ణులోకంబు గాశికి వినిమయంబు

---

* 'లందఱును ద్రిశూలపాణు లందఱును గిశో, రేందూత్తంసులు' అనిపా.

దాసదాసానుదాసబృందంబు గాశి
కింద్రచంద్రాదిలోకంబు లిద్ధమహిమ! 151

సీ. శివుని నివాళించు శేషాహి నడురేయి
బహుఫణారత్నదీపములచేత
నంతర్హితంబులై యర్చించు నీశాను
ఫలపుష్పములఁ గల్పపాదపములు
కామధేనువులై దుఖండేందు శేఖరు
సూధస్యధారల నోలలార్చు
నిధులు తొమ్మిదియుఁ గంఠేకాలునకు నిచ్చు
నిర్మలమణులు కానికలు గాఁగఁ

తే. గాశికాపట్టణంబు శంకరుని నెలవు
కలి ప్రవేశింప దానందకాననమున
శ్రీనివాసంబు వారాణసీపురంబు
ముక్తిసంధాయకం బవిముక్తమెపుడు. 152

వ. అని శిష్యులు గాశీమాహాత్మ్యంబు వర్ణించిన విని బాద
రాయణుండు వారి కిట్లనియె. 153

తే. ఉపవసింతుము గాక నేఁ డుఁగి మడిఁగి
యస్తమించుచు నున్నవాఁ డహిమభానుఁ
డెల్లి పారణకైన లే దెట్టు మనకు
మాధుకరభిక్ష బ్రాహ్మణమందిరముల. 154

వ. అని యారాత్రి గడపి మఱునాఁడు మధ్యాహ్న కాలంబున
శిష్యులుం దాను వేఱువేఱ వేదవ్యాసుండు విప్రభవనవా
టికలభిక్షాటనం బొనర్పంబోయి తొలునాఁటియట్ల ముక్కంటి
మాయ నేమచ్చకంటియు వంటకంబు వెట్టకున్నఁ గటకటం

బడి భిక్షాపాత్రంబు నట్టనడువీథిం బగుల వైచి కోపావేశం
బున. 155

తే. ధనమదంబును వేదవిద్యామదంబు
మోక్షలక్ష్మీమదంబును ముదిరి కాదె
కాశికాపట్టణంబునఁ గరుణ లేక
బ్రాహ్మణులు నన్ను నిటు భంగపఱిచి రనుచు. 156

వ. కృష్ణద్వైపాయనుం డాత్మగతంబున. 157

తే. ధనము లేకుండెదరు మూఁడుతరములందు
మూఁడుతరములఁ జెడుఁ గాక మోక్షలక్ష్మి
విద్యయును మూఁడు తరముల [1]వెలయవలయుఁ
బంచజనులకుఁ గాశికాపట్టణమున. 158

వ. అని పారాశర్యుండు క్షుత్పిపాసాపరవశుండై శపియింపం
దలంచునవసరంబున నొక్కవిప్రగృహంబువాకిటఁ బార్వతి
[2]ప్రకృతస్త్రీవేషంబున. 159

ఉ. వేనలి పాటపాట నరవెండ్రుకతోఁ దిలతండులాన్వయ
శ్రీ నటియింపఁ గై సడలి వ్రేఁకనిచన్నుల పాలవంకపైఁ
గా నసియాడ్పవాలుఁ దెలికన్నులు గల్కితనంబు వీడ్కొనన్
మానిని హస్త మూఁదియొకమంజులభాషిణి వచ్చె వీథికిన్.

ఉ. వేదపురాణశాస్త్రపదవీనదవీయసి యైన పెద్దము
త్తైదువ కాశికానగరహాటకపీఠశిఖాధిరూఢ య
య్యాదిమశక్తిసంయమివరా! యిటు రమ్మని వీచె హస్త సం
జ్ఞాదరలీలరత్నకటకాభరణంబులు ఘల్లుఘల్లనన్. 161

వ. చేరం బిల్చి యమ్మత్తకాశిని సాత్యవతేయున కిట్లనియె. 162

1. వెడలవలయు 2. ప్రాకృత.

శా. ఆకంఠంబుగ వేడ్కతో నిపుడు భిక్షాన్నంబు భక్షింపఁగా
లేకున్నం గడు నంగలార్చెదవు మేలే! లెస్స! శాంతుండవే!
నీకంటె న్మతిహీనులే కటకటా! నీవారముష్టింపచుల్, శాకా
హారులుఁ గందభోజులు శిలోంఛప్రక్రముల్ దాపసుల్.

తే. ఓమునీశ్వర! వినవయ్య యున్నయూరుఁ
గన్నతల్లియు నొక్కరూపన్నరీతి?
యటు విశేషించి శివుని యర్ధాంగలక్ష్మి
కాశి యివ్వీటిమీఁద నాగ్రహము దగునె? 164

తే. వేయుశాఖలతో సామవేదరాశి
యేకవింశతిరూపమై ఋజ్నిగమము
తొమ్మిదియు నూటయొక్కండు త్రోవ లంది
మెరినొ నాథర్వణయజుస్సు లుండుఁ గాశి. 165

వ. ఇట్టి కాశికానగరంబుమీఁద భిక్ష లేకుండ కారణంబుగా నీయంతవాఁడు గటకటంబడి శపియింపం దలంచునె? బ్రాహ్మణుండవు గదా: నీకు నేమన్ననుం జెల్లు. అటు విశేషించి యాఁకొన్నవాఁడవు కావున నీయవసరంబున నిన్ను హెచ్చుకుందాడుట మముబోఁటిగృహిణులకు మెచ్చు గాదు. మాయింటికిం గుడువ రమ్ము. కుడిచి కూర్చున్న పిమ్మటం గొన్నిమాటలు నీతోడ నాడఁ గల విప్పుడు. 166

తే. వైశ్వదేవాదివిధుల సర్వమును దీర్చి
యరసియున్నాఁడు నాభర్త యతిథిరాక
నతిథి పంక్తికి రాకున్న నారగింపఁ
డొంటి నొకనాఁడుఁ బతి యెట్టిరోఁజకమునను. 167

తే. అభ్రగంగ నుపస్పర్శ మాచరించి
వేగ విచ్చేయ వలయు నావిభుఁడు దసిలి
యాఁకటికి నోర్వలేఁడు బ్రాహ్మణవరేణ్య!
యర్కుమండల మిదె వ్రాలె నపరదిశకు. 168

వ. అనిన వేదవ్యాసుండు ముత్తైదువ కిట్లనియె. 169

తే. కమలలోచన! కిన్నరాంగనవె నీవు
నీవు గంధర్వభామవే నీలవేణి?
యప్సర స్త్రీవె నీవు బింబాధరోష్ఠి?
రమణి! నీవు విద్యాధరరాజసుతవె?

సీ. కల్యాణి! నిన్ను నీకాశీపురములోన
నెన్నండుఁ గాన నీ వెవ్వరమ్మ?
నిన్ను దర్శింపంగ నిఖిలేంద్రియములకు
నత్యంతసంతృప్తి యావహిల్లె
రాహుదంష్ట్రాంకురక్రకచఘట్టనభీతి
జగతి కేతెంచినచంద్రకళవె?
నన్ను రక్షింపంగ నాపాలఁ గల్గిన
భాగ్యదేవతవొ తప్పదు నిజంబు

తే. ఒండెఁ గైవల్యలక్ష్మివి యొండె నీవు
కామినీత్వంబుఁ గైకొన్న కాశిపురివె?
యొండె నాఁకొన్నవారల నూఱడించి
యమృతభిక్షొసఁగు మిదువిశాలాక్షి వీవు. 171

తే. చేయఁ గలవాఁడ నేను నీ చెప్పినట్లు
బ్రాహ్మణుఁడఁ గాన నాకుఁ జాపలము ప్రకృతి

బుద్ధిఁ గృప సేసి రక్షింపు పుణ్యసాధ్వి!
కాన! నీపేరు నాకు నిక్కముగఁ జెప్పు. 172

వ. అనిన నమ్మత్తకాశిని సాత్యవతేయున కిట్లనియె. 173

శా. ఊర్కోఁ జెప్పఁగ నెంత యేని తడ వౌ నో విప్రశార్దూల! నీ
వాఁకొన్నాఁడవు భోజనోత్తరమునం దాస్థానమై యుండి య
త్త్రాఁకం బెట్టక చెప్పెదర్ వినుము వృత్తాంతంబునుం దేటగా
వీఁక న్వేళ యతిక్రమించెఁ గుడువన్ వేంచేయుమా గ్ర
క్కునన్ 174

వ. అనినం బారాశర్యుం డయ్యార్యతో నమ్మా! యొక్కవిన్న
పంబు గల దాకర్ణింపు మని యిట్లనియె. 175

తే. అయుతసంఖ్యశిష్యు లాయాయివీథుల
వేఱువేఱ భిక్ష వేఁడితేఱ
నేను నొక్కవీథి నేకాంతవృత్తిమైఁ
బర్యటించి తెత్తుఁ బంచభిక్ష. 176

చ. దినము దినంబుఁ దప్పకిటు ద్రిమ్మరిచాలఁగభిక్షచేసియుం
జనునెడఁ గూడ వత్తురు కృశానుసమానులు నన్నుఁబైలజై
మినిముఖు లైనశిష్యులు సమిద్ధమతిం బురసూర్యవీథికిన్
మునుకొని యొయ్యనొయ్యఁ గరముం గరవల్లియునుంబఱిం
[చుచున్.

తే. శిష్యులును నేను గూడి రాజీవనేత్ర!
యాశ్రమమునఁ బాషాణమఠాంతరమున
రాశి వోయుదు మఖిలపాత్రికలయందు
నందఱును దెచ్చినట్టి భిక్షాశనముల. 173

సీ. పాయసాపూపాదిపక్వాన్ననివహంబు
లేకీభవించిన నేర్పరించి

యన్నింట సగ మతిథ్యభ్యాగతార్థంబు
భాజనంబుల నించి పాయఁ బెట్టి
సగము భాగీరథీసలిలధారాప్రపూ
రంబునఁ బ్రక్షాళితంబు సేసి
తారతమ్యమున వృద్ధపురస్సరంబుగాఁ
బరిపాటి వేర్వేఱ బంతి సాగి

తే. యర్థి 'నమృతాయతా' మని యనుమతించి
యేను మున్ను ప్రాణాహుతు లెత్తఁ జూచి
చేయుఁ బ్రాణాగ్నిహోత్రంబు శిష్యకోటి
యింతగాలంబు నీ వ్రతం బిట్లు సెల్లె. 179

ఉ. ఎన్నఁడుఁ జూడ మున్వినమె యిట్టిమహాద్భుతమేమిచెప్పుదుం,
గిన్నరకంఠి ? యొ ట్టిడినకీలునఁ గాశిపురంబునందు భి
క్షాన్నము లేదు నీయడుగు లాన నిజంబుగ విన్నవించెదన్
నిన్నటబట్టి యేము నిరు నీఁగియు నుంటిమి నిట్టుపాసముల్.

ఉ. చట్టలు డప్పిమై నవురుసౌ రయి పాత్రలుఁ దారుఁ గాశికా
పట్టమునందుఁ గూటికి నుపాయము లేక పరిభ్రమింప వా
రెట్టటపోవ నిమ్మనుచు నించుకయేనియుఁ దాల్మి లేక యే
నెట్టుభుజించువాఁడఁదరళేక్షణ! యొక్కఁడనీగృహంబునన్.

తే. అస్తమింపంగఁ జేరినాఁ డహిమకరుఁడు
శిష్యులే కాక యయుతంబుఁ జిగురుఁబోఁడి!
వ్రతము దప్పి భుజింపంగ వలను గాదు
నేఁడు నిన్నటిమఱునాఁడు నిక్కువంబు. 182

చ. అనవుడు నల్ల నవ్వి కమలానన యి ట్లను లెస్సగాక యో
మునివర! నీవు శిష్యగణముం గొని రమ్మిట వేడ విశ్వనా

ఘుని కృపపేర్మి నెంద అతిథుల్ చనుదెంచినఁ గామధేనువుం
బనిగొనునట్లు పెట్టుదు నపారము లైనయభీప్సితాన్నముల్.

వ. అనిన నట్లకాక మహాప్రసాదం బని వేదవ్యాసుండు శిష్యు
లం గూర్చుకొని భాగీరథికిం జని యుపస్పర్శం బాచరించి
యేతెంచిన. 184

తే. గొడుగు పాగలు గిలుకలు గులుకరింప
నిందుబింబాస్య యెదురుగా నేగుదెంచి
ఛాత్ర సహితంబుగాఁ బరాశరతనూజు
బంతి సాఁగించె ముక్తిశాలాంతరమున. 185

వ. అనంతరం బావిశాలాక్షీ మహాదేవియనుభావంబున నమ్మహా
మునులముందటం గనకరంభాపలాశపాత్రంబులయందు విచి
త్రంబుగాఁ గలవంటకంబులు, నపూపంబులు, లడ్డుకంబులు,
నిడ్డెనలు, గుడుములు, నప్పడంబులు, నిప్పట్లు, గోళ్లెడలు,
దోసియలు, సేవియలు, *నంగరపోలియలు, పోవెలు, †సార
సత్తులుఁ‡బొత్తరలు,జక్కిలంబులు, మణుఁగుఁబూవులు, మో
రుండలుఁ, బుండ్రేక్షుఖండంబులుఁ, బిండఖర్జూరద్రాక్షానారికేళ
కదళీపనసజంబూచూతలికుచదాడిమీ కపిత్థకర్కంధూఫలం
బులు, గసగసలుఁ, బెసరుపులగములుఁ, జెఱకుగుడుములు,
నరిసెలుఁ, బిసకిసలయములవరుగులుఁ, జిలుగడములుఁ, బడి
దెములుఁ, బులుపలుఁ, బులివరుగులు, నప్పడంబులుఁ, బప్పు
(లు), రొట్టియలును, జాపట్లుఁ, బాయసంబులుఁ, గర్కరీ
కారవేల్లకూశ్మాండ నిష్పావకపటోలికాకోశాతక్యలాబూ

* 'అంగరొల్లె' లని శబ్దరత్నాకరము. † 'సారెసత్తులు' అని శ. ర.
‡ బొంతరకుడుములు.

శిగ్రూదుంబరవార్తాకబింబికారవింద శలాటువులును, గందయుఁ, బొందయుఁ, జారులుఁ, దియ్యగూరలుఁ, బచ్చడులు, భజ్జిగలు, భిజ్జిగిఱులు, వడియంబులుఁ, గడియంబులుఁ, గాయంబులు, గంధతోయంబులు, సుంద్రాలు, నానబాలు, ననుములు, మినుములు, బుడుకులు, నడుకులు, నిలిమిడియును, జలిమిడియును, ద్రెబ్బడయు, వడయు, సుక్కారలుఁ, జక్కారలును, నేతులుఁ, దేనెతాలలుఁ, బిట్టును, గుట్టును, ద్రోఁపలుఁ, ఘాలతిమ్మనం బూపలు, మోదకంబులు, గుడోదకంబులు, శాకంబులు, చెఱకుపాకంబులు, ముక్కాలు, మొరయని (మురియని) చొక్కాంపు జేరుఁ బ్రాలమిలమిలని మడుంగు రాజనంపుటోగిరంబులు, పాడబంబులతోడఁ, బానకంబులతోడఁ, దిమ్మనంబులతోడఁ, దధిపిండఖండంబులతోడ, మీఁగడలతోడఁ, మజ్జిగలతోడ, నూరుఁగాయలతోడ, నంబకబళంబులతోడ, దసావళులతోడంగూడ, భుగభుగలం దగు బొరగఁగంపులతోడం బ్రతిభటించు రామఠామోదంబును, రామఠామోదంబుతో మంతనంబాడు మెంతుల నేత్తావులు, మెంతులనేత్తావులతో బిత్తరించు జీరకంబులసౌరభంబులును, జీరకంబులసౌరభ(ృ)ంబులతోడం బ్రస్తరించు కుస్తుంబురుకిసలయవాసనలును, కుస్తుంబురుకిసలయవాసనలతోడం బిసాళించుచుఁ గఱివేపాకుపరిమళంబును, గఱివేపాకుపరిమళంబుతో సంబంధించుకమ్మకసిందగంధంబులును, గమ్మకసిందగంధంబులతోడం దార్కొను నేలకులసౌరభంబులును, నేలకులసౌరభంబులతో సాళగించు కాలాగురుకురంగనాభి కర్పూరగంధసార నీహారవాగపూరంబుల వలపు

లును, కాలాగురుకురంగనాభికర్పూరగంధసారనీహారవాః
పూరంబులవలపులను, వానితోడం గలహించు మహిసాక్షి
గుగ్గులుధూపధూమంబుల కమ్మందనంబును, గూడిభోజనా
గారగవాక్షమార్గంబులవెడలి కాశికానగరఘంటావీథులం
బౌరజననాసికాపుటకుటీరంబులకుం గుటుంబకంబులుగా మిరి
యంబు పెరిమయుం, బసుపుపసయు, శొంఠిసొబగు, నావతేవ
యుం, జెందుప్పుచేగయుం, కరాంబువుమవ్వంబును, బిప్పలి
యొప్పును, నల్లంబు, మొల్లంబును, జింతగొజ్జురజ్జును, జేల
పిండిమెండును, నిప్పవూమొగ్గల యగ్గలికయు, వెన్న
పెన్నాటకంబునుం గలిగి యొక్కొక్కమజియుం దనకుం
దాన నులివేఁడికట్టావితో నావిర్భవించిన. 186

సీ. తరుణకంకోలపాదపపల్లవముచాయ
        తవణించుజడలజూటంబు ముడిచి
హైమంబు లైనరుద్రాక్షకుండలములు
        శ్రవణపార్శ్వములందు సంతరించి
నిర్నాభిబిలముగా నెఱి వీఁగుబొజ్జపై
        సలిలకాషాయవస్త్రము ధరించి
యాపాదమస్తకం బఖిలాంగకంబుల
        నవ్యభస్మోద్ధూళనంబు సేసి
తే. పాశుపతదీక్ష రూపంబు పడసినట్లు
శాంతి పుంభావ మొందినసౌష్ఠవమున
బంతినడిమికి నేతెంచి భవనభర్త
తపసులకు భక్తి నన్నంబు దారవోసె. 187

వ. అంత. 188

తే. ఆరగించెఁ జతుర్విధాహారములను
మనసుకోరిక నిండంగ మునిగణంబు
వారిబంతిన కుడిచె నావాసభర్త
ధర్మగేహిని తాలవృంతంబు వీవ. 189

వ. భోజనానంతరంబున నాస్థానమంటపంబున సుఖోపవిష్టుండై ధర్మపత్నియుం దాను గృహపతి బాదరాయణు రావించి కూర్చుండ నియమించి కనుసన్నఁజేసి విశాలాక్షికి నతనితో నాడఁ గలమాట లాడు మనిన నమ్మహాదేవి పాత్యవతేయున కిట్లనియె. 190

తే. ఆరగించితె కడుపు నిండార నీవు?
శిష్యతతి భోజనంబు సేసెనె యథేచ్ఛ?
నదను దప్పినఁ దలఁగి యంతంత యున్న
వారు లేరు గదయ్య మీవంగడమున? 191

వ. అనిన బాదరాయణుండు మహాదేవీ! షడ్రసంబులయందు నొక్కొక్క రసం బుల్బణంబును, ననుల్బణంబునుఁ, నుల్బణానుల్బణంబును ననుమూఁడు ప్రకారంబుల ముయ్యాఱు భేదంబుల నాస్వాదనీయంబులై చతుర్విధాహారంబులయందు మాజిహ్వలకుం బండువు సేసె. కడుపు నిండ భుజించితిమి. వాసరద్వయోపవాస సంప్రభూత జఠర గోళక్షుధాగ్ని తాపం బుపశమించె. అవసరంబు దప్పి భోజనంబు లేక యంతంత యున్నవారు మాయం దెవ్వరును లేరు. మున్నెన్నఁడుం జూడము వినము. ఇట్టియద్భుతంబుం గలదె? పాత్రంబులయందు విచిత్రంబు లగునన్నంబులు సవ్యంజనంబులయి తమకుందా మావిర్భవించు టెట్లు? మీ

ప్రభావంబు మీఱ రెఱుంగుదురు. మాకుఁజూడ నీవు విశా
లాక్షి వీయయ్య యావిశ్వేశ్వర శ్రీమన్మహాదేవుండునుం
గావలయు ననిపలికిన విని యీశానియు నలిగి యతండు కాశీ
నగరంబునకుం జేసిన యపరాధంబునకుం దగినశిక్ష సేయం
గలదై యి ట్లనియె. 192

*మే లగుఁ గాశీనగరం
బీలాగున భక్తి గలిగెనే భోజన మే
వేళం బుట్టదు? పుట్టని
వేళం గినియంగఁ దగునె వేదవ్యాసా? 193

ఎట్టు పురాణము లవదియునెన్మిమిదిఁ జెప్పితి? వెట్లు వేదముల్
గట్టితి వేర్పఱించి? నుడికారముదప్పకయుండ భారతం
బెట్టు రచించి? తీవు ఋషివెట్టయి? తొక్కదినంబుమాత్ర లోఁ
బొట్టకు లేక తిట్టెదవు పుణ్యగుణంబులరాశిఁ గాశికన్. 194

క్రోధంబు ఫలమె నిర్మల
బోధమునకుఁ? దీర్థవాసమున కర్థంబే
క్రోధము? వారాణసిపైఁ
గ్రోధించిన విశ్వభర్త గ్రోధింపఁ డొకో? 195

వారాణసి ముక్తిస్థానం బీతీర్థముమీఁద నెవ్వం డన్యా
యము దలంచువాఁడు రుద్రపిశాచం బగు నని పలికి
భవాని భవునియాననం బాలోకించిన. 196

* ఒక వ్రాఁతపుస్తకమున దీనికి బదులు పాఠాంతరము:—
'మేలుగఁ గాశీనగరం, బీలాగున భుక్తి గలిగె నీభోజన మే
వేళం బుట్టదు? పుట్టని వేళం గినియంగ దగునె వేదవ్యాసా!'
మరియొక ప్రతిలో 'కినియుటిది తగవె' ఇంకొకదానిలో 'వేళనునీకిది యొ తగవు'
అనియుం నున్నది.

తే. కాశి నుండంగ నర్హుండు గాఁడు వీఁడు
వెడలి పొమ్మనుమాటలు వేయు నేల?
క్రోధనుం డెట్లు? కైవల్యకులగృహంబు
నానివాసంబు కాశికానగర మెట్లు? 197

వ. అని విరూపాక్షుండు రూక్షాక్షరంబుల (ఁదన్నున)ధిక్షేపించి పలికినం గలంగి వడవడ వడంకుచు వేదవ్యాసుం డయ్యాదిమ దంపతులపాదారవిందంబులకుం బ్రణమిల్లి యేనపరాధంబు సేసితిఁ గోపం బుపసంహరింపవలయు నని ప్రార్థించిన. 198

సీ. కాశికాపురిఁ దొంటికట్టడ నుండక
పుణ్యకాలమునందు భూతతిథుల
వచ్చువాఁడవు శిష్యవర్గంబు నీవును
నైదుక్రోశములకు నవలినేల
నుండువాఁడవు పైఁడికుండలు ప్రాకార
వలయంబుఁ బొడగానవచ్చుచోటఁ
ద క్కన్యతిథులఁ దీర్థముల నిందింపకు
బుద్ధిమంతుఁడవు గాఁ బొమ్ము బ్రదుకు

తే. మంచు నంతర్హితుం డయ్యె నగజతోడ
విశ్వనాథుండు మునియును విశ్వభర్త
యాన తిచ్చినచోటనే యధివసించెఁ
గాశికాపురి కెడదవ్వ కలుగునడవి. 199

తే. అనిన విని కుంభసంభవుఁ డాదరమున
నాంబికేయున కభివాదనంబు సేసి
కాశిఁ గలతీర్థములును లింగములు నాకు
నాన తిమ్మని ప్రార్థించి యడుగుటయును. 200

. కార్తికేయుం డౌర్వశేయున కిట్లనియె. 201

**క్షేత్రతీర్థకదంబవర్ణనము**

. అనఘ! యిట్టుల మాతల్లి యడిగె శంభు
హస్తములు మోడ్చి యడిగిన నధికకరుణ
నాన తిచ్చె విశాలాక్షి యనెడు పేరి
యస్మదంబకుఁ దరుణచంద్రార్ధమౌళి. 202

. విశాలాక్షీ! మోక్షలక్ష్మికిం బుట్టినిల్లగు కాశీపట్టణంబున విశ్వేశ్వరాభిధానుండ నైననాచుట్టునను బంచక్రోశమధ్యంబునను విరించి హరిపురందరాదిబృందారకవందనీయంబులై నిగూఢంబులు నగూఢంబులు గూఢాగూఢంబు లగు దివ్యలింగంబులుం బుణ్యతీర్థంబులు బావనవాపీకూపతటాకంబులు లెక్కించి చెప్ప గోచరంబులుగావు. లేశమాత్రంబునుఁ జెప్పెద. సావధానమతివై యాకర్ణింపుము. సారసలోచన! సారస్వతేశ్వరుండు సారస్వతప్రదుండు; నీలవేణి; గోప్రేక్షుండు దాక్షిణ్యనిధి; అచలకన్యక! దధీచీశ్వరుండు పాపవిమోచనిండు; కనకకేతకీ (కుసుమ) గర్భపత్ర (సగోత్రగాత్రి!) గౌరి! యత్రీశ్వరుం డిహాముత్రఫలప్రదాత; లజ్జావతి! విజ్వరేశ్వరుండు గుజ్జుకల్పతరువు; తలోదరి! వేధేశ్వరుండు కరుణానిధి; కుశేశయగంధి! యాదికేశవుం డఖిలక్లేశనాశకుండు; తన్వంగి! సంగమేశ్వరుండు తంగేటిజున్ను; తీఁగబోఁడి! చతుర్ముఖేశ్వరుండు భయత్రాత; ఇంతి! శాంతీశ్వరుండు చింతామణి; కాంత! కాంతీశ్వరుండు సంతతికరుండు; విపులశ్రోణి! కాసిలహ్రదం బఘగదాగదంకారంబు; కిసలయోష్ఠి! యనసూయేశ్వరుండు కొంగుపసిఁడి; ముగ్ధ!

సిద్ధివినాయకుండు కామధుగ్ధేనువు; తరుణి! హిరణ్యకశిపు లింగంబు ముంగిటినిధానంబు; మందగమన! మందాసురేశ్వరుండు వందారుజనమందారంబు; సుదతి! సతీశ్వరస్కందేశ్వర ప్రసన్నవదనేశ్వరులు శాశ్వతైశ్వర్యసంధాయులు; చండి! ప్రసన్నోదకుండంబు దురితఖండనంబు; అష్టాదశ యోగపీఠికాధిష్ఠాత్రి! యట్టహాసేశ్వరుండు ఘటితాఘ ప్రఘట్టుండు; జగద్ధాత్రి! మిత్రావరుణ వృద్ధవసిష్ఠకృష్ణ యాజ్ఞవల్క్య ప్రహ్లాదవైరోచనేశ్వరులు సర్వాభీష్ట ఫల ప్రదాయకులు;పల్లవపాణి! బాణచంద్రవిద్యేశ్వరులు క్షుద్రోప ద్రవ విద్రావణులు; కర్ణమోటీ! వికటాదేవి జంబేటికాలువ; గౌరి! వీరేశ్వరుండు వారాణసీపంచముద్రమహాపీఠ పట్టాభిషిక్తుండు; లీలావతి! వాలిహనూమదధీశ్వరుల లింగంబులు మంగళప్రదంబు లనిచెప్పి వెండియు. 203

దండకము. విను మభినవవిద్రుమాతామ్రదంతచ్ఛదా! భద్రకుండంబు గండూషితాశేషదోషంబు భద్రేశ్వరశ్రీమహాదేవుఁ డందుండుఁ, దత్కుండపూర్వోత్తరాశావిభాగంబునంజక్ర కుండంబు చక్రేశుఁ డందుండుఁ, దత్సేవ సంసారచక్రక్రమ ప్రక్రియాధిక్కృతి, ప్రౌఢ! తన్నైరృతాశం ద్రికూటేశ్వరుండుండు, నాచేరువన్ శూలికుండంబు, శూలాప్రహ్లాదస్నానపానంబులన్ మానవుం డొందు నేనోనివృత్తిం. దదగ్రంబునన్నారదేశుండు గోటీశుఁడుం గోటితీర్థంబు నంగారకాధీశుఁడున్, దుర్గ! చాముండియున్ భార్గవేశుండునున్నాపిలేశుండు నోంకారమత్స్యోదరీతీర్థరాజంబులున్ శంకుకర్ణేశ్వరాఘోర నాథేశుఁడున్ రుద్రవాసాప్రహ్లాదంబున్ మహాపాతకోపద్రవో

ద్రేకవిద్రావణ ప్రౌఢిముద్రాసమున్నిద్ర రౌద్రోదయస్ఫూర్తులై
యుండు, రాచక్కటిం గౌస్తుభేశుండు సిద్ధీశుఁడుం గామ
కుండంబు లక్ష్మీశ సత్యామృతేశానులుం జంద్రకుండంబు
నింద్రేశచంద్రేశ్వరాగ్నీశులున్ బాలచంద్రేశుఁడున్ వృద్ధ
కాళేశలింగంబు దక్షేశలింగంబునై గావణాధీశలింగంబు
ధన్వంతరీశానలింగంబునుం దుంగనాథేశలింగంబు శ్రీభైర
వాధీశలింగంబు దర్శించు మర్త్యుండు మృత్యూద్భవంబైన
భీత్యుద్గమంబున్ బెడంబాయు వ్యాసేశ్వరవ్యాసకుండం
బులుం బంచచూడాసరోమధ్యమేశానమందాకినీతీర్థముల్
రామభద్రేశుఁడున్ జంబుకశ్రీమతంగేశులున్ సిద్ధకూపంబు
సిద్ధేశుఁడున్ వ్యాఘ్రలింగంబు వాతాతపేశానుఁడున్ హారి
తేశుండుగాణాదకూపంబుగాణాదలింగంబునాషాఢనాథేశుఁ
డున్ భారభూతేశుఁడున్ శ్రీగభస్తీశుఁడున్ మంగళేశుండు
నుం దృష్టనాథేశుఁడున్ దైవదైతేశుఁడున్ మంగళాదే
వియున్ శ్రీమయూఖార్కుఁడున్[1] వ్యాఘ్రపాదేశుఁడున్
శ్రీవిభాండేశలింగంబు సిద్ధేశలింగంబునాలక్షకోట్యర్బుదన్య
ర్బుదానేకలింగంబు లాకాశగంగాప్రతీకంబునన్ గాశికా
క్షేత్ర సీమావిభాగంబునన్ భోగమోక్షంబులున్ సేవక
శ్రేణికిఁజాలుఁ గల్యాణి! కాత్యాయనీ! దేవి! నారాయణీ!
శ్రీవిశాలాక్షి! సత్యంబు సత్యంబు సత్యంబు ముమ్మాటికిన్.

క. గంగాధరుసన్నిధి హరి
ముంగలఁ జదివినను విన్న ముక్తిధరిత్రీ

---

1. శ్రీఖుచండీశుఁడున్ చిత్రగుప్తేశుఁడున్ నిర్జరాధీశుఁడున్ విష్ణు-శేశుండు శుక్రేశుఁడున్ శక్రకూపంబు శ్రీదాదికాధీశుఁడున్ శ్రీఆదికేశేశుఁడున్ పిశాచేశుఁడున్.

లింగాభిధానమాలిక
భంగించును బంచజనునిపాపౌఘంబుల్. 205

తే. ఒక్క పేరిలింగంబులు వెక్కు గలవు
కలవు పెక్కొకపేరివ కలువకొలఁకు
లొక్క పేరివ కలవు పెక్కుపవనములు
గాశికాపట్టణమునందుఁ గంబుకంఠి. 206

తే. అంధువులసంఖ్య లెక్కింప నలవి గాదు
కుండములసంఖ్య లెక్కింప గొలఁది గాదు
వాపికలసంఖ్య లెక్కింప వలను గాదు
పద్మలోచన! కాశికాపట్టణమున. 207

మ. మునుపు న్మచ్చటయు న్రహస్యమునను న్ముద్రించి నానాదివౌ
కసు లాస్థానముఁ గూడియాడుదురు శ్రీకాశీప్రదేశంబునం
గసవై పుట్టెడుభాగ్యమైన మనకుం గల్పింపదా దైవ మీ
కసుమాళం బగునాక మేల యనియుత్కంఠాతిరేకంబునన్.

తే. కాశి శివలింగకోటులఁ గన్నతల్లి
కాశి కైవల్యఫలనవకల్పవల్లి
గంగగారాబునెచ్చెలికత్తె కాశి
సురనరోరగదైత్యసంస్తుత్య కాశి. 209

తే. శైలసుత, సర్వతీర్థైకజన్మభూమి
సర్వవేదపురాణశాస్త్రములగరిడి
సర్వపాపౌఘజలదఝంఝామరుత్తు
సర్వమోక్షమ్ములకు శుభాస్పదము కాశి. 210

ఉ. దుర్గ! హిమాచలంబుపయి దుస్సహమైన తపంబు సేసి త
ద్భూర్గరిమంబున న్ననుఁ గుతూహలిఁ జేసితి వీవు కాశి నె

సర్గిక మైనతేజమున సంతస మందఁగఁ జేయు నన్ను నీ
మార్గము కాశికానగరిమార్గముఁజూడుమయెద్దియెక్కుడో ?

క. నీ వెంత ప్రియవు నాకును
దేవి! విశాలాక్షి సర్వదేవనమస్యా
కైవల్యజన్మనిలయము
శ్రీవారాణసియు నంత ప్రియ మైయుండున్. 212

తే. స్కందనందిమహాకాళకరటిముఖులు
నైగమేషవిశాఖులు నలిననేత్ర?
పట్టిమూడంగ నా కెంత పరమహితులు
పాయ కవిముక్తమున నున్న ప్రజలు నట్లు. 213

తే. వేల్చినారు తపంబు గావించినారు
తీర్థములు సర్వములును సాధించినారు
కమలలోచన! యానంద కాననమునఁ
బాయకుండెడుజనులు ప్రాగ్భవమునందు. 214

తే. భువనభారంబునకుఁ గాఁగఁ బుట్టినారు
కాశిఁ గాఁపున్న ప్రజలు దక్కఁగ లతాంగి
యక్షగంధర్వగరుడవిద్యాధరులును
దంవశూకులు నర్థవాదంబుగాదు. 215

తే. *కాశిపురి నున్న యట్టిపుల్కసునిఁ బోల
రితరభూముల నున్నవా రెంతవారు
శ్రోత్రియులయింటఁ బుట్టినీ శ్రుతులు నాల్గు
నభ్యసింపంగ నీసరోజాయతాక్షి?

సీ. సాక్షాద్ద్విసంఖ్యాధికేక్షణుం డనవచ్చుఁ
గాశిఁ గాఁపుర మున్న కాఁపుకొడుకు

---

* కాశికాపురినున్న పుల్కసుని.

కాశిఁ బంచక్రోశికడసీమ మొలచిన
గఱికతో సరిరావు కల్పకములు
కల్పాంతకాలంబు గడుసు దాఁటిననాఁడుఁ
గాశి ముంపఁగ లేదు కడలివెల్లి
బ్రహ్మాదులకుఁ గాశిఁ బాదచారమ కాని
యొక్క మర్యాద లే దెక్కి రింత
తే. సుదతి! పాపములకునెదుర్చుక్క కాశి
వెలఁది! యుపపాతకములకు విషము కాశి
భామ! కల్యాణమున కాటపట్టు కాశి
ఇంతి! మోక్షంబునకుఁ బుట్టినిల్లు కాశి. 217

తే. అన్నికుండంబులను దీర్థమాడినఫల
మన్నిలింగంబులకు మ్రొక్కినట్టిఫలము
గలదు నీహారగిరిరాజకన్య! నిజము
మరియు నీతీర్థములు విన్నమానవులకు. 218

సీ. జపియింపఁ దగుఁ బితృశ్రాద్ధకాలంబుల
నిమ్మహాస్తోత్ర మద్రీంద్రతనయ!
పంచమహాపాపభద్రేభపంచాస్య
మిమ్మహాస్తోత్ర మద్రీంద్రతనయ!
పఠియించువారలపాలి కల్పద్రుమం
బిమ్మహాస్తోత్ర మద్రీంద్రతనయ!
నాకు నత్యంతమనఁగ ప్రమోదావహం
బిమ్మహాస్తోత్ర మద్రీంద్రతనయ!
తే. డాంబికున కుద్ధతునకు నధార్మికునకుఁ
గూటసాక్షికి శఠునకుఁ గుత్సితునకు

హేతువాదికిఁ గ్రూరున కిది యనర్హ
మిమ్మహాస్తోత్ర రాజ మద్రీంద్రతనయ! 291

వ. అని గంగాధరుండు కాశీలింగతీర్థమాహాత్మ్యంబు విశాలాక్షికి వినిపించుచుండె. ఆసమయంబున మందరాచలంబుననుండి దివోదాసోచ్చాటనానంతరంబు గాశి కేగుదెంచి బహిర్గేహంబునం బట్టాభిషేకంబు గైకొని యంతర్గేహప్రవేశంబునకు శుభముహూర్తంబు ప్రతీక్షించుచుండ నమ్మహోత్సవకాలం బాసన్నం బగుటయు నందికేశ్వరుం డేగుదెంచి యిట్లనియె. 220

సీ. ఊర్జమాసంబున నుడురాజునభివృద్ధి
ప్రతిపద్దినంబున భాస్కరుండు
గగనహర్మ్యశిఖాగ్ర కనకకుంభంబు గా
నభిజిత్తునందు మధ్యాహ్నవేళఁ
బ్రాలేయకరుఁడు సప్తమరాశితోఁ గూడఁ
బంచగ్రహము లుచ్చపదవి నుండఁ
గరణంబు యోగ నక్షత్రంబులును లెస్స
గా లగ్నసంశుద్ధి కలిమి మెఱయ

తే. మంచికాలంబు సాధించి మనసు గెలిచి
బ్రహ్మహరివాసవాదుల పరమనిష్ఠఁ
గాచి యున్నారు మీరాకఁ గాలకంఠ!
వేగ విచ్చేయు గేహప్రవేశమునకు. 201

వ. అని నందికేశ్వరుండు విన్నవించినం బరమానందకందళితహృదయారవిందుండై యయ్యిందుశేఖరుండు విశాలాక్షీసహితుం డై మోక్షలక్ష్మీలీలదర్పణం బైనయంతగపురప్రాసాద

మందిరంబు ప్రవేశించె. సురభిగంధంబులై గంధవాహం
బులు వొలసె. గంధర్వులు దివ్యగాంధర్వంబున మద్రకాది
(మహా)ప్రబంధంబులు పాడిరి. అప్సరస లాడిరి. మహర్షులు
హర్షించిరి. చారణులు సంస్తుతించిరి. ప్రమథులు ప్రమో
దించిరి. విద్యాధరులు పుష్పవర్షంబులుగురియించిరి. చరా
చరభూతజాలంబు సంప్రీతిమేదురంబులయ్యె. పంచమహావా
ద్యంబులు సెలంగె. ఇబ్భంగి గృహప్రవేశమహోత్సవారం
భంబు త్రిభువనచరదృక్కరంభం బయ్యె నయ్యవసరంబున.

ఉ. వెగ్గల మైనవాసనలు విశ్వజగంబులఁ గ్రమ్మ వేల్వఁగా
గుగ్గులుధూపధూమము లగోచరలీల నజాండగోళము
న్నగ్గలిఁ బాఱె వానిమిళనంబునఁ గాదె నభంబు గల్వపూ
*మొగ్గయుఁబోలియిప్పుడు సమున్నతినీలిమమయ్యెఁజూడ్కికిన్.

తే. అవసరం బిచ్చి శివుఁడు బ్రహ్మాచ్యుతాది
దేవతల గారవించె నతిప్రియమున
నటు విశేషించి మధుకైటభాసురారి
నాదరించెను గారవం బతిశయిల్ల. 223

వ. ఆదరించి యిట్లని యానతిచ్చె 224

తే. నీకతనంబునఁ గాదె నాళీకనయన!
కలిగెఁ గ్రమ్మఱ నానందకాననంబు
తక్కొరుఁడు నేర్చునే దివోదాసనృపతి
విబుధసందోహవిద్వేషి వెడల నడుప? 225

వ. నీకుం బ్రియం బెయ్యది? యదియ వరంబుగా నిత్తు ననిన
నచ్యుతుం డంబికావల్లభున కిట్లనియె. 226

---

* 'మగ్గయుఁబోలె నిప్పుడు నమంచిత' ఇయ్యది విచార్యము.

తే. ప్రియము నా కొండు గలుగ దీ త్రిభువనములఁ
గలదు ప్రియ మొక్కటియ చూడఁ గాలకంఠ!
కాశికాపట్టణమున నివేశనంబుఁ
గరుణ నొప్పార నిమ్ము నీ పౌరుగునందు. 227

విశ్వేశలింగమాహాత్మ్యము

వ. అనిన విని శంభుం డట్లయగుంగాక యో విశ్వంభర ! నా చేరువనే యుండుము. మొదల నిన్ను నారాధించి పిమ్మటఁ బ్రజలు నన్నారాధించువారు. ఇదె చూడుము. దక్షిణమంటపం బైన యీయపవర్గ మంటపంబునఁ గాశీమాహాత్మ్యపుణ్య కథలు వినునది. మణికర్ణికా స్నానానంతరంబు ముక్తిమంట పంబునఁ బురాణంబు వినుట కర్తవ్యంబు. 228

తే. కాశిఁ దీర్థంబు లెన్నేని గలుగనిమ్ము
చక్రతీర్థంబు తీర్థంబె శార్ఙ్గపాణి!
కాశి లింగంబు లెన్నేని గలుగనిమ్ము
విశ్వపతి మేటి లింగంబు విహగగమన! 229

క. కైవల్యమంటపం బిదె
నావిహారణభూమిపద్మనాభ ! విముక్త
శ్రీవనితాశుద్ధాంతము
గ్రైవేయవిభూషణంబు కాశీపురికిన్. 230

వ. ఈముక్తిమంటపంబునకు భవిష్యద్ద్వాపరంబునఁ గుక్కుట మంటపం బనునామాంతరంబు గలుగఁ గలయది. యావృ త్తాంతంబు వివరించెద. ఆకర్ణింపుము. ఆనందకాననంబున మహానందుం డను బ్రాహ్మణుం డగ్రవేది పిన్ననాఁట పితృ

మాతృవియోగంబు నొంది యవినయనిధానం బైనయౌవ
నంబున విషయాసక్తుండై విషమశరశరశలాకాకీలితం బైన
చిత్తంబున సుత్తమాంగన(నుం)బొరుగింటి బ్రాహ్మణు(ని)
భార్య మైత్రీచ్ఛద్మంబున నపహరించి యపేయపానం బభక్ష్య
భక్షణం బగమ్యాగమనం బనాచారాచరణంబు గర్తవ్యం
బులుగా వర్తించుచు. 231

సీ. శైవుఁడై యొకవేళ సర్వాంగకంబుల
భూతియు రుద్రాక్షములు ధరించుఁ
బఠియించు శ్రీగీతఁ బరమభాగవతుఁడై
యుద్ధతి నటియించు నొక్కనాఁడు
గొరగయై మైలారుఁ గొనియాడు నొకవేళ
నొసలిపై బండారుపసుపుఁ దాల్చి
ప్రణుతించు నొక్కవీరాదేవి నొకవేళ
బవినీఁడయి సమగ్రభక్తిగరిమ

తే. బౌద్ధుఁడై యొకవేళఁ గాపాలికుఁడయి
యొక్కవేళను జైనుఁడై యొక్కవేళ
దిరుగు నాయాయిచిహ్నము ల్పరిఢవించి
యర్థకాంక్ష మహానందుఁ డవనిసురుఁడు. 222

తే. శైవపరిషత్తుఁ గూడి వైష్ణవుల నవ్వుఁ
బరరు శైవుల వైష్ణవప్రతతిఁ గూడి
శైవుఁడును గాఁడు తాను వైష్ణవుఁడు గాఁడు
పరమధూర్తాగ్రగణ్యుండు బ్రాహ్మణుండు. 233

క. ఏవేషము ధరియించిన
నావేషము తనకు నడ్డమై యద్ధాత్రీ

దేవుఁడు చెట్టునఁ బుడికిన
భావంబున నుండు రూపు ప్రాయము కలిమిన్. 234

తే. ద్వారవతి గంగమట్టి హస్తమునఁ గరఁచి
ఫాలమున నూర్ధ్వపుండ్రంబు పట్టి దీర్చి
యుభయదర్భలు ధరియించి యుదయవేళ
గంగదరి నుండు దానాభికాంక్ష నతఁడు. 235

ఉ. ఏమని చెప్పఁ గాశిపురి నెందును సంకుచితాగ్రహస్తుఁడై
భూమిసురుండు దానములు పుచ్చుకొనండు దరిద్రుఁడయ్యు నే
నేమలు పాటునం గనిన నేటితటంబున నర్థకాంక్షఁ జే
రాముదపాఱునట్లు తనహస్తము విచ్చియయుండు వానికిన్.

తే. ఇవ్విధంబున బ్రాహ్మణుం డేపు రేగి
తిరుగుచుండఁగఁ బెక్కువత్సరము లరుగఁ
గలుగుదురు పుత్రు లిద్ద ఱక్కాలమునకుఁ
గుండగోళకశబ్దంబు కొనలు సాగ. 237

వ. అక్కాలంబునం దొక్క చండాలుండు బహుధనాఢ్యుండు వింధ్యపర్వతదేశవాసి తీర్థయాత్రాప్రసంగంబునం గాశి కేతెంచి చక్రపుష్కరిణీహ్రదంబునఁ దీర్థంబాడి యార్ద్రవస్త్రధరుండై దరికేతెంచి నలుదిక్కులం జూచి యుచ్చైస్స్వనంబున.

శా. చండాలుం డనువింధ్యభూధరమహాసానుస్థలీపక్కణ
స్థుండం గాశికి వచ్చి సిద్ధతటినీతోయంబులం గ్రుంకితిఁ
వెండిం బైఁడియుఁ దెచ్చినాఁడఁ గల దేవిప్రుండు విద్యాసము
ద్రుం డీయర్థము వాని కేను బిత్రుసంతోషార్థమై యిచ్చెదన్.

తే. అనిన విని భూసురోత్తము లద్దిరయ్య!
కాశి యఁట గంగ యఁట మణికర్ణిక యఁట

విశ్వపతి యఁట యఁవిముక్తవిహ్రృతిభూమి
మాలచే దారగొనెడు బ్రాహ్మణుఁడు గలఁడె! 240

తే. అనుచుఁ జేతులఁ గర్ణంబు లదిమికొనుచుఁ
బోవ నున్నారు నది నున్న భూమిసురులు
చూప నున్నాఁడు వ్రేల భూసురుఁ డొకండు
సాహసికుఁడు మహానందు సన్న సేసి. 241

సీ. ప్రార్థింప నున్నాఁడు పాదాబ్జముల వ్రాలి
వెలివాడవాఁడు తద్విప్రకులుని
మేల్కొన నున్నాఁడు మిథ్యాసమాధిన
కృపఁ ధార్మికుఁ డప్డు కన్నుఁ దెఱచి
ప్రణుతింప నున్నాఁడు బ్రాహ్మణబ్రువు మాల
కేల్దోయి నొసలిపైఁ గీలుకొలిపి
దీపింప నున్నాఁడు దెలిసి దోహారిబంటు
చెవి నక్షమాలిక చెరివి ద్విజుఁడు

తే. ప్రబలతరభక్తి నీరీతి బ్రస్ఫుటముగ
వివిధదంభంబు లిబ్భంగి విస్తరిల్ల
నంత్యజుండును నగ్రజన్మాధముండు
గంగదరిఁ దీర్తు రుచితసత్కారవిధులు. 242

వ. అనంతరంబ పరద్రవ్యజిహీర్షాలోభగ్రహగ్రస్తుఁ డైనయ
య్యగ్రజన్మాధముండు చండాలునిం గటాక్షమున వీక్షించి
నిస్పృహాత్వంబు నటించుచు. 243

తే. ఆస లేదు ధనంబుపై నంత్యజన్మ!
చాలు యాయావరము శిలోంఛంబు మాకుఁ

గలుగునే వేడ్క సమలోష్టకాంచనులకు
నర్థములమీఁద? నని విప్రుఁ డపలపించు. 244

వ. ఆచందంబున మనసుపట్టి యుండం జాలక. 245

సీ. అవుఁ గాక! యేమి ద్రవ్యము తెచ్చినాఁడవు?
తెచ్చినాఁడ ధనంబు దిమ్మలుగను
దెత్తు గా కేమి యీఁ దీరు నెంతసువర్ణ ?
మెంత యిచ్చినఁ జిత్త మిగ్రుచు నంత
మేలు గా కేమి టంకాలజాళెము లెవ్వి ?
యల్ల వెపెట్టెలో నెల్ల నవియె
యుండుఁ గా కేమి యేనో యెంచటో పాత్ర ?
లీవె పాత్రంబు గా కెంత తేల?

తే. యనుచు నొరొయ్యొయ్య మంతనం బాడుచుండ
బ్రాహ్మణుండును జండాలభటుఁడుఁ గూడి
ద్రవ్యలాభంబు తీర్థయాత్రాఫలంబు
దివుటమైఁ గోరి భాగీరథీతటమున. 246

తే. అంత నమ్మక బ్రాహ్మణుం డర్థపరత
నిట్టు లనెఁ బుల్కసునితోడ నేవపడక
నేన యీయర్థము పరిగ్రహించువాఁడ
నొరుఁడు గలసిన నీధనం బొల్లఁ జుమ్ము. 247

వ. అని పలికినఁ జండాలుండును నందుకు సమ్మతించి మణికర్ణికా హ్రదంబు తీరంబున గోమయంబునం బట్టు వేసి మార్తాండ కిరణంబులలో మాఱుమండు పదియాఱువన్నె బంగారంబు రాశిపోసి చతురశ్రం బగునప్పట్టుమీఁద బ్రాహ్మణు నిలిపి భాగీరథీజలంబులఁ దత్పాదంబులు బ్రక్షాళించి గంధమా

లాక్షతంబులం బూజించి యమ్మహాదానంబు ధారాసలిల పూర్వకంబుగా విశాలాక్షీసహితుండు గాశీపతి విశ్వనాథుండు సంప్రీతుండగుంగాక యని యతని కాదానం బిచ్చు నంత బ్రాహ్మణుండును సంతుష్టాంతరంగుండై నిజనివాసంబున కరుగు. చండాలుండును దమదేశంబునకుం బోవుచు దదనంత రంబ. 248

క. బహుళద్రవ్యంబుఁ బరి
గ్రహము గొనియె మాలచేత గంగయరుఁగన
మ్మహిసురుఁడు వంశమునకును
బహారుండో! యనుచుఁ జాటఁ బనుతురు విప్రుల్. 249

క. చండాలాత్తద్రవిణుఁడు
చండాలబ్రాహ్మణుండు జగతిని నట్టి
చ్చండాలుఁడు గాశిని వీఁ
డుండిన నే ముండ మందు రుర్వీదివిజుల్. 250

వ. ఇవ్విధంబునం గాశికానగరంబున భూతాక్రోశంబుగాఁ గన్న వారెల్లనుం దన్ను నిందింప విని విని విసికి వేసరి యొక్కనాఁ డర్ధరాత్రసమయంబున మహానందుం డానంద కాననంబు వెడలి పౌరభీతుండై కాకభీతం బగు దివాంధంబునుంబోలెఁ జీకాకు వడి పుణ్యదేశంబులు చొరనెలవు లేమి గుటుంబసహితుం డై కీకటదేశంబునకుం బోవువాఁడై, యటవీ మార్గంబున. 251

తే. తాను నిల్లాలుఁగొమ్మయుఁ దనయయుగము
మొలల దీనారములజాళెములు వహించి
సాతుఁగూడి చనంగఁ దస్కరులు దాఁకి

నలుగురం బట్టి ధన మెల్ల నొనిచికొంద్రు! 252

వ. ఒలిచికొని యాదొంగ లిట్లని వితర్కింతురు. 253

తే. ధనము వేరాళ మబ్బె నీతఁడు బళాయి
వీఁడు ప్రాణాన కలిగిన వెదకి వెదకి
మనల బరి మార్చుఁగా కేల మనఁగ నిచ్చు
నితని వధియింత మని నిశ్చయింతు రపుడు. 254

వ. వధియింప నిశ్చయించి బ్రాహ్మణునిం జేరి కత్తిఁ దీటి యోయి విప్రుండ ; నీవు కళత్రంబును నీతనయులును మీయిష్ట దైవంబులం దలంచి కొండనుటయు. 255

తే. అంబురుహనేత్ర శ్రీవిశాలాక్షిఁ దలఁచు
బ్రాహ్మణుఁడు చిత్తమున విశ్వభర్తఁ దలఁచుఁ
దలఁచుఁ బుత్రద్వయంబు సద్భక్తియుక్తిఁ
గంఠపీఠాగ్ర కరిరాజు ఢుంఠిరాజు. 256

వ. వెండియు మహానందుం డాత్మగతంబున. 257

సీ. పొరిగింటి బ్రాహ్మణిఁ బుణ్యగేహిని నేల
యపహరించితిఁ గన్ను లార్చి యార్చి
పడరాని బ్రాహ్మణపదవి భస్మంబుగా
మధుమాంసముల కేల మరులుగొంటిఁ?
బరమనాస్తికుఁడ నై పాషండవేషంబు
ఘటియించుకొని యేల కోర్కి నైతిఁ?
జక్రపుష్కరిణిలోఁ జండాలకులజుచే
ధన మపారం బేల ధార గొంటి?

తే. నాతతాయికి శఠున కన్యాయరతికిఁ
బాపబుద్ధికి విశ్వాసపాతకునకు

నాకు నిదిక్ప్రాప్త మని మహానందుఁ డుండు
మస్తకము వాంచి కాంతారమధ్యభూమి. 258

చ. తలలు దెగంగ వ్రేయుదురు తస్కరవీరులు వారి నల్వురన్
నలువురుఁ జచ్చియన్యజననంబునఁ గుక్కుటజాతిఁబుట్టుటం
గోలఁకులకోళ్ళలోఁ గలసి కోళ్లను నాలుగు నుండుఁగానయ
ప్పుగుఁలులఁగూటఁబెట్టుకొనిపోదురు కాశికిసార్థవాహకుల్.

సీ. రేపాడి మణికర్ణికాపయోవేణిక
మజ్జనం బాడు నేమంబు మెఱయ
ముక్తిమంటపములో మునిజనంబు పఠింప
విను నాదిమపురాణవిస్తరంబు
విశ్వనాథునిదివ్యవేశ్మంబునకు జేయు
మైత్రి మీఁదఁ బ్రదక్షిణత్రయంబు
ద్వారభూములఁ జల్లునీరాజనక్రియా
దివ్యాన్నములఁ దీర్చు దేహయాత్ర

తే. గౌరి భజియించు నొకవేళఁ గొమరుసామిఁ
నాల్గుజాలును సంజ్ఞాస్వనం బొనర్చుఁ
బ్రణవమంత్రంబు క్రేంకారపదముఁ గూర్చు
మిక్కుటం బగుగరిమతోఁ గుక్కుటములు. 260

వ. ప్రాగ్జన్మవాసనావశంబున నజ్ఞానతస్కరత్వంబు గలిగి యాకు
క్కుట చతుష్కంబు ముక్తిమంటపంబు నాశ్రయించి మో
క్షంబు వడయం గావున నమ్మంటపంబునకుఁ గుక్కుటమంట
పంబను సంజ్ఞాంతరంబు సంభవించు నని శంభుండు విశ్వంభ
రునకు నావృత్తాంతం బానతిచ్చె విశ్వంభరుండును విశ్వేశ్వర
లింగంబుతోడి సాంగత్యంబు వహించె నని చెప్పుటయు. 261

తే. కుంభసంభవుఁ డంబికాసంభవునకు
ప్రణతుఁ డై దేవతాయాత్రపదము దెలుపు
క్రమముతో నది మొదలుగాఁ గాశియందుఁ
దీర్థ మాడంగ నర్హంబు దివిజవంద్య? 262

దేవతాయాత్రావిధానము

వ. అనినం గుమారస్వామి చక్రపుష్కరిణీతీర్థంబున దేవర్షిపితృ తర్పణంబుసేసి యాదిత్యాద్రౌపదీవిష్ణుదండపాణిమహేశ్వర ఢుంఠివినాయకజ్ఞానవాపీనందికేశ్వర తారకేశ్వర కాలేశ్వరుల సేవించి విష్ణువిశ్వేశ్వరుల నారాధించునది. అనంతరంబ ఓం కారలింగంబు మత్స్యోదరీకృత్తివాసోలింగంబు రత్నేశ్వరుండు చంద్రేశ్వరకేదారేశ్వర కరవీరేశ్వరదక్షేశ్వర పార్వతీశ్వరపశుపతీశ్వర గంగేశ్వర నర్మదేశ్వరగభస్తీశ్వర సరస్వతీశ్వర తారకేశ్వరుల దర్శించునది. శైలేశ్వరసంగమేశ్వర మందాకినీశ్వర మణికర్ణికేశ్వర గోప్రేక్షేశ్వరకాపిలేశ్వర శుక్రేశ్వరేశ్వరవహ్న్యీశ్వరనకులేశ్వరభారభూతేశ్వర లాంగలీశ్వరమ (०) దాలసేశ్వరతిలపర్ణేశ్వర త్రిపురాంతకేశ్వర మనఃప్రకారేశ్వర ప్రీతికేశ్వర బ్రహ్మేశ్వరాగస్తీశ్వరకశ్యపేశ్వర త్రిసంధేశ్వర హాటకేశ్వర సీమావినాయకత్రిసంధ్యేశ్వర విశాలాక్షీశ్వర రమేశ్వర ధర్మేశ్వర వినాయకవృద్ధాదిత్యచండిచండీశ్వర భవానీశ్వర పరాన్నేశ్వర వీరభద్రేశ్వర పంచవినాయకులం బూజించునది. 263

సీ. యాత్రాక్రమం బిది యానందకానన
వాస్తవ్యదేవతావర్గమునకు

నిది కాశికాఖండ మిమ్మహాఖండంబు
శ్రీమహాస్కాందవార్ధికి నమృతము
పఠియించినను దీనిఁ బ్రతిలిఖించిన విన్న
దానంబు చేసిన దారులోహ
పాషాణపీఠికోపరిభాగమున సిల్పి
గంధపుష్పముల నక్షతలఁ బూజ

తే. సేసినను గాశికాభర్త శివుఁడు విశ్వ
నాయకుఁడు లక్ష్మి యిచ్చు దీర్ఘాయు వొసఁగుఁ
బ్రాభవంబుఁ బ్రసాదించు భక్తతతికి
శ్రీవిశాలాక్షి కృప సేయుఁ జింతితములు. 264

ఆశ్వాసాంతము

శా. కర్ణాటక్షితిపాలమౌక్తికసభాగారాంతరాకల్పిత
స్వర్ణస్నానగతిప్రసిద్ధకవిరాట్సంస్తుత్యచారిత్ర! దు
గ్ధార్ణోరాశిగభీర! ప్రస్థానముఖమథ్యాహ్నపరాహ్ణార్పితా
పర్ణావల్లభ! రాజశేఖరమణీ! పంటాన్వయగ్రామణీ! 265

క. హేమాద్రిధీర! ద్రాక్షా
రామశ్రీభీమశంకరకృపాలక్ష్మీ
సామగ్రీపరివర్ధిత
భూమాసామ్రాజ్య విభవ! పుణ్యశ్లోకా! 266

మాలిని. వికచకములనేత్రా! వేమమాంబాసుపుత్రా!
సకలనృపశరణ్యా! సంభృతాశేషపుణ్యా!
మకరనిధిగభీరా! మానినీచిత్తచోరా!
ప్రకటగుణతరంగా! రాయవేశ్యాభుజంగా! 267

గద్యము. ఇది శ్రీమత్కమలనాభపౌత్త్ర మారయామాత్య
పుత్త్రసుకవిజనవిధేయ కవిసార్వభౌమ శ్రీనాథనామధేయ
ప్రణీతంబైన కాశీఖండంబునందు సప్తమాశ్వాసము సర్వము
సంపూర్ణము.

---

చ. వరకవిసత్ప్రబంధములు బాలిశసంస్కృతి దుర్విదగ్ధతం
బొరసిపొకాలసంస్కరణముంబొనరించుటదుష్కరంబ; య
చ్చరిత మెఱింగియుం బరమసాహసరీతిఁ బొనర్చితిం బరి
ష్కరణము నెద్దియే నెరసుగల్గిన సూరులు దెల్పుఁడీదయన్.

క. నలపుష్యకృష్ణదశమిఁ
లలిఁ గాశీఖండకృతి సలక్షణముగ ను
త్పల వేంకటనరసింహా
ర్యులు సంస్కరణంబొనర్చి రుద్దీప్తము గాన్.

---

'శ్రీరామాప్రెస్సున' ముద్రితము.—1958.